# సిద్ధాన్తశిఖామణి

(శ్రీ రేణుకాగస్త్య సంవాదరూప శైవశాస్త్రము)

★


మూలము:

శ్రీ శివయోగి శివాచార్యులు

ఆంధ్ర వివృతి:

ఈశ్వర సత్యనారాయణశర్మ

శ్రీ శ్రియానందనాథులు





ప్రకాశకులు:

సాధన గ్రంథ మండలి, తెనాలి.

1. అమ్మతో ముచ్చటలు 1-50

ఇందు 600 లకు పైగా పద్యములు గలవు. సాధక, భక్తలోకమునకు విజ్ఞానపథ ప్రదర్శకము లగు చక్కని భావములు గలవు. ధారాళమైన శైలి. ప్రతివారు చదువతగినది.

2. దేవపూజా రహస్యము 1-75

ఇందు పూజా స్వరూప, సంకల్ప, కాలాదులు; అధికార, మూర్తి, మంత్రరహస్యములు మొదలగు సాంప్రదాయిక రహస్యములు వివరముగా వివరింపబడినవి. పూజకు సంబంధించిన యిట్టి గ్రంథ మింతవరకు వెలువడలేదు.

3. సౌందర్యలహరి 0-75

శ్రీ శంకరభగవత్పాదుల కృతికి ఆంధ్ర పద్యము, నూతన వివరణ; కని విని యెరుగని శ్రీ శర్మగారి స్వానుభవ విశేషములతో నలరారుచున్న గ్రంథ రాజము.

4. భీమేశ్వర నుతి 0-50

శివాష్టోత్తర శతనామములకు ప్రతి నామమునకు గల విశేషార్థములతో 108 పద్యములు భాష్యమువలె నొప్పు గ్రంథము. కంఠస్థము చేయతగినది.

సాధన గ్రంథ మండలి – 83.

# సిద్ధాన్తశిఖామణి

(శ్రీ రేణుకాగస్త్య సంవాదరూప శైవశాస్త్రము)

★

మూలము:

శ్రీ శివయోగి శివాచార్యులు

ఆంధ్ర వివృతి:

శ్రీ క్రియానందనాథులు

ఈశ్వర సత్యనారాయణశర్మ



ప్రకాశకులు:

సాధన గ్రంథ మండలి, తెనాలి.



***

[వెల రు. 3–00

# ఆమోదము

వీరశైవ మతప్రతిపాదకము, రేణుకాగస్త్య సంవాదరూపము నగు నీ సిద్ధాంతశిఖామణిని శ్రీ శివయోగి శివాచార్యులు సంస్కృత భాషయందు రచించిరి. ఈ శివయోగి శివాచార్యులు రెండువేల యేండ్లకు బూర్వుఁడేకాని పరుఁడు కాఁడని విద్వజ్జనుల యభిప్రాయము.

ఈ గ్రంథము సర్వోపనిషత్సారభూతమగు భగవద్గీతకు వ్యాఖ్యానమో యన నొప్పుచుఁ బ్రాచీనులగు ననేకులు బుధప్రకాండులచే ననేకోద్గ్రంథవ్యాఖ్యాసందర్భములందుఁ బ్రమాణముగాఁ జూపఁబడినది; యగుచో నీగ్రంథప్రాశస్త్యమును వేఱ చెప్పఁ బనియుండదు. శాక్త విద్యాపూర్ణాభిషేకమును బడసి, యనేకములగు గ్రంథములను రచించి, సమస్త శాక్తధర్మములను తత్తన్మర్మములను గూలంకషముగా నెఱింగియున్న బ్ర. శ్రీ. ఈశ్వరం సత్యనారాయణ శర్మగారు రచించిన యీ యాంధ్రవివృతి సులలితమగు భాషలో నొప్పారుచున్నది.

శ్రీ సత్యనారాయణశర్మగారు నాకు గురుతుల్యులు. పితృసమానులు. వారు తమ యవ్యాజ కృపాహేతుకముగా నిట్టి గ్రంథరాజములను మా మండలియందుఁ బ్రకటింప ననుజ్ఞ యొసంగుటయే గాక గ్రంథముద్రణకు ఆర్థికసహాయమును జేయుచుండిరి. ఇట్టి గ్రంథములను బ్రకటించుటవలన మా గ్రంథమండలియుఁ గృతకృత్యత నందినదని భావించుచుంటిని. శ్రీవారు నాయెడ, మండలియెడ జూపు దయావిలసనమున కేను బ్రతి యొనర్పజాలను. అందుచే

అంబికా చరణాబ్జరోలంబరూపి
కఖిల బుధలోక సన్నుత హారియశున
కంజలి ఘటింతు సత్యనారాయణాఖ్య
నుర్వి విలసిల్లు నస్మద్గురూత్తమునకు.

శుభకృత్ జ్యేష్ఠము
తెనాలి

బులుసు సూర్యప్రకాశశాస్త్రి
వ్యవస్థాపకుఁడు : సాధన గ్రంథ మండలి.

జానకిరాం ప్రెస్, తెనాలి.

# పీఠిక

శివయోగి శివాచార్యులు రేణుకాగస్త్య సంవాదరూపమైన సిద్ధాంతశిఖామణిని రచించిరి. శివాద్వైతదర్శనమును నిర్దుష్టముగా, అక్లిష్టముగా, సుమధురభాషలో స్థాపించుటకు ఇరువదియొక పరిచ్ఛేదములలో నడచిన ఈ గ్రంథము పునః పునః పరిశీలనార్హము.

భక్త, మహేశ, ప్రసాది, ప్రాణలింగి, శరణ, ఐక్యములను ఆరు స్థలములను గూర్చిన జ్ఞానమే మోక్షహేతువగుటచే రేణుకాచార్యులీ షట్‌స్థల సిద్ధాంతమునిట ఉపదేశించిరి. స్థలశబ్దము పరబ్రహ్మను నిర్దేశించునది. ఈ స్థలమునుండి 44 అంగస్థలములు, 57 లింగస్థలములు బయల్వెడలినవి. ఆధ్యాత్మిక, దార్శనిక విషయములతో బాటు మత, యోగాది విషయములుకూడ ఈ స్థలములలో ప్రతిపాదితములు. అనేక సన్నివేశములలో భగవద్గీతను పోలియుండుటచే నీ సిద్ధాంతశిఖామణిని రేణుకగీత, రేణుకాగమము, సిద్ధాంతాగమము అనికూడ వ్యవహరించుట కలదు. శ్రీపతిపండితుడు, శ్రీకంఠశివాచార్యులు మున్నగువారు దీనిని పరమప్రామాణిక గ్రంథముగా స్వీకరించిరి.

ప్రథమ పరిచ్ఛేదమున బౌద్ధుల ప్రతిసిద్ధాంతముల నెదుర్కొన జాలినది సనాతనధర్మమైన శైవసిద్ధాంతమని కలదు. బౌద్ధప్రాబల్య కాలము శాంతరక్షితాదుల కాలమైనచో శివయోగి శివాచార్యులు క్రీ. శ. ఎనిమిది, తొమ్మిది శతాబ్దములకు చెందియుండ వచ్చును. ఇదే కాలమున వాచస్పతి, ఉదయనుడు మొదలగువారుకూడ బౌద్ధులపై విజృంభించిరి.

ఇంత ప్రాచీన గ్రంథమున విరుద్ధ, విపరీతార్థద్యోతకములగు ప్రక్షిప్తములుచేరి, మూలగ్రంథమే మాటుపడిపోవ సాగినది. మూల ప్రతిని పరిశోధించి, సంస్కరించి, తెనుగున కనువదించి, వివృతి నొసంగిన శ్రీ ఈశ్వర సత్యనారాయణ శర్మగారికి తెనుగు పాఠకులేగాక దార్శనికులు, తత్త్వజిజ్ఞాసువులు, పండితులు, పరిశోధకులు సదా కృతజ్ఞులు

దార్శనిక గ్రంథములను సంస్కృతమునుంచి తెనుగు సేయుటలో అనేక ఇక్కట్లున్నవి. సామాన్యపాఠకునికి అందుబాటులో ఉండు భాషనుపయోగించి, శాస్త్రరహస్యమును,సంప్రదాయమును అరచేతిలో నుంచిన అరటిపండువలె అర్పించినవారు చాల అరుదు. ఇట్టి సందర్భములో రేణుకాగస్త్యులచే తెనుగున స్వాభావికముగా, సహజముగా సంవదింపచేయజాలిన శ్రీ శర్మగారి కృషి అత్యంతము ముదావహము. శ్రీ శివయోగి శివాచార్యులే ఈ గ్రంథమును తెనుగున రచించిరా యను భ్రమను కలిగింపజాలిన శ్రీ శర్మగారు ధన్యులు.

వీరశైవులు గాకున్నను వివృతికారులు సహృదయతతో వీరశైవాగమమును తెనుగువారి కిచ్చుటలో భారతీయ సంప్రదాయాభిజ్ఞతను ఆచరణలోనికి తెచ్చిరి.

ప్లవ శ్రావణ కృష్ణ
తృతీయా సోమవారం
28-8-61

పోతుకూచి సుబ్రహ్మణ్యశాస్త్రి
ఎం. ఏ., ఎం. లిట్. పిహెచ్. డి.
ఆంగ్ల శాఖాధ్యక్షుడు, నాగపుర విశ్వవిద్యాలయము.

ఓం నమః శివాయ

# సిద్ధాన్తశిఖామణి

## విషయానుక్రమణిక

క్రియా నిరసన స్థలము:- వర్ణాశ్రమ ధర్మ నిరూపణము, 19. సర్వాద్వైత నిరసన స్థలము:- లింగపూజాకర్మ నిష్ఠులెల్లరు అద్వైతభావముతో నుండరాదను విషయము, 20. ఆహ్వాన నిరసన స్థలము:- ఇష్టలింగమందు ఆహ్వాన విసర్జనములను జేయరాదను విషయము, 21. అష్టమూర్తి నిరసన స్థలము:- పృథివ్యాద్యష్ట శరీరములకు శివునకు భేదనిరూపణము, 22. సర్వగత్వ నిరసన స్థలము:- శివుడు ఇష్ట లింగమందు మాత్రమే విశేషముగా వసించి యుండుననుట, 23. శివ జగన్మయ స్థలము:- శివుడు సకల చరాచర ప్రపంచ స్వరూపుడై యున్నాడను నిరూపణము, 24. భక్తదేహిక లింగస్థలము:- శివుడు శివభక్తులందు సదా సన్నిహితుడై యుండునను విషయము.



25. ప్రసాది స్థలము:- శివప్రసాద ప్రాశస్త్యనిరూపణము, 26. గురుమహాత్మ్య స్థలము.- గురుప్రాశస్త్య నిరూపణము, 27. లింగమాహాత్మ్య స్థలము:- శివలింగ ప్రాశస్త్య నిరూపణము, 28. జంగమ మాహాత్మ్య స్థలము, 29. భక్త మాహాత్మ్య స్థలము:- శివభక్త ప్రాశస్త్య నిరూపణము, 30. శరణ మాహాత్మ్యస్థలము:- శరణ ప్రాశస్త్య నిరూపణము, 31. ప్రసాద మాహాత్మ్య స్థలము:- శివప్రసాద ప్రాశస్త్య నిరూపణము.



32. ప్రాణలింగిస్థలము:- ప్రాణలింగ-ప్రాణలింగి నిరూపణము, 33. ప్రాణలింగార్చన స్థలము:- క్షమాదిభావపదార్థ పూర్వక ప్రాణలింగ పూజాక్రమము, 34. శివయోగ సమాధి స్థలము:- శివాత్మ ధ్యానసంపత్తిరూప శివయోగ సమాధి స్వరూప నిరూపణము, 35. లింగ నిజస్థలము:- అంతర్లింగమే నిజలింగమనెడి ప్రత్యక్షానుభవస్థితి నిరూపణము, 36. అంగ లింగ స్థలము:-జ్ఞాన జ్ఞేయరూపమైన అంగ లింగముల సమరసత్వనిరూపణము.



37. శరణ స్థలము:- శివ శరణాగతి విషయ నిరూపణము, 38. తామస నిరసన స్థలము:- తమోభావ నిరసనమును, సాత్విక రాజస తామస స్వరూపమును, 39. నిర్దేశ స్థలము:- తమోభావనిరాసకుడైన శ్రీగురు ప్రాశస్త్యము, 40. శీల సంపాదనస్థలము:- శివతత్త్వ జిజ్ఞాసారూప శీల స్వరూపము.



41. ఐక్య స్థలము:- శివైక్యస్వరూపమును - శివాద్వైతాధిక్య నిరూపణమును, 42. ఆచార సంపత్తి స్థలము:- శివైక్యుని ఆచారస్థితి నిరూపణము, 43. ఏకభాజన స్థలము:- చరచరాత్మకమైన జగత్తు శివస్వరూపమైనదను నిరూపణము, 44. సహభోజన స్థలము:- శివైక్యుడు ద్వైతభావ నిరసన పూర్వకముగా సర్వస్వరూపుడు తానే యగునను నిరూపణము.

పదునెనిమిదవ పరిచ్ఛేదము ... (270–286)

28. ఆత్మస్థలము:- జీవాత్మస్వరూప నిరూపణము, 29. అంతరాత్మస్థలము:- అంతరాత్మ స్వరూపనిరూపణము, 30. పరమాత్మ స్థలము:- పరమాత్మ స్వరూప నిరూపణము, 31. నిర్దేహాగమ స్థలము:- శివయోగి దేహయుక్తుడైనను దేహాభిమానశూన్యుడై సాక్షాచ్ఛివస్వరూపుడై యుండుననుట, 32. నిర్భావాగమస్థలము:- శివయోగి 'అహం' అనునట్టియు, 'బ్రహ్మ' మనునట్టియు భావమునకు దూరుడై శివ సామరస్యముతో తాను తానుగానే యుండి మెలగుననుట, 33. నష్టాగమ స్థలము:- శివయోగియందు జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయరూప త్రిపుటివిషయభేదజ్ఞానము నష్టమగునను నిరూపణము, 34. ఆదిప్రసాదిస్థలము:- సర్వాధిభూతుడైన పరశివుని ప్రసాద మహత్త్వ నిరూపణము, 35. అంత్యప్రసాదిస్థలము:- శివతత్త్వమును సాక్షాత్కరించుకొన్న శివయోగి స్వరూప నిరూపణము, 36. సేవ్యప్రసాది స్థలము:- గురుతత్త్వ మహాత్మ్యమును, జ్ఞానామృత తృప్తుడైన శివయోగి నిజస్థితి నిరూపణమును.

పందొమ్మిదవ పరిచ్ఛేదము ... (287–305)

37. దీక్షాపాదోదక స్థలము:- పాదము, ఉదకము అను మాటల పరమార్థము నిరూపితము, 38. శిక్షాపాదోదక స్థలము:- ఆనందమయుడైన శివయోగి మహానంద ప్రభావము, 39. జ్ఞానపాదోదకస్థలము:- జ్ఞానమయుడైన శివయోగి మహానందమహత్త్వ నిరూపణము, 40. క్రియానిష్పత్తిస్థలము:- జ్ఞానియైన శివయోగికి కర్మసంబంధముండదను నిరూపణము 41. భావనిష్పత్తి స్థలము:- జ్ఞానసంపన్నుడైన శివయోగి భావముతో దూరుడైనను, శివునందు భావము నుంచవలయునను నిరూపణము, 42. జ్ఞాని నిష్పత్తి స్థలము:- శివజ్ఞాన సంపన్నుడైన శివయోగికి జ్ఞాతృజ్ఞేయరూపమైన భేదముండదని యిందు నిరూపితము. 43. పిండాకాశ స్థలము:- ఆత్మశరీరోపాధి విశిష్టమైనను స్వరూపముచే పరిపూర్ణమును సచ్చిదానంద స్వరూపము నయి యున్నదను నిరూపణము, 44. బింద్వాకాశ స్థలము:- ఆత్మయొక్కటే యైనను శక్తిభేదముచే సర్వత్ర వ్యాపకమై యుండుననుట, 45. మహాకాశ స్థలము:- బ్రహ్మాండ పిండాండస్థితమైన ఆత్మకు స్వరూపముచే ఏకత్వ నిరూపణము; పరబ్రహ్మ స్వరూప నిరూపణము, చరాచరాత్మక జగత్తు పరబ్రహ్మమున కభిన్నమై సత్యమను నిరూపణము, 46. క్రియాప్రకాశ స్థలము:- శివయోగి శివక్రియా సదృశమైన క్రియతోగూడి శివధ్యానముచే శివస్వరూపుడే యను విషయము నిరూపితము. 47. భావప్రకాశ స్థలము:- శివయోగి సకల చరాచర ప్రపంచ స్వరూపుడై యుండునను విషయమును, శివయోగి భావము కేవల శివమయమైయుండు ననుటయు నిందు నిరూపితములు, 48. జ్ఞానప్రకాశ స్థలము:- శివాద్వైత జ్ఞానమహాత్మ్య నిరూపణము.

## ఇరువదవ పరిచ్ఛేదము ... (305_322)

49. స్వీకృత ప్రసాదస్థలము:- శివునందు లీనుడైన శివయోగికి పృథివ్యాదితత్త్వము లన్నియు శివస్వరూపముగానే తోచుననుటయు, శివయోగి సర్వపదార్థములను శివ ప్రసాదబుద్ధితోనే స్వీకరించుననియు నిందు నిరూపితము, 50. శిష్టౌదన స్థలము:-ఓదన రూప మాయ శివయోగియెడ దాసీభావమునొందుననియు, శబ్దాది విషయములు శివ యోగియందు లయమగుననియు నిందు నిరూపితములు, 51. చరాచరలయస్థలము:-ఇందు తుర్యాతీతపదమునొందిన శివయోగికి ప్రపంచభావన ముండదని నిరూపణము, 52. భాండ స్థలము:- విమర్శశక్తి స్వరూప నిరూపణము, విమర్శశక్తి సమావేశముచే శివయోగి సర్వ జ్ఞత్వాదులతో గూడినవాడగునను నిరూపణము, 53. భాజనస్థలము:- పరబ్రహ్మమందు శక్తి అవినాభావ సంబంధముతో నుండుననియు, పరబ్రహ్మమందు జగత్తు సూక్ష్మ రూపముతో నుండుననియు, శివశక్తి మయమైన పరబ్రహ్మము 'అహం' పదవాచ్య మైనదనియు నిందలి నిరూపణము, 54. అంగాలేప స్థలము:- జీవన్ముక్తుడైన శివయోగి, దేవత్వ మనుష్యత్వాదులకు దూరుడైన సంసారవాసనలతో నంటడని యిందలి నిరూప ణము, 55. స్వపరాజ్ఞ స్థలము:- శివైక్యమొందిన శివయోగికి తనయు, తనకంటె నన్య మైన వస్తువులయు జ్ఞానమేయుండదని యిందు నిరూపితము, 56. భావాభావ లయ స్థలము:- శివైక్యుడైన శివయోగికి నేనున్నాననెడి భావముగాని నేను లేననెడి యభా వము గాని లేదని యిందలి నిరూపణము, 57. జ్ఞానశూన్యస్థలము:- శివయోగి భేదజ్ఞాన శూన్యుడై పరబ్రహ్మమందు సామరస్యము నొంది పరబ్రహ్మమే యగునని యిందలి నిరూపణము; శివాద్వైత సిద్ధాంతమును బోధించి మౌనముద్రదాల్చియున్న శ్రీ రేణుకా చార్యులను గూర్చి యగస్త్యుల ప్రార్థనము; శ్రీ రేణుకాచార్యులు అగస్త్యుని గూర్చి నా యుపదేశించిన శివాద్వైతమును సర్వత్ర ప్రకాశింపజేయుమని యానతిచ్చి యంత ర్ధానము నొందిన విషయమును, సిద్ధాంతశిఖామణి శ్రవణఫలము నిందు నిరూపణము.

## ఇర్వదియొకటవ పరిచ్ఛేదము ... (323_332)

విభీషణాభీష్ట వరప్రదానము. శ్రీ రేణుకాచార్యులు అగస్త్యాశ్రమమునుండి లంకాపురికి దయచేసి విభీషణ ప్రార్థనానుసారముగా నచట ఒక్కసారియే మూడు కోటుల గురురూపములదాల్చి ముక్కోటిలింగములను ప్రతిష్ఠింపజేయుటయు, శ్రీ రేణు కాచార్య లఖిల భూమండలమున సంచరించి, సకల మానవుల నుద్ధరించి, మరల కుల్య పాక క్షేత్రమును జేరి శ్రీ సోమనాథ లింగమం దణగిన విషయమును, శ్రీ సిద్ధాంత శిఖామణి గ్రంథ ప్రాశస్త్యము నిందలి నిరూపణములు.

ఓం తత్సత్





శ్రీ శ్రీయానందనాథా పరనామధేయ

రాఃశ్వర సత్యనారాయణ శర్మ

ఓం నమః శివాయ.

శ్రీ మాత్రే నమః.

# శ్రీ సిద్ధాన్తశిఖామణి

## మున్నుడి

మనది భారత దేశము. మనము భారతులము. " భాయాం రతాః భారతాః "ఉత్తిష్ఠ మా స్వపథ అగ్ని మిచ్ఛధ్వం భారతాః" శ్రుతి. భా=భర్గస్సు, తేజస్సు, పరమాత్మ తేజస్సు నుపాసించు రతి గలవారని యర్థము. ఆ 'భా' యన్నదే జ్ఞానానంద స్వరూపము. దాని నుపాసించు నిష్టమే మతము. ఆ మతమే మన భారతీయతకును, సామనస్యమునకును, సౌమనస్యమునకును, సౌజన్యమునకును, మూలమై విశ్వోన్నతి నొందించు విశిష్ట సాధనము. ఈ భారతి మన దేశప్రజలందు సాగుచుండిన కాలమందు యుగ యుగములకును ప్రమాణీభూతములు కాఁదగిన గ్రంథములు సకల శాస్త్రములందును వెలసినవి. మన భారత దేశమే నాగరకతకు ఆదర్శమై వైదేశీయ విజ్ఞులచే సైతము కొనియాడఁబడెను, కొనియాడఁ బడుచున్నది.

దీనికి ముఖ్యకారణము హిందు మతము జీవన్మృత మగుటయే. పరమతము లెన్ని విజృంభించి ముట్టడించినను జావనిదే జీవన్మృతము. ఆ మత మందలి శ్లాఘనీయ ధర్మములే జీవముగా నుండుటచే నది చావదు. మతాంతర సహనము, వైరాగ్యము, కామాది నిగ్రహము, అహింస మున్నగు పరికరములతో మానవ పరమ లక్ష్యమును సాధింపఁగల బ్రహ్మజ్ఞాన లాభము మతమునకుఁ గూఁకటివేరై యున్నపుడు అది యేనాడును జెక్కు-సెదరదు. ఇతర మతములందుఁ బ్రధాన ధర్మము లేవియని గర్వించుచున్నారో వానిని మన హిందు మతమందలి లోతులు పరికింపలేని పండితమ్మన్యులు కొనియాడుచుఁ గైకొనుచున్నను, వారి నాకర్షించిన యాధర్మము లన్నియు హిందుమత ధర్మములందంతఃపాతులే. జీవన్మృతమైన యీమతము సర్వధర్మ సంపుటము. ఇందును గూర్చి వివేకానందస్వామి —

"My religion is one of which the Bhagavad Gita is the off-shoot, Buddhism a rebel child and Christianity is a patchy imitation" (భగవద్గీత దేని మొలకయో, బౌద్ధమతము దేని దుండగపుం బుత్రికయో, క్రీస్తుమతము దేని యతుకులమారి యను కృతియో, అట్టిది నామతము అన్నాండు.

హిందు మతమును గూర్చి మోనియర్ విల్లియమ్స్‌దొర యిట్లు వ్రాసి యున్నాండు:-

"It is based on the idea of universal receptivity. It has ever aimed at accommodating itself to circumstances and carried on the process of adaptation through more than three thousand years. It has first borne with and then, so to speak, swallowed, digested and assimilated some thing from all creeds, or like a best hospitable mansion it has opend its doors to all comers, it has not refused a welcome to applicants of every grade from the highest to the lowest if only willing to acknowledge the spiritual head ship of the Brahmins and adopt caste rules."

హిందు మతము సమస్త మతధర్మములను గలిగి వర్ణ మందేని వయసునందేని పెద్ద, పిన్నయనక యెల్లరకు స్వాగతమిచ్చి యాదరించు నొక మహాసత్రము వంటిది అని దీని తాత్పర్యము.

కావున హిందు మతము జీవన్మతమే కాని మఱి యొకటికాదు. దీని వ్యాప్తికై కాంతాకనకములు మూలకారణము లగుట లేదు. రాజస తామసముల ప్రధానకండ మగుట లేదు. సహజముగా దనయందున్న జీవరస బలమునుబట్టి యిది లోకమం దంతటను వ్యాపించి యున్నది, దీని నొక వటవృక్షముతోం బోల్చి చక్కగాం జెప్పినవాండు మోనియర్ విల్లియమ్స్ పండితుండు.

"Yet Hinduism is continually growing within itself. In its tenacity of life and power of expansion if may be compared to the banyan tree, whose thousand ramifications often issuing from apparently lifeless stems find their way into walls, undermine old buildings or themselves descend to the

ground, take root in to the soil and from fresh centres of growth and vitality." (అయినను హిందు మతము తనలోఁ దాను గ్రమక్రమాభివృద్ధి నొందుచునే యున్నది. గట్టిప్రాణము గల్గి యుండుటలోను, శాఖోపశాఖలుగ వ్యాపించి విస్తరించు స్వభావము పటుత్వములోను, పైచూపునకు నిర్జీవముగాఁ గాన్పించు కొమ్మలనుండి తఱుచైన యూడలనుండి దించి గోడలను మేడలను నాక్రమించి భూమిలోఁ బాదుకొని జీవాభివృద్ధులుగల పలుక్రొత్త చెట్లుగ నేర్పఱచుటలోను బవిత్రమైన వటవృక్షముతోఁ బోల్పవచ్చును".) కావున మన భారతీయ మతమే జీవన్మత లక్షణముతో శోభించు కల్పవృక్షము.

జీవన్మత లక్షణములను మాక్సుమూలరుదొర "A religion which is not able thus to grow and live with us as we grow and live is dead already. Definite and unvarying unifornity so far from being a sign of honesty and life is always a sign of dishonesty and death. Every religion, if it is to be a bond of union between the wise and the foolish, the old and the young must be pliant, must be high and deep and broad, bearing all things, enduring all things. The more it is so, the greater its vitality, the greater the strength and warmth of its embrace". (మన మేరీతి నభివృద్ధి నందుచు జీవింతుమో యారీతి నభివృద్ధి నందుచు జీవింపఁజాలని మతము ఇదివఱకే గతించిన దగుచున్నది. నిశ్చితమై మార్పుచెందని యేక విధ్యము, యోగ్యతాలక్షణమును, జీవలక్షణము నగుటకు మాఱుగా నెప్పుడును అయోగ్యతా లక్షణమును, మృతలక్షణమును నగుచున్నది. ప్రతి మతము, అజ్ఞులను ప్రాజ్ఞులను, పిన్నలను బెద్దలను, నేకీభవింపఁ జేయు సంధానముగా నుండవలయునెడ, నయ్యది సులభ సాధ్యమును, గంభీరమును, నున్నతమును, విశాలమునునై యన్ని యంశములను గలిగి, యన్నిటిని నమ్మి, యన్నిటిని అభిలషించి, అన్నిటిని సహించి నిలువ గలదై యుండ వలయును. అది యెంత యీవిధముగా నుండిన అంతగా దాని చైతన్యాతిశయము గానఁబడు చుండును. అంతగా దాని యవలంబన బల పరాక్రమములు విలసిల్లు చుండును.)

ఈ లక్షణము లన్నియును ఒక్క మన భారతీయ మతమునందే యున్నవని చక్షుష్మంతులకుఁ దెలియక పోదు. వైదేశీయములు, వైజాతీయములునైన సంప్రదాయముల ననుసరించుట భ్రమమూలకము, హానిదము నని యెఱుంగ కీదురవస్థలోఁబడి క్రమముగ జాగతిక, వైషయిక, సుఖాభిలాషము మెండైనది; తోడనే యీ యభిలాషము తీఱువెరవులును సన్నగిల్లి జనము సంకట పడుచున్నది. ఏదేన్నొక మార్గమందు, నాయకుఁడ ననువాఁడు పండితం మానియై దూరదృష్టి లేక తన మూలచ్ఛేది పాండిత్యముతో హానికరములగు క్రొత్తల కెత్తుగడచేసి యెటులో జగత్ప్రతిష్ఠాశా పీడితుఁ డగుచున్నాఁడే కాని "స్థితస్య గతి శ్చింత నీయా" అను నార్యశాసనమునకు వెల యిచ్చి యీశ్వరదత్తమైన తన బుద్ధి నిల్వచూపి యథార్థయశోధనుఁడు కాలేక లోకముచేఁ జీవాట్లు తినుచున్నాఁడు. మహర్షిప్రదర్శిత మార్గధిక్కారమును బ్రమాదకరముగా నెన్నకున్నాఁడు. నేతయై నేయులకు సుఖకరములని తాఁజేయు సూచనము లెల్ల మహర్షిసూక్తులం దంతఃపాతులే యను తెలివిలేక మురియుచున్నాఁడు. నేయులు నిజమెఱింగియు భారతి లేకుంటచే ధీరతచచ్చి, మానవత మాసిపోయి, తెలివి తెల్లవారిపోయి, గొఱియల గుంపువలె సాగుచున్నారు. సుఖమననేమో సుఖానుభూతి యననేమో తెల్పు సూత్ర గ్రంథములం దవగాహనము చేయుశక్తి సన్నగిల్లినది. సంస్కృ భాషాపటిమ చప్పబడి పోవుటచూచి వేరు పచ్చియఱ లేదుగానఁ జిగుర్పవచ్చునని మహాశయులు కొందఱుచేయు ప్రయత్నముతో మహర్షి హృదయ గ్రహణశక్తి నిచ్చుపటిమ మఱల యక్ష్మరోగి కోలుకొను నట్లుయి భారతులందు యథార్థభారతి రెండు దశల నాటికైనను వెలుఁగునేని వారిది పవిత్రోద్దేశమనియే మనము ధన్యవాదము లర్పింపవచ్చును. దేశము స్వరాజ్య ప్రాప్తివలన నాశించిన వానిలో నిది సిద్ధించినదని వ్రేల్మడచిచెప్ప నొక్కటి లేకున్నను బరమ శివుఁడు, కాలనాముఁడు, కాలస్వరూపుఁడని యింకను వేచియుండ మైనను జీవునందు భారతి విశ్రమించు నిమ్మలకు బునాదులే లేనపుడున్న గట్టిపునాదులు వేయింతుమని యున్న పునాదు లూడదీయు నపుడును చేయునది యేమో తెలియకున్నది. పునాదుల నూడఁదీయఁ బ్రయ

త్నించు వారలకును గ్రో త్తకట్టడముల యున్కి వేడుక గలవారలకును, ప్రాతపునాదుల గాంభీర్యము తేటపఱచుట యథాశక్తి కర్తవ్యము. దానికై భారతి తత్త్వమును బయల్వెట్టు గ్రంథములను అంత దనుకం దెనుఁగునకుఁ దెచ్చి తెనుఁగు తలల నుద్బోధించుట విధులం దొకటి యనియెంచి పరతత్త్వబోధమును బుద్ధి తత్త్వముతో సరిపుచ్చిన బౌద్ధుల ప్రాబల్యము నెఱపియున్న కాలమందు వెలసిన నిరుపమాద్వైత గ్రంథ మొండు తెలుఁగున వివరించి లోకమున కిచ్చుట భారతుఁడనగు నాధర్మమని నిశ్చయించి యుంటిని.

(శ్రీ) మాతృభావ బ్రహ్మోపాసనమును గూర్చి సాధకబోధ పూర్ణములగు 'సౌందర్యలహరి', 'శ్రీదేవీపంచ స్తవి', 'శ్రీదేవీసూక్తము' మున్నగు వాని ననువదించి, స్వతంత్రముగా 'శ్రీ బాలాంబాస్తుతి', 'అమ్మతో ముచ్చటలు', 'శ్రీసూక్తరహస్యార్థము', 'శివనామాష్టోత్తర శత పరమార్థము', 'సోఽహం భావ సమాధి', 'శర్మసాధనము' 'దేవ పూజారహస్యము', 'శాస్త్రసాధనము' మున్నగు రచనములను జేసి యుంటినైనను బూర్ణదీక్షాకాలమున సాధకులకు (శ్రీ) గురువు లిచ్చు మహావాక్యరత్నమైన "శివోఽహం" అనెడి దానిని గూర్చి — అనఁగా శివాద్వైతజ్ఞానప్రతిపాదకమగు ప్రామాణిక గ్రంథమొకటి వివరింప కుంట నా పదుప్రయాసములందు లోటయ్యెనను చింతయుండెడిది.

ఇంతట నా యనువదించిన మహాకవి కాళిదాసకృత (శ్రీ) దేవీ పంచ స్తవి ముద్రణ వ్యయభారమును వహించి దానిని భక్తకరముల కుచితముగ నందిచ్చిన కడపజిల్లా రాయచోటి తాలూకా రాయవర గ్రామవాసులు (శ్రీ) శివానంద స్వామీతి దీక్షానామధారులు డా॥ (శ్రీ) శివానందము వీరయ్య దేవరగారు శివాజ్ఞగా నాకీ 'సిద్ధాన్త శిఖామణి' గ్రంథము నిచ్చి తెన్గువివరణము వ్రాయఁ బ్రోత్సహించిరి.

లోకములో మానుషవృత్తికి సర్వవిషయము లందును యథార్థ జ్ఞాన మెటు లావశ్యకమో యటులే మతవిషయము నందును నిశ్చయ జ్ఞాన సంపాదనము కడు నావశ్యకము. అట్టి నిశ్చయ జ్ఞానమును బ్రతి పాదించునది వీరశైవాద్వైతము ప్రసిద్ధతమము. ఆవీరశైవాద్వైత సిద్ధాం

తములను సర్వప్రమాణానుసారముగా నద్దమందువలెఁ జూపునీ 'సిద్ధాన్త శిఖామణి'కి శ్రీ వీరయ్యదేవరగారు, ఆంధ్రవివృతి వ్రాయుఁడనుట పరమ శివ ప్రోత్సాహముగా భావించి, శివాజ్ఞగా బూనుకొని, శివకరుణాలం బముచేఁ దెన్గు వివృతి కృతియందుఁ గృతార్థుఁడ నైతిని. 'శ్రీ సిద్ధాన్త శిఖామణి' గ్రంథప్రాశస్త్య ప్రాచీనతలను గూర్చి దీనికిఁ గర్ణాట వాణి యందు వ్యాఖ్య వ్రాసిన నాగనూరు బృహన్మఠాధ్యక్షులు కీ॥ శే॥ శ్రీకాశీ నాథశాస్త్రిలు వ్రాసిన యుపోద్ఘాతమునఁ జూడఁదగును. ఈనామున్నుడి తరువాయి నే పాఠకులు దానిని జూడఁగలరు. అది చూడఁదగినది.

శివాద్వైత గ్రంథరాజమగు నీ సిద్ధాన్త శిఖామణి సార్థకనామ శోభి; దానికదే సాటి. ఆధ్యాత్మిక నాయకత్వమును వహించి ప్రబలిన భారతదేశముకొఱకే యీ గ్రంథరాజము వెలసినది. ఇది విజ్ఞానానంద మయకోశ సాధనము. శ్రీభగవద్గీత మనోమయకోశ సాధనముమాత్రము. దీని భాష మృదులతమము. భావములు సువ్యక్తములు. గీతోల్లిఖితము లగు నుపనిషద్భావములు సర్వమించు సరళ భాషాబద్ధములు. ఇది చదువుకొని గీతావ్యాసంగము చేయువారి కద్వైతజ్ఞానసిద్ధి హస్తగత ముగాఁ దోపక మానదు. బ్రహ్మమును 'శివ' శబ్దముతో వ్యవహ రించు నీగ్రంథము మధురశ్లోకబద్ధమైన గీతాభాష్యమా ? యనిపించును. మొట్టమొదట కొన్ని పరిచ్ఛేదములు శైవమత కర్మకాండ బోధ విశి ష్టములైనను, దర్వాతివి పూర్ణజ్ఞాన ప్రదములు. సాధకుని ముక్తి సౌధ సోపానములం దెక్కించుటకు గ్రంథకర్త 'శివయోగి శివాచార్యులు' తన రచనయం దెట్టి వెరవులు ద్రొక్కెనో సౌధోన్నత భూమికను జేరుటకెట్టి సులభోపాయములు సూపెనో, చదివినపుడు గాని తెలియదు. వేయిమాటలేల ? చదువ మొదలిడినంత గ్రంథము ముడువ బుద్ధి పుట్టదు. అనివార్యకార్యములకై ముడిచినను, జదివినది మదిని వదలదు. అనంతరమే పుస్తకము నెత్తుకొనఁ జేయును. ఇటువటవ పరిచ్ఛేదమునకు వచ్చుసరికిఁ బరితృప్తసాధకుఁడు జ్ఞానామృతాప్లావిత హృదయుఁడై శివైకతానంద స్వరూపుఁడై గ్రంథకర్తకుఁ గృతజ్ఞతావందనము లర్పిం చుచుఁ దనకదే భవసాగరమును జేర్చు తెప్పయని మఱి వీడలేఁడు.

అద్వైతసిద్ధి జిజ్ఞాసువు నిజాభీష్టసిద్ధికై వేఱొక గ్రంథమును జదువ నక్కఱలేదు.

పరిచ్ఛేదము లిరువదియొకటి. వానియందలి యవాంతర భాగము లనేకముగల పేళ్లు చిత్రములు. ఆ భాగము లందలి యుద్దిష్ట విషయ వివరణము చిత్రతమము. గ్రంథకర్త పాటంతయు వేదాగమ ప్రమాణ సిద్ధము. జగన్నిత్యత్వము, శక్తి విశిష్ట శివత్వము, నిశ్శంకముగా సప్రమాణముగా సిద్ధాన్తీకరింపఁ బడినది. అనుబంధ చతుష్టయ పరిపాలనము గ్రంథకర్త సొమ్ము. "అంతయు బాగున్నది గాని ఇక్కడ నిదిమాత్రము" అను హంస పాదమునకు గ్రంథమందుఁ దావే లేదు.

నేనీ తెలుఁగు వివరణము వ్రాయఁ బూనునపుడు వీరశైవ సిద్ధాంతములకు విరుద్ధార్థము నిచ్చు నొక మాటయేని దొరలునోయను పెను బీతుతోనే పూనితిని. సహజముగా వీరశైవుఁడను గాకున్నను నే నలింగాంకిత శైవుఁడనే. శాక్త విద్యా పూర్ణాభిషేక కాలమందు నాకుపదేశింపఁబడిన మహావాక్యములలోఁ జరమవాక్యము 'శివోఽహ' మ్మనునదియే. కావునఁ గ్రియాభాగమందు వీరశైవుఁడనే. శైవశాక్తములకుఁ బరమార్థముచే భేదమే లేదు. అది శివ విశిష్టశాక్తము. ఇది శక్తి విశిష్ట శైవము.

భక్తి జ్ఞానబోధకములగు పుస్తకములతో నేమాత్రపుఁ బరిచయమున్న వారలకును నీనా తెనుఁగు సుగ్రాహ్యమనియే నా విశ్వాసము. గ్రంథాదిని గ్రంథకర్తచేసిన వర్ణనములందుమాత్రమే నా యనువాదము శుద్ధాంధ్రపదభూయిష్ఠముగా సాగినది. అచ్చోట నట్టి భాషయే యోజ్యమని యీశ్వర ప్రేరణము. తక్కుభాగములందు భాషతోఁ బెనఁగులాడక భావములను సుష్పష్టము చేయుటకే ప్రయాసం పడితిని. ఇంతదాఁక నిట్టి గ్రంథరాజమునకుఁ దెనుఁగు వివరణము పుట్టకుండుట నా భాగ్యపుంబంటకే. ఆ పంటకు దోహద మిచ్చినవారు శ్రీ శివానంద స్వామి, డా॥ వీరయ్య దేవర వారని మున్నే చెప్పికొంటిని. ఈ గ్రంథము నందుకొని చదివి యానందించు సద్వైతులు శివభక్తులు నన్నుఁగంటె ముందుగా శ్రీవారినే పరమ శివునకుం జూపెట్టి పిదప నన్నాశీర్వ

దింతురుగాక. నా యెఱింగినంతవఱకు శ్రీ వారి విశ్రుత శుద్ధ చరిత్రమును వారు ప్రకాశింపఁజేసిన 'శ్రీదేవీ పంచస్తవ్యనువాద' గ్రంథాదిని వ్రాసి యుంటిని గాన మఱల నిట వ్రాయలేదు.

జీవన్మతములలో వీరశైవాద్వైతము సుప్రసిద్ధ తరమని వ్రాసితిని. శ్రీ సిద్ధాన్త శిఖామణి యనుశీలనము తఱచు చేసిన నేను దానియందు ప్రతిపాదితమైన వీరశైవాద్వైత ప్రసిద్ధి విశిష్టత నుగ్గడించి పాఠకుల నాకర్షించుట ధర్మమనుకొంచు వీరశైవమేమి తెలుపునో, నాయెఱింగి నంత పాఠకుల కంటఁ బెట్టుచున్నాను.

వీరశైవము, అనుభవ విద్య. శక్తి విశిష్టాద్వైతము. లింగతత్త్వ నిర్ణయ షట్స్థల సిద్ధాన్తము లింగాంగ సామరస్యము, శివయోగము, శరణుని యోగము, లింగాయత విశ్వాసమును క్రియాజ్ఞాన మూలకముగా బయల్పెట్టు నొక యద్దము.

శక్తి విశిష్టాద్వైతము "ఊర్ధ్వమాయ, అధోమాయ" యను పదముల చేతనైన విశిష్టతను జక్కఁగా వివరించి తెలుపును. వీరశైవాద్వైతము జీవుని తమో బాధ తొలగించి గమ్యమును జేర్పఁగల యున్నత మహాదీపస్తంభము.

వేదాంతమును మతమును సంధింపఁజేసి నిరాఘాటముగ మనుజుని గమ్యమునకుఁ జేర్పఁగల సేతువు వీరశైవ సిద్ధాన్తము.

యోగముకంటె సుఖతర సత్యమార్గము లేదని చాటి చెప్పెడి ఢంక వీరశైవ సిద్ధాన్తము.

యోగమే సత్యముతో సన్నిహిత సంబంధము గలది యను సత్యమును బోధించునది వీరశైవ సిద్ధాన్తము.

శరణుని యోగమందుఁ బరమేశ్వరుని సాక్షాత్కారము, ఈశ్వరానుగ్రహము సర్వదా మనోదృష్టి గోచరములని తేటపఱచునది వీరశైవము.

పరమేశ్వర సత్తనుగూర్చిన శరణుని స్వప్రమాణవాదము సులభము, ఋజువు, సర్వసమ్మతము.

మన యీ జగత్తునకుఁ గారణ మొండుండవలయు. ఆ కారణము జ్ఞానసంపన్నము కావలయు; ఆ జ్ఞానము సర్వాలలితము కావలయు; ఆ సర్వాలలిత జ్ఞానమే పరమేశ్వరుఁడు అని శరణుఁడు నిష్కలంకముగ, నిస్సంశయముగ, శాంతముగ ఘోషించునని వీరశైవము తెలుపును.

మఱియు, ఆ జ్ఞానమే "నాబోధదీపము, నా హృదయానందము, ఆశాపూరకము, ఆలోచనా దర్శకము, దుఃఖ శామకము, ఆత్మ నాయకము, లోకాంత రాద్భుత మహాత్మ్యమును గంటియెదుట నుంచు దూరదర్శి యంత్రము.'' అని ఘోషించును. జీవుఁడు తరించుట "అన్యథా శరణం నాస్తి" యను మహా మంత్రము వల్లనను గావుననే శరణుఁడు సార్థక నాముఁడు.

''పరమ శివుఁడు నిన్నెల్లపుడు నాలోకించును; ఆతని నాలోకింపఁ బ్రయాస పడుము. నీకాతని యెడ భయము గల్గును. ఆ భయము భక్తిగా మాఱును. దైవభీతితోనే జ్ఞానోదయ మగును. ఆదైవజ్ఞానమే భక్తిపూర్ణత'' యని వీరశైవమతము.

పరమేశ్వరుఁ డెల్లపుడు మనమేలే కోరును; సంపదలందు మన కృతజ్ఞతను, సాధారణావస్థయందు మన తృప్తిని, దుఃఖము లందు మన లోఁగు పాటును, అయోమయావస్థయందు మన విశ్వాసమును, కామములందు మన మొరగకుండుటను, సర్వదా మన వినయ విశ్వాసములను బరికించు చుండునని శరణయోగి నిశ్చయము.

ఆత్మాంతరాత్మ పరమాత్మ లక్షణములను జక్కబోధించునదే వీరశైవ సిద్ధాంతము.

సర్వసంపదలందు నమూల్యమైనది తన్నుఁదా గెల్చు శక్తియే శక్తి; పరీక్షల కాగు శక్తియే శక్తి; ఆపదల నెదుర్కొను శక్తియే శక్తి; ఈ మున్నగు శక్తులను మున్ను సంపాదించినవాఁడే శీల సంపాద నార్హుఁడని బోధించునదే శైవాద్వైత మతము.

ఆత్మవిజయమే శీలమునకు మనోహరాకారమును గూర్చునని బోధించునదే శైవాద్వైతము.

నైతిక సూత్రములను, శాసనములను బాలించి తత్పరుఁడగు వాఁడును, అహంకార మమకార విజయ మొనర్చి ధర్మోపేతుఁడు కానివాఁడును శరణ నామకుఁడని పల్కును శైవసిద్ధాన్తము.

అనాదిగ భారతదేశమందు వెలయుచున్నది "సోఽహం" అనెడి మతమే యని చాటును శైవాద్వైతము.

నిష్క్రియావస్థనుండు బ్రహ్మమే శివుఁడనియు, స్థిరమ్మనియు, సక్రియావస్థనుండు నయ్యదే శక్తియుఁ జరమనియుఁ బల్కును శైవాద్వైతము.

పరమ శివుని చరశక్తియే క్రియావత్సంకల్పమే శివలింగము యొక్క సాకారస్థితి యనియు, ఈసంకల్పమే క్రియాసమర్థమై శివ లింగమందు మఱుగువడి యుండు ననెడి శ్వేతాశ్వత రోపనిషదర్థమును బోధించునదే వీరశైవాద్వైతము.

సముద్రజలమందు బడబాగ్నివలెను, జంద్రునం దమృత కిరణము వలెను, పూవునందుఁ దావివలెను, ఆఁడుఁ బడుచులందుఁ బ్రేమవలెను, సత్యమందాసంకల్పమణఁగి యుండునని తెల్పునది వీరశైవ సిద్ధాన్తము.

ఇట్టి యన్యోన్య సంబంధమును దెల్పునదే శక్తి విశిష్టాద్వైతమనెడి వీరశైవ మతము.

ప్రపంచమంతయు శివ సంకల్పముయొక్క వికాసమే యనియు, శక్తినాయకుఁడు శివుఁడనియు బోధించును వీరశైవ సిద్ధాన్తము.

శివశక్తులకును, సత్యసంకల్పములకును, లింగ జంగములకును, అన్యోన్య ప్రబల సంబంధమును నొక్కి చెప్పునది వీరశైవాద్వైతము.

శక్తియే సృష్టి స్థితి లయ సమర్థయగు నైన నద్దానికి శివుఁడతీతుఁడనియు, ఆ శక్తి పరమశివునుండి వెలికివచ్చు ప్రవాహ మనియు, అదియే యానంద శాంతమూర్తి యందలి స్పందనమనియు వీరశైవ సిద్ధాన్తము.

శివశక్తుల పూర్ణత్వ సంబంధమున విభాగమును గాని, శక్తి జడత్వమును గాని, యొప్పుకొన్నచో శివజీవ సామరస్యమునకే భంగ మనునది వీరశైవ సిద్ధాన్తము.

చిచ్ఛక్తి సత్యమనియు, అదియే జడజ్ఞానమును దొలఁగించి మనుజుని యాత్మానుభవమునకుఁ దోడగుననియు దెల్పును వీరశైవ సిద్ధాన్తము.

సదా దేహసంబంధముతో నుండు నిష్టలింగమే జడత్వాభాసమును దొలఁగించి జీవుఁడు దేవుఁడనుటను స్థిరపఱచునది వీరశైవ సిద్ధాన్తము.

భావదార్ఢ్యముచేఁ జైతన్య వికాసము మిగులుచున్న కొలఁది జీవునందలి చైతన్యము లన్నియు శైవములేయగుచు రమ్యశాంతి నొడఁగూర్చు ననునదే వీరశైవ సిద్ధాన్తము.

జగన్మిథ్యాత్వమును సాధింపఁజూచు మాయావాదమును శ్రౌతాగమ సూత్రము లందలి చైతన్య సత్తయొక్క భ్రాంతి దర్శనమే యైనచో ప్రపంచమొక చేవలేని యసత్యమనవలయును; సర్వప్రమాణముల చేతను సత్యమగు జగత్తు మహాచైతన్య సత్తయొక్క భ్రాంతిమత్పరిణామ మెటులగును? బ్రహ్మ పరిణామమే యైన జగత్తు సత్యమనియు, బ్రహ్మమునకును జగత్తునకును, కుండకును దానికిఁ గారణమైన మట్టికినివలె భేదము లేదనియు, బ్రహ్మము సత్యమనునపుడు జగత్తు సత్యమనుట తప్పదనియుఁ జెప్పెడి తాంత్రిక మతమును నెలకొల్పునది వీరశైవము.

ఏకైక మహాసంవిత్తే తాను గాఁ దలంచుకొన్నదే యయినది గాన అది కానిది వేఱొండు లేదు. కాని సదాత్మయం దంతయు సత్యమే ఏలన బహుత్వములేని నిత్యవస్తువొకటే బహుత్వాకారము నొందినపుడు ఆ బహుత్వమునకుఁ దాను నిత్యత్వ మిచ్చితీఱును. కనుక నన్నింట నాత్మ మఱుఁగున నుండనేయున్నదనియు, ఆ సమష్టి ప్రజ్ఞాకారము చరాచరములం దిమిడి యున్నదనియు, ఆ ప్రజ్ఞయొక్క సర్వస్వతంత్ర సామర్థ్యమునే యాగమములు శక్తి పేర వ్యవహరించుననియు వీరశైవ సిద్ధాన్తము.

మానవుఁడు పూర్ణత నొందు దారిని బ్రదర్శించునదే వీరశైవము. ఆదారియే భక్తాదిగ నైక్యాంతమైన ఆఱుస్థలములపేరి ఆఱవస్థలు గలది.

జీవితమం దమృతత్వమును, కాలమందు శాశ్వతత్వమును, మానుషమందు దైవత్వమునుజూపు షట్స్థలయోగమే జీవ యాత్రికుని స్వస్వరూప లబ్ధి యనెడి సర్వోన్నత శిఖరమునకు ఒడిదుడుకులకు లోఁబడనీయక యెక్కించు సుఖ నిశ్శ్రేణి.

వీరశైవము ఆగమాంత నిర్దిష్ట విషయములను బరమ విశ్వాసముతోఁ జూపు మతము. అది పరమేశ్వరుని లింగరూపమును బూజించుటను దెల్పునది. ఆ లింగమే యనంత సత్యస్వరూప పరమ శివుని ప్రతీకము. కావుననే దానికి లింగాయత మని వ్యవహారము.

లింగాయతుఁడు ఉపనిషద్ జ్ఞానయోగములకు విరోధము లేనటులు దైవతత్త్వసారమును వెల్లడించుచు. అనుభవించుచు, లింగమే సర్వాతిశాయి వస్తువనెడి విశ్వాసముతో వర్తులమును దేజోవంతమునగు లింగప్రతీకమును అరచేతఁబట్టి పూజించును. సాధకుఁడు తన యెడమ చేతనుంచి కుడిచేత మూసి పూజించుటయందు భావమేమనఁగ — దన కాలింగరూప బ్రహ్మము చేఁజిక్కిన దనుటను దెలుపును. వేదాంతములందు శిరోహృదయములందు మాత్రమే ఇష్ట దైవమును నెలకొల్పుటను దెల్పఁగా నిందలి విశేషము కరసంయోగము నిరర్థకము కాదని, అర్థవంతమని యెఱుంగునది. సృష్టి యాయనంత శక్తి చేతి నుండియే జరుగుననియు, అదిదాని సంకల్పరూపమే యనియు, దెలుపుచుఁ దన చేతి నైంద్రజాలికుని మంత్రదండముగాఁ జేసి యాత్మ స్థానమును శిరోహృదయములనుండి చేతికి మార్చును. మానవుని హస్తమున కాశక్తి కలదని యాతని నిశ్చయము. కావున ఉపనిషత్సమ్మత శీర్షహృదయములతో వీరశైవము కరస్థలమును జేర్చినది. శీర్షము స్థానముగాఁగల యనంత వస్తువే భావలింగము; హృదయస్థమగు సర్వవ్యాపక సమష్టి దైవమే ప్రాణలింగము. కరస్థమగు నా ప్రత్యేక జీవరూపమగు దైవమే యిష్టలింగము.

సిద్ధాన్త శిఖామణి ననుశీలించు చక్షుష్మంతులైన పండితులా మహాసముద్రమునుండి మణులనువలె నింకెన్నిటినో రత్నములను బయల్వెట్టఁగలరు. జ్ఞానదార్ఢ్యమును వివేచనశక్తినిబట్టి యెంత యేని వ్రాయ

వచ్చును. ఇప్పటికే నా మున్నుడితో బాఠకులను విసివించి యుందు నని భయపడుచు నింతటితో విరమించు చున్నాను.

కూర్పరులు సత్కృతి ప్రకాశనమునకు సత్పురుషుల యవలంబ నము దొరికినపుడే పరమ ధన్యత.

ఇట్లు,
శివభక్తపాదపాంసువు,
శ్రీ శ్రియానందనాథాపరనాముఁడు
ఈశ్వర సత్యనారాయణశర్మ.

శ్రీకాకుళము.
ప్లవ గ్రీష్మము

---

ఓం నమః శివాయ

శ్రీ మాత్రే నమః

శ్రీ జగద్గురు పంచాచార్యాః ప్రసీదంతు

"శ్రీ సిద్ధాంత శిఖామణి"కి శ్రీ కాశీనాథశాస్త్రిలవారు వ్రాసిన "భావప్రకాశిక" యనెడి వివృతికి వారి మున్నుడి.

శ్రీ జగద్గురు రేణుకాది పంచాచార్యులు పరమ శివునాజ్ఞచే నాల్గు యుగము లందును శ్రీ సోమనాథాది పంచశివలింగము లందును నవతరించి వీరశైవ మతమును నెలకొల్పిన విషయము 'వీరాగమ, విజ యాగమ, స్వాయంభువాగమ, సిద్ధాగమ, సుప్రభేదాగమాది శివాగ మములందు ఘంటాఘోషముగాఁ జెప్పఁబడి యుండుట సుప్రసిద్ధము. ఈ పూజ్యపాదులు నిగమాగమ విఖ్యాతమగు శైవాద్వైత సిద్ధాంత మును సర్వత్ర నెలకొల్పిరి. శివజీవైక్యరూప లింగాంగసామరస్యమును బోధించునదే యీ సిద్ధాంత రహస్యము. ముక్తిమందిరమును బ్రవేశిం చుటకుగా నీ సిద్ధాంతమందు భగవత్పాదులచే భక్త, మహేశ, ప్రసాది, ప్రాణలింగి, శరణ' ఐక్యము లనెడి పేళ్లతో నాఱు సోపానరూప స్థల

ములు రచియింపఁబడినవి. ఇవే షట్స్థలములని ప్రసిద్ధములు. ఈ షట్స్థల జ్ఞానమే మోక్షమునకు మూలభూతము. వీరశైవ మత స్థాపకులు శ్రీ జగద్గురు రేణుకాచార్యులు జగద్విఖ్యాతుఁడైన యగస్త్యమహర్షికీ షట్స్థల సిద్ధాంతము నుపదేశించి యా మునివరుని ముక్తుని జేసిరి. ఇందీ విషయమే ప్రతిపాదితము.

దీనియందు 21 పరిచ్ఛేదములును మొత్తము 1330 శ్లోకములునుం గలవు. ఇందు 1, 2, 3, 4, 21 పరిచ్ఛేదములు మాత్రము చారిత్రకాది విషయములను బ్రతిపాదించుచు 234 శ్లోకములతో గూడినవి. 5 మొదలు 20 వరకు గల 16 పరిచ్ఛేదములు షట్స్థల సిద్ధాంతమును బ్రతిపాదించుచు 1096 శ్లోకములతో గూడినవి.

ఈ పదునారు పరిచ్ఛేదములందు 101 స్థలముల సమగ్రస్వరూపము నిరూపింపఁ బడినది. వీరశైవ సిద్ధాన్తమందుఁ బరబ్రహ్మము స్థల శబ్దముచేఁ బ్రతిపాదింపఁబడినది. గ్రంథ భాగమును స్థల మందురు.

ఈ స్థలము అంగస్థల లింగస్థల భేదముచే రెండు విధములుగా నుండి అంగస్థలము 44 స్థలములుగాను లింగస్థలము 57 ప్రకారములుగాను విభాగము నొంది వెరసి 101 స్థలములుగా నున్నవి. ఈ స్థలములందు బ్రమాణ విచారము, గురుమాహాత్మ్యం, లింగధారణ, భస్మధారణ, రుద్రాక్షధారణ విచారము, పంచాక్షర మంత్ర విచారము, వర్ణాశ్రమ ధర్మవిచారము, క్రియాజ్ఞానసమ సముచ్చయ విచారము, ద్వైతాద్వైత విచారము, జీవాత్మ పరమాత్మ విచారము, శక్తివిచారము, జగత్సత్యత్వ విచారము, పరిణామ వాద విచారము, లింగాంగ సామరస్య విచారము, మున్నగు నెన్నో విషయములు ప్రతిపాదింపఁ బడినవి.

ఈ గ్రంథము ముముక్షు కల్యాణమునకై పారమార్థిక తత్త్వ ప్రతిపాదకమైన మతసిద్ధాంతమునే విశేషముగా బోధించు చున్నది. తత్త్వార్థ పూరితమైన యీ మహాప్రబంధ రచన శైలియు నత్యంత హృదయంగమమై భగవద్గీతవలెనే బహుభావ గర్భితమైనది. వ్యాసమహర్షి శ్రీకృష్ణార్జున సంవాదమును సంగ్రహించి దానికి "భగవద్గీత" యని పేరుంచి నటులే శ్రీ శివయోగి శివాచార్యులు శ్రీ రేణుకాగస్త్య

సంవాదమును సంగ్రహించి దీనికి "సిద్ధాంత శిఖామణి" యను పేరుంచిరి. ఈ కారణము చేతనే యీ గ్రంథ రత్నము "రేణుక గీత, రేణుకాగస్త్య సంవాదము" అనెడి పవిత్ర నామాంతరములతో వెలయు చున్నది. వేదాంత సారము, వీరశైవ చింతామణి మున్నగు గ్రంథముల కర్తలు దీనినే "రేణుకాగమము" అనుపేరుతో నుల్లేఖించిరి. ఈ గ్రంథము 'సిద్ధాంతాగమ' మను పర్యాయనామముగల సిద్ధాగమము యొక్క సారరూపమైన దనువిషయము శ్రీకరభాష్యముచేఁ దెలియఁబడును. శ్రీపతి పండితులు "పత్యురసామంజస్యాత్" అనెడి బ్రహ్మసూత్ర భాష్యమందు (2-2-36) ఈ గ్రంథముయొక్క 5 వ పరిచ్ఛేద మందుఁ జెప్పఁబడిన,—

అగస్త్య మునిశార్దూల సమస్తాగమ పారగ,
శివజ్ఞానకరం వక్ష్యే సిద్ధాంతం శృణు సాదరమ్॥
అగస్త్య ఖలు సిద్ధాంతా విఖ్యాతా రుచి భేదతః,
భిన్నాచార సమాయుక్తా భిన్నార్థ ప్రతిపాదకాః॥

ఈ మున్నగు నెనిమిది శ్లోకములను గ్రమముగా నుదాహరించి "సిద్ధాంతాగమమందలివి" యని యుల్లేఖించిరి. ఇందుచే నీ గ్రంథ రత్నము సిద్ధపదవాచ్యులైన రేవణసిద్ధుల విషయమై యుండుటయు, సిద్ధాగమ సారరూపమై యుండుటయు స్పష్టమగుచున్నది.

ఈగ్రంథము యోగ్యతయు నసాధారణము. ఇది తన నామము చేతనే సిద్ధాంత తత్త్వమును బ్రతిపాదించు సమస్త గ్రంథములలో శిఖామణియై యొప్పుచున్నది. కావుననే యీ గ్రంథకర్త గ్రంథాంత మందు:—

"శ్రీవేదాగమ వీరశైవ సరణిం, శ్రీషట్స్థలోద్యన్మణిం,
శ్రీజీవేశ్వర యోగపద్మతరణిం, శ్రీగోప్యచింతామణిమ్,
శ్రీసిద్ధాన్త శిఖామణిం లిఖతి యస్తం లేఖయత్యాదరాత్
శ్రోతా శ్రావయితా స యాతి విమలాం భుక్తిం చ ముక్తింపరామ్॥

అని గ్రంథ ప్రాశస్త్యమును ముక్తకంఠముగా నుగ్గడించిరి. ఈ యుగ్గడింత స్వాభావికమే గాని యతిశయోక్తి గాదు.

వీరశైవ మతగ్రంథము లందెల్ల నిది యత్యంత ప్రాచీనము. వీరశైవసిద్ధాంతమును బ్రతిపాదించు గ్రంథము లెన్నిగలవో యన్నిటి యందును నీగ్రంథరత్న పవిత్ర నామము ప్రకాశించు చున్నది. క్రీ. శ. 1061 సం. నందు నీగ్రంథమందలి వాక్యము లనేక స్థలములందుఁ బ్రమాణ రూపముగా నుదాహరింపఁ బడినవి. శ్రీపతి పండితుఁడు "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" యనెడి (౧-౧-౧) బ్రహ్మసూత్రపు భాష్యమును వ్రాయు సందర్భమున "పవిత్రంతే" ఇతి ఋగ్వేద మంత్రస్య శ్రీ సిద్ధాన్త శిఖామణౌ శ్రీ రేణుకాచార్యేణాపి "పిండతాపిండ విజ్ఞాన" మిత్యారభ్య ఏతాని శివభక్తస్య కర్తవ్యాని ప్రయత్నతః" "ఇత్యం తేన సిద్ధాన్త శిఖామణౌ తస్మై వ్యోపదేశాత్" ఇత్యాది వాక్యములను వ్రాసి, సిద్ధాన్తశిఖామణి పవిత్రనామము నుల్లేఖించిరి.

ఇది యంతయు సుప్రసిద్ధ శ్రీకంఠ భాష్యకారులైన శ్రీకంఠ శివాచార్యులు సైతము 'అవిభాగేన దృష్టత్వాత్' అనెడి (4-4-4) బ్రహ్మసూత్రపు భాష్యమందు, సిద్ధాంత శిఖామణి. 9 పరిచ్ఛేదమందుఁ జెప్పఁబడిన "ముక్తః శివసమో భవేత్" అనెడి శ్లోకమును బ్రమాణముగా నుదాహరించిరి. ఈ రీతిగా జగత్ప్రసిద్ధ భాష్యకారులే యీ గ్రంథమును బ్రమాణముగా స్వీకరించినపుడు దీనియోగ్యత యెంత ఘనమో వేఱ యన నక్కఱ లేదు. ఈ భాష్యకారులేగాక ప్రాచీన పరమతీయ పండితులు సైతము నీగ్రంథప్రమాణమును దమ తమ గ్రంథములం దుల్లేఖించిరి. 'సిద్ధాంత కౌముది' యనెడి వ్యాకరణ గ్రంథమైన 'తంత్రాధికార నిర్ణయ' మనెడి గ్రంథమందును, 'శారదా తిలక', 'నిర్మాల్య రత్నాకర', 'శైవబ్రాహ్మణోత్పత్తి' మున్నగు గ్రంథములందును, నీగ్రంథప్రమాణము లుదాహరింపఁ బడినవి. ఇటులు స్వమత పరమత పండిత మండలిచే నంగీకృతమైన యీగ్రంథము ప్రాశస్త్యమును బాఠకులే గ్రహింపఁగలరు.

ఇట్టి యమూల్యగ్రంథమును రచించిన శ్రీ శివయోగి శివాచార్యులు ఏ దేశమునఁబుట్టిరి? ఏ శతాబ్దివారు? అనుట యీగ్రంథము వలన స్పష్టపడదైనను గ్రంథకర్త ప్రథమ పరిచ్ఛేదమునందు, శివ

యోగి శివాచార్యుఁడనియు, ఆతని వంశమున, ముద్దదేవ శివాచార్యుఁడను పుత్త్రుఁడుదయించెననియు, నతనికి సిద్ధనాథశివాచార్యుఁడుదయించెననియు, ఆ సిద్ధనాథ శివాచార్యుని కొడుకే తాననియు మాత్రమే చెప్పికొనెను. ఇందుచే నీ గ్రంథకారులు వీరశైవ మతాచార్య వంశభవులని మాత్రమే స్పష్టమగుచున్నది. దేశకాలవిషయము తేలదు. అందుచే వీరి వంశ పరంపర యందు వ్రాసిన "ముద్దదేవ" యనుపేరు విచారింపఁగా వీరు కర్ణాటదేశము వారని తోఁచును. ఎందుచే ననఁగాఁ గర్ణాట దేశమందు నేటికిని 'ముద్ద, ముద్దవీర, ముద్దణ, ముద్దదేవ' యనెడి పేళ్లు విశేషముగా రూఢి పడి యున్నది. మఱేదేశము నందును లేదు. ముఖ్యముగా 'ముద్దు' అను మాట కర్ణాట భాష యందలిదే, ప్రీతి యను నర్థము గలది. ఈ కర్ణాటక శబ్దమునే యీ గ్రంథకారులు తమ పాండిత్య ప్రభావముచే 'ముదం దదాతీతిముద్దః' అను వ్యుత్పత్త్యర్థమును జెప్పి సంస్కృత పదమునుగాఁ జేసిరి. విమర్శాత్మక దృష్టిచే విచారించినచో నీపేరు కన్నడ భాషదే యనియు, వీరు కన్నడ దేశమందు వీరశైవ గురుసంతతివారనియు స్పష్టము. అటయిన వీ రేకాలపు వారనుట పర్యాలోచింపఁ దగినది.

క్రీ॥శ॥ 1060 సం॥ నందుండిన శ్రీపతి పండితులు తమ రచించిన శ్రీకర భాష్యమందుఁ బలుతావుల నీ గ్రంథనామము నుల్లేఖించుటచేత నీగ్రంథము శ్రీకర భాష్యముకంటె నెంతో పురాతనమైనదని నిస్సంశయముగఁ దెలియును. మరియు శ్రీపతి పండితుల కంటెను ప్రాచీను లయిన శ్రీకంఠ శివాచార్యులు సైతము తమ భాష్యమందు దీని ప్రామాణ్యము నుల్లేఖించుటచే నిది శ్రీకంఠ భాష్యము కంటెనుం బురాతనమైన దనుటయు నిర్వివాదము. ఇటుండఁగా గ్రంథకర్త మొదటి పరిచ్ఛేదమందు వ్రాసిన

> "యేన రక్షావతీ జాతా శివభక్తిః సనాతనీ,
> బౌద్ధాది ప్రతి సిద్ధాంత మహాధ్వాంతాంశుమాలినా"

అను శ్లోకము నభిప్రాయమును విచారించినచో వీరి కాలమందు బౌద్ధుల యుపద్రవముచే అనాది కాలమునుండి నిల్చిన శివభక్తికి బాధ

కల్గినట్లును దెలియఁబడును. మన భరత ఖండమందు బౌద్ధ సిద్ధాంతము రెండు వేల యేండ్లకు మున్ను ప్రబల ప్రచారమందుండినదనుట యెల్లరు నెఱిఁగినదే. బౌద్ధ ప్రాబల్య సమయమందే ఈ మహానీయుఁడు పుట్టి యుండినట్లీతఁడు వ్రాసిన దానిఁబట్టియే తెలియుటచే నీతఁడు రెండు వేల యేండ్లకు మున్నె యుండెననుటయు నిర్వివాదము. ఇటులే యనేకులు విద్వాంసులు రెండు వేల యేండ్లకు మున్నే శ్రీ శివయోగి శివాచార్యు లుండిరని అభిప్రాయ పడుచున్నారు. అది యుండ నిండు.

ఈ గ్రంథము శ్రీ రేణుకాగస్త్య సంవాద రూపమైనది. శ్రీ రేణుకాచార్యులు అగస్త్య మహర్షికి షట్స్థల సిద్ధాంత మంతయు బోధించి తుట్టతుదిని, —

"అగస్త్య మునిశార్దూల తపస్సిద్ధ మనోరథ,
త్వాం వినా శివ శాస్త్రస్య కః శ్రోతు మధికారవాన్,
పాత్రం శివప్రసాదస్య భవానేకో న చాపరః,
ఇతి నిశ్చిత్య కథితం మయాతే తంత్ర మీదృశం,
స్థాప్యతాం సర్వలోకేషు తంత్రమే తత్త్వయామునే"

"ఓ అగస్త్యమహర్షీశ్వర! నేను నీకుపదేశించిన ఈ శైవ సిద్ధాంత తంత్రమును నీవు ప్రపంచమునఁ బ్రకాశింపఁ జేయుము." అను శ్రీ రేణుక గణేశ్వరాజ్ఞానుసారము అగస్త్యమునీశ్వరులు లోకమున వీరశైవ సిద్ధాంతమును బ్రచారము చేసిరను విషయమున వీరు బ్రహ్మసూత్రములతరువాత శివాద్వైత సిద్ధాంత ప్రతిపాదకమైన "వృత్తి" యును వ్రాసియుండుట ప్రబల సాక్ష్యము. అగస్త్యులు బ్రహ్మసూత్రములకు వృత్తిని వ్రాసియున్న విషయము శ్రీకర భాష్యముచేఁ దెలియఁబడుచున్నది. శ్రీపతి పండితులు శ్రీకర భాష్య ప్రారంభమందు—

"అగస్త్య ముని చంద్రేణ కృతాం వైయాసికీం శుభామ్,
సూత్రవృత్తిం సమాలోక్యకృతం భాష్యం శుభంకరమ్"

అగస్త్యరచిత బ్రహ్మసూత్ర వృత్తిపై నాధారపడియే శ్రీకర భాష్యమును వ్రాసితినని శ్రీపతిపండితు లుల్లేఖించిరి. మునిచంద్రపదవీ

భూషితులైన యగస్త్యులచే రచియింపఁబడిన "మునిచంద్రవృత్తి" కుంభకోణమందు సంస్కృతాక్షరములతో ముద్రింపఁ బడినది. ఈ సూత్రవృత్తి యత్యంత గూఢార్థ గర్భితము. దీనియందలి వాక్యములు శ్రీకరభాష్య ప్రతి సూత్రమందును నుదాహరింపఁబడినవి. ఈ విషయ మును విచారింపఁగా అగస్త్యులు శ్రీ రేణుకాజ్ఞాప్రకారము శివాద్వైత సిద్ధాంతమును సర్వత్ర ప్రచార మొనరించిరని స్పష్టం పడుచున్నయది. ఉండనిండు.

శివాద్వైత సిద్ధాంత ప్రతిపాదక గ్రంథములందు శిఖామణియై యొప్పు నీ సిద్ధాన్తశిఖామణి ముద్రితమైనను ముద్రాపకులు శాస్త్రజ్ఞు లును, సంశోధన దృష్టిగలవారును గాకపోవుటచే వారు ముద్రించిన వానిలోఁ గొన్ని యశుద్ధ వాక్యములును వీరశైవ సిద్ధాంతమునకు విరుద్ధములైన కొన్నిశ్లోకములు సయితము ముద్రింపఁబడినవి. వీరశైవ సిద్ధాంతము పరిణామ వాదమును, జగత్సత్యత్వ వాదమును ఘంటా ఘోషముగాఁ దెలుపుచుండ దానికి విరుద్ధములైన వివర్తవాద జగ న్మిథ్యాత్వవాద ప్రతిపాదక శ్లోకము లాడాడ నెటులో యెవరిచేతనో చేర్పఁబడినవి. మఱియు శ్రీ రేణుకభగవత్పాదుల భూలోకావతార విషయమున శివాగమాభిప్రాయమునకు అత్యంత విరుద్ధములైన కొన్ని శ్లోకములును ముద్రితములైనవి. అందుచే వీరశైవ సిద్ధాంతమునకును శైవాగమాభిప్రాయమునకును విరుద్ధములై యందందుఁ జేర్పఁబడిన శ్లోకము లన్నియు వేర్పఱచి చూపఁబడినవి. గ్రంథాంతమునఁ జూచు నది. ఈ గ్రంథమున రెండవపరిచ్ఛేదమందుఁ జెప్పఁబడిన జగత్సృష్టి ప్రతిపాదక శ్లోకములు విజయాగమ మందలి శ్లోకములై యున్నవి. వీరశైవ సదాచార సంగ్రహముయొక్క తొమ్మిదవ ప్రకరణమం దుల్లేఖింపఁబడినవి. రెండవ పరిచ్ఛేదము శోధనమందు వీరశైవ సదా చారసంగ్రహము విశేషసహాయ మొనర్చినది. ఈ గ్రంథ శోధనమందు శ్రీ జగద్గురు ఉజ్జయినీ మహాసంస్థాన ప్రాచీన గ్రంథ భండారమందు లభించిన తాళపత్ర గ్రంథమును జాలకాలము క్రిందటనే తెనుఁగు లిపియందు ముద్రితమైన శైవసిద్ధాంత పంచకమందున్న ప్రతియు విశేషముగా సాయపడినవి.

ఈ గ్రంథమునకు ననేకులు సంస్కృత, కన్నడ, మహారాష్ట్ర భాషలందు వ్యాఖ్యానములు చేసిరి. కాని వారెల్లరు పలుతావులందు భగవత్పాదుల హార్దికాభిప్రాయము నెఱుంగక స్వేచ్ఛముగ వ్యాఖ్యానించి యుండుటచే ఈ మతసిద్ధాంత తత్త్వమే జనులకుఁ దెలియక పోయె. కొన్నిచోట్ల మూలశ్లోకములనే మార్చివైచిరి. విడిచివైచిరి. ఇదంతయుఁ గూలంకషముగఁ బరామర్శించు శైవమతాభిమానుల కెల్లరకు వ్యసనకారణమే యయ్యెను. ఇది యెల్లరకుఁ దెలియఁజేయు నుద్దేశముతోఁ గొన్ని శ్లోకముల నుదాహరించుచున్నాము. పాఠకులును బరామర్శింపఁ దగును.

శివాద్యాది సముత్పన్న శాంత్యతీత పరోత్తరామ్
మాతరం తాం సమస్తానాం వందే శివకరీం శివామ్॥
శివభక్తిః స్థిరా యస్మిన్ యజ్ఞే విగత విఘ్నవాః
విదధతు మతిమస్మిన్ వీరశైవే విశిష్టాః॥ (౧ పరిచ్ఛేదము)
ఆచాంతే భవతా పూర్వం పంక శేషాః పయోధయః(౫ ,, )
ఏతాని మాన భూతాని నోపహాన్యాని యుక్తిభిః (౫ ,, )
పృథ్వ్యాధిక మిదం సర్వం కార్యం కర్తా మహేశ్వరః
నైతత్సాక్షాన్మహీశోఽయం కులాలో మృత్తికా యథా(౧౦ ,, )
ప్రాణో యత్ర లయం యాతి భాస్కరే తుహినం యథా
తత్ప్రాణ లింగ ముద్దిష్టం తద్ధారీ స్యాత్తదా కృతిః
ఏవ విధై ర్భావ పుష్పై రుపచారైర ధూపితైః
ప్రత్యఙ్ముఖమనా భూత్వా పూజయే ల్లింగ మాంతరం॥(౧౨ ,, )
యథా చంద్రే స్థిరా జ్యోత్స్నా విశ్వవస్తుప్రకాశినీ,
తథాశక్తిర్విమర్శాత్మా ప్రకాశే బ్రహ్మణి స్థితాః
ఇదానీ మేవ మే జాతం ముని రాజోత్తమోత్తమమ్,
శ్రుత్వా మేమోదతే చిత్తం జ్యోతిః పశ్యే శివాభిధమ్. (౨౦ పరి,)

పై వానియందుఁ గ్రీగీర గలవన్నియుఁ దప్పులు. ఇవి తాళపత్ర గ్రంథ సహాయముచే నీక్రింద నుల్లేఖించినటులు సరిపుచ్చుకొనఁబడినవి.

(1) సముత్పన్నా, (2) పదోత్తరా, (3) జజ్ఞే విగత విప్లవా, (4) వీరశైవాః, (5) ఆచాంతాః, (6) నహంతవ్యాని, (7) కాలాంశః కలశో యథా, (8) భాస్కరేందు విఘట్టనాత్, (9) భావశుద్ధైః, (10) ప్రత్యఙ్ముఖ, (11) విమర్శాఖ్యా, (12) ప్రకాశే, (13) స్థిరా, (14) మునిరాజత్వముత్తమమ్, (15) పశ్యత్.

ఈ రీతినే ముద్రితములైన గ్రంథములందు అనంతానంతములు అర్థదోషములును, వ్యాకరణ దోషములును, మిగులఁగలవు. ఇప్పుడీ ముద్రిత గ్రంథమును జూచినపుడు ధర్మజ్ఞులగు పండితులకు దీని పారిశుద్ధ్యము తెలియకపోదు. అది యుండనిండు.

ఈ గ్రంథమందీరీతిగా వచ్చిపడిన లోపముల నన్నింటిని సరిపుచ్చి శివాద్వైత సిద్ధాన్తానుసారముగా సరియైన వ్యాఖ్యానమును వ్రాసి శుద్ధ సంప్రదాయానుగతమైన వీరశైవ సంఘముయొక్క కల్యాణమును కొఱకుఁ బరిశుద్ధముగా ముద్రించి ప్రకటింపవలయు ననెడి యనేకుల మతతత్త్వాభిమానుల యభిలాషమును దీర్చుటకై నేనీ మహాకార్యమును బూనుకొని నా యోపినంతగా విశేష శ్రమతో సంశోధించి "భావప్రకాశ"మనెడి పేరితో యథార్థ తత్త్వప్రతిపాదకమైన సరళ వ్యాఖ్యానమును రచించి యిమ్మహాకార్యమును బూర్తి చేసితిని. దీనికిఁ (శ్రీ) జగద్గురువులైన (శ్రీ) రేణుక గణనాథుని యాశీర్వాద ప్రభావమే మూలకారణ మనవలయునేకాని నా బుద్ధిబలమెంత? నే నెంత?

ఈ మహాగ్రంథము నుపయోగము సామాన్యముగా నెల్లరకుఁ గాఁదగునన్న యుద్దేశముతో బహుశ్రమంపడి విషయానుక్రమణికయు, శ్లోకానుక్రమణికయుఁ జేర్చి ముద్రింపఁజేసితిని. కావునఁ దత్త్వశాస్త్రాభిమానులెల్లరు కైవల్య కల్పతరువు వంటిదైన యిమ్మహాగ్రంథమును సంగ్రహించి (శ్రీ) జగదాచార్యుల యుపదేశామృతమును గ్రోలి ధన్యాత్ములు కాఁగలరని కోరిక.

పం॥ కాశీనాథ శాస్త్రి

—♦—

ఈం హ్రీం నమః
ఓం నమః శివాయ
శ్రీ జగద్గురు పంచాచార్యాః ప్రసీదన్తు
శ్రీ రేణుకాగస్త్య సంవాదరూప

# సిద్ధాన్తశిఖామణి

(శైవశాస్త్రము)

## మొదటి పరిచ్ఛేదము

త్రైలోక్య సంపదాలేఖ్య సముల్లేఖన భిత్తయే,
సచ్చిదానందరూపాయ శివాయ బ్రహ్మణే నమః॥ ౧

శ్రీ రేణుకాగస్త్య సంవాదరూపమైన 'సిద్ధాన్త శిఖామణి' యను నీ గ్రంధమును విరచించిన శ్రీ శివయోగి శివాచార్యులు కృత్యారంభమునఁ బరశివ నమస్కారరూప మంగళాచరణమును జేయుచున్నారు.

ముల్లోకముల కలిమి యనెడి బొమ్మలను జిత్రించుటకుఁ బెను గోడవంటివాఁడును, సత్, చిత్, ఆనందము అను నవియే స్వరూపమైనవాఁడును, మంగళస్వరూపుఁడునైన శివ పరబ్రహ్మమునకు నా నమస్కారము.

వి॥ దేనియందు నిశ్చయముండునో యది సిద్ధాన్తము. శిఖామణి = తలఁదాల్పఁదగు మాణిక్యము, అనఁగ శ్రేష్ఠము. లోకమున ననేక సిద్ధాన్తములు గలవు. అందెల్ల శ్రేష్ఠమైన వీరశైవ సిద్ధాన్త మిది యని భావము.

సత్ = దేశకాలములచే వేఱుపడనిదియు, త్రికాలము లందును బాధలేనిది (మున్నుండెను, ఇపుడున్నది, ముందుండును).

చిత్ = తనకంటె వేఱయి వెలుపలఁదోఁచు దృశ్యవస్తువుల నన్నిటిని ఇతరసాధనము లేకయే తెలిసికొను శక్తియు (ఇది దేహము, ఇవి

యింద్రియములు, ఇవి విషయములు, ఇది యంతఃకరణము, ఇవి జాగ్ర దాద్యవస్థలు, ఇవి కామక్రోధాదులు, మున్నగు నంతర్దృశ్యములను అన్యసాధనము లేకే తెలియు శక్తియు); ఆనందము—విచారింపగా నెప్పుడును సంభవించు దుఃఖములఁ దొలఁగఁ జూచుచు జలనము లేని సౌఖ్యము నొందుట, దుఃఖమయము లగు శబ్దస్పర్శాది దృశ్యమంతయు సుఖకరముగాఁ దోఁచుట యనెడి యానందము. అది సహజమై ప్రమాణముల కందనిదియు, సాటి లేనిదియునైన క్షోభము లేని స్థితి. బ్రహ్మము—ఎప్పటికప్పుడు వృద్ధిపొందునది, వృద్ధినొందించునది. శివః — ఆనంద స్వరూపుఁడు నిర్వికారుఁడునై శమించి యుండువాఁడు, సజ్జనుల మనస్సునం దుండువాఁడు, శుభముతో నుండువాఁడు, శుభము నిచ్చువాఁడు. సర్వము తన వశమం దున్నవాఁడు.

> బ్రహ్మేతి వ్యపదేశస్య విషయం యం ప్రచక్షతే,
> వేదాన్తినో జగన్మూలం తం నమామి పరం శివమ్॥ 2

వేదాన్తులు బ్రహ్మ మనెడి ప్రసిద్ధ బిరుదమునకు ఎవనిని విషయము (నిత్యపరిచయము నొందునది — స్థానము)గా బలుకుదురో, ఎవఁడీ సచరాచర జగత్తులకెల్ల మూలకారణమో యట్టి పరమ శివునకు నా జోత.

> యస్యార్మి బుద్బుదాభాసః షట్త్రింశ త్తత్త్వ సంచయః,
> నిర్మలం శివనామానం తం వందే చిన్మహోదధిమ్॥ 3

శివాది భూమ్యంతమైన ముప్పదియాఱు తత్త్వములు (ప్రారంభక వస్తువులు — సత్యవస్తువులు) పరశివుండనెడి యే జ్ఞాన సముద్రమునకైన యలలయందుఁ బుట్టిన బుడగలో, ఆణవ, కార్మిక, మాయికములనెడు మలము లెవ్వనికి లేవో, యట్టి పరమశివునకు నా మ్రొక్కు.

వి॥ ఆణవ మలము — స్వరూపమును గూర్చి యపుడపుడు గలుగు జ్ఞానమును మఱుఁగు పఱచు దోషము. కార్మిక మలము — గురువులు బోధించిన పరమార్థము నందు బుద్ధిని జొఱనీయని దోషము. మాయిక మలము — పరతత్త్వజ్ఞాన వాసన నెప్పుడును గలుగనీయనిది,

పాపకార్యములందు బుద్ధిని జొనుపునది. ఈ మలములు మాయావృతుఁడైన జీవు నంటియుండునవి.

శైవ, శాక్త సిద్ధాన్తములందు ముప్పదియాఱు తత్త్వములు సంకేతింపఁబడినవి. వాని స్వరూప మెల్లరకును దెలియఁదగినది గాన నందుఁ బొందుపఱచుచున్నాను.

ప్రకాశ స్వరూప పరశివ బ్రహ్మము కంటెను వేఱుకానిదియు, ఆ బ్రహ్మము నెన్నఁడును వీడియుండనిదియునైన విమర్శశక్తిస్ఫురణమే, శివ, శక్తి, సదాశివ, ఈశ్వర, శుద్ధ విద్యా, మాయా, కలా, విద్యా, రాగ, కాల, నియతి, పురుష, ప్రకృతి, బుద్ధి, అహంకార, మనః, శ్రోత్ర, త్వక్, నేత్ర, జిహ్వా, ఘ్రాణ, వాక్, పాణి, పాద, పాయు, ఉపస్థ, శబ్ద, స్పర్శ, రూప, రస, గంధ, ఆకాశ, వాయు, అగ్ని, జల, క్షితి అనెడి 36 తత్త్వముల రూపమైనది.

శక్తియుత పరబ్రహ్మము "బహుస్యాం ప్రజాయేయ" నేననేక రూపములుగా నగుదు ననెడి సంకల్పముతోఁ గూడిన దయ్యెను. ఆ సంకల్పమే యిచ్ఛాశక్తి. ఆ శక్తియే జ్ఞానశక్తిగాను, అదే క్రియాశక్తి గాను మాఱెను. అనఁగాఁ బరమేశ్వరునకు సృష్టి సంకల్పము కలుగఁగానే యతని యందు వీడి యుండని విమర్శశక్తి యిచ్ఛాశక్తిగా ముందు మాఱెను.

"అనాది నిధనా చ్ఛాంతా చ్ఛివా త్పరమ కారణాత్, ఇచ్ఛాశక్తి స్సముత్పన్నా తతో జ్ఞానం తతః క్రియా, తత్రోత్పన్నాని భూతాని భువనాని చతుర్దశ" అనెడి శివాగమ ప్రమాణానుసారముగా, ఆద్యంతములు లేని, పరమకారణమైన, శాంతమైన, యా పరశివబ్రహ్మము నుండి తొలుత నిచ్ఛాశక్తియు, దాని నుండి జ్ఞానశక్తియు, దాని వలనఁ గ్రియాశక్తియుఁ గలిగినవి. ఈ యిచ్ఛాశక్తికి జ్ఞానశక్తి యంతరంగము, క్రియాశక్తి బహిరంగము.

పరశివ బ్రహ్మము జ్ఞానశక్తితోఁ జేరి 'నేను సర్వజ్ఞుఁడను' అనెడి యభిమానము నొంది 'శివతత్త్వ' మనఁబడును. సాలెపురుగు తాను బన్నువలకు నిమిత్తకారణ మైనటులే, యీ శివతత్త్వాకారమైన

పరశివబ్రహ్మమే జ్ఞానవిశిష్టాకారముతోఁ దాను సృష్టింపఁబోవు ప్రపంచమునకు నిమిత్తకారణ మగుచున్నది.

ఈ పరశివ బ్రహ్మమే క్రియాశక్తి యందుఁజేరి "నేను సర్వకర్తను" అనెడి యభిమానమునొంది 'శక్తితత్త్వ' మనఁబడుచున్నది. సాలెపురుగు వలయల్లుకొనుటకు యోగ్యమైన శరీరముతో నున్నదై దాని కుపాదానకారణ మగునటులే, శక్తి తత్త్వాత్మకమైన పరశివబ్రహ్మమే, క్రియాశక్తి విశిష్టాకారముతో భావిప్రపంచమునకు నిమిత్తకారణమును నుపాదానకారణమును నగుచున్నదనుట ముండకోపనిషత్తు "యథోర్ణ నాభిః సృజతే గృహ్ణాతే చ" అను వాక్యముచేఁ బ్రతిపాదింపఁ బడుచున్నది.

ఈ శక్తి తత్త్వమే యిచ్ఛాశక్తికి అంతరంగమైన జ్ఞానశక్తి యందుఁ బ్రవేశించి, సముద్రమునుండి పైకిలేచు కెరటములవలె నుబ్బి లేచిన భావిప్రపంచమును గూర్చి 'అహ మిదం' నేనే యీ ప్రపంచ మనెడి యభిమానము నొందఁగా '**సదాశివ తత్త్వ**' మనఁబడును.

ఈ శక్తి తత్త్వమే ఇచ్ఛాశక్తికి బహిరంగమైన క్రియాశక్తియందుఁ బ్రవేశించి, మంచి పొలమున విత్తిన మంచివిత్తనమువలె మొలకెత్తి, యటులు మొలకెత్తిన ప్రపంచమునుగూర్చి 'అహ మిదం' నేనే యీ ప్రపంచ మనెడి యభిమానము నొందగా 'ఈశ్వరతత్త్వ' మనఁబడును.

ఈ శక్తితత్త్వమే, సముద్రమునకును సముద్రమునఁబుట్టిన కెరటములకును భేదము లేనట్లు 'అహ మిదం' నేను అనెడి యహంకారమునకును, 'ఇది' యనెడి ప్రపంచమునకును భేదములేదనెడి జ్ఞానమునొంది 'శుద్ధ విద్యా తత్త్వ' మనఁబడును.

ఇపుడు శుద్ధవిద్యాతత్త్వముగా మాఱిన శక్తితత్త్వము మయూరాండరస న్యాయముగా ( నెమలిగుడ్డులోని రసమునందుఁ గాళ్లు, రెక్కలు, పలురంగులునుగల పిల్లయేర్పడి సూక్ష్మరూపముగా నుండును. ఇందుఁ ద్యాజ్యాంశము లేనే లేదు). అటులే తనయందణఁగి యుండి పుట్టఁబోవు ప్రపంచమునకు నిర్మాణకారణమైన సూక్ష్మభూత పదార్థ

ములందు అన్యోన్యాభావ మనెడి (ఒండొంటియొక్క లేమి యనెడి) భేదబుద్ధి ప్రాధాన్యముతో 'మాయాతత్త్వ' మనఁబడుచున్నది.

కళా, విద్యా, రాగ, కాల, నియతుల నెడి యయిదు తత్త్వము లును బురుషునకుఁ గంచుకరూపముగా (లాల్చీలవలె) నుండుటచే, మొదటఁ గంచుకియైన పురుషుని తత్త్వమును నిరూపించి, తరువాతఁ గళాది పంచతత్త్వములను నిరూపింతును.

కఱ్ఱల రాపిడిచే నగ్నికణములు పుట్టినట్లు పరశివుఁడు ఇచ్ఛా శక్తిని గూడుటచేఁ గలిగిన శివాంశమే మాయాశక్తియందుఁ బ్రవేశించి 'పురుషతత్త్వ' మనిపించుకొనును.

ఈ పురుషతత్త్వమునకు మాయామల సంబంధముండుటచే ఆత్మ యందు అనాత్మజ్ఞానమును, అనాత్మవస్తువులం దాత్మత్వ జ్ఞానమును, "నేను సుఖిని, నేను దుఃఖిని" యనెడి బుద్ధి గలుగును. పురుషుఁ డీరీతిగా ఆణవ, కార్మిక, మాయిక మలములతోఁ గూడినవాఁడై జనన మరణ రూప సంసారము నొందుచున్నాఁడు.

పురుషుఁడు మాయా మలములచేఁ గ్రమ్మఁబడి తన సర్వ కర్తృత్వ, సర్వజ్ఞత్వ, పూర్ణత్వ, నిత్యత్వ, వ్యాపకత్వము లనెడి శక్తు లను మఱచి కించిద్జ్ఞత్వాది శక్తులతోఁ గూడినవాఁ డగుచున్నాడు. పురుషుని యీ కించిత్కర్తృత్వరూప శక్తియే 'కళాతత్త్వ'మనఁబడును.

కించిద్జ్ఞత్వ రూప శక్తియే విద్యాతత్త్వ మనఁబడును. అపూ ర్ణత్వ రూప శక్తియే స్రక్చందన వనితాదులందలి ప్రీతిరూపమైన 'రాగతత్త్వ' మనఁబడును.

అనిత్యత్వ రూపశక్తియే భూత, వర్తమాన, భావికాలములందు వ్యవహారమునకు అసాధారణ కారణమైన 'కాలతత్త్వ' మనఁబడును.

అవ్యాపకత్వ శక్తియే 'ఈ కారణమున నీ కార్యము పుట్టును. నాయందుఁ బుట్టినది కాదు' అనెడి నియమమునకు అసాధారణ కారణ మైన 'నియతితత్త్వ' మనఁబడును.

కార్యమున కున్ముఖము చేయు (పని చేయవలయునని పూనిక కలిగించు) ఇచ్ఛాశక్తి తనయందున్న జ్ఞాన క్రియాశక్తులందుండి, 'జ్ఞానం

క్రియా న భవతి, క్రియా జ్ఞానం న భవతి' యనెడి భేదబుద్ధి ప్రధానమైన మాయాతత్త్వమున్నందుఁ బ్రతిస్ఫురించి 'ప్రకృతితత్త్వ' మనఁబడును.

ఈ ప్రకృతి తత్త్వము సుఖ దుఃఖ మోహములకుఁ గారణమైన సత్త్వ, రజ, స్తమోగుణములు సామ్యావస్థా రూపమం దుండుటయే 'మహత్తత్త్వ' మనఁబడును.

ఈ పదుమూఁడు తత్త్వములే సృష్టికి మూలకారణములు.

ప్రకృతి తత్త్వరూపమైన శక్తితత్త్వమే 'ఇదమిత్థమ్' ఇది యిట్లు అనెడి నిశ్చయమునకుఁ గారణమై 'బుద్ధితత్త్వ' మనఁబడును. దీనికే వ్యావహారిక 'మహత్తత్త్వ'మని మఱియొక పేరు.

బుద్ధితత్త్వరూపమైన శక్తితత్త్వమే 'నేను – నాది' యనెడి యహంకార మమకారములకు మూలమై 'యహంకారతత్త్వ' మనఁబడును.

అహంకార రూపమైన శక్తితత్త్వమే 'స్థాణుర్వా – పురుషోవా' కట్టెదుంగయా – పురుషుఁడా ? యనెడి సంకల్ప వికల్పములకుఁ గారణమైన 'మనస్తత్త్వ' మనఁబడును.

బుద్ధ్యహంకార, మనస్తత్త్వములు శరీరము ననుసరించుటవలన నిమ్మూఁడును గలిసి 'అంతఃకరణ' మనఁబడును. ఈ యంతఃకరణము ఇచ్ఛాశక్తి ప్రధానమైనది.

అంతఃకరణ రూపముగాఁ బరిణమించిన యీ శక్తి తత్త్వమే బాహ్యశరీరము నవలంబించి 'శబ్ద' జ్ఞానమునకు సాధనమై 'శ్రోత్ర తత్త్వ' మనియు, 'స్పర్శ' జ్ఞానమునకు సాధనమై 'త్వక్తత్త్వ' మనియు, 'రూప' జ్ఞానమునకు సాధనమై 'నేత్ర తత్త్వ' మనియు, 'రస' జ్ఞానమునకు సాధనమై 'జిహ్వాతత్త్వ' మనియు, 'గంధ' జ్ఞానమునకు సాధనమై 'ఘ్రాణతత్త్వ' మనియుఁ జెప్పఁబడును. ఈ యైదింద్రియములును జ్ఞానశక్తి ప్రధానము లగుటవలన జ్ఞానేంద్రియము లనఁబడును.

జ్ఞానేంద్రియ రూపముగాఁ బరిణమించిన యీ శక్తితత్త్వమే ఉచ్చారణక్రియకు సాధనమైన 'వాక్తత్త్వ' మనియు, దానాదానాది

క్రియలకు సాధనమైన 'పాణితత్త్వ' మనియు, గమనాగమనాది క్రియలకు సాధనమైన 'పాదతత్త్వ' మనియు, మల పరిత్యాగమునకు సాధనమైన 'పాయుతత్త్వ' మనియు, శుక్ర మూత్రములు విడుచుటకు సాధనమైన 'యుపస్థతత్త్వ' మనియుఁ జెప్పఁబడును. ఈ యయిదిం ద్రియములును గ్రియాశక్తి ప్రధానము లగుటవలనఁ గర్మేంద్రియము లనఁబడును.

ఈ విధముగాఁ జెప్పఁబడిన బుద్ధి తత్త్వాదులగు పదుమూఁడును గ్రమముగా ఇచ్ఛా, జ్ఞాన, క్రియా శక్తి ప్రధానములుగా నున్నవి.

ఇఁక నీ శక్తితత్త్వమే కేవల శ్రోత్రేంద్రియముచేఁ గ్రహింపఁ బడు 'శబ్దతత్త్వము' గాను, కేవల త్వగింద్రియముచేఁ దెలియఁబడు 'స్పర్శతత్త్వము'గాను, కేవల నేత్రేంద్రియముచేఁ దెలియఁబడు 'రూప తత్త్వము' గాను, కేవల జిహ్వేంద్రియముచేఁ దెలియఁబడు 'రస తత్త్వము' గాను, కేవల ఘ్రాణేంద్రియముచేఁ దెలియఁబడు 'గంధ తత్త్వము' గాను బరిణమించుచున్నవి.

శబ్దమందు ధ్వనిరూప వర్ణరూప శబ్దమును, స్పర్శమందు శీతము, ఉష్ణము మున్నగు స్పర్శమును, రూపమందు నలుపు, ఎఱుపు, పొట్టి, పొడుగు మున్నగు రూపమును, రసమందు తీపి, పులుపు, ఉప్పు మున్నగు రసమును, గంధమందుఁ గమ్మతావి, చెడుతావి మున్నగు గంధమును అను విభాగమేర్పడి సామాన్యరూపముగానున్న శబ్దాదులే 'తన్మాత్ర' లనఁబడును.

మునుజెప్పిన శక్తితత్త్వమే శబ్దము గుణముగాఁగల 'యాకాశ తత్త్వము' గాను, స్పర్శప్రధానగుణము గల 'వాయుతత్త్వము' గాను, రూపప్రధాన గుణముగల 'తేజస్తత్త్వము' గాను, రసప్రధాన గుణము గల 'జలతత్త్వము' గాను, గంధప్రధాన గుణముగల 'పృథివీతత్త్వము' గాను బరిణమించును. ఇది స్థూల పరిణామము.

ఈ పంచభూతము లందును ఉత్తరోత్తర భూతములయందుఁ బూర్వ పూర్వ భూతగుణము లనువర్తించుచున్నవి. అనఁగా ఆకాశ గుణము వాయువునందు స్పర్శగుణముతోఁబాటు ఇమిడియున్నది.

తేజస్సునందు శబ్ద, స్పర్శ రూపము లనువర్తించుచున్నవి. జలమందు శబ్ద, స్పర్శ, రూప, రసము లనువర్తించుచున్నవి. పృథివియందు దాని గంధగుణముతో శబ్ద, స్పర్శ, రూప, రసములును ననువర్తించుచున్నవని భావము.

నిగమాగమ ప్రసిద్ధములైన యీ ముప్పదియాఱు తత్త్వములు సచ్చిదానందరూపమైన శక్తి విశిష్ట పరశివ బ్రహ్మముయొక్క పరిణామ రూపమై యుండుటవలన వీరశైవమతము పరిణామవాదమును జగత్సత్యత్వవాదమును బోధించును.

యద్భాసా భాసతే విశ్వం యత్సుఖే నానుమోదతే
నమస్తస్మై గుణాతీత విభవాయ పరాత్మనే॥ ४

"తస్యభాసా సర్వమిదం విభాతి" యనెడి కఠవల్లీ శ్రుతి ప్రమాణముఁ బట్టి సమస్త ప్రపంచమును ఆ పరశివ బ్రహ్మప్రకాశము వల్లనే ప్రకాశించుచున్నది. ఆ పరశివబ్రహ్మము యొక్క ఆనందము వల్లనే యానందించు చున్నది. త్రిగుణ రహిత విభవము గల యా పరశివ నామక పరమాత్మకు నా నమస్కారము.

సదాశివ ముఖాశేష తత్త్వోన్మేష విధాయినే,
నిష్కలంక స్వభావాయ నమః శాంతాయ శంభవే॥ ౫

శివాది భూమ్యంతమైన ముప్పది యాఱు తత్త్వములును దనయందు దాఁగియున్న విమర్శ శక్తివలన మయూరాండరస న్యాయముగా (దీని వివరణము ౨౨వ శ్లోకమునఁజూచునది) వికసింపఁ జేయువాఁడును, స్వభావముచే నిష్కలంకుఁడును (ఆణవాది మల రహితుఁడును) శాంతుఁడును నైన యా శంభునకు నా జోత.

స్వేచ్ఛా విగ్రహ యుక్తాయ స్వేచ్ఛావర్తన వర్తినే,
స్వేచ్ఛాకృత త్రిలోకాయ నమః సాంబాయ శంభవే॥ ౬

భక్తానుగ్రహమునకై స్వేచ్ఛతో నానావిధ మంగళ రూపములను దాల్చుచు, స్వేచ్ఛావర్తనముఁ గలిగి, తనయందుం దాఁగియున్న

యిచ్ఛాశక్తివలన సచరాచర జగత్తులను దననుండి విడుచుచున్న యా పార్వతీపతికి నా (మ్రొక్కు.

యత్ర విశ్రామ్య తీశత్వం స్వాభావిక మనుత్తమమ్,
నమస్తస్మై మహేశాయ మహాదేవాయ శూలినే॥ ౭

ఏ పరశివ బ్రహ్మమందు సర్వశ్రేష్ఠమును, స్వభావసిద్ధమును నైన యీశత్వము (సర్వాతిశాయిత్వము, అన్నిటిని మీఱియుండుట) సుస్థిరమై యుండునో, ఇచ్ఛా, జ్ఞాన, క్రియాశక్తులనెడి త్రిశూలము నెవఁడు తాల్చెనో యా మహాదేవునకు నమస్కారము.

మహాదేవుని చేతి శూలము అ, ఉ, మ్ అను నంగములతోనైన ప్రణవమును, స్తోతృ, స్తుత్య, స్తుతులు, జ్ఞాతృ, జ్ఞేయ, జ్ఞానము లనెడి త్రిపుటియుఁ దన రూపమే యని తెల్పును.

ఈ గ్రంథకారులు పరశివునందెల్లప్పుడు నవినాభావ సంబంధముతో నుండు శక్తిని 5 శ్లోకములతో స్తుతించుచున్నారు.

## శక్తిస్తుతి.

యామాహుః సర్వలోకానాం ప్రకృతిం శాస్త్రపారగాః,
తాం ధర్మచారిణీం శంభోః ప్రణమామి పరాం శివామ్॥ ౮

సర్వశాస్త్రముల తుదఁ జూచిన పండితులు ఈ చరాచర జగత్తులు పుట్టుట కేమెను గారణముగా నందురో, ('శ్రీగురుః కారణభూతాశక్తిః' — కౌలోపనిషత్) ప్రకృష్టాః కృతయః యస్యాః సా ప్రకృతిః – సృష్టి, స్థితి, లయ, తిరోధా, నానుగ్రహములనెడి ఐదు గొప్పపనులను జేయునది కావుననే 'పంచకృత్య పరాయణా' యని నామస్మృతి. అట్టి యుత్కృష్ట కార్యము లేమెవో, శంకరుని ధర్మచారిణి యేమెయో, (భర్తృధర్మముల నాతనితో సమానముగా నాచరించునది. అనఁగా శంకరుని ధర్మము విమర్శశక్తి. ధర్మము శక్తి– ధర్మి శంకరుఁడు అని శ్రుతి. అనఁగాఁ బరశివుని విమర్శ శక్తియై యేమి చెలఁగుచున్నదో) అట్టి సర్వమంగళా రూపమైన పరాశక్తికి మ్రొక్కుచున్నాను.

గ్రంథకర్త యీ మంగళ శ్లోకమందు శక్తి శక్తిమంతుల కవినాభావ సంబంధమును జెప్పుచున్నాఁడు. ఇదె వీరశైవ సిద్ధాన్త మందలి పరమ రహస్యము. ఈ శక్తి విశిష్టాద్వైతముయొక్క యాథార్థ్యము నెల్ల రెఱుంగఁదగును గాన నిట సంక్షేపముగా వివరింపఁబడును.

శక్తివిశిష్టాద్వైత మనఁగా శక్తి విశిష్ట జీవునకును శక్తివిశిష్ట శివునకును సామరస్యమనియే యర్థము.

"శక్తిశ్చ శక్తిశ్చ శక్తీ — తాభ్యాం విశిష్టౌ జీవేశౌ,
తయో రద్వైతం శక్తి విశిష్టాద్వైతమ్ ॥

అని పూర్వాచార్యులెల్లరు శక్తి విశిష్టాద్వైతమనెడి పదమునకు వ్యుత్పత్తిని దెలిపిరి.

ఈ శక్తి స్థూల చిదాత్మకశక్తి, సూక్ష్మ చిదాత్మకశక్తి యని రెండువిధములుగా నున్నది. జీవుఁడు స్థూల చిదాత్మకశక్తియుక్తుఁడు. శివుఁడు సూక్ష్మ చిదాత్మకశక్తియుక్తుఁడు. జీవుని స్థూల చిచ్ఛక్తి కించిద్జ్ఞత్వ రూపమైనది. స్థూలమైన అచిచ్ఛక్తి కించిత్కర్తృత్వ రూపమైనది. శివుని సూక్ష్మచిచ్ఛక్తి సర్వజ్ఞత్వరూపమైనది. సూక్ష్మమైన అచిచ్ఛక్తి సర్వకర్తృత్వరూపమైనది. ఈ రెండు విధములైన శక్తులతోఁ గూడిన జీవుఁడును శివుఁడును వేఱు కారనునదే శక్తివిశిష్టాద్వైత మనఁబడును. శక్తియుఁ బరబ్రహ్మమందు అవినాభావ సంబంధము గలది.

"పరాస్య శక్తి ర్వివిధైవ శ్రూయతే స్వాభావికీ జ్ఞాన బల క్రియా చ" — శ్వేతాశ్వతరోపనిషత్. ఈ వాక్యమును బర్యాలోచించి బ్రహ్మమందు శక్తి స్వభావసిద్ధమనియు, ఇదే జ్ఞానక్రియాది రూపములతో నానావిధములుగా నున్నదనియు సిద్ధమైనది. "స్వాభావికీ" యను పదము శక్తియొక్క సత్యత్వమును ఘంటాఘోషముతోఁ జాటుచున్నది.

ఈ విషయమునే యీ శ్రుతి మఱియొకచోట 'యదా తమస్తన్నదివా నరాత్రి ర్నసన్నచాస చ్ఛివ ఏవ కేవలమ్, త దక్షరం తత్స

వితుర్వరేణ్యం ప్రజ్ఞా చ తస్మాత్ ప్రసృతాపురాణీ" యను వాక్యముచేఁ బ్రతిపాదించుచున్నది.

పురాణీ — అనాది సంసిద్ధమైన, ప్రజ్ఞా — చిచ్ఛక్తి, తస్మాత్ — ఆ పరశివ బ్రహ్మమునుండి, ప్రసృతా — క్రియాశక్తి మున్నగు ననేక రూపములుగా వ్యాపించుచున్నది. ఈ శ్రుతివాక్యమునందు శక్తి విశ్వాసము విస్పష్టముగాఁ జెప్పఁబడినది.

"మాయాం తు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరమ్" అను నీ వాక్యము సైతము పరమశివుఁడు శక్తివిశిష్టుఁడని చెప్పుచున్నది. పూర్వాచార్యులు మాయా శబ్దమును మం=శివం, అయతి— స్వభావతః ప్రాప్నోతి (సహజముగానే చేరుచున్నది) యని నిర్వచించిరి.

ఈ మాయను అద్వైతులు మూలావిద్యా రూపముగాను విమర్శశక్తిరూప మాయగాను జెప్పిరి.

ఈ యభిప్రాయమునే సిద్ధాగమము "మం శివం పరమంబ్రహ్మ ప్రాప్నోతీతి స్వభావతః। మాయేతి ప్రోచ్యతే లోకే బ్రహ్మ నిష్ఠా సనాతనీ" యన్నది.

ఇఁకఁ దైత్తిరీయ సంహితయందు "ఆహు స్తే రుద్ర పశు స్తం జుష స్వైష తే రుద్ర భాగః। సహస్వస్రాంబికాయా తం జుషస్వ" ఈ మంత్రము వలనను శక్తినిత్యత్వము ప్రతిపాదింపఁబడుచున్నది. ఇందలి 'స్వస్రా' — 'అంబికయా' అను మాటలు పర్యాలోచించినచోఁ బరమాత్మయందు శక్తియునికి స్వాభావికమని సిద్ధము.

"నమః సోమాయ చ రుద్రాయ చ' అను రుద్ర మంత్రము గూడ, పరమేశ్వరుఁడు ఉమారూప శక్తియుక్తుఁడనియే జెప్పుచున్నది.

ఇటులే యెన్నోశ్రుతులు శక్తినిత్యత్వమును శివు నెడబాయ కుండుటను బ్రతిపాదించుచున్నవి.

"యథా చంద్రే స్థిరా జ్యోత్స్నా విశ్వవస్తు ప్రకాశినీ,
తథా శక్తి ర్విమర్శాఖ్యా ప్రకాశే బ్రహ్మణి స్థిరా,

అంతఃకరణ రూపేణ జగదంకుర రూపతః,
యస్మిన్ విభాతి చిచ్ఛక్తి ర్బ్రహ్మభూతః స ఉచ్యతే॥"

అన్నిఁటిని ప్రకాశింపఁజేయు వెన్నెల నెలయందెట్లు స్థిరమో, యటులే చరాచర జగత్తును ప్రకాశింపఁజేయు విమర్శశక్తి ప్రకాశ స్వరూప పరబ్రహ్మమందు స్థిరమై యుండుననియు, మూలాహంకార రూపముగాను జగద్రూపముగాను అంతట వెలయుచుండు ననియు, అదియే పరబ్రహ్మ స్వరూపమనియుఁ బ్రతిపాదింపఁబడెను.

శ్రీ మన్మహాకవి కాళిదాసుఁడును దన రఘువంశకావ్యమునం దారంభమున 'వాగర్థా వివ సంపృక్తౌ వాగర్థ ప్రతిపత్తయే, జగతః పితరౌ వందే పార్వతీ పరమేశ్వరౌ' అను నీమంగళ శ్లోకమునందుఁ బార్వతీ పరమేశ్వరులు శబ్దార్థములవలెనే నిత్యసంబంధము గలవారని ప్రతిపాదించెను. పార్వతీ పరమేశ్వరులే శక్తియు, శివుఁడును. శబ్దమును విడిచి యర్థముండదు, అర్థమును విడిచి శబ్దముండదు. అటులే శివుఁడు శక్తిని, శక్తి శివుని వీడియుండరని మహాకవి యభిప్రాయము.

వీరశైవ సిద్ధాన్తమున బ్రహ్మము సవిశేషమును నిర్విశేషమును నై యుండును. పరబ్రహ్మము శక్తి విశిష్టమగుటచే 'సవిశేష' మనఁ బడును. ఈ బ్రహ్మము సవిశేషముగా నున్నపుడే చరాచరజగన్నిర్మాణ కారణ మగుచున్నది. ఈ విషయమునే శ్రీమచ్ఛంకర భగవత్పాదులు తమ 'సౌందర్యలహరి'లో మొదటి శ్లోకమున "శివః శక్త్యా యుక్తో యది భవతి శక్తః ప్రభవితుం, నచే దేవం దేవో న ఖలు కుశలః స్పందితు మపి" అని ప్రతిపాదించిరి.

శక్తి విశిష్ట బ్రహ్మముచే సృజింపఁబడిన జగత్తును శక్తి విశిష్ట మైనదియే కాదా ! ఈ జగత్తు నందలి పదార్థములెల్లఁ జూడఁగా ఒక్కొక దానియం దొక్కొకశక్తి యొక్కొక విధముగా నుండుట కానవగును. పృథివియందు ధారణశక్తి, జలమందుఁ దృప్తిపఱచు శక్తి, తేజస్సునందు వెలుఁగుశక్తి, కాల్చుశక్తియు, వాయువునందుఁ జలనశక్తి, ఆకాశమందు వ్యాపనశక్తి, ఆత్మయందు బుద్ధిశక్తి యున్నవికదా !

అటులే వృక్షాదులందు నీటిని గొనుశక్తి, భూమధ్యాకర్షణ శక్తికి విరుద్ధముగాఁ బైకిలేచు శక్తియు, వనస్పతులయందు వ్యాధి నాశకశక్తి, పాదరసమందు రాగిని బంగారుచేయు శక్తి, వజ్రమందు ఱాతిని భేదించుశక్తి, మణి మంత్రాదులందు భూతప్రేతాదులఁ దొలఁగించుశక్తి, ధ్వన్యాకర్షణ యంత్రమున ధ్వని నాకర్షించి విస్తరింపఁ జేయుశక్తి, విద్యుత్తునందు నానాయంత్ర చాలనశక్తి, సూదంటు రాతియందు ఇనుమును లాగికొనుశక్తి, కొమ్ములుగల జంతువులకు విషమును బరీక్షించు శక్తి, చీమలకుఁ జెట్టువేరు మూలోఁని దాని కొననున్న పండును జూచు శక్తి, లొట్టిపిట్టలకు (ఒంటెలకు) శ్వాస దారిని సర్పముల నాకర్షించు శక్తి యీ విధముగా బ్రహ్మసృష్టియందున్న సకల వస్తువులందును నేదే నొక విధమైన శక్తి యున్నదనుట యెల్లరకుఁ బ్రత్యక్షముగాఁ గానవచ్చుచున్నదే కదా. దీనిచే సకల చరాచర రూపమైన జగత్తు శక్తి విశిష్టమై యున్నదనియు, నిట్టి శక్తి విశిష్ట జగత్తును దననుండి విడిచిన బ్రహ్మము సైతము శక్తి విశిష్టమైన దనియు నెల్లరకు ననుభవముచేఁ దెలియఁబడును.

సత్, చిత్, ఆనంద స్వరూపమైన పరబ్రహ్మము 'అస్మి ప్రకాశే నందామి'— 'నేనున్నాను, ప్రకాశించు చున్నాను, ఆనందించు చున్నాను.' అనెడి యనుభవముతోఁ గూడియున్నది. ఈ యనుభవమే పరబ్రహ్మము యొక్క విమర్శ శక్తి. ఈ యనుభవము పరబ్రహ్మమందుండుటచే ఆ పరబ్రహ్మమునకుఁ బ్రకాశరూపమైన స్ఫటికశిలవలె జడమని చెప్పరాని ప్రసంగము గలదు.

చక్కఁదనము గల గ్రుడ్డివానికిఁ దన యందమును దెలియు శక్తి లేక యుండుటచే వాని కాయానందము వ్యర్థమైనట్లే బ్రహ్మమునకుఁ దన సచ్చిదానంద రూపమును దెలియు శక్తి లేకున్నయెడలఁ దన సచ్చిదానంద స్వరూపము వ్యర్థమేకదా ? ఆ కారణముచే బ్రహ్మమందు సచ్చిదానంద రూపానుభవ శక్తిని ఒప్పుకొనవలసి యున్నది. ఇందుచే బ్రహ్మము శక్తి విశిష్టమని, విస్పష్టము అని సిద్ధమగుచున్నది.-

ఇట్లు శక్తివిశిష్ట పరబ్రహ్మము "అథాతో బ్రహ్మ జిజ్ఞాసా" "చైతన్యమాత్మా" మున్నగు బ్రహ్మసూత్ర శైవసూత్రములచేఁ బ్రతిపాద్యమైనది.

యయా మహేశ్వరః శంభు ర్నామరూపాది సంయుతః,
తస్యై మాయా స్వరూపిణ్యై నమః పరమశక్తయే ॥ ౯

తనయందు నిత్య సంబంధముతో నున్న యే శక్తిచేఁ బరమేశ్వరుఁడు నామరూప క్రియాదులతోఁ గూడినవాఁ డగుచున్నాఁడో, జగదుత్పత్తికారణమై మూలప్రకృతి స్వరూపమైన యా శక్తికి వందనము.

"శక్తిః కుండలినీతియా నిగదితా, అ ఈ మ సంజ్ఞా జగన్నిర్మాణే సతతోద్యతా" "శ్రీగురుః సర్వకారణభూతాశక్తిః" అనియు శ్రుతులు.

శివాద్యాది సముత్పన్నా శాంత్యతీత పదోత్తరా,
మాతరం తాం సమస్తానాం వందే శివకరీం శివామ్ ॥ ౧౦

శాంత్యతీతోత్తరకలా (విమర్శశక్తి) స్వరూపమై యేమె పరశివునితో సృష్ట్యాదియందు ఆవిర్భవించి సమస్త జగత్తునకు మాతృస్వరూపమై మంగళస్వరూపమైనదో యా సర్వమంగళా దేవికి మ్రొక్కుచున్నాను. 'మాతృత్వం యాతీతి మాయా' యని నిర్వచనము. కాన నీశక్తియే మాయ.

ఇచ్ఛా జ్ఞానాది రూపేణ యా శంభో ర్విశ్వభావినీ,
వందే తాం పరమానంద ప్రబోధ లహరీం శివామ్ ॥ ౧౧

ఏమెవలనఁ బరమశివుఁడు ఇచ్ఛా జ్ఞాన క్రియాశక్తి రూపముతో జగత్తును బ్రకాశింపఁ జేయుచున్నాఁడో ఆ పరమానంద జ్ఞానప్రవాహ రూపమైన యుమాదేవికి మ్రొక్కుచున్నాను.

అమృతార్థం ప్రపన్నానాం యా సువిద్యా ప్రదాయినీ,
అహర్నిశ మహం వందే తా మీశాన మనోరమామ్ ॥ ౧౨

ముక్తికొఱకుఁ దన్నాశ్రయించి శరణాగతులైన వారికిఁ 'దత్త్వమ'స్యాది మహావాక్యములచేఁ దెలుపఁబడు శివ జీవైక్య జ్ఞానమును బ్రసాదించునట్టి యా పరశివశక్తికి రేవగళ్లు నా మ్రొక్కులు.

ఈ పరశక్తి సహస్రనామములలో "శివజ్ఞాన ప్రదాయినీ" యనునది యొకటి. మున్ను శక్త్యారాధనము చేసినంగాని శివజ్ఞాన మల వడదు. తండ్రి రహస్య స్వరూపములను దెలుపునది తల్లియే కదా !

—•ఈ గ్రంథకర్తయైన శివయోగి శివాచార్యుల వంశ వర్ణనము•—

ఆసీ దాచార సిద్ధానా మగ్రణీః శివయోగినాం,
శివ యోగీతి విఖ్యాతః శివజ్ఞాన మహోదధిః ॥ ౧౩

సదాచారసంపన్నులైన శివయోగులందు శ్రేష్ఠుడును, శివజ్ఞానమునకు సముద్రమువంటివాడును నైన, శివయోగి శివాచార్యు డనెడి సుప్రసిద్ధు డుండెను.

శివభక్తి సుధాసింధు జృంభణామల చంద్రికా,
భారతీ యస్య విదధే ప్రాయః కువలయోత్సవమ్॥ ౧౪

తస్య వంశే సముత్పన్నో ముక్తామణి రివామలః,
ముద్దదేవాభిధాచార్యో మూర్ధన్యః శివయోగినామ్॥ ౧౫

ఏ శివాచార్యుని నిర్మలవాణి శివభక్తి యనెడి యమృత సముద్రము నుప్పొంగించు మలుకలులేని వెన్నెలయై భూమండల మనెడి కలువకు దనివి గూర్చెనో, యా శివాచార్యుని వంశసముద్రమందు బలుగడిగిన ముత్తెమువలె శివయోగులకు దలమానికమైన ముద్దదేవు డనెడి శివాచార్యుడు పుట్టెను.

ముద్దానా త్సర్వజంతూనాం ప్రణతానాం ప్రబోధతః,
ముద్దదేవ ఇతి ఖ్యాతా సమాఖ్యా యస్య విశ్రుతా॥ ౧౬

తస్యాసీ న్నందనః శాన్తః సిద్ధనాథాభిధః శుచిః,
శివసిద్ధాన్త నిర్ణేతా శివాచార్యః శివాత్మకః॥ ౧౭

శరణాగతులైన యెల్లరకు సద్బోధముచే సంతోషమును గల్గించుటచేత నే యాచార్యునకు 'ముద్దదేవ' (ముత్ + ద = సంతసము నిచ్చు, దేవ = ఇది పూజ్యవాచకమై రాజునకును, గురునకును గూడ

జెల్లును) యనెడిపేరు లోకమున వాసిగనెనో, ఆ ముద్దదేవశివాచార్యునకు శాన్తుఁడును, బవిత్రుఁడును, శివస్వరూపుఁడును, శైవసిద్ధాన్తనిర్ణాయకుఁడును అయిన సిద్ధనాథశివాచార్యుఁ డనుపేరి కొడుకు పుట్టెను.

వీరశైవ శిఖారత్నం విశిష్టాచార సంపదం,
శివజ్ఞాన మహాసింధుం యం ప్రశంసన్తి దేశికాః॥ ౧౮

యదాచార్యకులే జాతా సతా మాచార మాతృకా,
శివభక్తిః స్థిరా యస్మిన్ జజ్ఞే విగత విప్లవా॥ ౧౯

తస్య వీరశివాచార్య శిఖారత్నస్య నందనః,
అభవ చ్ఛివ యోగీతి సింధో రివ సుధాకరః॥ ౨౦

ఆచార్యులెల్లరును వీరశైవులలో శిఖామణి యనియు, శ్రేష్ఠమైన యాచారమే సంపదగాఁ గలవాఁడనియు, శివజ్ఞానమునకుఁ దఱుగని మహాసముద్రమువంటి వాఁడనియు గొంతెత్తి యెవ్వనిఁ గొనియాడిరో, ఏ యాచార్యుని వంశమందు సదాచారముల మూలము పుట్టెనో ఏ యాచార్యునందు శివభక్తి హానిలేనిదై స్థిరమయ్యెనో, వీరశైవులకుఁ జూడామణి యెవ్వఁడయ్యెనో యట్టి సిద్ధనాథ శివాచార్యునకు సముద్రమునుండి చంద్రుఁడువలె శివయోగి శివాచార్యుఁడనెడి కొడుకుపుట్టెను.

చిదానంద పరాకాశ శివానుభవ యోగతః,
శివయోగీతి నామోక్తి ర్యస్య యాథార్థ్య యోగినీ॥ ౨౧

శివాగమ పరిజ్ఞాన పరిపాక సుగంధినా,
యదీయకీర్తి పుష్పేణ వాసితం హరితాం ముఖమ్॥ ౨౨

యేన రక్షావతీ జాతా శివభక్తిః సనాతనీ,
బౌద్ధాది ప్రతి సిద్ధాన్త మహాధ్వాన్తాంశు మాలినా॥ ౨౩

స మహావీరశైవానాం ధర్మమార్గ ప్రవర్తకః,
శివతత్త్వ పరిజ్ఞాన చంద్రికావృత చంద్రమాః॥ ౨౪

ఆలోక్యశైవ తంత్రాణి కామికాద్యాని సాదరం,
వాతులాంతాని శైవాని పురాణా న్యఖిలాని తు॥ ౨౫

వేదమార్గావిరోధేన విశిష్టాచార సిద్ధయే,
అసన్మార్గ నిరాసాయ ప్రమోదాయ వివేకినామ్॥ ౨౬

సర్వస్వం వీరశైవానాం సకలార్థ ప్రకాశకం,
అస్పృష్ట మఖిలైర్దోషై రాదృతం శుద్ధమానసైః॥ ౨౭

శైవాగమేషు సర్వేషు పురాణే ష్వఖిలేషు చ,
పురా దేవేన కథితం దేవ్యై తన్నందనాయ చ॥ ౨౮

తత్సంప్రదాయ సిద్ధేన రేణుకేన మహాత్మనా,
గణేశ్వరేణ కథిత మగస్త్యాయ పునః క్షితౌ॥ ౨౯

వీరశైవ మహాతంత్ర మేకోత్తర శత స్థలం,
అనుగ్రహాయ లోకానా మభ్యదాత్ సుధియాం వరః॥ ౩౦

చిదానందస్వరూపుఁడును, పరాకాశస్వరూపుఁడు నైన యా పరమ శివుని స్వరూపానందానుభవముచే 'శివయోగి' యను నామ మెవ్వనికి సార్థమయ్యెనో, శివాగమ జ్ఞానము పండుటచే మిగులఁ దావిగలదియై యే యాచార్యుని యశస్సనెడి పూవు పది దిక్కులను బరిమళింపఁ జేసినదో, సూర్యుఁడు పెంజీఁకటినివలె నే యాచార్యుఁడు బౌద్ధాది ప్రతికూల సిద్ధాన్తములను దొలఁగించి సనాతనమైన శివభక్తి తత్త్వమును గాపాడెనో, శివతత్త్వజ్ఞానమనెడి వెన్నెలచే నావరింపఁ బడిన చంద్రునివంటి తేజశ్శాలి యెవఁడో, యా వీరశైవ ధర్మమార్గ ప్రవర్తకుఁడు, శివయోగి శివాచార్యుఁడు, కామికాదివాతూలాంతమైన శివాగమములను, సకలపురాణములను సమగ్రముగఁ బరిశీలించి, వేద మార్గానుసారముగా సకలధర్మాచార సిద్ధికొఱకును, తప్పుదారులను ద్రొక్కిన బౌద్ధాది సిద్ధాన్తములను నిరసించుకొఱకును, జ్ఞానుల యానందము కొఱకును, నిగమాగమార్థములనుఁ జక్కఁగాఁ జూపునదియు, నెట్టిదోషములును లేనట్టియు, శుద్ధాంతఃకరణులచే నాదరింపఁబడినదియు, పురాణాగమాదులందెల్ల శివునిచేతఁ బార్వతీకుమారుల కుపదేశింపఁ బడినదియునై ౧౦౧ స్థలములుగల వీరశైవమహాశాస్త్రమును, వీరశైవ సంప్రదాయమును స్థాపించువాఁడును, మహాత్ముఁడునైన శ్రీ రేణుక

గణాధీశ్వరుఁడు ఈ భూమియందు దివ్యదేహధారియై యవతరించి యగస్త్యమహర్షి కుపదేశించిన విధమున, జగదనుగ్రహముతో బోధించెను.

> సర్వేషాం శైవ తంత్రాణా ముత్తమత్వా న్నిరుత్తరం,
> నామ్నా ప్రతీయతే లోకే యత్సిద్ధాన్త శిఖామణిః॥ ౩౧

ఇమ్మహాశైవ తంత్రము సకల శైవతంత్రములందును శ్రేష్ఠమగుటచే, దన్నుమించిన దొండు లేకుంటచే, లోకమున "సిద్ధాన్త శిఖామణి" యను పేర వాసిఁగన్నది.

> అనుగత సకలార్థే శైవ తంత్రే సమస్తైః
> ప్రకటిత శివబోధాద్వైత భావ ప్రసాదే,
> విదధతు మతి మస్మి న్వీరశైవా విశిష్టాః
> పశుపతి మతసారే పండిత శ్లాఘనీయే॥ ౩౨

సర్వ శివాగమముల ననుసరించిన రహస్యార్థములు గలదియు, శివజ్ఞానముచేఁ గలుగు శివాద్వైత భావప్రసాదమును బ్రకటించునదియు, శివమతసారము గలదియునై పండితులు కొనియాడఁ దగిన యీ సిద్ధాన్త శిఖామణియందు వీరశైవోత్తములు పూజ్యబుద్ధి గలవారగుదురు గాక.

ఇది

శ్రీ సిద్ధాన్త శిఖామణి యందు

శివయోగి శివాచార్య వంశ వర్ణన మనెడి

మొదటి పరిచ్ఛేదము.

శ్రీ శివార్పణము.

---

ఓం నమః శివాయ.

శ్రీ మాత్రే నమః

శ్రీ జగద్గురు రేణుకాది పంచాచార్యాః ప్రసీదంతు.

# రెండవ పరిచ్ఛేదము.

## జగత్సృష్టి విచారము.

సచ్చిదానంద రూపాయ సదసద్వ్యక్తిహేతవే,
నమః శివాయ సాంబాయ సగణాయ స్వయంభువే॥ ౧

సచ్చిదానంద స్వరూపుఁడును, చేతనాచేతన ప్రపంచనిర్మాణ కారణుఁడును, ప్రమథగణసహితుండును (ప్రమథులు = శివుని సభయందుండువారు. వీరు రేణుక, చండీశ్వర, నంది, మహాకాళాదులు. ప్రమథులనఁగా అంతః శత్రువులను మథించువారని యర్థము), పార్వతీయుతుండును [సాంబః – అంబయా సహితః, 'అంబమతి' (వమతి)–బ్రహ్మమును వెడలఁగ్రక్కునది అనఁగా పరశివ బ్రహ్మజ్ఞానము గలిగించునది] తనకుఁదానే లీలచేఁ బుట్టువాఁడు నైన పరశివునకు మ్రొక్కు.

సదాశివముఖాశేష తత్త్వమౌక్తిక శుక్తికాం,
వందే మాహేశ్వరీం శక్తిం మహా మాయాది రూపిణీమ్॥ ౨

(తొలి పరిచ్ఛేదమునఁ జెప్పఁబడిన) సదాశివాది ౩౬ తత్త్వములనెడి మంచి ముత్తెములు పుట్టు చిప్పయు, విమర్శ శక్తి రూపయు, మహామాయా స్వరూపయు నైన యా శైవశక్తికి నా జోతము. (సర్వబ్రహ్మాండములకును మాతృత్వము నొందినది గాన మహామాయ.)

అస్తి సచ్చిత్సుఖాకార మలక్షణ పదాస్పదం,
నిర్వికల్పం నిరాకారం నిరస్తాశేష విప్లవమ్॥ ౩

పరిచ్ఛేద కథా శూన్యం ప్రపంచాతీత వైభవం,
ప్రత్యక్షాది ప్రమాణానా మగోచరపదే స్థితమ్॥ ౪

స్వప్రకాశం పరాకాశ మనౌపమ్య మనామయం,
సర్వజ్ఞం సర్వగం శాన్తం సర్వశక్తి నిరంకుశమ్॥ ౫

శివరుద్ర మహాదేవ భవాది పద సంజ్ఞికం,
అద్వితీయ మనిర్దేశ్యం పరంబ్రహ్మ సనాతనమ్॥ ౬

సచ్చిదానంద స్వరూపమును, మోక్ష స్థాన భూతమును, మార్పు లేనిదియు, రూపము లేనిదియు, నెట్టిహానియును లేనిదియు, దేశకాలములచేఁ దెంపులేనిదియుఁ హద్దులేని వైభవము గలదియు, (తనవలనఁగలిగి తన రూపమే యైన ప్రపంచముపై విభుత్వము గలదియు) ప్రత్యక్షాది ప్రమాణముల కందని, తనంతటఁ దాఁ బ్రకాశించు (బయల్పడు) నదియు, పరాకాశ స్వరూపమును, పోలిక చెప్పరానిదియు, జనన మరణాది దోషములు (అవస్థావిశేషములు) లేనిదియు, అన్య సహాయ సాధనములు లేకయే బాహ్యాభ్యంతర వస్తువులను దెలియు నదియు, సకల చరాచరాత్మక ప్రపంచ మంతటను వ్యాపించి యుండు నదియు, (సర్వగం-అందఱచేతను గానముచేయఁబడు నదియు) పలు విధములైన శక్తులతోఁ గూడినదియు, అడ్డులేనిదియు, శివుఁడు-మంగళ స్వరూపుఁడు, రుద్రుఁడు-రోదనమును అనఁగా దుఃఖమును బోఁగొట్టు వాఁడు, మహాదేవుడు-సర్వశ్రేష్ఠుఁడైన దేవుఁడు, భవుఁడు-అంతయుఁ దానయైనవాఁడు మున్నగు పేళ్లు గలదియు, తాను దక్క వేఱొక్కటి లేనిదియు సనాతనమును నైన పరబ్రహ్మపదార్థమే ప్రకాశించుచున్నది.

తత్రలీనమభూత్పూర్వం చేతనాచేతనం జగత్,
స్వాత్మలీనం జగత్కార్యం స్వప్రకాశ్యం తదద్భుతమ్॥ ౭

ఆ పరబ్రహ్మమందే సృష్టికి మున్ను చేతనాచేతనాత్మకమైన జగత్తంతయు నణఁగిపోయినది. ఆ రీతిగాఁ దనయందే యణఁగి కార్య రూపమైన (తననుండి విడువఁబడి నామరూపయుతమైన) యీ జగత్తు తనచేతనే ప్రకాశింపఁజేయఁ బడఁదగినది.

శివాభిధం పరంబ్రహ్మ జగన్నిర్మాతు మిచ్ఛయా,
స్వరూప మాదధే కించి త్సుఖస్ఫూర్తి విజృంభితమ్॥ ౮

నిరస్తదోష సంబంధం నిరుపాధిక మవ్యయం,
దివ్య మప్రాకృతం నిత్యం నీలకంఠం త్రిలోచనమ్॥ ౯

చంద్రార్ధ శేఖరం శుద్ధం శుద్ధస్ఫటిక సన్నిభం,
శుద్ధముక్తాఫలాభాస ముపాస్యం గుణమూర్తిభిః ॥ ౧౦

విశుద్ధ జ్ఞానకరణం విషయం సర్వయోగినాం,
కోటిసూర్యప్రతీకాశం చంద్రకోటి సమప్రభమ్,
అప్రాకృత గుణాధార మనంత మహిమాస్పదమ్ ॥ ౧౧

శివనామకమైన యీ పరబ్రహ్మము జగత్తును నిర్మించు కోరికతోఁ జనన మరణాది దోషములు లేనిదియు, ఉపాధి (దేశకాల పరిచ్ఛిత్తి) నాశనము లేనిదియు, అమానుషమైనదియు, ప్రాకృతము కానిదియు, శాశ్వతమైనదియు, నల్లనికుత్తుక గలదియు, ముక్కనులు గలదియు (కాలసూచక వస్తువులు సూర్య, చంద్రాగ్నులు అవయవ భూతములు కాఁగా కాలస్వరూపుఁడు, కాలాతీతుఁడు నని భావము; మఱియు, భూత, వర్తమాన, భవిష్యత్ జ్ఞానములే ముక్కనులు. అనఁగాఁ త్రివిధ జ్ఞానస్వరూపుఁడని భావము.) నెల తలపూవుగాఁ గలది (సదా స్వరూపానంద సుధాప్లావితుఁ డనుట. మఱియు దాను జరాచరాత్మకతనుఁడు గానఁ జంద్రుఁడు తలపూవుగా నిరూపింపఁబడెను), ఆణవాది మల రహితమైనదియు, శుద్ధ స్ఫటిక కాన్తి గలదియు, పులు గడిగిన ముత్తెపు నిగ్గువంటి నిగ్గుగలదియు (శుద్ధ జ్ఞాన మూర్తియని భావము), బ్రహ్మాదులైన గుణమూర్తులచేత నుపాసింపఁబడునదియు, నిర్మల జ్ఞానమును గలిగించు నదియు, యోగుల కెల్లరకు లక్ష్యమైనదియు, కోటి సూర్యులను, కోటి చంద్రులనుబోలి వెల్గునదియు, అప్రాకృత గుణముల కాధారమైనదియు, ఎల్లలేని మహిమమున కిమ్మయినదియు, ఆనందస్ఫూర్తి గలదియు నైన యొకానొక రూపమును దాల్చెను.

తదీయా పరమా శక్తిః సచ్చిదానంద లక్షణా,
సమస్త లోక నిర్మాణ సమవాయ స్వరూపిణీ,
తదిచ్ఛయాఽభవత్ సాక్షాత్ తత్స్వరూపాను కారిణీ॥ ౧౨

సర్వలోకముల నిర్మించుట యందు శివునితోఁ జేరియుండి తానాడును విడని సంబంధమే స్వరూపముగాఁ గలదియునైన విమర్శ-

శక్తి, పరశివుని యిచ్ఛానురూపముగా సాక్షాత్తుగా నాతని స్వరూపమునే యనుకరించిన దయ్యెను. [కావుననే సంధ్యావందన వాక్యములందును "'దేవీ' — (దేవశక్తి) అక్షరం బ్రహ్మ సమ్మితమ్" — అధిష్ఠాన, అవస్థాన, అనుష్ఠాన, నామ, రూపములందు బ్రహ్మముతో సమానమైన దనియు, నాశరహిత యనియు వర్ణింపఁబడినది].

స శంభు ర్భగవాన్ దేవః సర్వజ్ఞః సర్వశక్తికః,
జగత్సిసృక్షుః ప్రథమం బ్రహ్మాణం సర్వదేహినాం,
కర్తారం సర్వలోకానాం విదధే విశ్వనాయకః ॥ ౧౩

భగవంతుఁడు — ఉత్పత్తి, లయము, భూతముల రాకపోకలు, విద్య, అవిద్య (అల్పవిద్య) అను నైదిటికి భగమని పేరు. అది కలవాఁడు భగవంతుఁడు. స్వయంప్రకాశుఁడు, సర్వశక్తి యుక్తుఁడు (సర్వజ్ఞశక్తి, నిత్యతృప్తిశక్తి, అనాదిబోధశక్తి, స్వతంత్రశక్తి, నిత్యాలుప్తశక్తి, అనంతాస్త్రశక్తి) సర్వజ్ఞుఁడైన పరమేశ్వరుఁడు జగమును దనలోనుండి వెలికిఁ విడువఁ గోరినవాఁడై "విశ్వాధికో రుద్రో మహర్షిః హిరణ్యగర్భం జనయామాస పూర్వం" అనెడి శ్రుతి వాక్యానుసారముగాఁ బదునాలుగు భువనములను నిర్మించుటకుఁ జతుర్ముఖ బ్రహ్మను సృష్టించెను. అతఁడు విశ్వనాయకుఁడు అనఁగా మొదటి పరిచ్ఛేదమందు వివరించిన ౩౬ తత్త్వముల సముదాయమే విశ్వము. దానిని నడుపువాఁడు.

తస్మై ప్రథమ పుత్త్రాయ శంకరః శక్తిమాన్ విభుః,
సర్వజ్ఞః సకలా విద్యాః సానుగ్రహ ముపాదిశత్ ॥ ౧౪

సర్వశక్తిమంతుఁడును, స్వతంత్రుఁడును, సర్వవ్యాపకుఁడును, సర్వజ్ఞుఁడునైన శంకరుఁడు తన మొదటి కొడుకైన బ్రహ్మకు దయతో నన్ని విద్యల నుపదేశించెను.

ప్రాప్త విద్యో మహాదేవాత్ బ్రహ్మ విశ్వనియామకాత్,
సమస్త లోక నిర్మాణ సముద్యోగపరోఽభవత్ ॥ ౧౫

జగన్నాయకుఁడైన యమ్మహాదేవునిచే విద్య లొందినవాఁడై బ్రహ్మ లోకనిర్మాణకార్యమునం దాసక్తి కలవాఁ డయ్యెను.

కృతో ద్యోగోపి నిర్మాణే జగతాం శంకరాజ్ఞయా,
అజ్ఞాతోపాయ సంపత్తి రభవ న్మాయయా వృతః॥ ౧౬

బ్రహ్మ శంకరాజ్ఞచే జగములను నిర్మింపఁబూనినను దాను మాయావృతుఁ డగుటచే నిర్మాణోపాయమును దెలియనివాఁ డయ్యెను.

విధాతు మఖిలాన్ లోకా నుపాయం ప్రాప్తు మిచ్ఛయా,
పునస్తం ప్రార్థయా మాస దేవ దేవం త్రిలోచనమ్। ౧౭

తన చేతఁగాని యఖిలలోక నిర్మాణమునకైన వెరవును దెలిసికొను కోరికతో మఱల నిటులా ముక్కంటిని వేడుకొ నెను.

నమస్తే దేవ దేవేశ నమస్తే కరుణాకర,
అస్మదాది జగజ్జాల నిర్మాణ విధిషు క్షమ॥ ౧౮

ఉపాయం వద మే శంభో జగత్స్రష్టా జగత్పతే,
సర్వజ్ఞః సర్వశక్తి స్త్వం సర్వకర్తా సనాతనః॥ ౧౯

ఇతి సంప్రార్థితః శంభు ర్బ్రహ్మణా విశ్వనాయకః,
ఉపాయ మవద త్తస్మై లోక సృష్టి ప్రవర్తకమ్॥ ౨౦

'దేవాధిదేవా! దయాసముద్ర! నన్ను మొదలుగా సకల జగత్తులను నిర్మింపఁగలవాఁడ వీవు. సర్వజ్ఞుఁడవు; సర్వశక్తియుతుఁడవు; సర్వకర్తవు; నిత్యుఁడవు, కావున నీవే జగన్నిర్మాణమునకైన వెఱవును దెలుపుము.'

అని చతుర్ముఖునిచేఁ బలువిధములఁ బ్రార్థింపఁబడి శివుఁ డాతనికి జగన్నిర్మాణమునకైన యుపాయము నుపదేశించెను.

ఉపాయ మీశ్వరే ణోక్తం లబ్ధ్వాపి చతురాననః,
న సమర్థోఽభవ త్కర్తుం నానారూప మిదం జగత్॥ ౨౧

పున స్తం ప్రార్థయా మాస బ్రహ్మ విహ్వల మానసః,
దేవ దేవ మహాదేవ జగత్ప్రథమ కారణ॥ ౨౨

నమస్తే సచ్చిదానంద స్వేచ్ఛా విగ్రహరాజత,
భవ శర్వ మహేశాన సర్వకారణ కారణ॥ ౨౩

భవ దుఃఖోఽప్యుపాయో మే న కించిద్ జ్ఞాయతేఽధునా,
సృష్టిం విధేహి భగవన్ ప్రథమం పరమేశ్వర॥
జ్ఞాతోపాయ స్తతః కుర్యాం జగత్సృష్టి ముమాపతే॥ ౨౪
ఇత్యేవం ప్రార్థితః శంభు ర్బ్రహ్మణా విశ్వయోనినా,
స సర్జాత్మ సమప్రఖ్యాన్ సర్వజ్ఞాన్ సర్వశక్తికాన్॥ ౨౫
ప్రబోధ పరమానంద పరివాహిత మానసాన్,
ప్రమథాన్ విశ్వనిర్మాణ ప్రలయాది విధిక్షమాన్॥ ౨౬
సృష్ట ప్రమథవర్గేషు వర్ణాశ్రమ పరిక్రమాన్,
అప్రాకృత సదాచారా నుపాదిశ దథ ప్రభుః॥ ౨౭

ఈశ్వరునిచే నుపాయము తెలుపఁబడినను, నలువ నానారూపమైన జగత్తును నిర్మింపఁజాలనివాఁడై కలఁతనొందిన మనస్సుతో మఱల మఱల నిట్లు వేడుకొనెను — "దేవదేవ! మహాదేవ! జగదాదికారణ! స్వేచ్ఛారూపధారీ! శర్వుఁడా! (ప్రలయమందు భూతముల హింసించువాఁడు), మహేశ్వరుఁడా! సర్వకారణకారణుఁడా! నీవనుగ్రహించి నాకుపాయమును జెప్పినను నాకింతయుఁ దెలియదయ్యెను. గాన నీవే తొలిసృష్టి చేయుము. అపుడా యుపాయము నెఱిఁగికొని యా వెనుక నేను సృష్టిచేయుదును.

ఈ ప్రార్థనమును విని శంకరుఁడు తనతో సమానమైన ప్రతిభ గలవారును, సర్వజ్ఞులును, సర్వశక్తి సమన్వితులును, జ్ఞానానందమయ మనస్కులును, జగన్నిర్మాణ లయకార్యమందుఁ జాలినవారు నగు శ్రీ రేణుక, దారుకాద్యనేక ప్రమథులను సృష్టించెను.

శివుఁడు తనయందు స్వేచ్ఛతో సృష్టించిన ప్రమథగణమునకు వర్ణాశ్రమ ధర్మక్రమమును, అప్రాకృతశైవాచార సంపత్తిని ఉపదేశించెను. బ్రహ్మయు శివునిచేఁజేయఁబడిన సృష్టికైన యుపాయము నెఱిఁగి యా వెనుకఁ దాను సృష్టింప మొదలిడెను.

ఇది సిద్ధాన్త శిఖామణి యందు
జగత్సృష్టి విచార మనెడి రెండవ పరిచ్ఛేదము.
శ్రీ శివార్పణము.

ఓం నమః శివాయ

శ్రీ మాత్రే నమః

శ్రీ జగద్గురు రేణుకాచార్యాః ప్రసీదంతు.

# మూడవ పరిచ్ఛేదము.

## కైలాస వర్ణనము.

కదాచి దథ కైలాసే కలధౌత శిలామయే,
గంధర్వ వామనయనా క్రీడా మౌక్తిక దర్పణే॥ ౧

మందార బకులాశోక మాకందప్రాయ భూరుహే,
మల్లీమరంద నిష్యంద పానపీన మధువ్రతే॥ ౨

కుంకుమ స్తబకామోద కూలంకష హరిన్ముఖే,
కలకంఠ కులాలాప కందల ద్రాగ బంధురే॥ ౩

కిన్నరీ గీతమాధుర్య పరివాహిత గహ్వరే,
సానంద వరయోగీంద్ర బృందాలంకృత కందరే॥ ౪

హేమారవిందకలికా సుగంధి రసమానసే,
శాతకుంభ మయోత్తుంగ శత స్తంభ విరాజితే॥ ౫

మాణిక్య దీపకలికా మరీచి ద్యోతి తాంతరే,
ద్వారతోరణ సంరూఢ శంఖపద్మనిధి ద్వయే॥ ౬

ముక్తాతారకితోదార వితానాంబర మండితే,
స్పర్శ లక్షిత వైడూర్య మయభిత్తి పరంపరే॥ ౭

సంచరత్ ప్రమథశ్రేణీ పదవాచాల నూపురే,
ప్రవాల వలభీశృంగ శృంగార మణి మంటపే॥ ౮

పిమ్మట నొకనాఁడు వెండిరాలతో నిండినదియు, గంధర్వస్త్రీలు తమ యాటవేళఁ జూచికొను ముత్తెపు టద్దము వంటిదియు, మందారము పొగడ అశోకము తీయమామిడి మున్నగు చెట్లతో నిండినదియు, మల్లెపూఁదేనెలు త్రాగి బలిసిన తుమ్మెదలు గలదియు, కుంకుమ పూగుత్తుల తావులతో దిక్కులను నిండించుచున్నదియు, కోయిలల

పంచమ స్వరములచే మనోహరమైనదియు, కిన్నర నారుల పాటతీపి గ్రమ్మినకొండ గొబలు గలదియు, శివానందము ననుభవించు జోగి మిన్నల గుములచే నలంకృతమైన కందరములు గలదియు, (గుహాలు—దేవతలచేఁద్రవ్వఁబడిన బిలములు; కందరములు—కొండలందు మనుజులచే దొలువఁబడిన కృత్రిమ గృహములవంటి బిలములు) పొందమ్మి మొగ్గల తావిచే నిండిన నీరుగల మానస సరస్సు గలదియు, రతనపు దివ్వెకోడుల జిగులచే వెలుంగు నంతిపురులు గలదియు, ఎత్తైన నూఱు కంబాలతో నింపయినదియు, దువారపుఁదోరణముల కిరువంకలను శంఖపద్మము లనెడి నిధులు గలదియు, చుక్కలంబోలి మెఱయు మంచి ముత్తెముల కూర్పుగల విరివి మేల్కట్టు తొడవుగాఁ గలదియు, తాకుడు చేతనే తెలియఁబడు వైడూర్య మణులచేనైన గోడలు గలదియు, ఇటు నటుందిరుగు ప్రమథుల కాలియందెల చప్పుళ్లు గలదియు, పగడపుఁజట్టుగోడలందు సింగారపు రతనాల యూట పందిళ్లు గలదియునైన శివుని వెలికొండ వెలుగొందు చున్నది.

వందారు దేవమకుట మందార రస వాసితం,
రత్నసింహాసనం దివ్య మధ్యస్తం పరమేశ్వరమ్‌। ౯

ఇట్టి రమ్యమైన కైలాసమందుఁ దనకు మ్రొక్కెడి వేల్పుల కిరీటము లందలి మందారాది దేవవృక్షముల మకరందముచేఁ బరిమళింపఁ జేయఁబడిన రతనాల గద్దెనలంకరించి నట్టియు, వేలుపులకు వేలుపయినట్టియు,

త మాస్థాన గతం దేవం సర్వలోక మహేశ్వరం,
త్రయ్యంత కమలారణ్య విహార కలహంసకమ్‌॥ ౧౦

స్వయంప్రకాశుఁడును, సర్వలోకాధిపతియు, వేదాన్తముల నెడి తామర కొలఁకులందు ఓలలాడు రాజహంసమైనట్టియు,

ఉదారగుణ మోంకార శుక్తికాపుట మౌక్తికం,
సర్వమంగళ సౌభాగ్య సముదాయ నికేతనమ్‌॥ ౧౧

కుటిలము కాక పరుల మేలునకే యగు గుణములు గలట్టియు,

ఓంకారమనెడి ముత్తెపుఁజిప్పం బుట్టిన యాణిముత్తైమైనట్టియు, సకల శుభములకును, సౌభాగ్యములకును, దానైనట్టియు,

సంసార విషమూర్చాల జీవ సంజీవనౌషధం,
నిత్యప్రకాశ నైర్మల్యం కైవల్యసురపాదపమ్॥ ౧౨

సంసారమనెడి విషముచే మూర్ఛిల్లిన జీవులకు బ్రతుకుమందయినట్టియు, తఱుఁగులేని వెలుంగుతోనే వెలుంగునట్టియు, మోక్షమనెడి మహాఫలము నిచ్చు కల్పవృక్షమైనట్టియు,

అనంత పరమానంద మకరంద మధువ్రతం,
ఆత్మశక్తి లతాపుష్య త్త్రిలోకీ పుష్పకోరకమ్॥ ౧౩

ఎల్లలేని యానందమనెడి పూఁదేనెను గ్రోలు తుమ్మెదయైనట్టియు, తనశక్తియే యనెడి లతచేఁ బెంపఁబడు ముల్లోకములనెడి పూమొగ్గలు గలట్టియు,

బ్రహ్మాండ కుండికామండ పిండీకరణ పండితం,
సమస్త దేవతాచక్ర చక్రవర్తి పదే స్థితమ్॥ ౧౪

అనంతమైన బ్రహ్మాండముల నొక్కచోఁ జేర్చు నేర్పు గలట్టియు, వేల్పు మూకలకెల్ల సార్వభౌముఁడైనట్టియు,

చంద్రబింబాయుత చ్ఛాయా దాయాదద్యుతి విగ్రహం,
మాణిక్య మకుటజ్యోతి ర్మంజరీ పింజరాంబరమ్॥ ౧౫

పదివేల చంద్రబింబములకు సాటియైన కాంతిగల మూర్తి గలట్టియు, తన రతనాల బొమ్మిడి కపు జిగి గునులచేఁ బలురంగులు గలట్లు చేయఁబడిన యాకసము గలట్టియు,

చూడాలం సోమకలయా సుకుమార బిసాభయా,
కల్యాణపుష్ప కలికాకర్ణపూర మనోహరమ్॥ ౧౬

లేఁదామర తూఁడువలె గోమయిన చందురేక తలనగాఁ గలట్టియు, శుభములనెడి పూమొగ్గలు చెవితొడవులుగాఁ వెలయునట్టియు,

ముక్తావలయ సంబద్ధ రుండమాలా విరాజితం,
పర్యాప్త చంద్రసౌందర్య పరిపంథి ముఖశ్రియమ్॥ ౧౭

ముత్తెపు సరులతోఁ బెనగొన్న పునుక పేరులతో వెలయుసట్టియు, పున్నపుఁ జందురు నందమును ద్రోసిరాజను మొగసిరి గలట్టియు,

ప్రాతః సంఫుల్ల కమల ప్రతీకాశ త్రిలోచనం,
మందస్మిత మితాలాప మధురాధర పల్లవమ్॥ ౧౮

రేపటి విడు తామరలఁబోలు ముక్కన్నులు గలట్టియు, చిర్నగవుతను పడికట్టు మీఱని కులుకులతోను నందగించు క్రేఁబెదవి గలట్టియు,

గండమండల పర్యంత క్రీడ న్మకరకుండలం,
కాలిమ్నా కాలకూటస్య కంఠనాలే కలంకితమ్॥ ౧౯

గుండ్రని చెక్కిళ్ల యంచులందు నెత్తమాడు మొసలి వ్రాఁపోగులు గలట్టియు, కాలకూట మనెడి విసపు నలుపుచేనైన కుత్తుక మచ్చ గలట్టియు,

మణికంకణ కేయూర మరీచి కరపల్లవైః,
చతుర్భిః సంవిరాజంతం బాహుమందార శాఖిభిః॥ ౨౦

రతనాల కడియములయు, బాహుపురులయు నిగ్గులచే నొప్పుచు చివుళ్లవలె మెత్తనై వేలుపుఁ జెట్టుకొమ్మలఁబోలు నాల్గు చేతులు గలట్టియు,

గౌరీపయోధరాశ్లేష కృతార్థ భుజ మధ్యమం,
సువర్ణబ్రహ్మసూత్రాంకం సూక్ష్మకౌశేయ వాససమ్॥ ౨౧

గౌరమ్మ పాలిండ్ల నలముకొంటచేఁ దనిసిన ఱొమ్ము గలట్టియు, బంగారు జందెముగలట్టియుఁ, గడు సన్నని పట్టువలువఁ దాల్చినట్టియు,

నాభిస్థానావలంబిన్యా నవముక్తిక మాలయా,
గంగయేవ కృతాశ్లేషం మౌళిభాగావతీర్ణయా॥ ౨౨

పొక్కిలిదాఁక వ్రేలుటచేత, సిరమునుండి క్రిందికి జాఱిన గంగయో యనునట్టులున్న క్రొ మ్ముత్తెపు సరిచే నలముకొనఁ బడినట్టియు,

పదేన మణి మంజీరప్రభా పల్లవిత శ్రియా,
చంద్రవత్ స్ఫాటికం పీఠం సమావృత్య స్థితం పురః॥ ౨౩

రతనపు టందె నిగ్గులచేఁ బెంపొందింపఁబడిన సిరిగల యడుగులచే నెదుటఁ జంద్రునివలెఁ దెల్లనైన పటికపుఁబలక నలంకరించినట్టియు శివుఁడు వెలుంగుచుండెను.

వామపార్శ్వ నివాసిన్యా మంగళ ప్రియవేషయా,
సమస్త లోకనిర్మాణ సమవాయ స్వరూపయా॥ ౨౪

పరమేశ్వరుని యెడమవైపు నేనాఁడును వీడనిదియు, పరమ శుభమయ వేషము గలట్టియు, ఎల్లలోకములను గల్గించు పనియందు శివునితో నెడయని సంబంధ స్వరూపములు గలట్టియు,

ఇచ్ఛా జ్ఞాన క్రియా రూప బహుశక్తి విలాసయా,
విద్యాతత్త్వప్రకాశిన్యా వినాభావ విహీనయా॥ ౨౫

ఇచ్ఛా జ్ఞాన క్రియా ద్యనేక శక్తులతో గూడినట్టియు, తన భక్తుల కాత్మవిద్యారహస్యమును దెలుపునట్టియు, శివునితో విడని సంబంధము గలట్టియు,

సంసార విషకాంతార దాహదావాగ్ని లేఖయా,
ధమ్మిల్ల మల్లికామోద ఝుంకుర్వద్ భృంగ మాలయా॥ ౨౬

చావుపుట్టుక లనెడి విసపుటడవిని గాల్చు కారు చిచ్చయినట్టియు, తన కొప్పులోని మల్లెల తావికి మూగి జుమ్మని రొదచేయు తుమ్మెదల దండు గలట్టియు,

సంపూర్ణ చంద్రసౌభాగ్య సంవాది ముఖపద్మయా,
నానా మౌక్తిక లావణ్య నాసీర స్మితశోభయా॥ ౨౭

పున్నపుఁజందురు నందమును మేలమాడు మోము దామర గలట్టియు, పలుతెగల ముత్తెముల నిగ్గును దెగనాడు చిఱునగవు సిరి గలట్టియు,

మణి తాటంక రంగాంత ర్వలితా పాంగలీలయా,
నేత్రద్వితయ సౌందర్య విందితేందీవర త్విషా॥ ౨౮

రతనాల చెవికమ్మల చాయతోఁ బెనఁగొన్న క్రేగంటి చూపుల యొయారము గలట్టియు, నల్లకలువ యందమును గ్రిందుసేయు కందోయి సొంపు గలట్టియు,

కుసుమాయుధ కోదండ కుటిల భ్రూవిలాసయా,
బంధూక కుసుమచ్ఛాయా బంధుభూతాధరశ్రియా॥ ౨౯

పూవింటివాని విల్లునలె వంగిన బొమ్మలయొప్పు గలట్టియు, మంకెన పూవన్నెకుఁ జుట్టమైన క్రేఁబెదవి సిరి గలట్టియు,

కంఠనాళ జితానంగ కంబు బిబ్బోక సంపదా,
బాహుద్వితయ సౌభాగ్య వంచితోత్పల మాలయా॥ ౩౦

మరునిగెలుపు సంకు రొదనుగెలుచు కుత్తుకనాదు గలట్టియు, తనకైదోయి యొప్పుచేఁ గ్రిందుసేయఁబడిన కలువదండలు గలట్టియు,

స్థిరయౌవన లావణ్య శృంగారిత శరీరయా,
అత్యంత కఠినోత్తుంగ పీవర స్తనభారయా॥ ౩౧

నిలుకడగల జవ్వనపు నిగ్గుచే సింగారింపఁబడిన మేను గలట్టియు, మిపుల గట్టియై యెత్తై బలిసిన చన్దోయి బరువు గలట్టియు,

మృణాళ వల్లరీతంతు బంధుభూతావలగ్నయా,
శృంగార తటినీ తుంగ పులిన శ్రోణి భారయా॥ ౩౨

తామరతూఁటి దారమునకు సాటి చుట్టమైన నడుము గలట్టియు, తన సింగారపు టేటనైన పెన్నిసుక తిన్నెలో యన నొప్పు పిఱుఁదుల బరువు గలట్టియు,

కుసుంభ కుసుమచ్ఛాయా కోమలాంబర శోభయా,
శృంగారోద్యాన సంరంభ రంభాస్తంభోరుకాండయా॥ 33

కుసుంబ పూవన్నెగల మెత్తని చీలసౌరు గలట్టియు, తన సింగారపుఁ బూఁదోటను వెలయు ననఁటిబోదెలఁబోలు తొడలు గలట్టియు,

చూతప్రవాళ సుషమా సుకుమార పదాబ్జయా,
స్థిరమంగళ శృంగార భూషణాలంకృతాంగయా॥ 3౪

మావి చిగురు తళ్కుగల మెత్తని యడుగుఁదమ్ములు గలట్టియు, నిత్యమంగళ స్వరూపములైన సింగారపు నగలచేఁ గైసేయఁబడిన మేను గలట్టియు,

హారనూపుర కేయూర చమత్కృత శరీరయా,
చక్షురానందలతయా సౌభాగ్యకుల విద్యయా॥ 37

ముత్తెపు సరులు, దండకడియములు, అందెలు నను నగలచేఁ జూడఁదగిన మెయి గలట్టియు, చూచువారల కన్నులకుఁ దనివి తీగలు సాగించు నట్టియు, సౌభాగ్యకుల విద్యా స్వరూపిణి యైనట్టియు,— [కులవిద్య— శ్రీ విద్య; సౌభాగ్యకుల విద్య—పంచదశాక్షర శ్రీ విద్యా స్వరూప—పిండాండ మందు ఏ దేవి కుల కుండలినీ పరాశక్తిగా నుండి 'సౌభాగ్య విద్య' యను పంచదశాక్షర విద్యచే (క. ఏ. ఈ. ల. హ్రీం.— హ. స. క. హ. ల. హ్రీం.—స. క. ల. హ్రీం) నుపాసింపఁ బడునో యని యర్థము.]

కులమనఁగా సుషుమ్నామార్గము; దానియందుపాసింపఁబడు శ్రీ విద్యాస్వరూపిణి. ప్రాణాయామ, మంత్రచైతన్య భావనా దార్ఢ్యములచే మూలాధార మందలి కులకుండము నుండి సహస్రారమునకు శక్తిని గొనిపోవు విద్యయే కులవిద్య. దానికి సాటియైన యోగవిద్య లేవియు లేవు. కనుకనే పెద్దలు "పలువిద్యలెన్నియైనను, కులవిద్యకు సాటిరావు గువ్వలచెన్నా" యనిరి. విశేషములు శ్రీ విద్యా గురువుల వల్ల నెఱుఁగదగును.

ఉమయా సమ మాసీనం లోకజాల కుటుంబయా,
అపూర్వరూప మభజన్ పరివారాః సమన్తతః॥ 38

ఎల్లలోకములే తన బిడ్డలుగాఁ గలదియునైన ఉమాదేవితోఁ గూడి దివ్యసింహాసనము నలంకరించినట్టియు, అసాధారణ రూపముతోఁ గూడినట్టియు పరమేశ్వరుని ముప్పదిమూఁడుకోటుల దేవతలును గొలుచు చుండిరి.

వి॥ ముప్పది యెదవ శ్లోకమున 'సౌభాగ్యకుల విద్య' యని, యా జగన్మాత నుపాసించు పంచదశాక్షర మహావిద్యను గుప్తముగా

నుంచి, తదభిన్నయే దేవి యని యెట్లుసూచించెనో, యటులే, శ్రీ మదాచార్యుఁడు ఈ శ్లోకమున 'ఉమా' శబ్దమును గంభీరహృదయ ముతోఁ బ్రయోగించెను.

శివునకు 'ఉమా' శబ్దమందున్న గౌరవము తదనేక నామము లలో దేనియందును లేదఁట. ఏమన – చిన్ననాఁడు పార్వతి శివునే పెండ్లాడఁగోరి ఘోరతపమునకుఁ బూనుకొనఁగా తల్లి మేనాదేవి " 'ఉ' – అమ్మాయీ !, 'మా' – వలదు " అని బిడ్డను దపఃప్రయత్నము నుండి మఱలింపఁ జూచినను మానక పంచాగ్ని మధ్యమున నిల్చి తపము నిర్వహించి తత్ఫలముగా శివుని బెండిలియాడినది. కావున నుమ యను పేరే శివునకు మెప్పును గల్గించునది. కావుననే సహ పూర్వపద బహు వ్రీహులైన శివనామములందు సోమః, సాంబః అనునవి తక్క మఱే వియుఁ గానరావు. అంతేగాక యీ నామములు శివశక్తుల యవినా భావ సంబంధమును దెలుపును.

మఱియు, 'అం + బమతి (వమతి) అంబా; అం – పరమా త్మను, వమతి – వెడలఁగ్రక్కునది' అనఁగా శివుని తత్త్వమును దెల్పు నది అమ్మయైన శక్తియే. దానితోఁ గూడియుండువాఁడు.

మఱియు, 'ఓంకారము' శివతారకము (ప్రణవము). ఉమా యనునది శక్తిప్రణవము. అ+ఉ+మ్. అను శివప్రణవాంగములే వ్యత్య స్తముగా ఉ+మ్+ఆ అని శక్తిప్రణవమందునుం గలవు. ఇది శివశక్తుల కభిన్నతను దెల్పువిషయము కాదా ? ఉమా శబ్దవిశిష్టతకై జిజ్ఞాసువులు లలితాసహస్రనామ భాష్యమందుఁ జూచునది. ( అది శ్రీ భాసురానంద నాథునిది).

ఉ = శివః, తస్య మా = లక్ష్మీః, శివుని లక్ష్మి కావున. ఉమా. ఉమా = అవిసెపూవు. అతసీపుష్ప సంకాశత్వమున, అభేదోపచారము చేతను ఉమా.

" ఉమాతసీ హైమవతీ హరిద్రాకీర్తికాన్తిషు " కోశము. సర్వ భూతములందునుఁ గీర్తికాన్తి స్వరూపిణియై యుండునది కావున ఉమా. " యా దేవీ సర్వభూతేషు కాన్తిరూపేణ సంస్థితా" అని చండీపాఠము.

ఉం — పరమశివం. మాతి — పరిచ్ఛిన త్తి; ఉమా. శివుని నగపాలు చేసినది గాన ఉమా.

ఉః — ఉత్తమా చ సామా చ = చిత్తవృత్తిః ఉత్తమ చిత్త వృత్తి స్వరూపిణియు, ఉత్తమ చిత్తవృత్తి నిచ్చునదియు ఉమా. ఈ విషయమే సూతసంహితయందు

"పరానుభూతిం చ భవపాశ నాశినీం
సదాశివస్యా ప్యతిశోభనాధ్యాం
ఉమాభిధా ముత్తమ చిత్తవృత్తిదాం
నమామి నానావిధ లోకవైభవామ్"

అని ప్రతిపాదింపఁబడినది.

ఓంకారమునందు వలెనే ఉమాశబ్దమందలి ఉ+మ్+ఆ ప్రణవాంగములు విష్ణు, శివ, బ్రహ్మవాచకములు. కావున దేవి త్రిమూర్తి స్వరూపిణి. ఇదే లింగపురాణమందు భగవతినిగూర్చి పరమశివుఁడన్న మాట "అకారోకార మకారా మదీయే ప్రణవే స్థితాః, ఉకారం చ మకారం చ అకారం చ క్రమేరితమ్, త్వదీయం ప్రణవంవిద్ధి త్రిమాత్రం ప్లుత ముత్తమం" విస్పష్టము. కావున దేవిప్రణవ మని ప్రసిద్ధిగల "ఉమా" పదము ప్రయోగించుట చేతను, 32-వ శ్లోకమున "సౌభాగ్యకుల విద్యా" శబ్దప్రయోగముచేతను ఈ గ్రంథకర్త యిట్లెన్నియో రహస్యములను గ్రంథమున నిమిడ్చియున్నాఁడని యెఱుంగునది.

పుండరీకాకృతి స్వచ్ఛం పూర్ణచంద్రసహోదరం,
దధౌ తస్య మహాలక్ష్మీ స్సితమాతప వారణమ్ ॥ 38

అట్టి పరమశివునకు శ్రీమహాలక్ష్మి తెలిదామరనుబోలి తెల్లనైనట్టియు, పున్నమ నెలకుఁ దోఁబుట్టువనఁ దగినట్టియు వెలిపట్టుగొడుగు పట్టెను.

తంత్రీ ఝుంకారశాలిన్యా సంగీతామృత విద్యయా,
ఉపతస్థే మహాదేవ ముపాంతే చ సరస్వతీ ॥ 39

ఆ పరమేశ్వరుని చెంతనిల్చి పలుకువెలంది వీణాతంతుల రవళితోఁ గూడి యొప్పు గానామృతవిద్యచే సేవించెను.

ఝణత్కంకణ ఝాతేన హస్తే నోపనిష ద్వధూః,
ఓంకార తాలవృంతేన వీజయామాస శంకరమ్ ॥ ౩౯

ఉపనిషద్రూప యువతియు మొరయు కడియాలచేతితో ఓంకార మనెడి తాటియాకు వీవనతో నా పరమశివుని సేవించెను.

౩౮, ౩౯ శ్లోకముల సారాంశ మేమనఁగా — పరమశివుఁడు గానలోలుఁడనియు, గానరూప నాదోపాసనమున సంతుష్టినొంది తన భక్తులను శ్రేయోవంతులను జేయుననియు, తనను బ్రణవమంత్రముతో నుపాసించువారికి నిఃశ్రేయసు నొసంగు ననుటయు,

చలచ్చామరికా హస్తా ఝంకుర్వ న్మణికంకణాః,
ఆసేవంత త మీశాన మభితో దివ్యకన్యకాః ॥ ౪౦

వేలుపుఁగన్నె లా పరమశివుని చుట్టును నిల్చి మొరసెడి రతనాల కడియములుగల చేతులతో వీచోపులు మెల్లఁగా నాడించుచుఁ గొల్చిరి.

చామరాణాం విలోలానాం మధ్యే తన్ముఖమండలం,
రరాజ రాజహంసానాం భ్రమతా మివ పంకజమ్ ॥ ౪౧

కదలుచున్న యా వీచోపులనడుమ నా శివుని మొగము ఇటు నటుం దిరుగు రాయంచల నడుమఁ దామరపూవువలె శోభించెను.

మంత్రేణ త మసేవంత వేదాః సాంగ విభూతయః,
భక్త్యా చూడామణిం కాంతం వహంత ఇవ మౌళిభిః ॥ ౪౨

శిక్షా, వ్యాకరణము, ఛందస్సు, నిరుక్తి, జ్యోతిషము, కల్పము అను నాఱంగములతోఁ గూడిన ఋగ్యజుస్సామము లనెడి వేదములు, ఉపనిషత్తులనెడి తలలతో నా పరమేశ్వరునిఁ దలమానికమట్లు తాల్చుచున్నవో యనునట్లు, మంత్రములతో భక్తిమీఱ నా శివుని సేవించెను. అనఁగా శివుఁడు వేదాంతవేద్యుఁ డనుట.

తదీయాయుధ ధారిణ్య స్తత్సమాన విభూషణాః,
అంగభూతాస్త్రియః కాశ్చి దాసేవంత తమీశ్వరమ్॥ ४३

ఆ పరమేశ్వరునితో సమానముగా నలంకారములను దాల్చి నట్టియు, శివుని కంగభూతలైనట్టియు, శివుని యాయుధములను ధరించి నట్టియుఁ గొందఱు స్త్రీలు దేవుని సేవించిరి.

అష్టాధికారిణః కేచి దనంత ప్రముఖా అపి,
అష్టౌ విద్యేశ్వరా దేవ మభజంత సమంతతః॥ ४४

శివునివలన నధికారము నొందిన అనంతుఁడు, సూక్ష్ముఁడు, శివోత్తముఁడు, ఏకనేత్రుఁడు, ఏకరుద్రుఁడు, త్రిమూర్తి, శ్రీకంఠుఁడు, శిఖండి యను పేళ్లుగల యెనమండ్రు విద్యేశ్వరులు ఆ పరమశివుని గొల్చుచుండిరి.

తతో నందీ మహాకాల శ్చండో భృంగిరిట స్తతః,
ఘంటాకర్ణః పుష్పదంతః కపాలీ వీరభద్రకః॥ ४५

ఏవమాద్యా మహాభాగా మహాబలపరాక్రమాః,
నిరంకుశ మహాసత్త్వా భేజిరే తం మహేశ్వరమ్॥ ४౬

నంది, మహాకాలుఁడు చండుఁడు, భృంగిరిటుఁడు,ఘంటాకర్ణుఁడు, పుష్పదంతుఁడు, కపాలి, వీరభద్రుఁడు మున్నగు నడ్డులేని బలపరాక్రమములు గలవారు, ధన్యులయినవారు ఆ పరమేశ్వరుని సేవించిరి.

అణిమాదిక మైశ్వర్యం యేషాం సిద్ధే రవాహనం,
బ్రహ్మాదయః సురా యేషా మాజ్ఞాలంఘన భీరవః॥ ४౭

మోక్షలక్ష్మీ పరిష్వంగ ముదితా యేఽంతరాత్మనా,
యేషా మీషత్కరం విశ్వ సర్గ సంహార కల్పనమ్॥ ४౮

జ్ఞానశక్తిః పరా యేషాం సర్వవస్తుప్రకాశినీ,
ఆనందకణికా యేషాం హరిబ్రహ్మాది సంపదః॥ ४౯

ఆకాంక్షంతే పదం యేషాం యోగినో యోగతత్పరాః,
కాంక్షణీయ ఫలో యేషాం సంకల్పః కల్ప పాదపః॥ ౫०

కర్మకాలాది కార్పణ్య చింతా యేషాం నవిద్యతే,
యేషాం విక్రమ సన్నాహో మృత్యోరపిచ మృత్యవః,
తే సారూప్యపదం ప్రాప్తాః ప్రమథా భేజిరే శివమ్॥	౫౧

అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశిత్వము, వశిత్వము ననెడి యష్టసిద్ధులును నెవరిసిద్ధికి దిగదుడుపులో, చతుర్ముఖాదులగు వేలుపులును నెవ్వరియాన మీఱక వెఱతురో, మోక్షలక్ష్మిని గౌగిలించు కొనుటతో నెవ్వరు సంతుష్టులైరో, ఈ జగత్తులను బుట్టించుటయు, లోకీకృత్యకొనుటయు నెవ్వరికొక గొప్ప పనికాదో, సర్వవస్తు తత్త్వమును బ్రకాశింపఁజేయు తెలివి బలము లెవ్వరికిఁ గలవో, హరి బ్రహ్మాదుల విభవములును నెవ్వరి యానంద లేశములో, యోగవిద్యా సంపన్నులైన మహాయోగులును నెవ్వరి పదమునే కోరుచుందురో, ఎవ్వరి సంకల్పము కోరిన ఫలముల నిచ్చు కల్ప వృక్షమో, సంచితము, ప్రారబ్ధము, ఆగామి యనెడి కర్మములును, భూతవర్తమాన భవిష్యత్తు లనెడి కాలములును, కామాదులచే నగు చెడుగులును నెవ్వరికి లేవో, ఎవ్వరి పరాక్రమ ప్రయత్నము మృత్యువునకును మృత్యువు వంటిదో, శివసారూప్య పదవీభాగ్యము నెవ్వరందిరో యట్టి ప్రమథులెల్లరు నా పరమేశ్వరుని గొల్చుచుండిరి.

బ్రహ్మోపేంద్ర మహేంద్రాద్యా విశ్వ తంత్రాధికారిణం,
ఆయుధాలంకృత ప్రాంతాః పరితస్తం సిషేవిరే॥	౫౨

బ్రహ్మ, విష్ణువు, ఇంద్రుఁడు మున్నగు 33 కోటుల దేవతలును దమ తమ యాయుధములను దాల్చి ప్రక్కలనిలిచి జగన్నిర్మాణ పాలన లయ చణుఁడైన యా పరమశివుని సేవించు చుండిరి.

ఆదిత్యా వసవో రుద్రా యక్ష గంధర్వ కిన్నరాః,
దానవా రాక్షసా దైత్యాః సిద్ధా విద్యాధరోరగాః,
అభజంత మహాదేవ మపరిచ్ఛిన్న సైనికాః॥	౫౩

ద్వాదశాదిత్యులు, అష్టవసువులు, ఏకాదశరుద్రులు, కుబేరుఁడు మున్నగు యక్షులు, హాహాముఖ్యులైన గంధర్వులు, అశ్వముఖాదు

త్తైన కిన్నరులు, దైత్య దానవాదులైన రక్షోజాతులు, ఆదినాథాదులైన సిద్ధులు, మణిభద్రాదులైన విద్యాధరులు, శేషవాసుక్యాదులైన నాగులు తమ తమ యపరిమిత పరివారముతోఁగూడి యా మహాదేవుని సేవించిరి.

వశిష్ఠో వామదేవశ్చ విశ్వామిత్రాత్రి శౌనకాః,
దధీచి ర్గౌతమశ్చైవ సానంద శుక నారదాః ॥ ౫౪

ఉపమన్యు భృగు వ్యాస పరాశర మరీచయః,
ఇత్యాద్యా మునయః సర్వే నీలకంఠం సిషేవిరే ॥ ౫౫

వసిష్ఠుఁడు, వామదేవుఁడు, విశ్వామిత్రుఁడు, అత్రి, శౌనకుఁడు, దధీచి, గౌతముఁడు, సానందుఁడు, శుకుఁడు, నారదుఁడు, ఉపమన్యుఁడు, భృగువు, వ్యాసుఁడు, పరాశరుఁడు, మరీచి మున్నగు మహామును లెల్లరు నా నీలకంఠుని సేవించిరి.

పార్శ్వస్థ పరివారాణాం విమలాంగేషు బింబితః,
సర్వాంతర్గత మాత్మానం స రేజే దర్శయ న్నివ ॥ ౫౬

తన కుడి యెడమలందు నిల్చిన సమస్త పరివారముల యొక్క నిర్మల దేహములందుఁ బ్రతిఫలించిన శ్రీ పరమేశ్వరుఁడు, సర్వాంతర్గతుఁడైన తనను జూపుచున్న వాఁడువలెఁ బ్రకాశించెను.

క్షణం స శంభు ర్దేవానాం కార్యభాగం నిరూపయన్
క్షణం గంధర్వ రాజానాం గానవిద్యాం విభావయన్ ॥ ౫౭

## శ్రీ పరమేశ్వరుని రాజవ్యాపార వర్ణనము

పరమేశ్వరుఁడు కొంతసేపు దేవతలకు నీ వీ కార్యము, నీ వీ కార్యము చేయవలయునని యానతిచ్చుచు, కొంతసేపు గంధర్వ శ్రేష్ఠుల గానవిద్యను గౌరవించుచు,

బ్రహ్మ విష్ణ్వాదిభి ర్దేవైః క్షణమాలాప మాచరన్,
క్షణం దేవమృగాక్షీణాం లాలయన్ నృత్యవిభ్రమమ్ ॥ ౫౮

వ్యాసాదీనాం క్షణం కుర్వన్ వేదోచ్చారేషు గౌరవం,
నిదధానః క్షణం దేవ్యా ముఖే బింబాధరే దృశః,
హాస్య నృత్యం క్షణం పశ్యన్ భృంగిణా పరికల్పితమ్॥ ౫౯
నందినా వేత్ర హస్తేన సర్వతంత్రాధికారిణా,
అముంచతా సదా పార్శ్వ మాత్మాభిప్రాయ వేదినా॥ ౬౦
చోదితా నానయన్ కాంశ్చి ద్విసృజన్ భ్రూవిలాసతః,
సంభావయం స్తథాచాన్యా నన్యానపి నియామయన్॥ ౬౧

బ్రహ్మవిష్ణ్వాదులైన దేవతలతోఁ గొంతసేపు ముచ్చటలాడుచు కొంతసేపు దేవనారుల నాట్యమును మెచ్చుకొనుచు, కొంతసేపు వ్యాసాదుల వేదోచ్చారణమును బరామర్శించి గౌరవించుచు, కొంతసేపు ఉమాదేవి మొగమందును దొండపెదవి యందును నిగాలు నెఱపుచుఁ, గొంతసేపు భృంగి వికటనృత్యమున వినోదించుచుండెను. మఱియు సర్వకార్యములందు నధికార మీఁబడినట్టియు, దండధారియై నట్టియుఁ, దన సాన్నిధ్యము నెపుడును వీడనట్టియు, దన మనోగతము నిట్టె యెఱుంగ గలట్టియు, నందీశ్వరునిచే గొందఱను రావించుచుఁ, గొందఱకు బొమసన్నలతోనే సెలవిచ్చుచుఁ గొందఱ నాదరించుచుఁ గొందఱ నాజ్ఞాపించుచుండెను.

సమస్త భువనాధీశ మౌళి లాలిత శాసనః,
అకుంఠశక్తి రవ్యాజ లావణ్యా లలితాకృతిః॥ ౬౨
స్థిర యౌవన సౌరభ్య శృంగారిత కలేవరః,
ఆత్మశక్త్య మృతాస్వాద రసోల్లాసిత మానసః॥ ౬౩
స్వాభావిక మహైశ్వర్య విశ్రాంతి పరమావధిః,
నిష్కలంక మహాసత్వ నిర్మితానేక విగ్రహః॥ ౬౪
అఖండారాతి దోర్దండ కండూఖండన పండితః,
చింతామణిః ప్రసన్నానాం శ్రీకంఠః పరమేశ్వరః॥ ౬౫
సభాంతర గతం తంత్రం రేణుకం గణనాయకం,
ప్రసాదం సులభం దాతు మాహూయేత్థం సమాదిశత్॥ ౬౬

పదునాల్గు భువనము లందలి రాజులచేఁ దలఁ దాల్పఁబడిన యాజ్ఞ గలవాఁడును, మొక్కవోని సర్వశక్తులు గలవాఁడును, సహజ సౌందర్యముచే రమ్యమైన యాకారము గలవాఁడును, సడలని జవ్వనపు టందముచే వెలయు మెయి గలవాఁడును, తన యందు నిత్యమైన శక్తియ నెడి మహానందముచేఁ దనిసిన మనసు గలవాఁడును, తనయందు సహజమైన సర్వజ్ఞత్వాది శక్తులు నిలుచు సీమయైన వాఁడును, తన నిష్కలంక మహాశక్తిచేఁ బలు విధములైన శుభమూర్తులను నిర్మించు కొన్నవాఁడును, పగతుర తెంపులేని బుజముల తీఁటను దీర్చు నేర్పు గలవాఁడును, శరణాగతులైన భక్తులకుఁ జింతామణియైన వాఁడును, నైన విసపు గుత్తుక దేవర, ప్రమథనాయకుఁడైన రేణుక గణనాథునిఁ దన ప్రసాదము నిచ్చుటకుఁ బిలిచి యిటు లానతిచ్చెను.

శ్రీశైలస్యోత్తరే భాగే త్రిలింగ విషయే శుభే,
కుల్యపాకాభిధం పుణ్యక్షేత్ర మేకం విరాజతే॥ ౭౮

సోమేశ్వరాభిధానస్య తత్ర వాసవతో మమ,
అస్పృశన్మానుషం భావం లింగాత్ప్రాదుర్భవిష్యసి॥ ౭౯

మదీయ లింగ సంభూతం మద్భక్త పరిపాలకం,
విస్మితా మానుషాః సర్వే త్వాం భజన్తు మమాజ్ఞయా॥ ౮౦

రేణుక గణనాయకా! శ్రీశైలక్షేత్రమున కుత్తర భాగము నందలి తెలుఁగునాడు నందు "కుల్యపాక" యనెడి పుణ్యక్షేత్రమున్నది. సోమేశ్వరుఁడను పేర నచట వాసిగన్న నా లింగరూప శరీరమునుండి నీవు మానవ దేహముతోఁ దేజోమయ శరీరివై పుట్టఁగలవు. శివలింగము నుండి పుట్టి శివభక్తుల నేలు నిన్ను మానవులెల్లరు వింతపడి నా యాజ్ఞచే నిన్నుఁ బూజింతురు.

మదద్వైతపరం శాస్త్రం వేద వేదాన్త సమ్మతం,
స్థాపయిష్యసి భూలోకే సర్వేషాం హితకాంక్షయా॥ ౮౧

మమ ప్రతాప మతులం మద్భక్తానాం విశేషతః,
ప్రకాశయ మహీభాగే వేదమార్గానుసారతః॥ ౮౨

నీవు వేదవేదాన్తసమ్మతమును, ముక్తియనెడి హితము నెల్లరకు గూర్చునదియునైనట్టి శివాద్వైత సిద్ధాన్తమును భూతలమున నెలకొల్పుము.

ఇత్యుక్త్వా పరమేశ్వరః స భగవాన్ భద్రాసనా దుత్థితో
బ్రహ్మోపేంద్రముఖాన్ విసృజ్య విబుధాన్ భ్రూసంజ్ఞయా కేవలమ్,
పార్వత్యాసహితో గణైరభిమతైః ప్రాప స్వమంతః పురం
క్షోణీభాగ మవాతరత్ పశుపతే రాజ్ఞావశాద్రేణుకః ॥ ౭౨

ఇటులని పరమేశ్వరుఁడు రేణుక గణేశునకు సెలవిచ్చి, భద్రాసనమునుండి లేచి, బ్రహ్మోపేంద్రాదులైన దేవతలను బొమసన్నతోనే విడిచిపుచ్చి, పార్వతితోఁగూడి, యిష్టులైన ప్రమథులతోఁ దన యంతిపురిఁ జేరెను.

ఇచట భూలోకమందు శ్రీ రేణుక గణాధీశుఁడు పరమేశ్వరు నానచే నవతరించెను.

ఇది సిద్ధాన్త శిఖామణి యందు
శివసభావర్ణన మనెడి మూఁడవపరిచ్ఛేదము
శ్రీ శివార్పణము.

---

ఓం ఈం నమః
ఓం నమః శివాయ
శ్రీ జగద్గురు రేణుకాచార్యాః ప్రసీదంతు

# నాలవ పరిచ్ఛేదము.

## శ్రీ రేణుక గణేశుని లింగావతార వర్ణనము

అథ త్రిలింగవిషయే కుల్యపాకాభిధే స్థలే,
సోమేశ్వర మహాలింగాత్ ప్రాదురాసీత్ స రేణుకః॥ ౧

పిమ్మటఁ తెలుగు నాట వాసిగన్న శివక్షేత్రమైన 'కుల్యపాక' యను నూర వెలయు శ్రీ సోమేశ్వరుఁడను మహాలింగము నుండి పరమేశ్వరు నాన చొప్పున శ్రీ రేణుక గణాధీశుఁ డుదయించెను.

ప్రాదుర్భూతం త మాలోక్య శివలింగా త్త్రిలింగజాః,
విస్మితాః ప్రాణినః సర్వే బభూవు రతితేజసమ్॥ ౨

ఆ రీతిని శివలింగము నుండి యావిర్భవించిన మహాతేజశ్శాలి యైన శ్రీ రేణుక గణాధీశ్వరునిఁ జూచి యా తెలుఁగునాటి వారెల్లరు వింతపడిరి.

భస్మోద్ధూలిత సర్వాంగం సార రుద్రాక్ష భూషణం,
జటామకుట సంయుక్తం త్రిపుండ్రాంకిత మస్తకమ్॥ ౩
కటీ తటీ పటీ భూత కంథా పటల బంధురం,
దధానం యోగదండం చ భస్మాధారం కమండలుమ్॥ ౪
శివాద్వైత పరిజ్ఞాన పరమానంద మోదితం,
నిర్ధూత సర్వ సంసార వాసనాదోష పంజరమ్॥ ౫
శివాగమ సుధాసింధు సమున్మేష సుధాకరం,
చిత్తారవింద సంగూఢ శివ పాదాంబుజ ద్వయమ్॥ ౬
యమాది యోగ తంత్రజ్ఞం స్వతంత్రం సర్వకర్మసు,
సమస్త సిద్ధ సన్తాన సముదాయ శిఖామణిమ్॥ ౭
వీరసిద్ధాన్త నిర్వాహ కృత పట్ట నిబంధనం,
ఆలోకమాత్ర నిర్భిన్న సమస్త ప్రాణి పాతకమ్॥ ౮
త మపృచ్ఛన్ జనాః సర్వే నమస్తః కో భవానితి,
ఇతి పృష్టో మహాయోగీ జనైర్విస్మిత మానసైః॥ ౯

ఒడలనెల్లఁ బూది పూఁతయు, మేలి రుదురాక సరి తొడవులును, నొసఁట బసుమంపు తిగగీఱలును, పెంజెడ ముడియుఁ గలవాఁడును, మేనఁ గప్పుకొన్న పప్పళి పచ్చడము (యోగులు ధరించు బొంత), లాతమును (యోగదండము), జారీచెంబును, విబూదిబుఱ్ఱయుఁదాల్చిన వాఁడును, శివాద్వైత జ్ఞానమున నగు పరమానందముచేఁ దనియువాఁడును, శివాగమ మనెడి యమృత సముద్రము నుప్పొంగించు చంద్రుఁడును, తన హృదయ కమలమందు బరశివ పాదపద్మములను దాఁచుకొన్నవాఁడును, సంసారవాసనా సమూహమును దూలగొట్టినవాఁ

డును, యమ నియమా ద్యష్టాంగ యోగజ్ఞానము గలవాఁడును, సర్వ కర్మములందు నొరుల యపేక్ష లేనివాఁడును, సిద్ధసంఘముచే శిరసా వహింపఁ బడువాఁడును, వీరశైవ సిద్ధాన్త నిర్వహణమునఁ బట్టభద్రుఁడును, తన నిగాచేతనే యెల్లజీవుల పాపములు వాపఁగలవాఁడును నైన శ్రీ రేణుక సిద్ధునిఁ జూచి యా శివాలయమున నున్నవారెల్లరును నమస్కరించి 'మహాత్మా! నీ వెవఁడవు?' అని యడిగిరి. అటులు వింతతో నడుగువారలకు అమ్మహాయోగి యిటులనియెను.

## యమాది యోగాష్టాంగములు

(1) యమము :- అహింస, సత్యము, దొంగిలింపకుండుట, ఆసతోఁ బరులవలన నేదియు గొనకుండుట.

(2) నియమము :- శౌచము, తపము, సంతుష్టి, స్వాధ్యాయము, ఈశ్వర ప్రణిధానము.

(3) ఆసనము :- వీరాసన, పద్మాసన, స్వస్తికాసన, యోగాసన, కూర్మాసన, భద్రాసన, సిద్ధాసనాదులగు నాసనములు.

(4) ప్రాణాయామము :- పూరక, కుంభక, రేచకములచేత వాయువును నియమించి ప్రాణశక్తిని విస్తరింపఁజేయుట.

(5) ప్రత్యాహారము :- విషయమువలన నింద్రియములను మఱలించుట.

(6) ధ్యానము :- సగుణ నిర్గుణాత్మక పరవస్తువు నెల్లపుడు చింతించుట.

(7) ధారణము :- మూలాధారాది స్థానములందుఁ జిత్తము నరికట్టుట.

(8) సమాధి :- నిశ్చల నిర్మల చిత్తవృత్తి బ్రహ్మత్వమును సంపాదించుట. అనఁగా 'శివోఽహం' భావమున నిల్చుట.

ప్రత్యువాచ శివాద్వైత మహానంద పరాయణః,
పినాకినః పార్శ్వవర్తీ రేణుకాఖ్యో గణేశ్వరః॥ ౧౦

శివాదేశానుసారేణ శివలింగా దిహోద్భవం.
నామ్నా రేణుక సిద్ధోఽహం సిద్ధ సంతాన నాయకః,
స్వచ్ఛందచారీ లోకేఽస్మిన్ శివ సిద్ధాన్త పాలికః॥ ౧౧

శివాద్వైత మహానందమందే యాసక్తి కలవాఁడును, పరమేశ్వరుని ప్రక్కబంటును, ప్రమథ గణాధీశ్వరుఁడునైన శ్రీ రేణుకాచార్యుఁ డిట్లు బదులాడెను.

"ఓ భక్తజనులారా! శ్రీ పరమేశ్వరు నానచే నీ సోమేశ్వర లింగమం దుదయించితిని. నా పేరు రేణుక సిద్ధుఁ డందురు (రేవణ సిద్ధుఁడు). నేను సిద్ధ సంఘముల కధిపతిని. నే నీ లోకమందు నాయిచ్చ వచ్చినట్లు దిరుగుదును. శివాద్వైత సిద్ధాన్తమును బరిపాలింతును."

ఇత్యుక్త్వా పశ్యతాం తేషాం విషయ స్థిర చక్షుషాం,
వ్యథాయ వ్యోమ మార్గేణ మలయాద్రి ముపాగమత్॥ ౧౨

ఇట్లని, యచటివారెల్లరు ఱెప్ప వేయక చూచుచుండఁగానే గగనమార్గమున నాసిద్ధుఁడు మలయపర్వతమును జేరెను.

నవచందన కాంతార కందళ న్మంద మారుతం,
అభంగుర భుజంగస్త్రీ సంగీత రస సంకులమ్॥ ౧౩

కరిపోత కరాకృష్ట స్ఫుర దేలాది వాసితం,
వరాహ దంష్ట్రికా ధ్వస్త ముస్తా సురభికందరమ్॥ ౧౪

పటీర దళ పర్యంక ప్రసుప్త వ్యాధ దంపతిం,
మాధవీ మల్లికా జాతీ మంజరీ రేణు రంజితమ్॥ ౧౫

ఎలమంచి గంధపు టడవులందు వీఁచు పిల్లగాలులు గలదియు, సక్రమమైన తెంపులేని నాగకన్యకా గానరసముతో వ్యాప్తమైనదియు, ఏనుఁగు గున్నల తొండములచే లాగఁబడిన యేలకి తీవల నెత్తావి గలదియు, అడవి పందుల కోఱలచే నలియఁ గొట్టఁబడిన నాగర ముస్త లచేఁ బరిమళించు చరియలు గలదియు, మంచి గంధపుఁ జివురు పాన్పులపై నిదురించు బోయ మిథునములు గలదియు, పూవు గురువింద

లయు మల్లెలయు జాజులయు పూగుదుల నుండి రాలిన పుష్పాదులచే నందగించునదియు నైన యా మలయాద్రి యొప్పెను.

తత్ర కుత్రచి దాభోగే సర్వర్తు కుసుమద్రుమే,
అపశ్య దాశ్రమం దివ్య మగస్త్యస్య మహామునేః॥ ౧౬

సనకాఱు మున్నగు నాఱుకారుల పూలచెట్లుగల యా మలయ గిరియందొకచోట శ్రీ రేణుకాచార్యు డగస్త్యమహాముని యాశ్రమమును గాంచెను.

మందార చందన ప్రాయై ర్మండితం తరుమండలైః,
శాఖాశిఖర సంలీన తారకాగణ కోరకైః॥ ౧౭

మునికన్యాకరానీత కలశాంబు వివర్ధితైః,
ఆలవాల జలాస్వాద మోదమాన మృగీగణైః॥ ౧౮

హేమారవింద నిష్యంద మకరంద సుగంధిభిః,
మరాళాలాప వాచాల వీచిమాలా మనోహరైః॥ ౧౯

ఇందీవర మహాజ్యోతి రంధీకృత హరిన్ముఖైః,
లోపాముద్రా పదన్యాస చరితార్థ తటాంకితైః॥ ౨౦

హరినీహార కర్పూర హార హాసామలోదకైః,
నిత్యనైమిత్తిక స్నాన నియమార్థై స్తపస్వినామ్॥ ౨౧

ప్రకృష్టమణి సోపానైః పరివీతం సరోవరైః,
విముక్త సత్త్వవైరస్యం బ్రహ్మలోక మివాపరమ్॥ ౨౨

హూయమానాజ్యసన్తాన ధూమగంధి మహాస్థలం,
సుక సంస త్సమారబ్ధ శ్రుతి శాస్త్రోప బృంహితమ్॥ ౨౩

ఆ యగస్త్యాశ్రమము, కొమ్మకొనలయందణగిన మొగ్గలను బోలిన చుక్కలగుమి గలదియు (అనగా నచటి చెట్లు మిన్నంటు నంత యెత్తుగా బెరిగిన వనుట), మునికన్నెలు గిండ్లతో దెచ్చి పోసిన నీళ్లచే బెంపబడినదియు, పాదుకట్టు నందలి నీటిని గ్రోలి తనివొందు నాడు వేళ్లు గలదియునైన చెట్లగుంపులతో నింపు మీఱుచుండెను.

పొందమ్ములనుండి జాఱుచున్న పూఁదేనియలచేఁ బరిమళించు నట్టియు, రాయంచ పలుకులచే ధ్వనించు నలలచే నందమైనట్టియు, నల్లకలువల మేలిజిగిచేఁ బదిదెసలను జీఁకట్లు క్రమ్మించు నట్టియు, లోపాముద్రా సతి యడుగిడుటచే ధన్యమైన గట్లు గలట్టియు, మంచి ముత్తెపు సరులను మంచును గప్పురమును శివు నవ్వును బోలి నిర్మల మైన నీరు గలట్టియు, తపశ్శాలుర నిత్యనైమిత్తిక స్నాన నియమమే ప్రయోజనముగాఁ గలట్టియు, మేలి రతనాల మెట్లు గలట్టియు గొలఁకులచే వెలయుచుండెను.

మఱియు, నడవి మెకముల యొండొంటి పగలు లేనిదియు, వ్రేల్వఁ బడు నేతి మొత్తముల పొగచేఁ దావులీను తావులు గలదియు, చిలుక మూఁకలచేఁ జేయఁబడు వేదశాస్త్ర విచారములతో నిండినదియు నై రెండవ సత్యలోకమో యన నొప్పుచుండెను.

తస్య మధ్యే సమాసీనం మూలే చందన భూరుహాః,
సుకుమారదళచ్ఛాయా వారి తాదిత్య తేజసః॥ ౨౪

తటి త్పింగ జటా భారై స్త్రిపుండ్రాంకిత మస్తకైః,
భస్మోద్ధూళిత సర్వాంగైః స్ఫురద్రుద్రాక్ష భూషణైః॥ ౨౫

నవ వల్కలవాసోభి ర్నా నా నియమదారిభిః,
పరివీతం మునిగణైః ప్రమథైరివ శంకరమ్॥ ౨౬

ఆ యాశ్రమము నడుమను లేజొంపముల నీడచేఁ బ్రొద్దు నెల్లు నడ్డగించు మంచి గందపుఁ జెట్టు మొదటఁ గూరుచున్నట్టియు, మెఱుపుం బోలి పింగళవర్ణము గల జడలు బన్నును, భస్మత్రిపుండ్రములొప్పు నొసళ్లను, బూదిపూఁత వెలయు నొడళ్లను, మెఱయు రుదురాక తొడవులును, గ్రొత్త నారచీరలను దాల్చి పలువిధములైన వ్రత దీక్షలుగల మునుల మొత్తములచేఁ, బ్రమథులచే శంకరుఁడువలె బరివేష్టితుఁ డైనట్టియు,

సముజ్జ్వల జ్జటా జాలై స్తపః పాదప పల్లవైః,
స్ఫుర త్సౌదామినీ కల్పై ర్జ్వాలా జాలై రివానలమ్॥ ౨౭

తన తపస్సనెడి చెట్టు చిగిర్చినదో యనునట్టులున్న జడల మొత్తము చేత మెఱపులం బోలిన మంటల యంటలచే వెలుంగు నగ్గిని బోలినట్టియు,

విశుద్ధ భస్మ కృతయా త్రిపుండ్రాంకిత రేఖయా,
త్రిస్రోతసేవ సంబద్ధ శిలాభాగం హిమాచలమ్॥ ౨౮

పంచాక్షర మంత్ర పూత భస్మముచేనైన త్రిపుండ్ర రేఖలచే ముప్పాకలుగల గంగతోఁ గూడిన శిలా ప్రదేశముగల మంచుకొండ వలె నలరువాఁడును,

భస్మాలంకృత సర్వాంగం శశాంక మివ భూగతం,
వసానం వల్కలం నవ్యం బాలాతప సమప్రభమ్॥ ౨౯

వెలి బూది పూఁతచేఁ గైసేయఁ బడిన నిలువు గలిగి, నేలకు దిగిన నెలయో యనఁదగిన వాఁడును, లేయెండ జిగి యొప్పు క్రొత్త నార చీర దాల్చిన వాఁడును,

బడబాగ్ని శిఖా జాల సమాలీఢ మివార్ణవం,
సర్వాసామపి విద్యానాం సముదాయ నికేతనమ్॥ ౩౦

న్యక్కృత ప్రాకృతాహంతం నిరూఢ శివభావనం,
తృణీకృత జగజ్జాలం సిద్ధీనా ముదయ స్థలమ్॥ ౩౧

మోహాంధకార తపనం మూలబోధ మహీరుహం,
దదర్శ స మహాయోగీ మునిం కలశ సంభవమ్॥ ౩౨

బడబాగ్ని జ్వాలలచే వ్యాప్తమైన సంద్రమువలె నున్న వాఁడును, అశేష విద్యలకు నాలయమైన వాఁడును, ప్రాకృతాహంకారమును దిరస్కరించినవాఁడును, కుదురు పడిన శివభావనము గలవాఁడును, జగజ్జాలమును గడ్డిపోచగాఁ గనువాఁడును, సర్వసిద్ధులకును జన్మస్థానమైన వాఁడును, అజ్ఞానమను చీఁకటికి సూర్యుఁడైనవాఁడును, స్వస్వరూప జ్ఞానమునకుఁ గల్పవృక్షము వంటి వాఁడును నైన యాయగస్త్య మహర్షిని శ్రీ రేణుక గణాధీశ్వరుఁడు చూచెను.

## అగస్త్యుఁడు శ్రీ రేణుకాచార్యుని బూజించుట - కుశల గోష్ఠి

తమాగతం మహాసిద్ధం సమీక్ష్య కలశోద్భవః,
గణేంద్రం రేణుకాభిఖ్యం వివేద జ్ఞానచక్షుషా,
తస్యానుభావం విజ్ఞాయ సహసైవ సముత్థితః॥ 33

అగస్త్యమహర్షియుఁ దన యాశ్రమమునకు వచ్చిన సిద్ధశ్రేష్ఠుని జూచి జ్ఞాననేత్ర సహాయమున శ్రీ రేణుకుఁడను గణాధీశునిఁగా నెఱింగి, యాతని మహిమమును గుర్తించి చప్పునలేచి,

లోపాముద్రా కరానీతై రుదకై రతిపావనైః,
పాదౌ ప్రక్షాలయామాస స తస్య శివయోగినః॥ 3౪

తన యిల్లాలైన లోపాముద్ర తెచ్చిన పవిత్రోదకములతో నా శివయోగి యడుగులను గడిగెను.

సంపూజ్య తం యథాశాస్త్రం తన్నియోగ పురస్సరం,
మునిర్వినయ సంపన్నో నిషసాదాసనాంతరే॥ 3౫

మఱియు, విధ్యుక్తముగాఁ బూజించి యాతని యాజ్ఞనొంది యగస్త్యుఁడు అడఁకువతో వేఱొక్క యుచితాసనమునఁ గూర్చుండెను.

సమాసీనం మునివరం సర్వతేజస్వినాం విభుం,
ఉవాచ శాన్తయా వాచా రేవణః సిద్ధశేఖరః॥ 3౬

అపుడు సిద్ధకుల చూడామణియైన రేవణాచార్యుఁడు తేజశ్శాలురలో నగ్రగణ్యుఁడైన యమ్మౌని నాయకునితో నెమ్మదిగా నిట్లనెను.

నిర్విఘ్నం వర్తసే కిం ను నిత్యా తే నియమక్రియా,
అథవాగస్త్య తేజస్విన్ కుతః స్యుస్తేఽన్తరాయకాః॥ 3౭

తేజోవంతుఁడా! అగస్త్యుఁడా! సుగమున్నావా? నీ నిత్యనియమ వ్రతములు చక్కఁగ సాగుచున్నవా? నీ పనులకు విఘ్నము లెట్లగును?

వింధ్యో నిరుద్ధో భవతా విశ్వోల్లంఘన విభ్రమః,
నహుషో రోషలేశాత్తే సర్పః సర్పత్వమాగతః॥ 3౮

విశ్వమును మీఱి మిన్నుముట్టు వేడుకగల వింధ్యము నీచే నణికట్టఁబడినది. నీ చిన్నకినుకచే నహుష చక్రవర్తియుఁ బాముయి పోయెను.

ఆచాన్తా భవతా పూర్వం పంకశేషాః పయోధయః,
జీర్ణస్తే జాఠరే వహ్నౌ దృప్తో వాతాపి దానవః॥ ౩౯

మున్ను సంద్రములెల్ల నడుసుమాత్రమే మిగులునట్లు నీచే నాచమింపఁబడినవి. పొగరెక్కిన వాతాపి యను దానవుఁడు నీ కడుపుఁ జిచ్చునఁబడి యఱిగిపోయెను.

ఏవం విధానాం చిత్రాణాం సర్వలోకాతిశాయినామ్,
కృత్యానాం తు భవాన్ కర్తా కస్తేఽగస్త్య సమప్రభః॥ ౪౦

సర్వలోకోత్తరము లగు నిట్టి చిత్రకృత్యములను గావించిన వాఁడవు. నీకు సాటియగు తేజస్వి యెవ్వఁడు?

శివాద్వైత పరానంద ప్రకాశన పరాయణమ్,
భవంతమేకం శంసంతి ప్రకృత్యా సంగవర్జితమ్॥ ౪౧

ఈ లోకమందు నిన్నొక్కనినే శివాద్వైతానుభవమున నైన యానందము వెలయువాఁడవనియు స్వభావముచేతనే సంగదూరుఁడవనియుఁ గొనియాడుదురు.

పురా హైమవతీసూను రవదత్తే షడాననః,
శివధర్మోత్తరం నామ శాస్త్రమీశ్వర భాషితమ్॥ ౪౨

తొల్లి పార్వతీపుత్రుఁడైన కుమారస్వామి, శివుఁడు చెప్పిన శివధర్మోత్తరమనెడి శాస్త్రమును నీ కుపదేశించెను.

భక్తిః శైవీ మహాఘోర సంసార భయహారిణీ,
త్వయా రాజన్వతీ లోకే జాతాఽగస్త్య మహామునే॥ ౪౩

ఓ యగస్త్యమహామునీ! భయదసంసారము వలని వెఱపును బాచునది శివభక్తియే. అది నీ చేత నీ లోకమునఁ బ్రకాశింపఁ జేయఁబడినది.

ఇతి తస్యవచః శ్రుత్వా సిద్ధస్య మునిపుంగవః,
గంభీర గుణయా వాచా బభాషే భక్తిపూర్వకమ్॥ ౪౪

ఇటులాడిన (శ్రీ) రేవణసిద్ధుని మాటలువిని యగస్త్యమహర్షి మిగుల భక్తితో గంభీరముగా నిటులనెను.

అహమేవ మునీంద్రాణాం లాలనీయోఽస్మి సర్వదా,
భవదాగమ సంపత్తి ర్మాం వినాకస్య సంభవేత్॥ ౪౫

ఓ రేణుకాచార్య! నీ రాకయనెడి భాగ్యము నాకుఁదక్క మఱెవ్వరికిఁ గలుగును? అందునచే మునిశ్రేష్ఠుఁడని నేనే కొనియాడఁ బడుచున్నాను.

స్థిరమద్య శివజ్ఞానం స్థిరామే తాపసక్రియా,
భవద్దర్శన పుణ్యేన స్థిరా మే మునిరాజతా॥ ౪౬

నిన్నుఁగన్న పున్నెముచే నా శివజ్ఞానమును, నా తపశ్చర్యయు, నా మునిశ్రేష్ఠతయు సుస్థిరములైనవి.

సంసార సర్ప దష్టానాం మూర్ఛితానాం శరీరిణాం,
కటాక్షస్తవ కల్యాణం సముజ్జీవన భేషజమ్॥ ౪౭

సంసారమనెడి పాము కఱచి తెలివి తప్పిన దేహధారులకు మంగళప్రదమైన నీ క్రేగంటి చూపే బ్రతుకు మందు.

సమస్త లోక సందాహ తాపత్రయ మహానలః,
త్వత్పదాంబుకణా స్వాదా దుపశామ్యతి దేహినామ్॥ ౪౮

దేహధారులను గాల్చునట్టి యాధ్యాత్మిక, కాధిదైవిక, కాధిభౌతిక తాపము లనెడి యగ్నిని చల్లార్చుటకు నీ పాదతీర్థ బిందువొక్కటే చాలును.

రేణుకం త్వాం విజానామి గణనాథం శివప్రియం,
అవతీర్ణ మిమాం భూమిం మదనుగ్రహ కాంక్షయా॥ ౪౯

శివప్రేమ పాత్రుఁడవైన నిన్ను రేణుకుఁడను ప్రమథ గణాధిపతినిగాఁ దెలిసికొంటిని. నన్ననుగ్రహించు తలఁపుతోనే నీవీ భూమికి దిగితివి.

భవాదృశానాం సిద్ధానాం ప్రబోధ ధ్వస్త జన్మనాం,
ప్రవృత్తి రీదృశీ లోకే పరానుగ్రహ కారిణీ॥ ౫౦

శివాద్వైత జ్ఞానసిద్ధిచే మఱలఁ బుట్టువు లేని మీవంటి సిద్ధుల యీ లోకసంచార వ్యాపారము, ఇతరుల ననుగ్రహించుటే ప్రయోజనముగాఁ గలది కదా?

త్వన్ముఖాచ్ఛ్రోతు మిచ్ఛామి సిద్ధాన్తం శ్రుతి సమ్మతం,
సర్వజ్ఞ వదమే సాక్షాచ్ఛైవం సర్వార్థ సాధకం॥ ౫౧

శ్రీ రేణుకాచార్య! అన్నియు నెఱిఁగిన సిద్ధుఁడా! వేదసమ్మతమైన శివాద్వైత శాస్త్రమును నీనోట వినఁగోరుచున్నాను, గాన ధర్మార్థ, కామ, మోక్షము లనెడి నాలుగు పురుషార్థములకుమ సాధనమైనదియు,

సద్యః సిద్ధి కరం పుంసాం సర్వ యోగీంద్ర సేవితం,
దురాచారై రనాఘ్రాతం స్వీకృతం వేదవేదిభిః,

శివాద్వైత మహాబోధ సంప్రదాయ ప్రవర్తకమ్॥ ౫౨
ఉక్త్వా భవాన్ సకల లోక మహోపకారం

సిద్ధాన్త సంగ్రహ మనాదృత బాహ్య తంత్రమ్,
నానాగమ శ్రవణ వర్తిత సంశయం మాం
సద్యః కృతార్థయితు మర్హతి దివ్యయోగిన్॥ ౫౩

ఓ యోగీశ్వరా! విన్నంతనే సర్వసిద్ధుల నిచ్చునదియు, యోగిమిన్నలు సేవించు నదియు, దురాచార దూరమైనదియు, వేదవేత్తలంగీకరించి యాదరించి నదియు, శివ జీవుల కేకత్వమే యనెడి గొప్ప జ్ఞాన సంప్రదాయమును నెఱపు నదియునైన యీ జగత్పూజ్య సిద్ధాంతమును నాకుపదేశింపుము. మఱియుఁ బలు తెగల యాగమములను

విఘటచే సంశయగ్రస్తుఁడనైన నాకు నీవు వేదవిరుద్ధ సంప్రదాయ తంత్రములను ఖండించునదియు, పశునామకులగు సర్వజీవులకును సంసారనివృత్తి యనెడి మహోపకార మొనర్చునదియునైన సిద్ధాన్త సంగ్రహము నుపదేశించి ధన్యునిఁజేయఁ దగుదువు నీవ.

ఇది
సిద్ధాన్త శిఖామణి యందు
శ్రీ రేణుకాగస్త్య సంభాషణ ప్రసంగ మనెడి
నాలవ పరిచ్ఛేదము.
శ్రీ శివార్పణము.

---

ఓం ఈం నమః
ఓం నమః శివాయ
శ్రీ జగద్గురు రేణుకాచార్యాః ప్రసీదంతు

# అయిదవ పరిచ్ఛేదము

## అగస్త్యున కుపదేశము

అథాగస్త్య వచః శ్రుత్వా రేణుకో గణనాయకః,
ధ్యాత్వాక్షణం మహాదేవం సాంబ మాహ సమాహితః॥ ౧

ప్రమథ గణాధీశ్వరుఁడైన శ్రీ రేణుకాచార్యుఁడు, అగస్త్యుని యమ్మాటలు విని గడియసేపు స్థిరచిత్తుఁడై, అంబాసహితుఁడైన (శక్తిసహితుఁడైన) పరమేశ్వరుని ధ్యానించి పలికెను. అనఁగా నుపదేశమును ప్రారంభించెను.

అగస్త్య మునిశార్దూల సమస్తాగమపారగ,
శివజ్ఞానకరం వక్ష్యే సిద్ధాన్తం శ్రుణు సాదరమ్॥ ౨

సకలాగమముల యంతమును జూచినవాడా! అగస్త్య మహర్షీ! పరశివజ్ఞానమును గల్గించు సిద్ధాన్తము నిపుడు నీకుఁ బ్రేమతోఁ జెల్పుదును. ఆదరముతో వినుము.

అగస్త్య బహుధా ఖ్యాతాః సిద్ధాన్తా రుచిభేదతః,
భిన్నాచారసమాయుక్తా భిన్నార్థ ప్రతిపాదకాః॥ 3

ఓ యగస్త్యుఁడా! లోకమునఁ గపిలుఁడు, పతంజలి, మున్నగు మహర్షులు తమ తమ రుచులనుబట్టి వేర్వేఱు ఆచారములను, వేర్వేఱు ప్రయోజనములను దెలుపు సిద్ధాన్తములను వెలయించిరి. అవి ప్రసిద్ధములై యనేక విధములుగా నున్నవి.

సాంఖ్యం యోగః పాంచరాత్రం వేదాః పాశుపతం తథా,
ఏతాని మానభూతాని న హంతవ్యాని యుక్తిభిః॥ ౪

కపిలుని సాంఖ్యము, ప్రకృతి పురుషుడు అని రెండు పదార్థములనే ప్రతిపాదించునదియై యనీశ్వరవాదియై యున్నది.

పతంజలి యోగశాస్త్రము మిగులఁ గష్టతమమైన యమ, నియమ, ఆసన, ప్రాణాయామ, ప్రత్యాహార, ధ్యాన, ధారణ, సమాధులనెడి యెనిమి దంగములను బ్రతిపాదించునటియై సేశ్వరవాదియై యున్నది.

వాసుదేవ విరచితమైన పాంచరాత్రము వైష్ణవ దీక్షాంగములైన తప్త ముద్రాధారణాది (రాగి, వెండి, మున్నగు లోహములచేఁ చేయఁబడిన శంఖ, చక్ర చిహ్నములను గాల్చి బుజములందు అచ్చు వేయుట) క్రియాప్రతిపాదన మూలముగా చిత్, అచిత్, ఈశ్వరుఁడు అనెడి మూడు పదార్థములను బ్రతిపాదించునది.

శివప్రణీతమైన పాశుపతము, పశువు — పాశము — పతి యనెడి మూడు పదార్థములను బ్రతిపాదించునది.

జైమినిమునిచేత రచియింపఁబడిన పూర్వమీమాంసాశాస్త్రము అప్రయత్నముగా జరుగు శివుని నిఃశ్వాసరూపములైన ఋగ్, యజు, స్సామము లనెడి వేదము లందలి మొదటి కాండము ననుసరించి యాగాది కర్మములను బ్రతిపాదించునదియై యదియు ననీశ్వరవాదియై యున్నది.

ఈ శాస్త్రములెల్లఁ బ్రమాణభూతములే. కావున యుక్తి ప్రతియుక్తులను ఖండింపరానివి.

వేదః ప్రధానం సర్వేషాం సాంఖ్యాదీనాం మహామునే,
వేదానుసరణా దేషాం ప్రమాణ మితి నిశ్చితమ్॥ ౫

ఓ మహామునీ! సాంఖ్యము మున్నగు వీని కన్నింటికి వేదము ముఖ్యము. ఇవన్నియు వేదములను బట్టియే వర్తించుచుండుటచేతఁ బ్రమాణభూతములై యున్నవి.

పాంచరాత్రస్య సాంఖ్యస్య యోగస్య చ తథా మునే,
వేదైక దేశ వర్తిత్వం శైవం వేదమయం మతమ్॥ ౬

పాంచరాత్రము, సాంఖ్యము, యోగము అనునవి వేదమందలి యేదేనొక భాగమందే యుండి యొక్క విషయమునే తెల్పును. శైవమో — అట్టిదిగాక సర్వవేదమయము.

వేదైక దేశ వర్తిభ్యః సాంఖ్యాదిభ్యో మహామునే,
సర్వవేదానుసారిత్వా చ్ఛైవతంత్రం విశిష్యతే॥ ౭

ఓ మహామునీ! వేదమందలి యేదేనొక్క భాగమునే యనుసరించు సాంఖ్యాదులకంటె శైవమే సర్వవేదానుసారియగుటచేత సర్వశ్రేష్ఠము.

శైవతంత్ర మితి ప్రోక్తం సిద్ధాన్తాఖ్యం శివోదితం,
సర్వవేదార్థ రూపత్వాత్ ప్రమాణం వేదవ త్సదా॥ ౮

శివుని నోరు వెలువడిన శైవతంత్రమే సిద్ధాన్త మనఁబడుచున్నది. ఇది సర్వవేదార్థ స్వరూపమగుటవలన వేదమువలెనే ప్రమాణీభూతము.

ఆగమా బహుధా ప్రోక్తాః శివేన పరమాత్మనా,
శైవం పాశుపతం సోమం లాకులం చేతి భేదతః॥ ౯

శివపరమాత్మునిచే నాగమములు, శైవము, పాశుపతము, సోమము, లాకులము అను నాలుగు భేదములుగాఁ జెప్పఁబడెను.

తేషు శైవం చతుర్భేదం తంత్రం సర్వవినిశ్చితం,
వామంచ దక్షిణంచైవ మిశ్రం సిద్ధాన్త సంజ్ఞికమ్॥ ౧౦

అందు శైవతంత్రము వామము, దక్షిణము, మిశ్రమము, సిద్ధాన్తము అని నాలుగు భేదములుగా నున్నదని తంత్రజ్ఞులచే నిర్ణయింపఁబడినది.

శక్తిప్రధానం వామాఖ్యం దక్షిణం భైరవాత్మకం,
సప్తమాతృపరం మిశ్రం సిద్ధాన్తం వేదసమ్మతమ్ ॥ ౧౧

వామ మన్నది కేవల శక్తిప్రధానము; దక్షిణమన్నది కేవల భైరవాత్మకము; మిశ్రమమన్నది సప్తమాతృదేవతాత్మకము; సిద్ధాన్తము శక్తివిశిష్ట శివాత్మకమై సర్వవేదసమ్మతము.

వేదధర్మాభిధాయిత్వాత్ సిద్ధాన్తాఖ్యః శివాగమః,
వేదబాహ్య విరోధిత్వా ద్వేదసమ్మత ఉచ్యతే ॥ ౧౨

వేదము = జ్ఞానస్వరూప శివపరబ్రహ్మము. ధర్మము = సర్వలోకములను ధరించునది, విమర్శరూపశక్తి. (కౌల, భావనోపనిషత్తులను జూచుకొనునది.)

అనఁగా శక్తివిశిష్ట శివుని దెల్పునది యగుటవలనను, భస్మ, రుద్రాక్ష, లింగధారణాది వేదధర్మములను ప్రతిపాదించునది యగుటచేతను, వేదబాహ్యములైన చార్వాకాది మతముల నిరసించునది యగుటవల్లను, సిద్ధాన్త మనెడి యీ తంత్రము కేవల వేదసమ్మతముగా నంగీకరింపఁబడినది.

వేదసిద్ధాన్తయోరైక్య మేకార్థ ప్రతిపాదనాత్,
ప్రామాణ్యం సదృశం జ్ఞేయం పండితై రేతయో స్సదా॥ ౧౩

సర్వవేదములందును గానఁబడు గ్రాహ్యధర్మము లన్నియు నీయాగమమునఁ గానఁబడును. వేదమును సిద్ధాంతమును నొక్కధర్మమునే ప్రతిపాదించుటచేత రెండును నొక్కటే. కావునఁ బండితులెల్లరు నీ రెండింటికి సమాన ప్రామాణ్యమే యని తెలియవలయును.

సిద్ధాన్తాఖ్యే మహాతంత్రే కామికాద్యే శివోదితే,
నిర్దిష్ట ముత్తరేభాగే వీరశైవ మతం పరమ్ ॥ ౧౪

శివునిచేఁ జెప్పఁబడిన కామికతంత్రము మొదలు వాతుల తంత్రాంతముగానున్న సిద్ధాన్తతంత్రముల రెండవభాగములందు సర్వశ్రేష్ఠమైన వీరశైవమత స్వరూపమే చూపఁబడినది.

వి శబ్దే నోచ్యతే విద్యా శివజీవైక్య బోధికా,
తస్యాం రమంతే యే శైవా వీరశైవాస్తు తే మతాః॥ ౧౧

"వి" యనెడి శబ్దము లింగాంగ సామరస్య రూపమైన శివజీవైక్య జ్ఞానమును బోధించును. ఆ విద్యయందు రమించువారు, అనఁగా శివజీవైక్య జ్ఞానమందు వినోదించు శైవులు వీరశైవు లనఁబడుదురు.

వేదాన్త జన్యం యద్ జ్ఞానం విద్యేతి పరికీర్త్యతే,
విద్యాయాం రమతే యః స వీర ఇత్యభిధీయతే॥ ౧౨

ఉపనిషదర్థ బోధమువలనఁ గలిగిన జ్ఞానమే విద్య యనఁబడును. అట్టి విద్యయందు రమించువాఁడే వీరుఁడు. 'వి, ర' అను వానియందు 'అన్యేషామపి దృశ్యతే' యను పాణినీయ సూత్రమును బట్టి 'వి' శబ్దమునకు దీర్ఘము రాఁగా వీర యగును.

విద్యాయాం శివరూపాయాం రమంతే యే విశేషతః,
తస్మాదేతే మహాభాగా వీరశైవా ఇతి స్మృతాః॥ ౧౩

మంగళ స్వరూపమైన వేదాన్త జన్య జ్ఞానమందు విశేషించి రమించు భాగ్యవంతులైన శైవులే వీరశైవు లనఁబడుదురు.

విద్యాయాం రమతే యస్మా న్మాయాయాం హేయాం శ్వవద్రహేత్,
అనేనైవ నిరుక్తేన వీరమాహేశ్వరః స్మృతః॥ ౧౪

లింగాంగ సామరస్య రూపమగు శివ జీవైక్య విద్యయందు రమించుటచేతను మాయను హేయముగా 'శ్వవత్' కుక్కనువలెఁ దొలఁగించువారే వీరమాహేశ్వరులని నిరుక్తి.

శైవై ర్మాహేశ్వరై శ్చైవ కార్య మంతర్బహిః క్రమాత్,
శివో మహేశ్వర శ్చేతి నాత్యంత మిహ భిద్యతే,
యథా తథా న భిద్యన్తే శైవా మహేశ్వరా అపి॥ ౧౫

వీరశైవులు లింగపూజను అంతరంగమందును, మాహేశ్వరులు బహిరంగముగాను విశేషించి చేయుదురు. గాని భేదము విశేషించి లేదు. వీరశైవులకును వీరమాహేశ్వరులకును భేదము లేదు.

శివాశ్రితేషు తే శైవా జ్ఞాన యజ్ఞ రతా నరాః,
మాహేశ్వరాః సమాఖ్యాతాః కర్మ యజ్ఞ రతా భువి,
తస్మా దభ్యంతరే కుర్యుః శైవా మాహేశ్వరా బహిః॥ ౨౦

శివు నాశ్రయించిన భక్తులలో నెవ్వరు విశేషించి జ్ఞానయజ్ఞ మందే యాసక్తి గలిగి యుందురో, వారు వీరశైవులు. కర్మయజ్ఞమం దధికాసక్తి గలవారు వీరమాహేశ్వరులు. వీరశైవులు లింగపూజను ప్రధానముగా నంతరంగమందును, వీరమాహేశ్వరులు ప్రధానముగా బహిరంగమందును జేయుదురని భావము.

వీరశైవాస్తు షడ్భేదాః స్థల ధర్మ విభేదతః,
భక్తాది వ్యవహారేణ ప్రోచ్యన్తే శాస్త్ర పారగైః॥ ౨౧

వీరశైవులు భక్త, మాహేశ్వర, ప్రసాది, ప్రాణలింగి, శరణ, ఐక్య యనెడి స్థలభేదము గలిగిన నామధేయములతో ఆఱు విధములుగా నున్నారని శాస్త్రవేత్త లందురు.

శాస్త్రం తు వీరశైవానాం షడ్విధం స్థలభేదతః,
ధర్మభేద సమాయోగా దధికార విభేదతః॥ ౨౨

ఈ వీరశైవ శాస్త్రము స్థల భేదము వలనను, ఆయా స్థలము లందుఁ జెప్పఁబడిన యాచార భేదముచేతను, అధికార భేదముచేతను ఆఱు విధములుగా నున్నది.

ఆదౌ భక్త స్థలం ప్రోక్తం తతో మాహేశ్వర స్థలం,
ప్రసాది స్థల మన్యత్తు ప్రాణలింగి స్థలం తతః,
శరణ స్థల మాఖ్యాతం షష్ఠమైక్య స్థలం మతమ్॥ ౨౩

వి॥ ఈ శాస్త్రమునకు వీరశైవ (అంతర లింగార్చన పరుఁడు) ధర్మనిష్ఠుఁడైన మోక్షార్థియే యధికారి. శివజీవైక్యమనెడి సాయుజ్య

...క్తియే దీని ప్రయోజనము. భక్తాదికములైన యాఱుస్థలములం ...ను కలిసియున్న ౧౦౧ స్థలములే విషయము. శాస్త్రముచేఁ జెప్పఁ ...డునదే విషయము. వీరశైవశాస్త్ర మీావిధముగా నాలుగు అనుబంధ ...ములు గలది.

వీరశైవశాస్త్రమందుఁ బ్రసిద్ధములైన యాఱు స్థలములయందు 1. భక్తస్థలము, 2. మాహేశ్వరస్థలము, 3. ప్రసాదిస్థలము, 4. ప్రాణ ...లింగిస్థలము, 5. శరణస్థలము, 6. ఐక్యస్థలము అని ఆఱువిధములు. వీర ...శైవసిద్ధాన్తమందుఁ బరశివబ్రహ్మమే 'స్థల' శబ్దముచేఁ జెప్పఁబడును. ...స్థలతత్త్వము — "స్థీయతే లీయతే యత్ర జగదేత చ్చరాచరం, ...బ్రహ్మస్థల మిత్యుక్తం స్థలతత్త్వ విశారదైః॥" అను ప్రమాణ ...మునుబట్టి జంగమస్థావరాత్మకమైన యీాజగత్తు దేనియం దుత్పత్తి ... లయముల నొందుచున్నదో యీా బ్రహ్మవస్తువే స్థలశబ్దముచేఁ ...బిలువఁబడు చున్నది.

ఆ పరశివబ్రహ్మము తన విలాసముచేఁ 'అంగ' మని, 'లింగ' మని ...రెండు విధములుగా నగును.

చిత్తశక్తి విశిష్టుఁడైన జీవుఁడే అంగము. చిచ్ఛక్తి విశిష్టుఁడైన ...పరశివుఁడే లింగము. లింగాంగ పదములచేఁ జెప్పఁబడు శివజీవుల యేక ...త్వమే లింగాంగ సామరస్యము.

స్థలము (పరశివబ్రహ్మము) భక్త, మాహేశ, ప్రసాది, ప్రాణలింగి, ...శరణ, ఐక్య — అనెడి భేదములచే నాఱు విధములు.

"శివభక్తిః సముత్పన్నా యస్యాసౌ భక్తఉచ్యతే। తస్యాను ...యు కర్మాణా ముక్తిర్భక్త స్థలం మతమ్॥" ఎవనియందు యథార్థ ...మైన శివభక్తి కలుగుచున్నదో యతఁడు భక్తుఁడు.

"కేవలం సహజేదానే నిష్ణాతః శివతత్పరః, బ్రహ్మాది స్థాన ...విముఖో భక్తో మాహేశ్వరః స్మృతః॥" సహజదానమందు ఆఱితేఱిన ...వాఁడై శివాసక్తిగలిగి బ్రహ్మాది పదవులందు విముఖుఁడైనవాఁడే ...మాహేశ్వరుఁడు.

"మనః ప్రసాద సిద్ధ్యర్థం నిర్మల జ్ఞానకారణం, శివప్రసాదం స్వీకుర్వన్ ప్రసాదీ త్యేష కథ్యతే ॥" ఈ మాహేశ్వరుఁడే తన మనః ప్రసన్నతకై నిర్మల శివజ్ఞానకారణమైన శివప్రసాదమును గైకొనుటచేఁ బ్రసాది యనఁబడును.

"లింగం చిదాత్మకం బ్రహ్మ తచ్ఛక్తిః ప్రాణరూపిణీ, తద్రూప లింగవిజ్ఞానీ ప్రాణలింగీతి కథ్యతే॥" జ్ఞానస్వరూప లింగమే బ్రహ్మము. ఆ లింగరూప బ్రహ్మశక్తియే ప్రాణము. ఆ ప్రాణరూపశక్తియొక్కయు, లింగరూప బ్రహ్మముయొక్కయు స్వరూపమైయుండునది యొక్క పదార్థమే యనెడి ప్రసాదియే ప్రాణలింగి యనఁబడును.

"సతీవ రమణే యస్తు శివే శక్తిం విభావయన్, తదన్య విముఖః సోఽయం జ్ఞాతః శరణనామవాన్॥" తన పతియందుఁదక్కఁ బరపురుషు లందుఁ బెడమొగముతోనుండు నాథవ్రతయైన స్త్రీవలెనే యెవఁడు తనను శివునియెడ సతిగా భావించుకొనుచు నితరదేవతలయెడ విము ఖుఁడై యుండునో, యా ప్రాణలింగియే శరణనామమున నొప్పును.

"ప్రాణలింగాది యోగేన సుఖాతిశయ మేయివాన్, శరణాఖ్యః శివేనైక్య భావనా దైక్యవాన్ భవేత్॥" ఈ శరణుఁడే ప్రాణలింగాది యోగముచే ఆనందాతిశయమునొంది "శివోఽహం" ఈ యుపాధి యందున్న 'నేను శివుఁడనే' యను భావనతో శివునం దేకత్వము నొందుటచే ఐక్యనామము నొందును.

ఈ గ్రంథమందు శ్రీ రేణుకభగవత్పాదులు ఆఱు స్థలముల స్వరూపము నిటులే రూపించిరి.

## —: భక్తస్థలము. :—

(అంగ స్థలములు 44)

భక్తస్థలం ప్రవక్ష్యామి ప్రథమం కలశోద్భవ,
తదవాంతర భేదాంశ్చ సమాహిత మనాః శృణు ॥ —౨౪

ఓ యగస్త్యమహర్షీ! తొలుత భక్తస్థలమును దానియందలి యవాంతర భేదములను జెప్పెదను; శ్రద్ధతో వినుము.

శివేశ భక్తిః సముత్పన్నా యస్యాసౌ భక్తఉచ్యతే,
తస్యానుష్ఠేయ ధర్మాణా ముక్తి ర్భక్త స్థలం మతమ్॥ ౧౫

అవాంతర స్థలాన్యత్ర ప్రాహుః పంచదశోత్తమాః,
పిండతాపిండ విజ్ఞానం సంసార గుణహేయతా॥ ౧౬

దీక్షాలింగ ధృతిశ్చైవ విభూతే రపి ధారణం,
రుద్రాక్ష ధారణంచైవ పంచాక్షర జపస్తథా॥ ౧౭

భక్తమార్గక్రియాచైవ గురోర్లింగస్య చార్చనం,
జంగమస్య తథా హ్యేషాం ప్రసాద స్వీకృతి స్తథా॥ ౧౮

అత దాన త్రయంప్రోక్తం సోపాధి నిరుపాధికం,
సహజం చేతి నిర్దిష్టం సమస్తాగమ పారగైః,
ఏతాని శివభక్తస్య కర్తవ్యాని ప్రయత్నతః॥ ౧౯

ఈ భక్తస్థలమునందు, అవాంతరస్థలములు పదునైదు. 1. పిండస్థలము, 2. పిండజ్ఞానస్థలము, 3. సంసారహేయస్థలము, 4. దీక్షాగురు కారుణ్యస్థలము, 5. లింగధారణస్థలము, 6. భస్మధారణస్థలము, 7. రుద్రాక్షధారణస్థలము, 8. పంచాక్షరజప స్థలము, 9. భక్తమార్గక్రియా స్థలము, 10. ఉభయస్థలము, 11. త్రివిధసంపత్తిస్థలము, 12. ప్రసాదస్వీకారస్థలము, 13. సోపాధిదాన స్థలము, 14. నిరుపాధిదాన స్థలము, 15. సహజదాన స్థలము అని సర్వాగమపారగులు నిర్దేశించిన పదునైదు స్థలములందును జెప్పఁబడిన ధర్మములను శివభక్తుడు ప్రయత్నపూర్వకముగా నాచరింపవలయును.

## 1. పిండస్థలము

సహాజన్మ కృతైః పుణ్యైః ప్రక్షీణే పాపపంజరే,
శుద్ధాన్తః కరణో దేహీ పిండశబ్దేన గీయతే॥ ౨౦

పలుజన్మములందుఁ జేసిన పుణ్యములచేఁ బాపములు నశింపఁగా నిర్మలాంతఃకరణుఁడగు శుద్ధాత్మకరణమునకే పిండమని పేరు.

శివశక్తి సముత్పన్నే ప్రపంచేఽస్మిన్ విశిష్యతే,
పుణ్యాతిశయ క్షీణపాపః శుద్ధాత్మా పిండనామకః॥ ౨౧

శివశక్తి సంయోగము వలనఁ గలిగిన యీ ప్రపంచమందు, పుణ్యాధిక్యముచేఁ బాపము నశించి పుట్టిన శుద్ధాత్ముఁడైన జీవుఁడే పిండనాముఁడు. ఇతఁడే శ్రేష్ఠుఁ డందురు.

ఏక ఏవ శివః సాక్షా చ్చిదానందమయో విభుః,
నిర్వికల్పో నిరాకారో నిర్గుణో నిష్ప్రపంచకః॥ 3౨

పరమశివుఁడొక్కఁడే జ్ఞానానందస్వరూపుఁడు. సృష్ట్యాది సర్వ కార్యసమర్థుఁడు. స్వగతాది భేదములు లేనివాఁడు. నలుపు, పసుపు మున్నగు నాకారములు లేనివాఁడు. మాయాసంబంధమైన సత్త్వ రజ స్తమస్సు లనెడి యవస్థలు ( గుణములు చేరనివాఁడు ). కావున మాయిక ప్రపంచమునకు దూరుఁడు. 'ఏక ఏవ రుద్రో న ద్వితీయాయ తస్థే' 'ఏకమేవా ద్వితీయం బ్రహ్మ' ఈ మున్నగు శ్రుతి వాక్యములనుబట్టి, యున్నవాఁ డతఁడొక్కఁడే. రెండవది లేదు.

అనాద్య విద్యా సంబంధా త్తదంశో జీవనామకః,
దేవ తిర్యఙ్మనుష్యాది జాతి భేదే వ్యవస్థితః,
మాయీ మహేశ్వర స్తేషాం ప్రేరకో హృది సంస్థితః॥ 33

తనయందు నిత్య సంబంధముతో నున్న విమర్శ శక్తి (అస్మి = ఉన్నాను; ప్రకాశే = వెలయుచున్నాను. నందామి = ఆనందించు చున్నాను, అనెడి యనుభవము) యందున్న (ఇమిడియున్న) అనాది యైన మాయయొక్క సంబంధముచేతఁ బరమశివుని యంశమే జీవుఁ డనఁబడును.

ఆ జీవుఁడు దేవ, మనుష్య, పశు, పక్షి, మృగ, జలచర రూప మైన లెక్కలేని భేదములతోఁ గూడిన ప్రాణులందు వసించును.

"మాయాం తు ప్రకృతిం విద్యా న్మాయినం తు మహేశ్వరం" ప్రకృష్టములైన సృష్టి, స్థితి, లయ, తిరోధా, నానుగ్రహము లనెడి కృతుల నాచరించుటచే 'ప్రకృతి' యనఁబడు తన విమర్శశక్తితోఁ గూడి ప్రేరకుఁడై సర్వజీవుల హృదయములందు వసించును.

జీవుఁడు శివాంశ రూపుఁడే యనుటకు "అంశో నానా వ్యపదేశాత్" అనెడి బ్రహ్మసూత్రమే సమర్థకము.

"యథా సుదీప్తా త్పావకాత్ విస్ఫులింగాః
సహస్రశః ప్రభవంతే సరూపాః,
తథాఽక్షరా ద్వివిధాః సోమ్యభావాః
ప్రజాయన్తే తత్ర చైవాపి యంతి॥"

మండుచున్న యగ్నియందు దాని లేశ భాగములే యైన మిణుఁగురులు లెక్కలేనన్ని యెటులు బయల్వెడలునో, యటులే పరబ్రహ్మము నుండి తల్లేశాంశములే యైన యనంతజీవులు పుట్టి యా పరబ్రహ్మమందే లయము నొందుచుండును. (ముండక శ్రుతి)

జీవుఁడు స్థూలమైన చిత్తు, స్థూలమైన యచిత్తు — అను శక్తులచే విశిష్టుఁడనియు, జీవుని స్థూల చిచ్ఛక్తియే కించిద్జ్ఞత్వ రూపమైనదనియు, ఆతని స్థూలమైన అచిద్రూపశక్తియే కించి త్కర్తృత్వ రూపమైనదనియు జెప్పియుంటిమి. అతఁడీ రెండువిధములైన శక్తులకును ఆశ్రయమైన యిచ్ఛాశక్తితోఁ గూడుకొని యుండువాఁడు. అనఁగా నిచ్ఛాశక్తి విశిష్టుఁడని భావము.

శివుని యంశమైన యీజీవుఁడు కించిద్జ్ఞుఁడు, కించిత్కర్త, కించిచ్ఛక్తియుతుఁడు, అవిద్యా మోహితుఁడు (అల్పవిద్యా మోహితుఁడు) బ్రహ్మముతో దన కేకత్వమే యనెడి జ్ఞానము మఱుఁగు పడినవాఁడు. ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికము లనెడి ఘోరతాపములచే మఱుఁగుచున్నవాఁడు. బద్ధుఁడు నయినాఁడు.

పరశివుఁడు సూక్ష్మ చిదచిదాత్మక శక్తి విశిష్టుఁడై సచ్చిదానంద స్వరూపుఁడును, సర్వజ్ఞుఁడును, సర్వశక్తియుతుఁడును, సాటిలేనివాఁడును, జనన మరణములు లేనివాఁడును, స్థావర జంగమాత్మక ప్రపంచమం దంతటను వ్యాపించినవాఁడును, త్రికాలాబాధ్యుఁడునై యున్నవాఁడు.

వీరశైవ సిద్ధాన్తమందు శివజీవులకుఁ బారమార్థిక భేదాభేదమాత్ర మంగీకరింపఁ బడినది.

అగ్నియందుఁ బుట్టిన మిణుఁగురులకును, అగ్నికిని మిగుల భేదము లేదు. మిగుల నభేదమును లేదు. అటులే శివజీవులకును నని యెఱుంగునది.

అంశము జీవుఁడు, అంశి శివుఁడు. అంశమునకును అంశికిని అత్యంతాభేదమునే చెప్పినచో, అగ్నిచేత నగు కాల్చుట, పాకము చేయుటా మున్నగు పనులు, దానినుండి పుట్టిన మిణుగురులచేతనుం గావలయును గాదా?

అత్యంత భేదమే చెప్పినచో, అగ్నికంటె నత్యంత భిన్నములగు నీరు మున్నగు వానిచే దాహపాకాదులు కానటులే, అగ్నియొక్క యంశములైన మిణుఁగురులకును నట్టిశక్తి కేవలము లేకయే యుండును గాని యగ్నికణములకు జిన్న వెలుఁగును, మఱియొక దానిని గాల్చు శక్తియుఁ గలదనుట మనకుఁ బ్రత్యక్షముకాదా?

కావున శివునకును, శివాంశరూపమైన జీవునకును అత్యంతమైన యభేదమునే చెప్పినచో, శివునందున్న సర్వజ్ఞత్వ, సర్వకర్తృత్వాదులు జీవునందును నుండవలదా? అత్యంత భేదమునే చెప్పినచో, శివునకు భిన్నములైన ఘటపటాదులచే జ్ఞానరూపకార్యము కాకున్నటులే జీవులచే సైతము కారాదు కదా?

జీవులకు, ఇది కుండ, ఇది వస్త్రము అనెడి జ్ఞానమున్నదనుట నిశ్చయము. అందుచేతనే వీరశైవాచార్యులు శివునకును, జీవునకును పారమార్థికమైన భేదాభేదము నొప్పుకొనిరి.

ఇందువలన వీరశైవ మతమునకును ద్వైతాద్వైత మతములకువలెనే నామాంతరములు కలిగి యుండును. శ్రుతులందు "ద్వా సుపర్ణా సయుజా సఖాయా సమానం వృక్షం పరిష స్వజాతే" ఇత్యాది వాక్యములు ద్వైతమును బ్రతిపాదించునవియుఁ గలవు. "తత్త్వమసి" "అహం బ్రహ్మాస్మి" "నేహ నానాస్తి కించన" మున్నగు వాక్యములు కేవలాద్వైతమును బ్రతిపాదించునవియుఁ గలవు. ఈ యుభయ వాక్యములకును సులభమార్గముచే సామంజస్యముఁ గలిగించుట వైదిక మతానుసారుల ముఖ్యకర్తవ్యమై యుండుటచేత నిదే మార్గమును

వీరశైవ మతాచార్యు లనుసరించిరి. కనుకనే వీరశైవ సిద్ధాన్తము సర్వ శ్రుతి సమ్మతమైనది.

ఈ విషయమును వీరశైవ మతాచార్యులైన శ్రీపతి పండితులు తమ రచించిన శ్రీకర భాష్యమందు "ద్వైతాద్వైత మతే శుద్ధే విశేషాద్వైత సంజ్ఞికే, వీరశైవైక సిద్ధాన్తే సర్వశ్రుతి సమన్వయః" అని వ్రాసిరి. కావున వీరశైవ మతము భేదాభేదాత్మక మైనదని తేలుచున్నది.

చంద్రకాంతే యథా తోయం సూర్యకాంతే యథాఽనలః,
బీజే యథాంకురః సిద్ధ స్తథాత్మని శివః స్థితః॥ 38

చంద్రకాంత శిలయందు నీరును, సూర్యకాంత శిలయందు అగ్నియు, విత్తునందు మొలకయు నెట్లు స్వాభావికముగా నుండునో, యట్లులే జీవునందుఁ బరశివుఁడు స్వాభావికముగా నుండును.

గుణత్రయాత్మికా శక్తి ర్బ్రహ్మ నిష్ఠా సనాతనీ,
త ద్వైషమ్యా త్సముత్పన్నా తస్మి న్వస్తు త్రయాభిధా॥ 39

"ఔష్ణ్యం హుతాశన ఇవ శీతలి మాన మిందౌ శయ్యాసు మార్దవ మివాశ్మసు కర్కశత్వం." అగ్నియందు వేడిమి, చంద్రునందు జలువ, పఱుపులందు మెత్తన, ఱాళ్లయందు గట్టితనము, సహజములై యుండునట్లే, సచ్చిదానందరూప పరశివబ్రహ్మమందు అనాదియైన విమర్శశక్తి స్వభావసిద్ధముగా నుండును.

మయూరాండ రస న్యాయమున – (నెమలి గ్రుడ్డునందలి రసమున మున్ముందు పుట్టఁబోవు నెమిలి పాదములు, ఱెక్కలు, చిత్రవర్ణములును నణఁగి యుండు నటులే) ఆ విమర్శ శక్తియందు సకల స్థిర చర రూపమైన జగత్తు అణఁగియున్నది. చరాచర ప్రపంచరూప విమర్శ శక్తి తన విభాగమును జూచుకొను దశయందు సత్త్వగుణ, రజోగుణ, తమోగుణ రూపముగా నగును. ఆ విమర్శ శక్తియొక్క అంశమందు ఉత్తమ కర్తృత్వము నుండి విడువఁబడిన జ్ఞానాంశముచే సత్త్వగుణ రూపమైన విద్యాశక్తి యుత్పన్నమగును. ఉత్తమ జ్ఞాతృత్వమునుండి

విడువఁబడిన క్రియాంశముచే రవ్వంత సత్త్వ తమో గుణ మిశ్రమమైన రజోగుణశక్తి పుట్టును.

జ్ఞానక్రియలకు స్వాభావికమైన యైక్యమున్నను సృష్టి దశయందు జ్ఞాన క్రియాశక్తులు పరస్పరము విభాగ మొందుటచే "జ్ఞానం క్రియా న భవతి, క్రియా జ్ఞానం న భవతి" జ్ఞానము క్రియకాదు, క్రియ జ్ఞానము కాదు. అనెడి భేద బుద్ధి రూపమైన తమోగుణశక్తి యుత్పన్నమగును.

ఈ తమోగుణశక్తియే జడమైన మాయ యనిపించుకొనును. సూర్యకిరణము సూర్యకాంతపు రాతికిం దగిలి ప్రతిస్ఫురించుటచే, అగ్నికణరూపమై సమీపమం దుంచిన దూదిని జేరి యగ్నిరూపము నొందినటులే, శివుని విమర్శశక్తి జడమాయాశక్తియందుఁ బ్రతిస్ఫురించుటచే సుఖ దుఃఖ మోహాదులను గలిగించు సత్త్వ, రజ స్తమో గుణరూపమైన ప్రకృతియొక్క రూపమును ధరించును.

సత్త్వ, రజ, స్తమస్సుల యొక్క హెచ్చు దగ్గులచేత ఆ విమర్శశక్తి శుద్ధ జ్ఞానరూపుఁడైన పరశివునందు, భోక్త = అనుభవించువాఁడు, భోజ్య = అనుభవింపఁ బడునది, ప్రేరక = అనుభవమునకుఁ బురికొల్పువాఁడు, అను రూపములుగాఁ బరిణమించును.

"తదీయా పరమా శక్తిః సచ్చిదానంద లక్షణా, సమస్త లోక నిర్మాణ సమవాయ స్వరూపిణీ।తదిచ్ఛయాఽభవ త్సాక్షాత్ తత్స్వరూపానుకారిణీ॥" పరమశివుని విడి యుండని యా విమర్శశక్తి, సర్వలోక నిర్మాణమందు సమష్టి స్వరూపము నొందినదై పరశివుని యిచ్ఛననుసరించి కేవల మాతని రూపమే యగును. ఈ ప్రమాణవాక్యమును శక్తి పరశివునికంటె వేఱు కానిదై విశ్వసృష్టి కారణ మగుచున్నది.

"చిదాత్మైవ హి దేవోఽన్తః స్థిత మిచ్ఛావశా ద్బహిః, యోగీవ నిరుపాదాన మర్థజాతం ప్రకాశయేత్॥" ఈ లోకమున యోగసిద్ధుఁడు తన యిచ్ఛవచ్చిన వస్తువులను బ్రకాశింపఁజేయునటులే పరశివుఁడు తనయం దడఁగియున్న జగత్తును విమర్శశక్తిచేఁ బ్రకాశింపఁజేయును. ఇట్టి ప్రమాణ ముండుటచేత స్థావర జంగమాత్మకమైన

జగత్తు అనాదికాలమునుండియు నా పరబ్రహ్మమందు సద్రూపముగా నుండునని స్థిరపడుచున్నది. ఈ విషయమునే 'గీతాచార్యుఁడును "నాసతో విద్యతే భావో నా భావో విద్యతే సతః" అను వాక్యముచే సమర్థించినాఁడు. ఇందువలనఁ జరాచరాత్మక జగత్తు మాయావాదు లనునట్లు మిథ్య యనుట అసత్యమని సిద్ధాన్త మగును. గాన జగత్తు మిథ్య కాదు. భ్రాంతి కాదు.

కించి త్సత్త్వ రజోరూపం భోక్తృ సంజ్ఞక ముచ్యతే,
అత్యంత తామసోపాధి ర్భోజ్య మిత్యభిధీయతే॥ 38

ఇంచుకంత సత్త్వ రజోగుణ రూపమైన జీవచైతన్యమే భోక్త యనఁబడును. అత్యంత తామసోపాధి విశిష్టచైతన్యమే భోజ్య మనఁబడును.

పరతత్త్వ మయోపాధి ర్బ్రహ్మచైతన్య మీశ్వరః,
భోక్తా భోజ్యం ప్రేరయితా వస్తుత్రయ మిదం స్మృతమ్॥ 39

పరతత్త్వ స్వరూపమును శుద్ధ సత్త్వగుణ మనెడి యుపాధితోఁ గూడిన బ్రహ్మచైతన్యమగు పరమేశ్వరుఁడే ప్రేరకు డనఁబడును; గాన భోక్త, భోజ్యము, ప్రేరకుఁడు అను నిమ్మూడు నిట్లు చెప్పఁబడినవి.

అత్ర ప్రేరయితా శంభుః శుద్ధోపాధి ర్మహేశ్వరః,
స మిశ్రోపాధయః సర్వే భోక్తారః పశవః స్మృతాః॥ 40

ఇందు శుద్ధోపాధితోఁ గూడిన మహేశ్వరుఁడే ప్రేరకుఁడు (ఒక కార్యమును జేయ బురికొల్పువాఁడు). మిశ్రోపాధులతోఁ గూడిన (రజ స్తమ స్సంబంధము గల) భోక్తలు (జీవులు) పశువులు. (సంసార పాశముచేఁ గట్టువడువారు.)

భోజ్య మవ్యక్త మిత్యుక్తం శుద్ధ తామస రూపకం॥

శుద్ధ తామస రూపమైన యవ్యక్తమే (తాను స్ఫుటముగా నేర్పఱుపరానిది) ప్రకృతి యనఁబడును. అదియే భోజ్యము (అనుభవింపఁ బడునది).

అత్యంత గూఢ చైతన్యం జడ మవ్యక్త ముచ్యతే,
సర్వజ్ఞః ప్రేరకః శంభుః కించిద్జ్ఞో జీవ ఉచ్యతే॥ ౩౯

అనఁగా నీ యవ్యక్త మనునది (మాయ లేక ప్రకృతి) అత్యంత గూఢచైతన్యమై యుండును. ప్రేరకుఁడైన శంభుఁడు సర్వజ్ఞుఁడై యుండును. జీవుఁడు కించిద్జ్ఞుఁడై యుండును.

ఉపాధిః పునరాఖ్యాతః శుద్ధాశుద్ధ విభేదతః,
శుద్ధోపాధిః పరామాయా స్వాశ్రయాఽమోహకారిణీ॥ ౪౦

మును జెప్పిన మాయోపాధి శుద్ధమని, యశుద్ధమని రెండు విధములు. శుద్ధోపాధి స్వరూపమైన పరామాయ శివు నాశ్రయించియు నతనికి మోహాదులను గలుగనీయదు. ఇదే ఊర్ధ్వమాయ యనఁబడును.

అశుద్ధోపాధి రప్యేవ మవిద్యాశ్రయ మోహినీ,
అవిద్యాశక్తి భేదేన జీవా బహువిధాః స్మృతాః॥ ౪౧

అశుద్ధోపాధి రూపమైన యీ మాయ, అవిద్యారూపమై (అజ్ఞాన = అల్పజ్ఞాన) జీవుల నాశ్రయించి మోహమును (అజ్ఞానమును) గల్గించును. ఇదే అధోమాయ యనఁబడును = ప్రకృతి యనఁబడును. ఆ యవిద్యాశక్తి భేదముచేతనే జీవులనేక విధములుగా నగుచున్నారు.

మాయాశక్తి వశా దీశో నానా మూర్తిధరః ప్రభుః,
సర్వజ్ఞః సర్వకర్తా చ నిత్యముక్తో మహేశ్వరః॥ ౪౨

పరమేశ్వరుఁ డీ మాయాశక్తి యొక్క సంబంధముచేతఁ బలు విధములైన దివ్యమంగళ రూపములను దాల్చువాఁడై (కర్తు మకర్తు మన్యథా కర్తుం వా సమర్థః) స్వతంత్రుఁడై చేయుటకును జేయకుండుటకును జేసినదానిని మఱియొకవిధముగాఁ జేయుటకును జాలినవాఁడును, సర్వజ్ఞుడును, సర్వజగన్నిర్మాణ కారణభూతుఁడును, నెట్టి బంధము నెపుడును లేనివాఁడై యున్నాఁడు.

కించిత్కర్తా చ కించిద్జ్ఞో బద్ధోఽనాది శరీరవాన్,
అవిద్యా మోహితా జీవా బ్రహ్మైక్యజ్ఞాన వర్జితాః॥ ౪౩

ఇఁక జీవుఁడన్ననో కించిత్కర్తయు, కించిద్జ్ఞుఁడును, ఆణవాది మలపాశబద్ధుఁడునునై యనాదికాలమునుండి శరీరాభిమానము గల వాఁ డగుచున్నాఁడు. మఱియు నవిద్యచే మోహపెట్టఁబడినవాఁడై "అహం బ్రహ్మాస్మి" "నేను బ్రహ్మమనే" యనెడి సామరస్యజ్ఞానము లేనివాఁ డగుచున్నాఁడు.

పరిభ్రమన్తి సంసారే నిజకర్మానుసారతః,
దేవ తిర్యఙ్మనుష్యాది నానాయోని విభేదతః॥ ౭౭

చక్రనేమి క్రమేణైవ భ్రమన్తి హి శరీరిణః,
జాత్యాయు ర్భోగవైషమ్య కారణం కర్మ కేవలమ్॥ ౭౫

జీవులు తమ తమ కర్మములనుబట్టి దేవతలు, మనుష్యులు, పసులు, పక్షులు మున్నగు ౮౪ లక్షల జీవరాశి యోనులందుఁ బుట్టుచు బండి యుండ కమ్మి క్రిందికి వచ్చుచు మీదికిఁ బోవుచుండునటులు సంసారమందుఁ బరిభ్రమించుచున్నారు.

జాతి, ఆయువు, సుఖము, దుఃఖము మున్నగు వానియందు జీవు లకుఁ గల్గు హెచ్చుతగ్గులకు వారి వారి కర్మఫలములే కారణములు. బ్రాహ్మణాది జాతులు జన్మసిద్ధములనియే భగవత్పాదుల యభిప్రా యము. "సతి మూలే తద్విపాకో జాత్యాయుర్భోగాః" అనెడి పతంజలి యోగసూత్రము దీనినే స్థిరపఱచుచున్నది.

ఏతేషాం దేహినాం సాక్షీ ప్రేరకః పరమేశ్వరః,
సంసారే భ్రమతాం నిత్యం కర్మయన్త్ర నియన్త్రణే॥ ౭౬

ఈ కర్మయంత్రముచేఁ ద్రిప్పఁబడుచున్న సంసారమందుఁ బరిభ్ర మించు జీవులకుఁ బరమేశ్వరుఁడు ప్రేరకుఁడగుటేకాక తాను సాక్షియు నగుచున్నాఁడు.

దేహినాం ప్రేరకః శంభు ర్హితమార్గోపదేశికః,
పునరావృత్తి రహిత మోక్షమార్గోపదేశికః॥ ౭౭

ప్రేరకుఁడైన పరమేశ్వరుఁడు జీవులకు మేలుదారి చూపువాఁ డును, మఱి పుట్టుక లేకుంట యనెడి ముక్తిమార్గమును జూపువాఁడు నగుచున్నాఁడు.

స్వకర్మ పరిపాకేన ప్రక్షీణ మలవాసనః,
శివప్రసాదాత్ జీవోఽయం జాయతే శుద్ధమానసః॥　　౪౮

దయాసముద్రుఁడైన శివుని కరుణచేతను, దన కర్మ పరిపాకము చేతను, అనాదులైన ఆణవాది మలములు తొలఁగినవాఁడై యీ జీవుఁడు శుద్ధమనస్కుఁ డగును.

శుద్ధాంతః కరణే జీవే శుద్ధకర్మ విపాకతః,
జాయతే శివకారుణ్యాత్ ప్రస్ఫుటా భక్తిరైశ్వరీ,
జన్తు రంత్య శరీరోఽసౌ పిండ శబ్దాభిధేయకః॥　　౪౯

శుద్ధకర్మ పరిపాకముచే జీవుఁడు శుద్ధాన్తఃకరణుఁడు కాఁగా శివుని కరుణ గలిగి, వానియం దీశ్వరభక్తి సువ్యక్తమగును. దానిచే నదియే తుది పుట్టువుగాఁ గలవాఁడై 'పిండ' నామముచే వ్యవహారింపఁ బడును.

## 2. పిండ జ్ఞాన స్థలము,

శరీరాత్మ వివేకేన పిండజ్ఞానీ స ఉచ్యతే,
శరీరమేవ చార్వాకై రాత్మేతి పరికీర్త్యతే॥　　౫౦

తప్పక శీర్ణము కాఁదగిన శరీరము వేఱు, ఎన్నఁడును శీర్ణముకాని ఆత్మ వేఱు అనెడి జ్ఞానము గలవాఁడగుటచే జీవుఁ డిపుడు 'పిండజ్ఞాని' యనఁబడుచున్నాఁడు.

ఈ శరీరమే యాత్మ యను తప్పు తెలివి గలవారలే 'నావి' యను మమకారముతో ధన, దార, క్షేత్రాదుల పెంపునందు ఆనందమును, వాని నష్టమందు దుఃఖమును జెందుచుందురు. అట్టి యల్పజ్ఞానులే చార్వాకులు.

ఇల్లు పొలము మొదలయినవానికి, ఇది పశువు, ఇది పక్షి యను జ్ఞానమెటులు లేదో, యటులే యీ చార్వాకులును శరీరాత్మల భేద మెఱుంగక, శరీరమే యాత్మ యనుచుందురు.

ఇంద్రియాణాం తథాత్మత్వ మపరైః పరిభాష్యతే,
బుద్ధి తత్త్వగతై ర్బౌద్ధై ర్బుద్ధి రాత్మేతి గీయతే॥　　౫౧

ఇంద్రియములే యాత్మ యని కొంద ఱందురు. ఇఁక బౌద్ధులు [illegible] జ్ఞానేంద్రియములు జడములయి బుద్ధి కధీనములు కావున బుద్ధియే యాత్మ యందురు.

నేంద్రియాణాం న దేహస్య న బుద్ధే రాత్మనా భవేత్,
అహం ప్రత్యయ వేద్యత్వా దనుభూత స్మృతే రపి॥ ౫౨

నేను బలిసితిని; నేను చిక్కిపోతిని; నేను సుఖిని; నేను దుఃఖిని, [illegible] నేను చిన్నను; ఇపుడు పడుచువాడను; ఇపుడు ముసలివాడను [illegible] ప్రత్యయము సామాన్యముగా నందఱియందు గానఁబడుచున్నం [illegible]ము ఆత్మ కాదు; నాబుద్ధి, నాఆత్మ యనుటచేత నేను వేఱు; [illegible] దేహేంద్రియాదులు నాకంటె వేఱు; అని తెలుచున్నది. ఏది మాఱినను 'నే' నన్నవాఁ డటులే యున్నాఁడు.

శరీరేంద్రియ బుద్ధిభ్యో వ్యతిరిక్తః సనాతనః,
ఆత్మేతి వివేకీ యః పిండ జ్ఞానీ స కథ్యతే॥ ౫౩

కావున 'నేను' అనుదానికి విషయమైనవాఁడు శరీరేంద్రియ [illegible] కంటె వేఱయినవాఁడు, అనాదిసిద్ధుఁడైన ఆత్ముఁడు అనెడి వివేకము [illegible]నవాఁడు 'పిండజ్ఞాని' నాఁబడును.

[illegible]ని శరీరాణి నానారూపాణి కర్మణా,
ఆ[illegible]తో నిత్య ఏవాసావితి జంతో ర్వివేకితా॥ ౫౪

వివేకమనఁగా, పూర్వకర్మానుసారముగా నానా యోనులందుఁ బుట్టి నానా రూపములను బొందు శరీరములు నాశనము గలవియే; ఆ శరీరము నాశ్రయించిన యాత్మ మాత్రము 'నాశము లేనిది, నిత్యము' నను తెలివియే.

శరీరా త్పృథ గాత్మాన మాత్మనః పృథగీశ్వరః,
ప్రేరకం యో విజానాతి పిండజ్ఞానీ స కథ్యతే॥ ౫౫

శరీరముకంటె ఆత్మ వేఱనియు, ఆత్మకంటెను ప్రేరకుఁడైన [illegible] వేఱనియుఁ దెలిసికొనువాఁడే పిండజ్ఞాని యనఁబడును. [illegible] జీవాత్మ పరమాత్మల భేదము నెఱిఁగినవాఁడే పిండజ్ఞాని.

## 3. సంసార హేయ స్థలము

నిరస్త హృత్కళంకస్య నిత్యానిత్య వివేకినః,
సంసారహేయతా బుద్ధి ర్జాయతే వాసనా బలాత్॥ ౫౮

అనేక జన్మార్జిత పుణ్యవిశేష బలముచేత మనస్సు నంటిన మాలిన్యములన్నియుఁ దొలఁగి, 'ఆత్మ నిత్యము, శరీర మనిత్యము' అనెడి నిశ్చయజ్ఞానము గలిగినవానికి సంసారమందు ఏవగలుగును.

ఐహికే క్షణికే సౌఖ్యే పుత్రదారాది సంభవే,
క్షయిత్వాది యుతే స్వర్గే కస్య వాంఛా వివేకినః॥ ౫౯

ఆలు బిడ్డలు మున్నగువారి వలనఁ గలుగు సుఖము మఱుఁగడియ యందుండునది కాదనియు, "క్షీణే పుణ్యే మర్త్యలోకం విశన్తి" యను గీతాప్రమాణమును బట్టి, పుణ్యాధిక్యముచేఁ గలుగు స్వర్గసౌఖ్యము కూడ తుచ్ఛమే (అశాశ్వతమే) యని తెలియు వివేకికి మఱల వాని యందుఁ గోరిక గలుగునా? కలుగదనుట.

జాతస్య హి ధ్రువో మృత్యు ర్ధ్రువం జన్మ మృతస్య చ,
జంతు ర్మరణ జన్మభ్యాం పరిభ్రమతి చక్రవత్॥ ౬౦

పుట్టినవాఁడు చావక తప్పదు. చచ్చినవాఁడు మఱలఁ బుట్టక తీరదు. ఇటులు శరీరి జనన మరణములతోఁ జక్రమువలెఁ దిరుగును.

మత్స్య కూర్మ వరాహాంగై ర్నృసింహ మనుజాదిభిః,
జాతేన నిధనం ప్రాప్తం విష్ణునాపి మహాత్మనా॥ ౬౧

మత్స్య, కూర్మ, వరాహ, నారసింహ, రామ, కృష్ణాదులగు రూపులనందిన మహాత్ముఁడు విష్ణునకును బుట్టుటచేఁ జావు తప్పదయ్యెను.

భూత్వా కర్మవశాజ్జన్తు ర్బ్రాహ్మణాదిషు జాతిషు,
తాపత్రయ మహావహ్నౌ సంతాపా ద్దహ్యతే భృశమ్॥ ౬౨

కావున జన్మమైన వాఁడు కర్మఫలరూపముగాఁ గలిగిన బ్రాహ్మణ క్షత్రియాది జాతులందుఁ బుట్టి, ఆధ్యాత్మి, కాధిభౌతి, కాధి దైవిక తాపము లనెడి యగ్గిచే మిగులఁ గాల్పఁబడుచున్నాఁడు.

కర్మమూలేన దుఃఖేన పీడ్యమానస్య దేహినః,
ఆధ్యాత్మికాదినా నిత్యం కుత్ర విశ్రాంతి రాప్యతే॥ ౯౧

తొంటి కర్మమే మూలకారణముగాఁ గలుగు నాధ్యాత్మికాది దుఃఖములచేఁ బీడింపఁబడువానికి విశ్రాంతి యెచ్చటను గల్గదు.

ఆధ్యాత్మికం తు ప్రథమం ద్వితీయం చాధిభౌతికం,
ఆధిదైవిక మన్యచ్చ దుఃఖత్రయ మిదం స్మృతమ్॥ ౯౨

ఈ దుఃఖములందు మొదటిది ఆధ్యాత్మికము, రెండవది ఆధిభౌతికము, మూడవది ఆధిదైవికము.

ఆధ్యాత్మికం ద్విధా ప్రోక్తం బాహ్యాభ్యంతర భేదతః,
వాతపిత్తాదిజం దుఃఖం బాహ్య మాధ్యాత్మికం మతం,
రాగద్వేషాది సంపన్న మాంతరం పరికీర్త్యతే॥ ౯౩

ఆధ్యాత్మికము రెండువిధములు. మొదటిది బాహ్యము. ఇదే వాత, పిత్త, శ్లేష్మాది దోషములచే శరీరమున గలుగునది. రెండవది కామక్రోధ రాగాదులచే మనస్సునకు గలుగునది. మొదటిది బాహ్యము. రెండవది మాభ్యంతరము. ఆత్మ శబ్దమునకు శరీరము, మనస్సు అని యర్థములు కావున నీవిభాగము.

ఆధిభౌతిక మేతద్ధి దుఃఖం రాజాది భూతజం,
ఆధిదైవిక మాఖ్యాతం గ్రహ యక్షాది సంభవమ్॥ ౯౪

రాజు మున్నగువారిచే నగునది యాధిభౌతిక దుఃఖము. ఆధిదైవికము గ్రహ, పిశాచ, యక్షాదులచే గలుగు దుఃఖము.

దుఃఖై రేతై రుపేతస్య కర్మ బద్ధస్య దేహినః,
స్వర్గే వా యది వా భూమౌ సుఖలేశో న విద్యతే॥ ౯౫

ఇట్టి దుఃఖములచే వేగుచుఁ దన కర్మముచేఁ గట్టఁబడిన దేహికి స్వర్గమందును సుఖ మింత లేదు. భూమియందును సుఖ మింత లేదు.

తటిత్సు కేలి మాలాసు ప్రదీపస్య ప్రభాసు చ,
సంపత్సు కర్మమూలాసు కస్య వా స్థిరతా మతిః॥ ౯౬

కావున వివేకియైనవాఁడు మెఱపులను, తరగలను, దీపకాంతులను, కర్మమూలకమగు సంపదలను స్థిరములని యెన్నఁడును దలంపఁడు.

మలకోశే శరీరేఽస్మిన్ మహాదుఃఖ వివర్ధనే,
తడిదంకురసంకాశే కో వా మోదేత పండితః॥ ౬౭

గొప్ప దుఃఖములను బెంపొందించునదియు, మెఱుపుఁ గొనవలె క్షణికమైనదియు, సమస్తమాలిన్యములు నిలుచు చోటైనదియు నగు నీశరీరమునం దభిమానముంచి పండితుఁ డెవ్వఁడును సంతోషింపఁడు.

నిత్యానంద చిదాకార మాత్మతత్త్వం విహాయ కః,
వివేకీ రమతే దేహే నశ్వరే దుఃఖభాజనే॥ ౬౮

సచ్చిదానంద స్వరూపమైన యాత్మతత్త్వమును వీడి క్షణభంగురమును, దుఃఖస్థానమునైన శరీర విషయమున వివేకి యెన్నఁడును బ్రీతి నొందఁడు.

వివేకీ శుద్ధహృదయో నిశ్చితాత్మ సుఖోదయః,
దుఃఖహేతౌ శరీరేఽస్మిన్ కలత్రేషు సుతేషు చ॥ ౬౯

సుహృత్సు బంధువర్గేషు ధనేషు కులపద్ధతౌ,
అనిత్యబుద్ధ్యా సర్వత్ర వైరాగ్యం పరమశ్నుతే॥ ౭౦

శ్రవణముచేతను, గురూపదేశముచేతను, స్వానుభవముచేతను, గడించిన జ్ఞానము గలిగి, నిశ్చితమైన యాత్మజ్ఞానముచే నిర్మలచిత్తుఁడైన వివేకి, దుఃఖహేతువై క్షణభంగురమైన శరీరమందును, ఋణానుబంధరూపులై స్వార్థపరులగు నాలుబిడ్డలందును, దాత్కాలిక సుఖకారకులగు మిత్ర బంధువు లందును, పాదధూళులవంటి ధనములందును, జ్ఞానమునకుఁ గారణముకాని కులపద్ధతి యందును, నివియెల్ల శాశ్వతములు కావనెడి నిశ్చయముతో వానియెడ వైరాగ్యమునే యవలంబించును.

వివేకినో విరక్తస్య విషయే స్వాత్మ రాగిణః,
సంసార దుఃఖ విచ్ఛేద హేతౌ బుద్ధిః ప్రవర్తతే॥ ౭౧

ఇంద్రియ విషయము లందును, సాంసారిక విషయము లందును, విరాగమును (ఆస లేమిని) పరమాత్మయందే ప్రీతియు గల వివేకికి ఈ సంసార దుఃఖమును దొలఁగించుకొనుట యెట్లనెడి బుద్ధి పుట్టును.

నిత్యానిత్య వివేకినః సుకృతినః శుద్ధాశయ స్యాత్మనో
బ్రహ్మోపేంద్ర మహేంద్ర ముఖ్యవిభవే ష్వస్థాయితాం పశ్యతః,
నిత్యానందపరే నిరాకృత జగత్సంసార దుఃఖోదయే
సాంబే చంద్ర శిరోమణౌ సముదయే ద్భక్తి ర్భవధ్వంసినీ॥ ౭౨

నిత్య మిది, యనిత్య మిది యను వివేకము గలిగి, శాస్త్రోక్త సత్కర్మములనే చేయు నాసక్తి గలిగి, నిర్మలమైన యంతఃకరణము గలిగి, బ్రహ్మ, విష్ణు, దేవనాథాదుల సంపదలును ననిత్యములే యనెడి తెలివిగలిగి, పుణ్యవంతుఁడైన పిండజ్ఞానికి, నిత్యానంద మయుఁడును, చంద్రశేఖరుఁడును, ముక్తిప్రదుఁడును, సర్వశక్తిమంతుఁడునగు పరశివు నందు భక్తి పొడముచుకొని వచ్చును.

ఇది
సిద్ధాన్త శిఖామణి యందలి భక్తస్థలమందు
పిండాది స్థలత్రయ ప్రసంగ మనెడి
అయిదవ పరిచ్ఛేదము.
శ్రీ శివార్పణము.

ఓం ఈం నమః

ఓం నమః శివాయ

శ్రీ జగద్గురు రేణుకాచార్యాః ప్రసీదంతు

# ఆ ర వ ప రి చ్ఛే ద ము

## 4. గురు కారుణ్య స్థలము

తతో వివేక సంపన్నో విరాగీ శుద్ధమానసః,
జిజ్ఞాసుః సర్వసంసార దోష ధ్వంసకరం శివమ్॥ ౧

ఉపైతి లోకవిఖ్యాతం లోభమోహ వివర్జితం,
ఆత్మ తత్త్వ విచారజ్ఞం విముక్త విషయ భ్రమమ్॥ ౨

శివ సిద్ధాన్త తత్త్వజ్ఞం ఛిన్న సందేహ విభ్రమం,
సర్వతంత్ర ప్రయోగజ్ఞం ధార్మికం సత్యవాదినమ్॥ ౩

కులక్రమాగతాచారం కుమార్గాచార వర్జితం,
శివధ్యాన పరం శాన్తం శివతత్త్వ వివేకినమ్॥ ౪

భస్మోద్ధూలన నిష్ణాతం భస్మతత్త్వ వివేకినం,
త్రిపుండ్ర ధారణోత్కంఠం ధృత రుద్రాక్ష మాలికమ్॥ ౫

లింగధారణ సంయుక్తం లింగపూజా పరాయణం,
లింగాంగ స్థల భేదజ్ఞం శ్రీగురుం శివవాదినమ్॥ ౬

సంసారమందు విరాగము గలిగి, నిర్మలాంతః కరణుఁడై, ఆత్మానాత్మ వివేకియైన సాధకుఁడు సర్వసంసార దోషములఁ బోగొట్టు మహాలింగ స్వరూపుఁడైన పరశివుఁ దెలియవలయునని కోరికపుట్టి,

జగద్విఖ్యాతుఁడును, లోభ మోహాదులు లేనివాఁడును, జీవాత్మ పరమాత్మల స్వరూపము నెఱింగినవాఁడును, ఇంద్రియ కార్యముల వలని భ్రమము వీడినవాఁడును, శివాద్వైత సిద్ధాన్త జ్ఞానము గలవాఁడును, పలుసంశయములచే నగు భ్రమము తొలఁగిన వాఁడును, సర్వతంత్రముల ప్రయోగము నెఱింగినవాఁడును, శివధర్మ నిష్ఠుఁడును, సత్యవాదియు, వంశానుక్రమముగా వచ్చు శిష్టాచారము గలవాఁడును,

[illegible]వ్యాపారములు లేనివాఁడును, శివధ్యానాసక్తుఁడును, శాంతుఁడును, శివస్వరూప జ్ఞానియు, భస్మలేపన క్రియయందు దాఁటి తేలినవాఁడును, శివస్వరూపము నెఱింగినవాఁడును, భస్మత్రిపుండ్రధారణ మొనరించువాఁడును, రుద్రాక్షమాలలఁ దాల్చువాఁడును, లింగధారణముచేత పవిత్రుఁడును, శివలింగపూజ మాననివాఁడును, శివజీవుల యైక్యము నెఱింగినవాఁడును, శివాద్వైతవాసన స్థిరపడినవాఁడును, అంగస్థల లింగస్థల రూపమైన నూటునొక్క భేదముల నెఱింగినవాఁడును, సదా పరశివుని గూర్చిన మంగళవాక్యములే పలుకువాఁడును నైన శ్రీగురువునే యాశ్రయించి దానిలాభము నొందఁగలఁడు.

సేవేత పరమాచార్యం శిష్యో భక్తి భయాన్వితః,
షణ్మాసాన్ వత్సరం వాపి యావదేష ప్రసీదతి॥ ౭

ఇట్టి లక్షణములు గల శ్రేష్ఠగురువును శిష్యుఁడు ఆఱు నెలలు కాని, ఒక యేఁడు కాని గురుఁడు ప్రసన్నుఁడగు దనుక భయభక్తులతో సేవింపవలయును.

ప్రసన్నం పరమాచార్యం భుక్తి ముక్తి ప్రదాయకం,
ప్రార్థయేత్ పురతః శిష్యః ప్రాంజలి ర్వినయాన్వితః॥ ౮

ప్రసన్నుఁడును, భుక్తి ముక్తులకు దారి చూపువాఁడును నైన ఆ పరమ గురువు నెదుటఁ జేతులు జోడించి, నిలిచి, యడఁకువతో [illegible] వేఁడుకొనవలయును.

శ్రీ కల్యాణ మహాభాగ శివజ్ఞాన మహోదధే,
ఆచార్యవర్య సంప్రాప్తం రక్ష మాం భవరోగిణమ్॥ ౯

ఓ మంగళమూర్తి! మహాభాగ! శివజ్ఞాన సముద్ర! గురువర్య! సంసార మనెడి వ్యాధిచే బాధింపఁబడుచు నిన్నుఁ జేరిన నన్ను రక్షింపుము.

ఇత్యనేన శిష్యేణ ప్రార్థితః పరమో గురుః,
శక్తిపాతం సమాలోక్య దీక్షయా యోజయేదముమ్॥ ౧౦

ఇటులు శిష్యుఁడు పరమ గురువును వేడుకొనఁగా ఆతఁడును శక్తిపాత మగునట్లుగా శిష్యుని జూచి (తనలో నిమిడియున్న శివ జ్ఞాన శక్తి శిష్యునందుఁ బ్రసరించునట్లు చేసి) యపుడు దీక్షతో వాని ననుగ్రహింప వలయును.

మృగేంద్రాగమమునం దిటులున్నది:– "యేషాం శరీరిణాం శక్తిః పతత్యఘనివృత్తయే, తేషాం తల్లింగ మౌత్సుక్యం ముక్తౌ ద్వేషో భవ స్థితౌ, భక్తిశ్చ శివ భక్తేషు శ్రద్ధా తచ్ఛాసకే విధౌ॥" సంసారులైన జీవులకు దుఃఖ మయ సంసార మార్గమందు మఱలఁ జొచ్చుట తప్పి దానిచోట శివశక్తి ప్రాప్తి యగుటే శక్తి పాతము. కంటికి కగపడని యీ శక్తిపాతము శిష్యునం దీక్రింది లక్షణములచేఁ గనుఁగొన నగును. మోక్ష మార్గమునం దాసక్తి, సంసారమందు విరక్తి, శివ భక్తులందు భక్తి, శివ శాస్త్రమందు రక్తి, యనునవే శక్తిపాత లక్షణములు. శ్రీ గురువు శిష్యునం దిట్టి లక్షణములు కనిపెట్టి శివదీక్ష నీయ వలయును.

దీయతే చ శివజ్ఞానం క్షీయతే పాశ బంధనం,
యస్మా దతః సమాఖ్యాతా దీక్షేతీయం విచక్షణైః. ౧౧

దేనివలన శివజ్ఞానము పాదుకొని కర్మపాశ బంధము క్షయించునో యదియె దీక్షయని పండితు లందురు.

సా దీక్షా త్రివిధా ప్రోక్తా శివాగమ విశారదైః,
వేధా రూపా క్రియా రూపా మంత్ర రూపా చ తాపరః॥ ౧౨

ఓ మహర్షీ! ఆ దీక్ష వేధా దీక్ష, క్రియాదీక్ష, మంత్రదీక్ష యని ముత్తెఱంగులు గలదిగాఁ బండితు లనిరి.

గురో రాలోక మాత్రేణ హస్త మస్తక యోగతః,
యః శివత్వ సమావేశో వేధా దీక్షేతి సా మతా॥ ౧౩

శ్రీ గురుని కృపాదృష్టి మాత్రమునను, హస్త మస్తక సంయోగ మాత్రమునను (శిష్యుని తలపై గురుఁడు తన చేతి నుంచుట) జ్ఞాన క్రియా రూపమైన శివతత్త్వ సమావేశము కలుగునో అదియే వేధా దీక్ష యనఁబడును.

మంత్ర దీక్షేతి సా ప్రోక్తా మంత్ర మాత్రోపదేశినీ,
కుండ మండలికోపేతా క్రియాదీక్షా క్రియోత్తరా॥ ౧౪

శివపంచాక్షరీ మంత్రోపదేశము చేయుటయే మంత్రదీక్ష. హోమకుండము, స్వస్తికమండలము, పంచకలశములు మున్నగు పరికరములతో దీక్షకంగములైన క్రియలతోఁ గూడినదే క్రియాదీక్ష.

శుభమాసే శుభతిథౌ శుభకాలే శుభేఽహని
విభూతిం శివభక్తేభ్యో దత్త్వా తాంబూలపూర్వకమ్ ॥ ౧౫
యథావిధి యథాయోగం శిష్యమానీయ దేశికః,
స్నాతం శుక్లాంబరధరం దంతధావన పూర్వకమ్ ॥ ౧౬
మండలే స్థాపయే చ్ఛిష్యం ప్రాఙ్ముఖం త ముదఙ్ముఖః,
శివస్య నామ సంకీర్తిం చింతామపి చ కారయేత్॥ ౧౭

శుభమాసము, శుభతిథి, శుభవారము, శుభవేళ చూచి, శివభక్తులకు విభూతిసహితముగాఁ దాంబూలము నర్పించి, విధ్యుక్తముగా దంతధావన స్నానాదులను జరిపించి శుభ్రవస్త్రములను దాల్పఁజేసి శ్రీగురుఁడు శిష్యునిఁ దన చెంతకు రావించి, స్వస్తికమండలమందుఁ దూర్పుమొగముగాఁ గూర్చుండఁ జేసి, తా నుత్తర ముఖముగాఁ గూర్చుండి శిష్యునిచే శివనామసంకీర్తనమును, శివధ్యానమును జేయింపవలయును.

విభూతి పట్టం కృత్వాగ్రే యథాస్థానం యథావిధి,
పంచబ్రహ్మ మయై స్తత్ర స్థాపితైః కలశోదకైః,
ఆచార్యః సమమృత్విగ్భి స్త్రివార మభిషేచయేత్ ॥ ౧౮
అభిషిచ్య గురుః శిష్యమాసీనం పురతః శుచిం,
తతః పంచాక్షరీం శైవీం సంసారభయ వారిణీమ్॥ ౧౯
తస్య దక్షిణకర్ణేతు నిగూఢ మపి కీర్తయేత్,
ఛందోరూప మృషిం చాస్య దేవతాం న్యాస పద్ధతిమ్ ॥ ౨౦

శరీరమందు భస్మధారణమునకు నిర్దిష్టమైన స్థలములందెల్ల విధి ననుసరించి విభూతిని ధరింపఁజేసి, 'సద్యోజాత', 'వామదేవ', 'అఘోర'

'తత్పురుష', 'ఈశాన' నామకములగు పంచబ్రహ్మరూప కలశములను నిలిపి, వానియందలి పవిత్రోదకములతో శ్రీ గురుడు సర్వజగత్ప్రసిద్ధులైన శ్రీజగద్గురు పంచాచార్యుల సంప్రదాయము ననుసరించు నల్వురు ఋత్విక్కులచే శిష్యునకు మహాభిషేకము చేయింపవలయును. ఇటు లభిషిక్తుఁడై పవిత్రుఁడైన శిష్యు నెదుర నుంచుకొని శ్రీగురుఁడు సంసారభయమును దొలఁచు శ్రీ శివపంచాక్షర మహామంత్రమును ఆతని కుడిచెవియందు దక్షిణరహస్యముగ నుపదేశించి, యా మంత్రస్వరూపమును, ఋషి, ఛందస్సు, బీజ, శక్తి, కీలకములను మంత్రార్థజ్ఞానముతో దాని నంగమునందు న్యసించుకొనుట మున్నగు ప్రకారములను జక్కఁగా బోధింపవలయును.

" శ్రీ పంచాచార్య మధ్యేతు యః పీఠ మధిరోహతి,
తథాఽసౌ గురుశబ్దేన వాచ్య ఇత్యభిధీయతే ॥
శేషా శ్చత్వార ఆచార్యా ఉపదేశస్య సాక్షిణః,
ఈశ్వరస్య ముఖాన్యేవ కలశా హి న సంశయః ॥
ఏతా దృక్కలశా న్పంచ నవసూత్రేణ వేష్టయేత్,
ప్రత్యేకం నవవస్త్రేణ వేష్టయే ద్దేశికోత్తమః ॥
గంగాది సర్వతీర్థానా మంభసా పరిపూరయేత్,
సంపూజ్య పంచకలశా 'నిమంమే' ఇతి మంత్రతః॥
తేషు తీర్థాభి పూర్ణేషు సన్నిధా యామ్రపల్లవాన్,
నానావిధై శ్చ కుసుమై ర్గంధ పత్రాక్షతాదిభిః॥
ఏవం శాస్త్రోక్త విధినా కలశా న్పంచ పూజయేత్,
శిష్యలింగ గురూణాం చ కలశానాం తథైవచ॥
ఏకసూత్రం వేష్టయిత్వా శిష్యస్యాభిముఖో గురుః,
శుద్ధిం కృత్వా పంచగవ్యైర్లింగం శిష్యకరా తథా॥
లింగం తథార్చయే ద్ధీమా నేకవింశతి పూజనైః,
మస్తకే సప్తపూజాశ్చ కృత్వా హస్తం తథార్చయేత్॥

సంస్కారాన్విధివత్కృత్వా చతుర్భిస్తైశ్చ సంయుతః,
పంచాక్షరీ మంత్రరాజ ముపదిశ్య యథావిధి,
శివలింగం ధారయిత్వా శివతత్త్వం సమాదిశేత్ ॥''

''శ్రీమజ్జగద్గురు పంచాచార్యులందుఁ బ్రధానపీఠము నలంకరించు నతఁడే గురుపదముచేఁ జెప్పఁదగినవాఁడు. తక్కు నలువురును సాక్షీభూతులు. మండలమం దుంచఁబడిన పంచకలశములును బరమేశ్వరుని పంచ ముఖములే. గురుఁడు పంచకలశములను గ్రొత్తదారముతోఁ గలియఁజుట్టి గంగా గోదావర్యాది పావనోదకములతో 'ఇమం మే వరుణ' యనెడి మంత్రమును బఠించుచు నింపి, వాని యందు మామిడి చివుళ్లు నునిచి, వానిని బలు తెగల పూవులతోను, గంధ పత్రాక్షతాదులతోను బూజించి, శిష్యునకును, లింగమునకును, గురువునకును ఒక్క సూత్రముతోనే చుట్టి, గురుఁడు శిష్యున కెదురుగాఁ గూర్చుండి, శిష్యుని చేతులను, లింగమును, గవ్యపంచకముతో శోధించి, లింగము నిరువదియొక్క యుపచారములతోఁ బూజింపవలయును పిమ్మట శిష్యుని హస్తమస్తకకములను బూజించి, నల్వురాచార్యులతోఁ గూడి సర్వసంస్కారములను జేసి, యథావిధిగాఁ బంచాక్షర మహామంత్రము నుపదేశించి, శివలింగమును శిష్య దేహమున ధరింపఁజేసి, శివతత్త్వమును బోధింపవలయు'' అని పాశుపతతంత్రమునందుఁ జెప్పఁబడినది. ఇటులు శ్రీగురుఁడు శిష్యునకుఁ మోక్షదాయక శివదీక్ష నొసంగవలయును.

## 5. లింగ ధారణ స్థలము.

స్ఫాటికం శైలజం వాపి చంద్రకాంతమయం తు వా,
బాణం వా సూర్యకాంతం వా లింగమేకం సమాహరేత్ ॥ ౨౧

సర్వలక్షణ సంపన్నే తస్మిన్ లింగే విశోధితే,
పీఠస్థితేఽభిషిక్తే చ గంధపుష్పాది పూజితే॥ ౨౨

మంత్రపూతే కలాం శైవీం యోజయే ద్విధినాగురుః,
శిష్యస్య ప్రాణమాదాయ లింగే తత్ర నిధాపయేత్ ॥ ౨౩

తల్లింగం తస్య తు ప్రాణే స్థాపయే దేక భావతః,
ఏవంకృత్వా గురుర్లింగం శిష్యహస్తే నిధాపయేత్ ॥ ౨౪

అటుపై నాచార్యుఁడు శిష్యునికై స్ఫాటికలింగమో, శ్రీశైల లింగమో, చంద్రకాంతలింగమో, సూర్యకాంతశిలాలింగమో నర్మదానది నుండి సంగ్రహించిన బాణలింగమో యొకటి తేవలయును. శాస్త్రోక్తమైన సర్వలక్షణములు గలదియు, జలాధివాసము, ధాన్యాధివాసము, శయనాధివాసము, అష్టత్రింశత్కళాన్యాసము, షడధ్వసిద్ధి మున్నగు సంస్కారములచే సంశోధింపఁబడి, పంచామృతముచే నభిషేకింపఁబడి, గంధ పత్ర పుష్ప తాంబూలాదులచేఁ బూజింపఁబడి, శివపంచాక్షరీ మంత్రపూతమై, కరపీఠమం దుంచఁబడిన యా శివలింగమునందు శ్రీ గురువు శిష్యుని మస్తకమందలి శివకళతో శాస్త్రోక్తముగాఁ గూర్పవలయును.

ఆ విధి ముగియఁగా శ్రీ గురువు శిష్యుని మస్తకమునందుఁ బంచదళచక్రమును రచించి, పైనుదళములందును నకారాది పంచ బీజాక్షరములను, నడుమ ఓంకారమును వ్రాసి, "నిత్యానంద స్వరూపాం నిరుపమ విభవాం నిష్కళాం నిర్విశేషాం । నిర్వ్యాజే నోర్ధ్వమాయా విరచిత వపుషీం విశ్వవంద్యాం పరాం తామ్ । ఆధారా మాదిశక్తిం గుణగణనమితాం దేవదేవీం శివాఖ్యాం । వందే హృత్పద్మపీఠే పరమ శివ పదాం శ్రీమతీ మూర్ధ్వ సంజ్ఞామ్ ॥" చరాచర ప్రపంచ తేజోరూపమైన, పరాశక్తియైన యిట్టి శివకళను ధ్యానించి, యా చక్రమును గంధ పుష్పాక్షతాదులతోఁ బూజించి, 'క్రోం' అను బీజము నుచ్చరించుచు, అంకుశముద్రతో నాకర్షించి, యావాహనము చేసి, స్థాపించి, పూజించి, శిష్యుని ప్రాణశక్తిని సర్వసంస్కారములు చేయఁబడిన శివలింగముతోఁ గూర్పవలయును. అటులే యా శిష్యుని ప్రాణకళయందు శివలింగము నేకాకారముతోఁ గూర్పవలయును.

ఆచార్యుఁ డీవిధముగా శివకళా, జీవకళా సామరస్యము గలిగించి, శివలింగమును శిష్యుని చేత నుంచి క్రిందఁ జెప్పినటు లాజ్ఞాపింపవలయును.

ప్రాణవ ద్ధారణీయం తత్ ప్రాణలింగ మిదం తవ,
కదాచిత్ కుత్రచి ద్వాపి న వియోజయ దేహతః॥ —౧౫

యది ప్రమాదాత్పతితే లింగే దేహాన్మహీతలే,
ప్రాణాన్విముంచ సహసా ప్రాప్తయే మోక్షసంపదః॥ ౨౮

ఇతి సంబోధితః శిష్యో గురుణా శాస్త్రవేదినా,
ధారయే చ్ఛాంకరం లింగం శరీరే ప్రాణయోగతః॥ ౨౭

ఓయీ శిష్యుఁడా! ఈ శివలింగమును నీ ప్రాణలింగముగాఁ నెఱుంగుము. దీనిని నీ ప్రాణమువలెనే ధరించుకొనుము. సర్వకాల సర్వావస్థలయందును నిది నీశరీరము నంటియే యుండవలయును. వీడరాదు సుమా. ఎప్పుడైన బొరపాటున నీదేహమునుండి నేలఁ బడెనేని వెంటనే ప్రాణములను వీడుము.

శాస్త్రజ్ఞుఁడైన గురునిచే నిటులు తెల్పఁబడిన శిష్యుఁడు తన కంఠమున ప్రాణ ముండువఱకును నిరుపమభక్తితో శరీరమునందా శివ లింగమును ధరించియే యుండవలయును.

లింగస్య ధారణం పుణ్యం సర్వపాప ప్రణాశనం,
ఆదృతం మునిభిః సర్వై ర్యోగమార్గ విశారదైః॥ ౨౮

శరీరమున నెల్లపుడును శివలింగమును దాల్చుట పుణ్యప్రదము, పాపహరము నగునని యోగమార్గవేదులైన మునులెల్లరు నీ శివలింగ మును ధరించిరి.

లింగధారణ మాఖ్యాతం ద్విధా సర్వార్థ సాధకం,
బాహ్య మాభ్యంతరం చేతి మునిభి ర్మోక్షకాంక్షిభిః॥ ౨౯

మోక్షాపేక్షగల మహామునులు ధర్మార్థకామమోక్షము లనెడి పురుషార్థముల నిచ్చు నీ లింగధారణము బాహ్యము, అంతరము నని రెండు తెఱఁగులుగాఁ జెప్పిరి.

చిద్రూపం పరమం లింగం శాంకరం సర్వకారణం,
య త్తస్య ధారణం చిత్తే తదాంతర ముదాహృతమ్॥ ౩౦

శివలింగము సచ్చిదానంద స్వరూపము; సచరాచర జగత్కారణము. సర్వదాహృదయకమలమున ధ్యానరూపముగా ధరించుటే యాంతర లింగధారణము.

చిద్రూపం హి పరం తత్త్వం శివాఖ్యం విశ్వకారణం,
నిరస్త విశ్వకాలుష్యం నిష్కలం నిర్వికల్పకమ్॥ ౩౧

సత్తానంద పరిస్ఫూర్తి సముల్లాస కలామయం,
అప్రమేయ మనిర్దేశ్యం ముముక్షుభి రుపాసితమ్॥ ౩౨

పరంబ్రహ్మ మహాలింగం ప్రపంచాతీత మవ్యయం,
తదేవ సర్వభూతానా మంతస్త్రిస్థాన గోచరమ్॥ ౩౩

బ్రహ్మమను పేర వెలయు మహాలింగము కేవల జ్ఞానస్వరూపమై, పరతత్త్వ స్వరూపమై, 'శివ' యను పేరు గలదై, సర్వజగత్తులు పుట్టి గిట్టుటకు మూలకారణమై, యెట్టిదోషమును లేనిదై, హేయకళా రహితమై, మార్పులు లేనిదై, నిత్యానందస్ఫూర్తిగల స్వయంప్రకాశ కళయే రూపముగాఁ గలదయి, మోక్షార్థులచే సదా యుపాసింపఁబడునదై ప్రపంచాతీతమై నాశనము లేనిదై యొప్పును.

ఆ మహాలింగమే సర్వభూతముల మూలాధార, అనాహత, ఆజ్ఞాచక్రము లనెడి ముచ్చోటులఁ బ్రకాశించుచుండును.

లింగప్రమాణములు:— 1. ప్రత్యక్షము, 2. అనుమానము, 3. ఉపమానము, 4. శబ్దము, 5. అర్థాపత్తి, 6. అనుపలబ్ధి, 7. సంభవము, 8. ఐతిహ్యము.

(ఇందు మొదటి నాలుగు తార్కికుల మతమందును, 6 వేదాంతుల మతమందును, 8 పౌరాణికుల మతమందును అని క్రమముగా నెఱుంగునది.)

(1) ప్రత్యక్షము:— ఇంద్రియములచే గ్రహించి యిది యిట్టిదని నిశ్చయించుట.

(2) అనుమానము:— పొగ గానవచ్చుచున్నది గనుక అక్కడ నగ్ని యుండునని యూహించి నిశ్చయమునకు వచ్చుట.

(3) ఉపమానము:— సాటిని గ్రహించి యిది యిట్టులని నిశ్చయమునకు వచ్చుట.

(4) శబ్దము:— ఒక యాప్తుఁ డనిన మాటల వలనఁ దెలియు నర్థముచే నిది యిట్టిదని నిశ్చయమునకు వచ్చుట (ఇదే యాగమము).

(5) అర్థాపత్తి:— ఇది యిటులున్న దిగదా, ఎట్లు సంభవించును? దీని కిది కారణమై యుండునని యూహించి నిశ్చయించుట. దేవదత్తుఁడు తినలేదుగదా, యెట్లు బలిసియున్నాఁడు? ఇతఁడు రాత్రులందు రహస్యముగా దినుచుండునని నిశ్చయించుట.

(6) అనుపలబ్ధి:—

(7) సంభవము:— పోలికనుబట్టి నిశ్చయించుట.

(8) ఐతిహ్యము:— పరంపరగా వచ్చు బోధము.

మూలాధారే చ హృదయే భ్రూమధ్యే సర్వదేహినాం,
జ్యోతిర్లింగఁ సదా భాతి యద్బ్రహ్మేత్యాహు రాగమాః॥ ౩౪

శివాగమములన్నియు దేనిని బ్రహ్మమని నిరూపించునో యా జ్యోతిర్లింగమే మూలాధార, హృదయ, భ్రూమధ్యముల నెడి చోటులఁ బ్రకాశించును.

అపరిచ్ఛిన్న మవ్యక్తం లింగం బ్రహ్మ సనాతనం,
ఉపాసనార్థ మంతఃస్థం పరిచ్ఛిన్నం స్వమాయయా॥ ౩౫

ఇక్కడ నున్నది, అక్కడ లేదు, ఇపుడు లేదు, అపుడున్నది యను మాట లేక సుఖముగాఁ దెలియరాక (అవ్యక్తపదము శంకరుని రూపము) బ్రహ్మమనుపేరఁ బరగునది. లోపలనే యుండునదయ్యు భక్తుల యుపాసనమునకై తన మాయాశక్తిచే విభజింపఁబడినటులు తోఁచును.

లయం గచ్ఛతి యత్రైవ జగదేత చ్చరాచరం,
పునః పునః సముత్పత్తిం తల్లింగం బ్రహ్మ శాశ్వతమ్॥ ౩౬

తస్మాల్లింగ మితి ఖ్యాతం సత్యానంద చిదాత్మకం,
బృహత్త్వా ద్బృంహణత్వా చ్చ బ్రహ్మ శబ్దాభిధేయకమ్॥ ౩౭

దేనియందీ చరాచరప్రపంచము చేరి యణఁగియుండునో, దేనియందే మరలమరలఁ గలసూపుచుండునో, యా నాశనములేని బ్రహ్మమే

లింగ మనఁబడును. సచ్చిదానందస్వరూపమైన యీ లింగము గొప్ప దగుట చేతను, ఎప్పటికప్పుడే వృద్ధి నొందునది యగుటచేతను, (బృహి వృద్ధౌ అను ధాతువువలనఁ బుట్టిననామము బ్రహ్మ) తన్నాశ్రయించిన వారిని వృద్ధినొందించునది యగుటచేతను బ్రహ్మమనుపేర నొప్పును.

ఆధారే హృదయే వాపి భ్రూమధ్యే వా నిరంతరం,
జ్యోతిర్లింగాను సంధాన మాంతరం లింగధారణమ్॥ ౩౭

అట్టి జ్యోతిః స్వరూపలింగము (బ్రహ్మము) మూలాధార పద్మ మందుఁగాని, [(ఈ పద్మము వెన్నెముకకొనను మూఁడెముకలు కలియు చోటు. అచటనే ఇడా పింగళా సుషుమ్నలనెడి నాడీత్రయము సంగతి.) ఇది నాలుగుదళములు గలది. (ఇచటి లింగమునకు 'స్వయంభువు' అని పేరు)], హృదయమందుఁగాని (ఇదె అనాహతమనెడి పద్మము; 12 దళ ములు గలది; ఇచటి లింగమునకు 'ఈశానుఁ' డని పేరు), భ్రూమధ్య మందుఁగాని (ఇది కనుబొమల నడిమిచోటు. ఇదె ఆజ్ఞాపద్మము; 2 దళ ములు గలది; ఇచట నుపాసింపఁబడు లింగమునకుఁ 'బరశివుఁ'డని పేరు), ఈ మూఁడుచోటుల శివు ననుసంధానించుటే 'ఆంతర లింగధారణము'.

ఆధారే కనక ప్రఖ్యం హృదయే విద్రుమ ప్రభం,
భ్రూమధ్యే స్ఫటిక చ్ఛాయం లింగం యోగీ విభావయేత్॥ ౩౮

సాధకుఁడైన యోగి బ్రహ్మస్వరూప జ్యోతిర్లింగమును మూలా ధారమున బంగరు వన్నెగల దానిఁగాను, అనాహతమందుఁ బగడపు రంగు గల దానిఁగాను, బొమల నడుమ శుద్ధస్ఫటిక కాన్తిగల దానిఁ గాను ధ్యానింపవలయును.

నిరుపాధిక మాఖ్యాతం లింగస్యాంతర ధారణం,
విశిష్టం కోటి గుణితం బాహ్యలింగస్య ధారణాత్॥ ౪౦

ఈ యంతర్లింగ ధారణము నిరుపాధికము. అనగా, ధరించు సాధనములేనిది యని చెప్పఁబడెను. శరీరమందు ధరింపఁబడు బాహ్య లింగము కంటెను నెన్నోరెట్లు గొప్పది.

యే ధారయన్తి హృదయే లింగం చిద్రూప మైశ్వరం,
న తేషాం పునరావృత్తి ర్ఘోర సంసార మండలే॥ ౪౧

సచ్చిదానంద స్వరూపమును, నాశన రహితమును నైన యీ లింగమును హృదయ కమలమునందు ధరించువారికి భయంకరమైన యీ సంసార మందు మాఱి పుట్టులేదు.

అంతర్లింగాను సంధాన మాత్మవిద్యా పరిశ్రమః,
గురూపాసన శక్తిశ్చ కారణం మోక్షసంపదామ్॥ ౪౨

హృదయ కమలమందు జ్యోతిర్లింగాను సంధానముఁ జేయుటయు, బ్రహ్మవిద్య నొందుటకై నిరంతర పరిశ్రమముఁ జేయుటయు, గురువులను సమర్థతతో నుపాసించుటయు ననునవియే మోక్ష సంపత్కారణములు.

వైరాగ్య జ్ఞాన యుక్తానాం యోగినాం స్థిరచేతసాం,
అంతర్లింగాను సంధానే రుచి ర్బాహ్యే న జాయతే॥ ౪౩

జ్ఞాన వైరాగ్యములు గలిగి చలింపని మనసుగల యోగులకు బాహ్య లింగార్చనముచేఁ గ్రమముగా నంతర్లింగాను సంధానమందే యాసక్తి పెరిగి బాహ్యలింగార్చనమందు రుచి సడలును.

బ్రహ్మ విష్ణుశ్చ రుద్రశ్చ వాసవాద్యాశ్చ లోకపాః,
మునయః సిద్ధ గంధర్వా దానవా మానవా స్తథా॥ ౪౪
సర్వే సుజ్ఞాన యోగేన సర్వకారణ కారణం,
పశ్యంతి హృదయే లింగం పరమానంద లక్షణమ్॥ ౪౫

బ్రహ్మ విష్ణు రుద్రులును, ఇంద్రుఁడు మున్నగు లోకపాలురును, సిద్ధులును, గంధర్వులును, దానవులును, మానవులును, మునులును, వీరు వారనక యెల్లరును జ్ఞానయోగము చేతనే (శివ జీవులకు భేదము లేదనెడి యనుసంధాన విధి చేతనే) సర్వకారణ కారణమును, సచ్చిదానంద స్వరూపమునైన మహాలింగమును (బ్రహ్మమును) దమ హృదయమునందుఁ గాంతురు.

తస్మా త్సర్వ ప్రయత్నేన శాంకరం లింగ ముత్తమమ్,
అంతర్విభావయే ద్విద్వా నశేష క్లేశ ముక్తయే॥ ౪౬

కావున వివేకియైన వాఁడు సర్వక్లేశములనుండి విడువఁబడుటకై శివ పరబ్రహ్మమనెడి మహాలింగమును హృదయపద్మమున ధ్యానింప వలయును.

క్లేశములు అయిదు:- 1. అవిద్యాక్లేశము=నేను జీవుఁడనే యని నిర్ణయించుకొనుట; 2. అభినవక్లేశము=సంసారమును దానియం దను రాగమును గల మనస్సును విడఁదీయలేకుండుట; 3. అస్తిగతక్లేశము= విషయాభిలాషను గలిగి విడుచుకొనలేకుండుట; 4. రాగక్లేశము = ధనముపై నమితాశ గల్గియుండుట; 5. ద్వేషక్లేశము=పొట్టకై పరుల నాశ్రయించి యందు లోటుగల్గఁగా నారలయెడఁ బగగల్గి దూషించుట.

అంతర్ధారయితుం లింగ మశక్తః శక్త ఏవ వా,
బాహ్యం చ ధారయే ల్లింగం తద్రూప మితి నిశ్చయాత్॥ ౪౭

శివమహాలింగమును హృదయమందు ధరింపఁ గలవాఁడైనను, ధరింపలేనివాఁడయినను, బాహ్యమందు (శరీరమున) ఆ మహాలింగమే యీ యిష్టలింగమను నిశ్చయబుద్ధితో లింగధారణము చేయవలయును.

లింగం తు త్రివిధం ప్రోక్తం స్థూలం సూక్ష్మం పరాత్పరం,
ఇష్టలింగ మిదం స్థూలం యద్బాహ్యే ధార్యతే తనౌ॥ ౪౮

లింగము స్థూలమనియు, సూక్ష్మమనియు, పరాత్పరమనియు నిటులు ముత్తెఱంగులు. అందు శరీరమున ధరింపఁబడు నిష్టలింగమే స్థూలము.

ప్రాణలింగ మిదం సూక్ష్మం య దంతర్భావనామయం,
పరాత్పరం తు యత్ప్రోక్తం తృప్తిలింగం యదుచ్యతే,
భావనాతీత మవ్యక్తం పరబ్రహ్మ శివాభిదమ్॥ ౪౯

హృదయకమలమందు ధ్యానింపఁబడునదే సూక్ష్మలింగము. అదే ప్రాణలింగము. భావించుట కందక, యింద్రియగోచరము గాక

యుండునదే పరాత్పర లింగ మనెడి పరశివ బ్రహ్మము. ఇదే భావ లింగము.

ఈ మూడు లింగము లందును నిష్టలింగము – ఆచార లింగ, గురు లింగము లనియు, మఱి ప్రాణలింగము – శివలింగ, చరలింగము లనియు, నిక భావలింగము – ప్రసాదలింగ, మహాలింగము లనియు నిట్లాఱు విధములుగాఁ జెప్పిరి.

(1) ఆచారలింగం ప్రాణాఖ్యం భక్తస్థల సమాశ్రయం,
నివృత్తికలయోపేతం గంధగ్రహణ సాధనమ్॥

(2) గురులింగం తు జిహ్వాఖ్యం మహేశస్థల సంశ్రయం,
ప్రతిష్ఠా కలయోపేతం రసగ్రహణ సాధనమ్॥

(3) శివలింగం తు నేత్రాఖ్యం ప్రసాదిస్థల సంశ్రయం,
విద్యాకలా సమాయుక్తం రూపగ్రహణ సాధనమ్॥

(4) త్వగాఖ్యం జంగమం లింగం ప్రాణలింగి స్థలాశ్రయం,
శాంత్యాఖ్య కలయోపేతం స్పర్శగ్రహణ సాధనమ్॥

(5) ప్రసాదలింగం శ్రోత్రాఖ్యం శరణస్థల సంశ్రయం,
శాంత్యతీత కలోపేతం శబ్దగ్రహణ సాధనమ్॥

(6) మానసం తు మహాలింగ మైక్యస్థల సమాశ్రయం,
శాంత్యతీతోత్తరోపేతం సర్వగ్రహణ కారణమ్॥

(1) ఘ్రాణరూపమైన యాచారలింగము భక్తస్థలము నాశ్రయించి, నివృత్తికళతోఁగూడి గంధగ్రహణ సాధనమైనది. ఘ్రాణము ఇడా పింగళ లనెడి నాడులద్వారా ప్రాణవాయు సంచారమున కాశ్రయమై యుండుటచేతను, దేహస్థితికి హేతుభూతమైన ప్రాణాయామ కార్యము నకు సాధనమగుటచేతను, దీని 'కాచారలింగ' మని పేరు.

(2) జిహ్వారూపమైన గురులింగము మహేశ్వరస్థలము నాశ్రయించి ప్రతిష్ఠాకళతోఁగూడి రసగ్రహణ సాధనమైనది. జిహ్వ షడక్షర మంత్రము నుచ్చరించుటకు సాధన మగుటచేతను, ఇమ్మహామంత్రము -

మంత్రమూర్తియగు గురుని నోరినుండి లభించున దగుటచేతను దీనికి 'గురులింగ'మను పేరయ్యెను.

(3) నేత్రరూపమైన శివలింగము ప్రసాదిస్థలము నాశ్రయించి విద్యాకళతోఁగూడి రూపగ్రహణ సాధనమైనది. నేత్రము తన గోళమందున్న శివప్రకాశముతోఁగూడి రూపవంతములైన వస్తువుల సన్నిధినిగ్రహింపఁగోన సాధనమగుటచేత దీనికి 'శివలింగ'మను పేరయ్యెను.

(4) త్వగ్రూపమైన చరలింగము ప్రాణలింగిస్థలము నాశ్రయించి శాంతికళాయుతమై, స్పర్శగ్రహణ సాధనమైనది. త్వక్కు సర్వశరీరము నాశ్రయించి శీతోష్ణాది స్పర్శజ్ఞానమునకు సాధనమగుటచే నిది సంచార స్వభావముగల వాయువుయొక్క యంశమగుటచేతను దీనికి 'చరలింగ' మను పేరయ్యెను.

(5) శ్రోత్రరూపమైన ప్రసాదలింగము శరణస్థలము నాశ్రయించి శాంత్యతీత కళతోఁగూడి శబ్దగ్రహణ సాధనమైనది. శ్రోత్రము శబ్దగ్రహణ సాధనమగుటచేతను, నాద నినాద సునాద మహానాద రూపమైన పరా, పశ్యన్తీ, మధ్యమా, వైఖరీ రూపమైన వాక్చతుష్టయముతో వరుసగాఁ బ్రాప్తమైన యనుగ్రహ రూపప్రసాదమునకు హేతువగుటచేతను, దీనికి 'ప్రసాదలింగ' మను పేరయ్యెను.

(6) మనో రూపమైన మహాలింగము ఐక్యస్థలము నాశ్రయించి శాంత్యతీతోత్తర కళతోఁగూడి సర్వగ్రహణ సాధనమైనది. మనస్సు శ్రోత్రాదీంద్రియములవలె ఒక్కొక్క విషయమునే గ్రహించుటగాక అన్ని విషయములను గ్రహింపఁగల దగుటచేతను, ఇంద్రియములకెల్ల మహారాజై యుండుటచేతను దీనికి 'మహాలింగ' మను పేరయ్యెను. "ఇంద్రియాణాం మనశ్చాస్మి" యను గీతావాక్యమును బట్టి యిది యీశ్వరవిభూతి యధికముగాఁ గలది.

ఇష్టలింగ మిదం సాక్షా దనిష్ట పరిహారకం,
ధారయే దవధానేన శరీరే సర్వదా బుధః॥ ౫౦

ప్రత్యక్షముగా సంచారమనెడికీడును బోఁగొట్టు నిష్టలింగమును జ్ఞానులెల్లరు నెప్పుడును శ్రద్ధతో ధరింపవలయును.

మూర్ధ్ని వా కంఠదేశే వా కక్షే వక్షఃస్థలేఽపివా,
కుక్షౌ హస్తస్థలే వాపీ ధారయే ల్లింగమైశ్వరమ్॥ ౫౧

ఇయ్యాశ్వరలింగమును శిరస్సు, మెడ, చంక, గుండె, కడుపు, చేయి యను నంగములం దొక దాన ధరింపవలయును.

నాభే రథస్తా ల్లింగస్య ధారణం పాపకారణం,
జటాగ్రే త్రికభాగే చ మలస్థానే న ధారయేత్॥ ౫౨

బొడ్డుకంటెను దిగువను లింగధారణము పాపహేతువగును. జడతుదను, త్రికమందును (వెన్నెముక తుదను మూడెమ్ములు కలియు చోట) ధరింపరాదు. (కొందఱు వెన్నెముకమీఁదితుదను మూడెమ్ములు కలియు చోటందురు; గాని యుక్తియుక్తముగాఁ దోఁచదు.)

లింగధారీ సదాశుద్ధో నిజలింగం మనోరమం,
అర్చయే ద్గంధ పుష్పాద్యైః కరపీఠే సమాహితః॥ ౫౩

లింగమును దాల్చు వీరశైవు లెల్లరును మనోహరమైన తమ యిష్టలింగమును బరిశుద్ధులై కరపీఠమం దుంచుకొని గంధ పుష్పాద్యుపచారములచే నిత్యమును బూజింపవలయును.

బాహ్య పీఠార్చనా దేత త్కర పీఠార్చనం వరం,
సర్వేషాం వీరశైవానాం ముముక్షూణాం నిరంతరమ్॥ ౫౪

ముక్తినిగోరు వీరశైవు లెల్లరును లింగమును బాహ్యపీఠమం దుంచి పూజించుట కంటెఁ గరపీఠమం దుంచికొని పూజించుటే కడు మేలు.

బ్రహ్మ విష్ణ్వాదయో దేవా మునయో గౌతమాదయః,
ధారయన్తి సదా లింగ ముత్తమాంగే విశేషతః॥ ౫౫

బ్రహ్మ, విష్ణువు, మున్నగు దేవతలును, గౌతముఁడు మున్నగు మునివర్యులును విశేషించి శివలింగమును శీర్షమందే ధరింతురు.

లక్ష్మ్యాది శక్తయః సర్వాః శివ భావ విభావితాః,
ధారయం త్యలికాగ్రేషు శివలింగమహర్నిశమ్॥ ౫౬

శివధ్యానాసక్తులగు లక్ష్మి మున్నగు శక్తి దేవతలును శివలింగ మును దమ నొసటిమీది భాగములందే ధరింతురు.

వేదశాస్త్ర పురాణేషు కామికా ద్యాగమేషు చ,
లింగధారణ మాఖ్యాతం వీరశైవస్య నిశ్చయాత్॥ ౫౭

వేదము లందును, శాస్త్రము లందును, పురాణము లందును, కామికాది వాతులాంతములగు శివాగమములందును, వీరశైవునకు లింగధారణము విధిగాఁ జెప్పఁబడినది.

ఋగిత్యాహ పవిత్రం తే వితతం బ్రహ్మణస్పతే,
తస్మాత్పవిత్రం తల్లింగం ధార్యం శైవ మనామయమ్॥ ౫౮
బ్రహ్మేతి లింగ మాఖ్యాతం బ్రహ్మణః పతిరీశ్వరః,
పవిత్రం తద్ధి విఖ్యాతం తత్సంపర్కా త్తనుః శుచిః॥ ౫౯
అత ప్త తను ర్జ్ఞోవై ఆమః సంస్కార వర్జితః,
దీక్షయా రహితః సాక్షా న్నాప్నుయా ల్లింగ ముత్తమమ్॥ ౬౦

''పవిత్రం తే వితతం బ్రహ్మణ స్పతే ప్రభుర్గాత్రాణి పర్యేషి విశ్వతః, అత ప్త తనూ ర్నత దామో అశ్నుతే॥'' ఈ మంత్రముచేత ఋగ్వేదము లింగధారణమును బోధించుచున్నది. ఆ కారణముచేఁ బవిత్రమును దోషరహితమును నైన లింగమును ధరింపవలయును. లింగమునకు బ్రహ్మమని పేరు. శివుఁడు చతుర్ముఖబ్రహ్మ కధిపతియైన వాఁడు. ఆ శివలింగమే 'పవిత్రం' అని చెప్పఁబడినది. ఇట్టి పవిత్ర లింగ మూర్తి సంబంధముచే శరీరము పవిత్రమగును. దీక్షాగ్నిచేఁ గాల్పఁ బడని శరీరము గలవాఁడును, షడధ్వాది సంస్కారములు లేనివాఁడును, శివదీక్ష నొందనివాఁడును, బరిపక్వహృదయుఁడు కానివాఁడును శివ రూపము నొందజాలఁడు.

లింగధారణచంద్రికాకారులు, శ్రీ నందికేశ్వర శివాచార్యులు పై మంత్రమునకు:- ''ఓ బ్రహ్మణస్పతీ! లింగరూప శరీరావచ్ఛేదముచే జీవభావముతో శరీరము నధిష్ఠించిన పరమశివుఁడా! బ్రహ్మనామముచేఁ జెప్పఁబడు లింగరూపమైన నీ శరీరము భక్తులకు శుచిగా నున్నప్పుడును

అశుచిగా నున్నయప్పుడును ధార్యమై, ఇష్టలింగాది భేదముచేతను, భక్తశరీరాది భేదముచేతను బహువిధములు గలది. నిగ్రహానుగ్రహ సమర్థుఁడవు శివుఁ భక్తశరీరముల నన్నింట వ్యాపించియుందువు.'' (ధరింపఁబడినవాఁడవై లింగరూప శరీరముద్వారా భక్తశరీరముతోఁ గూడి యుందువని భావము. వేధాది దీక్షాత్రయముచేతఁ గాల్పఁబడని శరీరము గలవాఁడును, అంతఃకరణపరిపాకము కానివాఁడును, ఆ పరశివబ్రహ్మము నొందలేఁడు అని వ్యాఖ్యానించియున్నారు.)

ఈ మంత్రము నభిప్రాయమునే వ్యాసమహర్షియు లింగపురాణము రెండవభాగమున ౨౧వ అధ్యాయమున నిటులు విస్పష్టముగాఁ జెప్పెను.

> బ్రహ్మేతి లింగ మాఖ్యాతం బ్రహ్మణస్పతి రీశ్వరః,
> పవిత్రం తద్ధి విఖ్యాతం తత్సంపర్కా త్తనుః శుచిః॥
> ఋషిత్వాహ పవిత్రంతే వితతం బ్రహ్మణస్పతే,
> తస్మా త్పవిత్రం తల్లింగం ధార్యం శైవ మనామయమ్॥
> అతప్త తను రజ్ఞో వై హ్యాఘీ సంసార లక్షణః,
> దీక్షయా రహితః నాత్మా న్నాప్నుయా ల్లింగ ముత్తమమ్॥
> యః కరోతి తపః పూర్వం స తప్త తను రుచ్యతే,
> పరిపక్వో విమోక్షాయ సోఽశ్నుతే లింగధారణమ్॥

బ్రహ్మమే శివలింగమనియు, పావనమైన లింగధారణముచేత భక్తశరీరము పావనమగుననియు, అందుచేఁ బవిత్ర శివలింగమును ధరింపవలయుననియు, వేధ మంత్ర క్రియా దీక్షలచేతఁ దప్తుఁడుకాని యజ్ఞాని పాపియు, సంసారబద్ధుఁడు నగుననియు, దీక్షారహితుఁడు శివలింగధారణమునకుఁ దగఁడనియు, మున్ను శివునిగూర్చి తప మాచరించినవాఁడే తప్తతనుఁడనియు, తప మాచరింపనివాఁడే యతప్తతనుఁడనియు, జ్ఞాన పరిపక్వాంతఃకరణుఁడు ముక్తికొఱకు లింగధారణము నొందుననియు పై శ్లోకముల యభిప్రాయము.

> అఘోరాఽపాపకాశీతి యా తే రుద్ర శివా తనూః,
> యజుషా గీయతే యస్మా త్తస్మా చ్ఛైవోఽఘ వర్జితః॥ ౬౧

యో లింగధారీ నియతాంతరాత్మా
నిత్యం, శివారాధన బద్ధ చిత్తః,
స ధారయే త్సర్వ మలాపహ త్యై
భస్మామలం చారు యథా ప్రయోగమ్॥    ౬౨

"యా తే రుద్ర శివా తనూ రఘోరాఽపాపకాశినీ । తయా నస్తనువా శంతమయా గిరిశం తాభి చాకశీహి॥" అనెడి యాజుష మంత్రము సైతము లింగధారణమునే బోధించుచున్నది. గాన లింగ ధారణ సంపన్నుఁడైన వీరశైవుఁడు పాపరాశివలన విడువఁబడును.

ఈ మంత్రమునకు శ్రీ రేవణాచార్యులు—"ఓ పరమేశ్వరా! మనో వాక్కాయములవలనఁ గలిగిన బహువిధపాపములను దొలంచునట్టియు, భయంకరముకాక శాంతమైనట్టియు, నేనీ శరీరము (లింగం తు శివయో ర్దేహ స్తాభ్యాం యస్మా దధిష్ఠితః") అను వాయవీయ వాక్యమునుబట్టి యిష్ట ప్రాణలింగ రూపమైన దేహము మంగళకరమును, భక్తులకు మహా భోగరూపమైన మోక్షసుఖము నిచ్చునదియు, దా సత్యంత సుఖ స్వరూపమునై యుండుటచేత ఆ యిష్టలింగ, ప్రాణలింగ స్వరూపముచే నీవు "ఇష్ట మూర్జం తపసాను యచ్ఛతే ప్రాణే ష్వంతర్మనసో లింగ మాహుః" అనెడి యథర్వ శిరో వాక్యమును బట్టియు, "ఇష్టలింగం ప్రాణలింగ మేకీకృత్యార్చనం పరం" అను వాతులోత్తర తంత్ర వాక్య మును బట్టియు, దేశికోపదేశముచే శిక్షితులమైన మాకు, అభిముఖుఁ డవై ప్రకాశింపుము" అని యీవిధముగా నిమ్మంత్రార్థమును వివరించిరి.

ఎవఁడు లింగధారియై మనోనిగ్రహము గలవాఁడై యెడతేని శివార్చనాసక్తి గలవాఁడై యుండునో యతఁడు సర్వపాపములవలన విడివడుటకై మనోహరమును బవిత్రము నైన భస్మమును విధ్యుక్త ముగా ధరింపవలయును.

ఇది

సిద్ధాన్త శిఖామణి యందలి – భక్తస్థలమున
గురుకారుణ్యస్థల, లింగధారణస్థల ప్రసంగమనెడి
ఆ ర వ ప రి చ్ఛే ద ము
శ్రీ శి వా ర్ప ణ ము.

శ్రీమాత్రే నమః

ఓం నమః శివాయ

శ్రీ జగద్గురు రేణుకాచార్యాః ప్రసీదంతు.

# ఏడవ పరిచ్ఛేదము.

## 6. భస్మధారణ స్థలము.

భస్మధారణ సంయుక్తః పవిత్రో నియతాశయః,
శివాభిధానం యత్ప్రోక్తం భాసనా ద్భసితం తథా॥ ౧

మహాభస్మేతి సంచింత్య మహాదేవం ప్రభామయం,
వర్తంతే యే మహాభాగా ముఖ్యాస్తే భస్మధారిణః॥ ౨

విధ్యుక్త భస్మధారణముచేయు వీరశైవుఁడు పవిత్రుఁడును నిర్మల చిత్తుఁడును అగును. "స ఏష భస్మజ్యోతిః, స ఏష భస్మజ్యోతిః" అనెడి భస్మజాబాలి శ్రుతినిబట్టి ఏది శివనామముతో నొప్పునో, ఏది శివస్వరూపమును భాసింపఁజేయుటచే నది 'భసిత' మనఁ బడెను. జ్యోతిస్స్వరూపుఁడైన యా శంకరుని భస్మముగా భావించి యెవరు వర్తింతురో ఆ మహనీయులే నిరుపాధిక భస్మధారులైన వీరశైవులు. పరశివుని మహాభస్మముగా భావించుటే నిరుపాధిక భస్మ మనఁబడును.

శివాగ్నావపి సముత్పన్నం మంత్రన్యాసాది యోగతః,
త[illegible]సోపాధిక మిత్యాహు ర్భస్మతంత్ర విశారదాః ॥ ౩

సద్యోజాతాది పంచబ్రహ్మమంత్రములచే సంస్కరింపఁబడి సిద్ధమైనట్టియు. శివాగ్ని సంస్కారపూర్వకముగా సిద్ధమైనట్టియు భస్మమును తంత్రవేత్తలు సోపాధిక భస్మమందురు;

విభూతి ర్భసితం భస్మ క్షారం రక్షేతి భస్మనః,
ఏతాని పంచనామాని హేతుభిః పంచభి ర్ధ్రువమ్॥ ౪

అయిదు కారణములచే నీ బూదికి విభూతి, భసితము, భస్మము, క్షారము, రక్ష యను నైదు పేళ్లయ్యెను.

విభూతి ర్భూతిహేతుత్వా ద్భసితం తత్త్వభాసనాత్,
పాపానాం భర్త్సనా ద్భస్మ క్షారణాత్ క్షారమాపదాం,
[illegible] త్స[illegible]తేభ్యో రక్షేతి పరిగీయతే॥ ౫

అణిమ, మహిమ, గరిమ, లఘిమ, ప్రాప్తి, ప్రాకామ్యము, ఈశిత్వము, వశిత్వము అనునవి అష్టభూతులు. వీనికే సిద్ధులనియు పేరు.

అణిమ = అణువులయందును పరమాణురూపమున నుండుట.

మహిమ = బ్రహ్మ విష్ణు రుద్రాదులకంటె నధికుఁడై యుండుట.

గరిమ = బ్రహ్మాండాదులకంటె బరువుగా నుండుట.

లఘిమ = దూదికణమువలె తేలికయై యుండుట.

ప్రాప్తి = వలయు వస్తువులు లభింపఁ జేసికొనుట.

ప్రాకామ్యము = ఆకాశసంచారము గలుగుట, సమస్తదేవతల నాయా లోకముల పనులందు నియమించుట.

ఈశిత్వము = సర్వాతిశాయియై యుండుట.

వశిత్వము=స్వాధీనేంద్రియత్వము, సర్వమును వశముచేసికొనుట.

అను నీ యెనిమిదైశ్వర్యములను నిచ్చును గాన విభూతియు, శివత్వమును భాసింపఁజేయునది గాన భసితమనియు, పాపములను భర్త్సించుటచే (భయపెట్టుటచే) భస్మమనియు, ఆపదలను క్షరణము చేయుటచే క్షారమనియు, భూతప్రేత పిశాచాదులవలన రక్షించునది గాన రక్షయనియు నైదుపేళ్లతో వెలయును.

నందా భద్రా చ సురభిః సుశీలా సుమనస్తథా,
పంచగావో విభోర్జాతాః సద్యోజాతాది వక్త్రతః॥ ౬

కపిలః కృష్ణ ధవళ ధూమ్ర రక్తా స్తథైవ చ,
నందాదీనాం గవాం వర్ణాః క్రమేణ పరికీర్తితాః॥ ౭

పరమేశ్వరుని సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాన నామములతో నొప్పు నైదుమోములనుండి వరుసగా నంద, భద్ర, సురభి, సుశీల, సుమన యను పేళ్లతో అయిదు గోవులు పుట్టినవి. అందు నంద కపిలవర్ణము గలది; భద్ర కృష్ణవర్ణము గలది; సురభి తెల్లనిది; సుశీల ధూమ్రవర్ణము గలది; సుమన ఎఱ్ఱనిది.

సద్యోజాతా ద్విభూతిశ్చ వామా ద్భసిత మేవచ,
అఘోరా ద్భస్మ సంజాతం క్షారం తత్పురుషా త్తథా,
రక్షా చేశాన వక్త్రాచ్చ నందాది ద్వారతోఽభవత్॥ ౯

సద్యోజాత ముఖమువలనఁ బుట్టిన నందాగోవు వలన నైనది విభూతి. వామదేవ ముఖము వలనఁ బుట్టిన భద్రయనెడి గోవువలన నైనది భసితము. అఘోరముఖమునుండి పుట్టిన సురభివలన భస్మము. తత్పురుష ముఖమున బుట్టిన సుశీల వలన క్షారము. ఈశానముఖమునఁ బుట్టిన సుమన యనుదానివలన నైనది రక్ష. అనగా ఆయా గోవు యనులనైన యాయా బూదులకు అట్టి మహిమ గలదని భావము.

ధారయే న్నిత్యకార్యేషు విభూతిం చ ప్రయత్నతః
నైమిత్తికేషు భసితం క్షారం కామ్యేషు సర్వదా॥ ౯
ప్రాయశ్చిత్తేషు సర్వేషు భస్మ నామ యథావిధి,
రక్షాచ మోక్షకార్యేషు ప్రయోక్తవ్యా సదా బుధైః॥ ౧౦

పండితులు నిత్యకర్మలందు విభూతిని, నైమిత్తికములందు భసితమును, కామ్యకర్మములందు క్షారమును, ప్రాయశ్చిత్తాదులందు భస్మమును, మోక్షప్రదకార్యములందు రక్షను విధ్యుక్తముగా ధరింపవలయు.

నందాదీనాం తు యే వర్ణాః కపిలాద్యాః ప్రకీర్తితాః,
త ఏవ వర్ణా విఖ్యాతా భూత్యాదీనాం యథాక్రమమ్॥ ౧౧

నందాదుల కేవర్ణము చెప్పఁబడెనో యదియే విభూత్యాదులకు నుండును. అనగా విభూతి కపిలవర్ణము, భసితము నల్పును, భస్మము తెల్పును, క్షారము ఆకాశవర్ణమును, రక్ష యెఱుపును గల్గియుండును.

భస్మోత్పాదన ముద్దిష్టం చతుర్ధా తంత్రవేదిభిః,
కల్పం చైవానుకల్పం చ ఉపకల్ప మకల్పకమ్॥ ౧౨
ఏషా మాదిమ ముత్కృష్ట మన్య త్సర్వ మభావతః,
యథా శాస్త్రోక్త విధినా గృహీత్వా గోమయం నవమ్॥ ౧౩
సద్యేన వామదేవేన కుర్యా త్పిండ మనుత్తమం,
శోషయే త్పురుషే ణైవ దహే ద్ఘోరా చ్ఛివాగ్నినా॥ ౧౪

కల్పం తద్భస్మ విజ్ఞేయ మనుకల్ప మథోచ్యతే,
వనేషు గోమయం యచ్చ శుష్కం చూర్ణీకృతం తథా॥ ౧౫

దగ్ధం చైవాను కల్పాఖ్య మాపణాది గతం తు యత్,
వస్త్రేణోత్తారితం భస్మ గోమూత్రా బద్ధపిండకమ్। ౧౬

దగ్ధం ప్రాగుక్తవిధినా భవే ద్భస్మోప కల్పకం,
అన్యై రాపాదితం భస్మ అకల్పమితి కల్పితమ్। ౧౭

తంత్రజ్ఞులైనవారు భస్మోత్పత్తిని కల్పము, అనుకల్పము, ఉపకల్పము, అకల్పము అని 4 విధములుగాఁ జెప్పిరి. అందు మొదటి కల్పభస్మమే సర్వోత్తమ మనిరి. ఇది దొరకనపుడు తక్కిన మూఁటిలో నేదే నుపయోగింపవచ్చును.

1. నేలబడనట్లుగా గోమయమును సద్యోజాతమంత్రము నుచ్చరించుచు గ్రహించి, వామదేవమంత్ర ముచ్చరించుచు ఉంటలుగాఁజేసి, తత్పురుషమంత్ర ముచ్చరించుచు ఎండలో నుంచి, అఘోర మంత్రోచ్చారణముతో గాల్పవలయును. ఈశాన మంత్రోచ్చారణముతో బిల్వాది పవిత్రాధారములం దుంచుకొనవలయును. ఇది కల్పభస్మము.

2. అడవిలో నెండిన గోమయమును దెచ్చి చూర్ణించి ఇదివఱకుఁ జెప్పినట్లు మంత్రోచ్చారణము చేయుచుఁ గాల్పగా సిద్ధమైనది అనుకల్ప భస్మము.

3. అంగడియందు వెలకు దొరకు భస్మమును దెచ్చి వస్త్రగాలితము చేసి గోమూత్రముతోఁ గలిపి పిండములుగాఁజేసి తొల్లింటివలెనే మంత్రోచ్చారణముతో మరల గాల్చి సిద్ధముచేసినది ఉపకల్ప భస్మము.

4. మంత్రజ్ఞానశూన్యులచే నేదో యొకవిధముగా సిద్ధమైనది అకల్పక భస్మము.

ఏష్వేక తమ మాదాయ పాత్రేషు కలశాదిషు,
త్రిసంధ్య మాచరేత్ స్నానం యథా సంభవమేవ వా॥ ౧౮

కొఱ్ఱ వేళ్ళు పాత్రములం దుంచుకొని అక్కఱపడినపుడు వాని లభించినచో గ్రహించి భస్మస్నానము చేయవలయును. దినమున కొకసారియైన జేయవలయును.

స్నానకాలే కరౌ పాదౌ ప్రక్షాళ్య విమలాంభసా,
వామహస్తతలే భస్మ క్షిప్త్వాఽచ్ఛాద్యాన్యపాణినా॥ ౧౯
అష్టకృత్వోఽథ మూలేన మౌనీ భస్మాభిమంత్ర్య చ,
శిర ఈశాన మంత్రేణ పురుషేణ ముఖం తథా॥ ౨౦
హృత్ప్రదేశ మఘోరేణ వామదేవేన గుహ్యకం,
పాదౌ సద్యేన సర్వాంగం ప్రణవే నైవ సేచయేత్॥ ౨౧

ఈ భస్మస్నానకాలమందు నిర్మల జలముతోఁ గాలు సేతులు కడిగికొని, ఎడమచేత విభూతివేసికొని, కుడిచేత మూసి, మౌనియై, మూలమంత్రము 8 సారులు జపించుచు అభిమంత్రించి, ఈశాన మంత్రముతో శిరస్సును, తత్పురుషమంత్రముతో ముఖమును, అఘోర మంత్రముతో హృదయమును, వామదేవమంత్రముతో గుహ్యమును, సద్యోజాతమంత్రముతో రెండుపాదములను, ఓంకారముతో సర్వశరీరమును ప్రోక్షింపవలయును.

భస్మనా విహితం స్నాన మిద మాగ్నేయ ముత్తమం,
స్నానేషు వారుణాద్యేషు ముఖ్యమేత న్మలాపహమ్॥ ౨౨

జలస్నానము మున్నగు నన్ని స్నానములలోను అగ్నిసంబంధమైన యీ భస్మస్నానమే శ్రేష్ఠతమము. ఈ మంత్రపూత భస్మస్నానమే ఆణవాదులగు మలములఁ దొలఁగించునది.

భస్మస్నానవతాం పుంసాం యథాయోగం దినే దినే,
వారుణాద్యైః ఫలం స్నానై ర్బాహ్యదోషాపహారిభిః॥ ౨౩

ప్రతిదినము విధినసరించి భస్మస్నానమాచరించువారికి బాహ్యదోషములను బోఁగొట్టు జలస్నానములతో నేమి ప్రయోజనము ?

ఆగ్నేయం భస్మనా స్నానం యతిభిస్తు విధీయతే,
జలస్నానా త్పరం భస్మ ఆర్ద్రే జంతువధో ధ్రువమ్॥ ౨౪

అగ్నిసంబంధమైన యీ భస్మస్నానము జ్ఞానసంపన్నులైన యతులచేతను జేయఁబడుచున్నది. జలస్నానాదులందు జీవహింస తప్పనిది గావున జలస్నానముకంటె భస్మస్నానమే శ్రేష్ఠతరమైనది.

ఆర్ద్రాం తు ప్రకృతిం విద్యాత్ ప్రకృతిం బంధనం విదుః,
ప్రకృతేస్తు ప్రహాణార్థం భస్మనా స్నాన మిష్యతే॥ ౧౫

“స వా ఏష పురుషోఽన్నరసమయః” అనెడి శ్రుతి చేతను “పురుషః ప్రకృతిస్థోఽపి భుంక్తే ప్రకృతిజాన్ గుణాన్” అనెడి గీతా వాక్యముచేతను అన్నరసమయుఁడైన పురుషుఁడు ప్రకృతిగుణముల ననుభవించు చుండుటచేత, జలమును ప్రకృతిగాఁ దెలియవలయును. జ్ఞానులు ప్రకృతిని బంధముగానే తెలిసికొనిరి. ఆ ప్రకృతిని నశింపఁ జేయుటకు భస్మస్నానము చెప్పఁబడినది.

బ్రహ్మాద్యా విబుధాః సర్వే మునయో నారదాదయః,
యోగినః సనకాద్యాశ్చ బాణాద్యా దానవా అపి॥ ౧౬

భస్మ స్నానరతాః సర్వే శివభక్తి పరాయణాః,
నిర్ముక్త దోషకలిలా నిత్యశుద్ధా భవంతి హి॥ ౧౭

బ్రహ్మ మొదలైన సమస్తదేవతలును, నారదాదులైన మునులును, సనకాదులైన యోగులును, బాణాదులైన దానవులును, భస్మస్నానాసక్తులై శివభక్తినిరతులై పాపములనుండి తొలగి నిత్యశుద్ధులైరి.

నమః శివాయేతి భస్మ కృత్వా సప్తాభి మంత్రితం,
ఉద్ధూల యేత్తేన దేహం త్రిపుండ్రం చాపి ధారయేత్॥ ౧౮

‘నమః శివాయ’ యనెడి పంచాక్షరమంత్రముచే భస్మమును ఏడుసారులు అభిమంత్రించి, దానితో దేహమునకు లేపము చేసికొనుటయు, త్రిపుండ్రమును ధరించుటయు శ్రేయస్కరము.

సర్వాంగోద్ధూలనం చాపి న సమానం త్రిపుండ్రకైః,
తస్మా త్త్రిపుండ్ర మేవైకం లిఖే దుద్ధూళనం వినా॥ ౧౯

సర్వశరీరమున భస్మలేపము చేసికొనుటయును, భస్మముతోఁ జేయు త్రిపుండ్ర (మూడు రేఖలు) ధారణమునకు సాటికాదు. అందు చేత ఉద్ధూలనము (మేనంతట బూసికొనుట) మాని త్రిపుండ్రధారణ మొకటే చేయవలయు.

త్రిపుండ్రం ధారయే న్నిత్యం భస్మనా సజలేన హి,
స్థానేషు పంచదశసు శరీరే సాధకోత్తమః॥ 30

సాధకులైన వీరశైవులు తమ శరీరమున పదునైదు చోటుల నీటితో గలిపిన భస్మముతోనే త్రిపుండ్రమును దాల్పవలయును.

ఉత్తమాంగే లలాటే చ శ్రవణ ద్వితయే తథా.
గలే భుజద్వయే చైవ హృది నాభౌ చ పృష్ఠకే॥ 31

బాహు యుగ్మే కకుద్దేశే మణిబంధ ద్వయే తథా,
త్రిపుండ్రం భస్మనా ధార్యం మూలమంత్రేణ సాధకైః॥ 32

శిరస్సు, నొసలు, రెండు చెవులు, కంఠము, రెండు భుజములు, గుండె, బొడ్డు, వీపు, రెండు బాహువులు, మూపు, రెండు మణికట్టులు అను పదునైదు చోటులను మూలమంత్రము నుచ్చరించుచు త్రిపుండ్ర ధారణము చేయవలయును. (ఇచట భుజ బాహు పదములు సమానార్థ ములుగాఁ దోఁచినను గ్రంథకర్త భుజ శబ్దముచే భుజ శిరస్సుల నుద్దే శించెను.)

వామ హస్త తలే భస్మ క్షిప్త్వాఽఽచ్ఛాద్యాన్యపాణినా,
అగ్ని రిత్యాది మంత్రేణ స్పృశన్ వారాభి మంత్ర్య చ॥ 33

త్రిపుండ్ర ముక్తస్థానేషు దధ్యాత్స జలభస్మనా.
శివం శివంకరం శాంతం స ప్రాప్నోతి న సంశయః॥ 34

ఎడమచేత భస్మము నుంచుకొని కుడిచేతితో మూసి "అగ్నిరితి భస్మ, వాయురితి భస్మ, జలమితి భస్మ, స్థలమితి భస్మ, వ్యోమేతి భస్మ, భస్మేతి భస్మ, సర్వం హ వా ఇదం భస్మ, మన ఇత్యేతాని చక్షూంషి భస్మాని" అనెడి మంత్ర ముచ్చరించుచు భస్మమును దాకి దాని నేడుసారు లభిమంత్రించి నీటితో గలిపిన యా భస్మముతోఁ

బై నిజెప్పిన స్థానములందుఁ ద్రిపుండ్ర ధారణము చేయు వీరశైవుఁడు మంగళకరుఁడైన శివుతో నైక్యమొందునన సందియము లేదు.

మధ్యాంగుళిత్రయేణైవ స్వదక్షిణ కరస్య తు,
షడంగులాయతం మాన మపివా౽తిక మానకమ్॥ 3౫

నేత్ర యుగ్మ ప్రమాణేన ఫాలే దధ్యా త్త్రిపుండ్రకం,
మధ్యమానామికాంగుష్ఠై రనులోమ విలోమతః॥ 3౬

ధారయే ద్యస్త్రిపుండ్రాంకం స రుద్రో నాత్ర సంశయః,
ఋజుశ్వేత మనువ్యాప్తం స్నిగ్ధం శ్రోత్రప్రమాణకమ్॥ 3౭

ఏవం సల్లక్షణోపేతం త్రిపుండ్రం సర్వసిద్ధిదం,
ప్రాతఃకాలే చ మధ్యాహ్నే సాయాహ్నే చ త్రిపుండ్రకం,
కదా చిద్భస్మనా కుర్యా త్సరుద్రో నాత్ర సంశయః॥ 3౮

కుడిచేతి నడిమి మూఁడువ్రేళ్లతోనే (చూపుడు, నడిమి, ఉంగరపువ్రేళ్లు) ఆరంగుళములు పొడవుగాని, నొసటి పొడవుగాని, రెండు కన్నులు వ్యాపించియున్నంత పొడవుగాని, త్రిపుండ్రమును రచింపవలయును.

తర్జనీ మధ్యమానామికలతో ఎడమనుండి కుడివైపునకును, బొటనవ్రేలితో మాత్రము కుడినుండి ఎడమవైపునకును నొసటి త్రిపుండ్రమును ధరింపవలయును. అట్టి శైవుఁడు రుద్ర స్వరూపుఁడే యగును. సందియము లేదు. చెవుల పర్యంతము వెలుతులు లేనట్లు తిన్నఁగా దట్టముగా శుభ్రముగా నుండునట్లు ధరింపవలయును. ఇట్లు మంచి లక్షణములతోఁ గూడిన త్రిపుండ్ర ధారణము సర్వసిద్ధుల నిచ్చును. మూఁడు సదెంలయందును ఎవఁడు త్రిపుండ్రములను ధరించునో అతఁడు శివస్వరూపుఁడే యగును. సందియము లేదు.

ఏవం విధం విభూత్యా హి కురుతే య స్త్రిపుండ్రకం,
సరౌద్ర ధర్మ సంయుక్త స్త్రయీ మయ ఇతి స్మృతః॥ 3౯

ఎవఁ డీ విధముగా విభూతితోఁ త్రిపుండ్రములను దాల్చునో అతఁడు శివధర్మయుక్తుఁడై సర్వవేదస్వరూపుఁడగును. "య ఇదం త్రిపుం

డ్రం ధరః తే స వేదత్రయధారీ భవతి స సంతతం త్రేతాగ్ని ర్భవతి । స పుణ్యక్రియ స్నాతో భవతి । య స్త్రిపుండ్రధారీ పురుష స్సరుద్రః" ... త్రిపుండ్ర ధారణముచే మూడువేదము లధ్యయనము చేసిన ఫలమును, మూడువేళల ఆహవనీయ గార్హపత్య దాక్షిణాయులను త్రేతాగ్నుల నర్చించిన ఫలమును, గంగా యమునా సరస్వతుల నడి త్రివేణీస్నానములు నాడిన ఫలమును పొంది రుద్ర స్వరూపుఁడే యగునని భావము.

బ్రహ్మ విష్ణుశ్చ రుద్రశ్చ దేవా శ్శక్ర పురోగమాః,
త్రిపుండ్రం ధారయం త్యేవ భస్మనా పరికల్పితమ్॥ ౪౦

బ్రహ్మ విష్ణు రుద్రులును ఇంద్రాదులైన దేవతలును భస్మ త్రిపుండ్రమునే ధరింతురు.

వసిష్ఠాద్యా మహాభాగా మునయః శ్రుతి కోవిదాః,
ధారయంతి సదాకాలం త్రిపుండ్రం భస్మనా కృతమ్॥ ౪౧

వేదపారంగతులైన వసిష్ఠాది మహామునులును భస్మత్రిపుండ్రముచే ఎల్లప్పుడును ధరింతురు.

శైవాగమేషు వేదేషు పురాణే ష్వఖిలేషు చ,
స్మృతీతిహాస కల్పేషు విహితం భస్మ పుండ్రకం॥ ౪౨

కామిక వాతులాది శైవాగమములందును, పదునెన్మిది పురాణములందును, మన్వాది స్మృతులందును, మహాభారతాదీతిహాసములందును భస్మత్రిపుండ్ర ధారణ ముగ్గడింపఁ బడినది.

ధారణీయం సమస్తానాం శైవానాం చ విశేషతః,
నాస్తికో భిన్నమర్యాదో దురాచార పరాయణః,
భస్మత్రిపుండ్రధారీ చే న్ముచ్యతే సర్వకిల్బిషైః॥ ౪౩

ఎల్లరును భస్మత్రిపుండ్రధారణమును జేయవలయును. అందును శైవమతీయులు విశేషించి చేయవలయును. నాస్తికుఁడే కానిముఱ్ఱి మాత్రభ్రష్టుఁడే కానీ, దురాచారాసక్తుఁడే కానీ, భస్మ త్రిపుండ్రధారి యగుచో నెల్లపాపములవలన విడువఁబడును.

## 7. రుద్రాక్ష ధారణ స్థలము.

భస్మనా విహిత స్నాన స్త్రిపుండ్రాంకిత మస్తకః,
శివార్చన పరో నిత్యం రుద్రాక్ష మపి ధారయేత్॥ ౪౪

విధ్యుక్తముగా భస్మస్నానముచేసి భస్మత్రిపుండ్రములను పదునేను స్థలములందును ముఖ్యముగా శిరస్సునందును, నొసటను దాల్చి శివపూజాసక్తుఁడైన వీరశైవుఁడు రుద్రాక్షములను గూడ ధరింపనగును.

రుద్రాక్ష ధారణా దేవ ముచ్యంతే సర్వపాతకైః,
దుష్ట చిత్తా దురాచారా దుష్ప్రజ్ఞా అపి మానవాః॥ ౪౫

మానవులు దుష్టమనస్కులే కానిండు, దుర్మార్గ సంచారులే కానిండు, దుష్టబుద్ధులే కానిండు, వారు సర్వపాపములనుండి తొలఁగుటకు రుద్రాక్ష ధారణమే సాధనము.

పురా త్రిపుర సంహారే త్రినేత్రో జగతాం పతిః,
ఉదపశ్య త్పురాం యోగ మున్మీలిత విలోచనః॥ ౪౬

మున్ను ముక్కంటియు జగన్నాథుఁడు నైన పరమ శివుఁడు త్రిపుర దైత్య సంహారకాలమందుఁ దన ముక్కన్నులను విచ్చి యా దైత్యుల పైభాగమును జూచెను.

నిపేతు స్తస్య నేత్రేభ్యో బహవో జలబిందవః,
తేభ్యో జాతా హి రుద్రాక్షా రుద్రాక్షా ఇతి కీర్తితాః॥ ౪౭

సూర్య చంద్రాగ్ని స్వరూపములైన యా రుద్రనేత్రములనుండి పెక్కులు నీటి చుక్కలు రాలెను. ఆ రుద్రనేత్ర బిందువులవలనఁ బుట్టినవి కావుటవే రుద్రాక్షములను పేర వెలసినవి.

రుద్ర నేత్ర సముత్పన్నా రుద్రాక్షా లోకపావనాః,
అష్ట త్రింశ త్ప్రభేదేన భవం త్యుత్పత్తి భేదతః॥ ౪౮

అటులు రుద్రుని యక్షులనుండి పుట్టినవియు, జగములను పవిత్రములుగాఁ జేయునవియైన రుద్రాక్షములు పుట్టుకయందలి భేదముచే ముప్పది యెన్మిది విధములుగా నున్నవి.

నేత్రాత్సూర్యాత్మనః శంభోః కపిలా ద్వాదశోదితాః,
శ్వేతాః షోడశ సంజాతాః సోమరూపా ద్విలోచనాత్॥ ౪౯

కృష్ణా దశవిధా జాతా వహ్నిరూపా ద్విలోచనాత్,
ఏవ ముత్పత్తి భేదేన రుద్రాక్షా బహుధా స్మృతాః॥ ౫౦

పన్నెండు కళల వాఁడయిన సూర్యుని రూపమగు శంభునేత్రము నుండి కపిలవర్ణము (గోరోచనపు వన్నె) గల 12 విధములైనవియు, పదునారు కళలవాఁడయిన చంద్రుని రూపమైన శంభునేత్రము నుండి తెల్లనివగు 16 విధములైనవియు, పదికళలవాఁడయిన యగ్నిస్వరూపమైన శివుని మూఁడవ కంటినుండి నల్లనివగు 10 విధములైనవియు బుట్టినవి. ఇటులు పుట్టుక భేదముచే రుద్రాక్షము లనేక (38) విధములని చెప్పఁబడినది.

అచ్ఛిద్రం కనకప్రఖ్య మనన్య ధృత ముత్తమం,
రుద్రాక్షం ధారయే త్ప్రాజ్ఞః శివపూజా పరాయణః॥ ౫౧

బంగారు రంగుగలిగి రంధ్రములు లేక ఇతరులచే ధరింపఁబడని రుద్రాక్షము లుత్తమములు. శివార్చనపరులైన తెలిసినవార లిట్టివే తాల్పవలయును.

యథా స్థానం యథా వక్త్రం యథా యోగం యథా విధి,
రుద్రాక్ష ధారణం వక్ష్యే రుద్ర సాయుజ్య సిద్ధయే॥ ౫౨

ఎన్ని ముఖములుగల రుద్రాక్షములు ఎన్ని ఏ చోటుల దాల్ప వలయునో చెప్పెదను. అటులు తాల్చువారికి రుద్రసాయుజ్య ముక్తి గలుగును.

శిఖాయా మేకమేకాస్యం రుద్రాక్షం ధారయే ద్బుధః,
ద్వి త్రిద్వాదశ వక్త్రాణి శిరసి త్రీణి ధారయేత్॥ ౫౩

షట్త్రింశ ద్ధారయే న్మూర్ధ్ని నిత్య మేకాదశాననాన్,
దశ సప్త పంచ వక్త్రాన్ షట్ షట్ కర్ణద్వయే వహేత్॥ ౫౪

షడష్టవదనాన్ కంఠే ద్వాత్రింశ ద్ధారయే త్సదా,
పంచాశ ద్ధారయే ద్ధీమాన్ చతుర్వక్త్రాణి వక్షసి॥ ౫౫

త్రయోదశ ముఖాన్ బాహ్వోర్ధరేత్ షోడశ షోడశ,
ప్రత్యేకం ద్వాదశ వహే న్మవాస్యా న్మణిబంధయోః॥ ౫౬
చతుర్దశ ముఖం యజ్ఞ సూత్ర మష్టోత్తరం శతం,
ధారయే త్సర్వకాలం తు రుద్రాక్షం శివపూజకః॥ ౫౭

తెలిసినవారు శిఖయందు ఒకముఖము గలదాని నొక్కదానినే ధరింపవలయును. 2, 3, 12 మొగములు గల మూఁడింటిని శిరస్సున ధరింపవలయు. పదునొకండుముఖముల రుద్రాక్షములను ముప్పదియాఱింటిని మూర్ధమున ధరింపవలయును. పది, ఏడు, అయిదు ముఖములు గలవానిని ఆఱేసి చొప్పున రెండుచెవులందున ధరింపవలయును. (అనగా పదిముఖములవి రెండును, ఏడుముఖములవి రెండును, ఐదుముఖములవి రెండును, వెరసి 6 అని భావము.) 6, 8 మొగములుగలవానిని 32 టిని మాలగాఁ జేసి కంఠమునఁ దాల్పవలయును. నాలుగుమోములు గల 50 టిని మాలగాఁ గూర్చి వక్షమునఁ దాల్పవలయును. 13 మొగములు గలవానిని 16 చొప్పున రెండుబాహువులకు ధరింపవలయును. 9 ముఖములు గలవానిని 12 చొప్పున రెండు ముంజేతులందుఁ దాల్పవలయును. 14 మొగములు గలవానిని 108 మాలగాఁ గూర్చి జందెముగా ధరింపవలయును. ఇటులు శివపూజారతుఁడు సర్వకాలములందు రుద్రాక్షములను దాల్పవలయును.

ఏవం రుద్రాక్షధారీ యః సర్వకాలే తు వర్తతే,
తస్య పాపకథా నాస్తి మూఢస్యాపి నసంశయః॥ ౫౮

ఇటులు రుద్రాక్షములను దాల్చువాఁడు ఎట్టిమూర్ఖుఁడైనను వానికి పాపమను మాటయే లేదు. అనగా పాపము లంటవనుట, నిస్సంశయము.

బ్రహ్మహా మద్యపాయీ చ స్వర్ణ హృద్గురు తల్పగః,
మాతృహా పితృహా చైవ భ్రూణహా కృత ఘాతకః,
రుద్రాక్ష ధారణా దేవ ముచ్యతే సర్వ పాతకైః॥ ౫౯

బ్రాహ్మణుని జంపుట, కల్లు ద్రాగుట, బంగారు దొంగలించుట, గురుభార్యను గలియుట, తల్లినిఁ జంపుట, తండ్రినిఁ జంపుట, కడుపు

లోని బిడ్డను జంపుట (భ్రూణ శబ్దమునకు వేదపారగుఁ డనియు నర్థము) మున్నగు మహాపాతకము లొనర్చిన వాఁడైనను రుద్రాక్ష ధారణముచే సకల పాపములవలన విడువఁబడును.

దర్శనాత్ స్పర్శనాచ్చైవ స్మరణా దపి పూజనాత్,
రుద్రాక్ష ధారణా ల్లోకే ముచ్యంతే పాతకై ర్జనాః॥ ౬౦

జనులు రుద్రాక్షములను జూచినను, తాకినను, తలంచుకొన్నను, పూజించినను, ధరించినను, పాపములవలన విడువఁబడుదురు.

బ్రాహ్మణోవాఽంత్యజో వాపి మూర్ఖోవా పండితోఽపివా,
రుద్రాక్ష ధారణా దేవ ముచ్యతే సర్వపాతకైః॥ ౬౧

బ్రాహ్మణుఁడే కానిమ్ము, కడజాతివాఁడే కానిమ్ము; పండితుఁడే కానిమ్ము; మూర్ఖుఁడే కానిమ్ము; రుద్రాక్ష ధారణము వలననే పాపములనుండి విడివడును.

గవాం కోటి ప్రదానస్య యత్ఫలం భువి లభ్యతే,
తత్ఫలం లభతే మర్త్యో నిత్యం రుద్రాక్ష ధారణాత్॥ ౬౨

నిత్య రుద్రాక్ష ధారణముచే మనుజునకుఁ కోటిగోవులను దానమిచ్చుటచేఁ గలుగు ఫలము గలుగును.

మృతికాలే తు రుద్రాక్షం నిష్పీడ్య సహ వారిణా,
యః పిబే చ్చింతయ న్రుద్రం రుద్రలోకం స గచ్ఛతి॥ ౬౩

మరణకాలమం దెవఁడు రుద్రాక్షమునుండి జారునీటిని (రుద్రాక్షము నీటవైచి యానీటిని) త్రాగునో వాఁడు రుద్రలోకమునకే పోవును.

భస్మోద్ధూలిత సర్వాంగా ధృత రుద్రాక్ష మాలికాః,
యే భవంతి మహాత్మానో రుద్రా స్తే నాత్ర సంశయః॥ ౬౪

ఏ మహాత్ములు సర్వాంగములందు భస్మధారణముచేసి రుద్రాక్ష పేరులను ధరింతురో వారు సాక్షాద్రుద్రులే యగుదు రన సందియమేల?

నిత్యాని కామ్యాని నిమిత్తజాని
కర్మాణి సర్వాణి సదాపి కుర్వన్,
న భస్మ రుద్రాక్షధరో యది స్యాత్
ద్విజో న తస్యాస్తి ఫలోపపత్తిః॥ ౬౫

బ్రాహ్మణుఁడు సమస్తమైన నిత్యకర్మములను నైమిత్తికకర్మములను కామ్యకర్మములను జేయునపుడెల్ల భస్మరుద్రాక్షములను ధరింపఁడేని వాని కాయా కర్మములవలని ఫలము దక్కదు.

సర్వేషు వర్ణాశ్రమ సంగతేషు
నిత్యం సదాచార పరాయణేషు,
శ్రుతి స్మృతిభ్యా మిహ చోద్యమానో
విభూతి రుద్రాక్ష ధరః సమానః॥ ౬౬

సదాచారపరాయణులును, వర్ణాశ్రమ ధర్మాసక్తులు నైన వారలందు విభూతి రుద్రాక్షములను ధరించువారే శ్రేష్ఠులని శ్రుతి స్మృతులు కొనియాడుచున్నవి.

ఇ ది

సిద్ధాన్త శిఖామణి యందలి – భక్తస్థలమున
భస్మ రుద్రాక్ష ధారణ స్థల మనెడి
ఏ డ వ ప రి చ్ఛే ద ము.

శ్రీ శి వా ర్ప ణ ము.

శ్రీ మాత్రే నమః

ఓం నమః శివాయ

శ్రీ జగద్గురు పంచాచార్యాః ప్రసీదంతు.

# ఎనిమిదవ పరిచ్ఛేదము.

## 8. పంచాక్షర జప స్థలము.

స్మృతిః శ్రీ భూతి రుద్రాక్షః ప్రయతో లింగధారకః,
జపే త్పంచాక్షరీ విద్యాం శివతత్త్వ ప్రబోధినీమ్॥ ౧

మంగళకరములైన భస్మరుద్రాక్షములను దాల్చి పవిత్రుఁడైన లింగధారి యగువాఁడు శివతత్త్వమును బోధించు శ్రీ రుద్రప్రసిద్ధ పంచాక్షర మంత్రమును జపింపవలయును.

శివతత్త్వా త్పరం నాస్తి యథా తత్త్వాంతరం మహత్,
తథా పంచాక్షరీ మంత్రా న్నాస్తి మంత్రాన్తరం మహత్। ౨

శివతత్త్వము కంటెను శ్రేష్ఠమైన తత్త్వము వేఱొండు లేదు. అట్లే పంచాక్షరి మంత్రము కంటెను శ్రేష్ఠమైన మరియొక మంత్రము లేదు.

జ్ఞాతే పంచాక్షరీ మంత్రే కిం వా మంత్రాంతరైః ఫలం,
జ్ఞాతే శివే జగన్మాత్రే కిం ఫలం దేవతాంతరైః॥ 3

సకల మంత్రములకును దల్లియైన పంచాక్షర మంత్రముయొక్క మాహాత్మ్యము నెఱింగినపై నిమఱియొక మంత్రముతోఁ బ్రయోజనమేమి? సకల చరాచర జగన్నిర్మాణకారణుఁడైన పరశివుని స్వరూపమే [illegible] ను ఇతర దేవతలవలని ప్రయోజనమేమి?

స[illegible]కోటిషు మంత్రేషు మంత్రః పంచాక్షరో మహాన్,
[illegible] దేవేషు యథా శంభు ర్మహత్తరః॥ ౪

[illegible] మహామంత్రములందును పంచాక్షర మహామంత్రమే [illegible]. ముప్పది మూడు కోటుల దేవతలలో శివుఁడే [illegible].

అశేష జగతాం హేతుః పరమాత్మా మహేశ్వరః,
తస్యవాచక మంత్రోఽయం సర్వమంత్రైక కారణమ్॥ ౫

పరమేశ్వరుఁడైన శివపరమాత్మయే సకలభువనముల యుత్పత్తి స్థితి లయకారణుఁడు. ఆ పరమాత్మనామమైన (నామము = తత్త్వము దీనిచేత పలుకఁబడును) ఈమంత్రమే సర్వమంత్రములకు మూలమైనది.

తస్యాభిధాన మంత్రోఽయ మభిధేయశ్చ స స్మృతః,
అభిధానాభిధేయత్వా న్మంత్రాత్ సిద్ధః పరః శివః॥ ౬

ఈ పంచాక్షర మంత్రమే శివుని నామము. దీనిచేతనే అతఁడు చెప్పఁబడును. అనగా శివుఁడు వాచ్యము; మంత్రము వాచకము. అనఁగా శివతత్త్వమెల్ల ఈ మంత్రముచేతనే తెలియఁబడుననుట.

నమః శబ్దం వదే త్పూర్వం శివాయేతి తతః పరం,
మంత్రః పంచాక్షరో హ్యేష సర్వశ్రుతి శిరోగతః॥ ౭

మొదట నమశ్శబ్దము నుచ్చరించి తర్వాత 'శివాయ' యని యుచ్చరింపవలయును. ఉపనిషత్తుల నన్నిటను బూజింపఁబడిన పంచాక్షర మంత్ర మిదియే.

ఆదితః పరిశుద్ధత్వా న్మలత్రయ వియోగతః,
శివ ఇత్యుచ్యతే శంభు శ్చిదానంద ఘనః ప్రభుః॥ ౮

సచ్చిదానంద స్వరూపుఁడును, సర్వస్వతంత్రుఁడు నైన శంభుఁడే ఆదినుండియు, ఆణవాది మలములతో నెట్టి సంపర్కమునులేని పరిశుద్ధుఁ డగుటచేతను "శివ" శబ్దముచేఁ జెప్పఁబడు చున్నాఁడు. (శంభుఁడు = పరమానంద స్వరూపుఁడై ప్రకాశించువాఁడు, ఇతని వలన సుఖము పొందఁబడుచున్నది. శివుఁడు = సత్పురుషుల మనసు లందు శయనించువాఁడు. శుభములతోఁ గూడినవాఁడు, ఇతని యందు సజ్జన మనస్సు లందును శుభముల నిచ్చువాఁడు, పరమానంద స్వరూపుఁడై నిర్వికారుఁడై శమించి యుండువాఁడు అని యర్థములు).

ఆస్పదత్వా దశేషాణాం మంగలానాం విశేషతః,
శివ శబ్దాభిధేయో హి దేవదేవ స్త్రియంబకః॥ ౯

బ్రహ్మ మున్నగు దేవతల కెల్లరకు ఆశ్రయుఁ డగుటచేతను, విశేషించి సర్వశుభములకును స్థానమగుటచేతను, కాల సూచకులైన సూర్య చంద్రాగ్నులనెడి ముక్కన్నులు గలవాఁడగుట చేతను, (సూర్య చంద్రాగ్నులు తన కంగ భూతులగుటచేత కాలస్వరూపుఁడును, కాలాతీతుఁడు ననుట) ఇతనికి శివ శబ్దము చెల్లుచున్నది.

> శివ ఇత్యక్షర ద్వంద్వం పరబ్రహ్మ ప్రకాశకం,
> ముఖ్య వృత్త్యా తదన్యేషాం శబ్దానాం గౌణవృత్తయః॥ ౧౦

'శివ' యనెడి రెండక్షరముల పదము పరబ్రహ్మ తత్త్వమును వెల్లడించునది. ఇంతకు వేఱయిన చంద్రశేఖర, విరూపాక్ష, శూలీత్యాది నామము లన్నియు ఆ శివుని గుణగణములను దెల్పునవియే.

> తస్మా న్ముఖ్యతరం నామ శివ ఇత్యక్షర ద్వయం,
> సచ్చిదానంద రూపస్య శంభో రమిత తేజసః॥ ౧౧

అందుచే 'శివ' యను రెండక్షరముల పదమే సచ్చిదానంద స్వరూపుఁడును, హద్దులేని తేజస్సు గలవాఁడునైన పరమేశ్వరుని నామముల యందెల్ల ముఖ్యతమము.

> ఏత న్నామావలంబేన మంత్రః పంచాక్షరః స్మృతః,
> యస్మా దతః సదా జప్యో మోక్షకాంక్షిభి రాదరాత్॥ ౧౨

'శివ' యను సర్వమంగళాత్మక పదము పట్టుగా నుండుటచేతనే పంచాక్షర మంత్రము మహామంత్ర మనఁబడెను. అందుచే మోక్షార్థు లెల్లరును సాదరముగా దీనినే జపింపఁ దగును.

> యథానాది ర్మహాదేవః సిద్ధః సంసార మోచకః,
> తథా పంచాక్షరో మంత్రః సంసార క్షయకారకః॥ ౧౩

ఆద్యంతములు లేని మహాదేవుఁ డెటులు భవబంధ విమోచకుఁడో యటులే యీ పంచాక్షర మహామంత్రమును భవనాశకమే యగుచున్నది.

> పంచభూతాని సర్వాణి పంచతన్మాత్రకాని చ,
> జ్ఞానేంద్రియాణి పంచాపి పంచ కర్మేంద్రియాణి చ॥ ౧౪

పంచ బ్రహ్మాణి పంచాపి కృత్యాని సహకారణైః,
బోధ్యాని పంచభి ర్వర్ణైః పంచాక్షర మహామనోః॥ ౧౫

పంచధా పంచధా యాని ప్రసిద్ధాని విశేషతః,
తాని సర్వాణి వస్తూని పంచాక్షర మయాని హి॥ ౧౬

ఈ పంచాక్షర మహామనువు నందలి పంచాక్షరముల వలన, పృథ్వి, అప్పు, తేజస్సు, వాయువు, ఆకాశ మనెడి పంచ మహా భూతములును; గంధము, రసము, రూపము, స్పర్శము, శబ్దము అనెడి పంచతన్మాత్రలును; ఘ్రాణము, జిహ్వ, చక్షువు, త్వక్కు, శ్రోత్రము ననెడి పంచ జ్ఞానేంద్రియములును; వాక్కు, పాణి, పాదము, పాయువు, ఉపస్థము ననెడి పంచకర్మేంద్రియములును; సద్యోజాత, వామదేవ, అఘోర, తత్పురుష, ఈశాను లనెడి పంచబ్రహ్మలును (బ్రహ్మ విష్ణు రుద్ర ఈశ్వర సదాశివులని కొందఱ మతము); సృష్టి, స్థితి, లయము, తిరోధానము, అనుగ్రహము అనెడి పంచకృత్యములును ఇటులే పంచ సంఖ్యచేఁ బ్రతిపాదింపఁబడు సర్వమును ఇమ్మనువు నందలి పంచాక్షరములే.

ఓంకార పూర్వో మంత్రోఽయం పంచాక్షరమయః పరః,
శైవాగమేషు వేదేషు షడక్షర ఇతి స్మృతః॥ ౧౭

'నమః శివాయ' యనెడి అయిదు బీజాక్షరములుగల సర్వోత్తమ మగు నీ మంత్రమునకే తొలుత 'ఓం' అనెడి ప్రణవ బీజమును గలిపినచో శైవషడక్షర మంత్రమని శైవాగమము లందును శ్రుతులందును ఉగ్గడింపఁ బడినది.

మంత్రస్యాస్యాది భూతేన ప్రణవేన మహామనోః,
ప్రబోధ్యతే మహాదేవః కేవల శ్చిత్సుఖాత్మకః॥ ౧౮

ఇమ్మహామంత్రమున కాదినున్న ఓంకారముచేఁ బరమశివుఁడు చిదానంద స్వరూపుఁడని తేటపడుచున్నది. "నకార స్తారకాకారో మకారో దండ ఉచ్యతే।శికారః కుండలాకారో వకార శ్చార్ధ చంద్రకః।యకారో దర్పణాకార ఓంకారః పంచవర్ణరాట్" ఇంతియగాక బీజనిఘంటువును

బట్టి ప్రత్యక్షరమును మంత్రమందలిది శివవాచకముగానే కానవచ్చును. చూడుఁడు.

న = గణేశుఁడు, శివుఁడు, అనాది; మ = మహాకాలుఁడు, జీవుఁడు, పురుషుఁడు, శ = శివుఁడు + ఇ = శక్తి = శి = శక్తి విశిష్ట శివుఁడు; వ = శంకరుఁడు, రుద్రుఁడు, ఆకాశము, య = సోముఁడు (ఉమా సహితుఁడు) అన శక్తి విశిష్ట శివుఁడే, చంద్రుఁడు. కావున నిమ్మహా మంత్ర బీజసముదాయమును బట్టియే కాక మహామంత్ర మందలి ప్రత్యక్షరమును శివస్వరూప ప్రతిపాదకమే.

ప్రణవేనైకవర్ణేన పరబ్రహ్మ ప్రకాశ్యతే,
అద్వితీయం పరానందం శివాఖ్యం నిష్ప్రపంచకమ్॥ ౧౯

"ఏకమేవా ద్వితీయం బ్రహ్మ" యను శ్రుత్యంతవాక్యము వలన తనకంటె రెండవది లేనివాఁడును "ఆనందం బ్రహ్మేతి వ్యజానీయాత్" అను శ్రుతినిబట్టి పరమానందస్వరూపుఁడును, "నేహనానాస్తి కించన" యను శ్రుతినిబట్టి హేయప్రపంచశూన్యుఁడును అయిన పరశివబ్రహ్మమే ప్రణవనామకమైన ఓంకారముచేఁ దెలుపఁబడుచున్నాఁడు.

పరమాత్మ మనుర్జ్ఞేయః సోఽహం రూపః సనాతనః,
జాయతే సహయోర్లోపా దోమిత్యేకాక్షరో మనుః॥ ౨౦

సనాతనమైన యీ పంచాక్షర మంత్రమే 'సోఽహం' రూపమైనది. నమః యనుదాన, మః = జీవుఁడను, న = కాను; శివాయ = శివుఁడనే, ఈ చతుర్థీ విభక్త్యంతము ఐక్యమునే బోధించును. అపుడు 'శివోఽహం' అను మహా వాక్యార్థమే తేలును.

ఇట్టివృత్తితో జపించునపుడు, సకారము చంద్రబీజము. హకారము సూర్యబీజము. ఇవే ఇడా,పింగళా నాడులు. కుంభకమందీ రెండుహల్లులు లోపింపగా మిగులునది ఓకారమే. ఇది తుది బిందువుతోఁ గూడి ప్రణవ బీజముగా (ఓం) మిగిలి, నాకంటె భిన్నుఁడుకాని పరమశివుఁడు ఓంకార స్వరూపుఁడే యని సాధకుఁడు గ్రహింపఁగలఁడు.

ప్రణవేనైవ మంత్రేణ బోధ్యతే నిష్కలం శివః,
పంచాక్షరేణ మంత్రేణ పంచబ్రహ్మ తనుస్తథా॥ ౨౧
నిష్కలః సంవిదాకారః సకలో విశ్వమూర్తికః,
ఉభయాత్మా శివో మంత్రే షడక్షరమయే స్థితః॥ ౨౨

ప్రణవ మంత్రముచేత నిష్కల శివుఁడు తెలియఁ బడుచున్నాఁడు. పంచాక్షర మంత్రముచేత సద్యోజాతాది పంచ బ్రహ్మరూప శివుఁడు తెలియఁ బడుచున్నాఁడు. నిష్కల శివుఁడు శుద్ధజ్ఞాన స్వరూపుఁడు. సకల శివుఁడు ప్రపంచ స్వరూపుఁడు. ఇట్టులు నిష్కలుఁడు సకలుఁడునైన శివుఁడు ఓంకార పూర్వకమైన పంచాక్షర మంత్రముచేఁ దెలియఁ బడుచున్నాఁడు.

మూలం విద్యా శివః శైవసూత్రం పంచాక్షరస్తథా,
ఏతాని నామధేయాని కీర్తితాని మహామనోః॥ ౨౩

మూలము, విద్య, శివుఁడు, శైవసూత్రము, పంచాక్షరము అనెడి పేళ్లతో ఇమ్మహామంత్రమే ప్రసిద్ధమగుచున్నది.

పంచాక్షరీ మిమాం విద్యాం ప్రణవేన షడక్షరీం,
జపేత్సమాహితో భూత్వా శివపూజా పరాయణః॥ ౨౪

శివపూజాసక్తుఁడైన వీరశైవుఁడు ప్రణవసహితమైన పంచాక్షర మహామంత్రమును (అనగా షడక్షర మంత్రమును) ఏకాగ్రమైన చిత్తముతో జపింపవలయును.

ప్రాణాయామ త్రయం కృత్వా ప్రాఙ్ముఖోదఙ్ముఖోఽపివా,
చింతయన్ హృదయాంభోజే దేవదేవం త్రిలోచనమ్॥ ౨౫

సర్వాలంకార సంయుక్తం సాంబం చంద్రార్ధశేఖరం,
జపే దేతాం మహావిద్యాం శివరూపా మనన్యధీః॥ ౨౬

తూర్పు మొగమయిగాని, ఉత్తరముఖముగా నుండిగాని, చేలాజిన కుశోత్తరమైన (క్రింద దర్భాసనము, దానిపై లేడి, పులి యనువాని చర్మములలో నొకటి, ఆపైని వస్త్రము) ఆసనముమీఁదఁ గూర్చుండి పూరక, కుంభక, రేచక రూపమైన ప్రాణాయామము (కుడిచేతి బొట్టన

[illegible] ముక్కు కుడిరంధ్రమును మూసి, ఎడమరంధ్రముదారిని నెమ్మ
దిగా వాయువును పీల్చుట పూరకము. ఆ పీల్చినంత కాలమునకు
[illegible] కాలమును వాయువును నిల్పుట కుంభకము. ఆ కుంభక
[illegible] సగముకాలమున ఎడమ ముక్కురంధ్రము దారిని నడిమి
[illegible] మూసి కుడిరంధ్రమును మూసిన బొటనవ్రేలి నెత్తివేసి
[illegible] నెమ్మదిగా విడువవలయును. ఇది యొక ప్రాణా
యామము. ఇట్లు (3 సారులు) చేసి ప్రాణశక్తిని గడించి, తన హృదయ
[illegible]ందు చంద్రుఁడు తలపూవుగాఁ గలట్టియు, ముక్కన్నులు
[illegible]యు. సర్వాలంకార భూషితమైన మూర్తిగా దేవాధిదేవుఁడైన
[illegible] ధ్యానించి శివస్వరూపమైన యిమ్మహామంత్రమును జపింప
వలయును.

జపస్తు త్రివిధః ప్రోక్తో వాచికోపాంశు మానసః,
శ్రూయతే యస్తు పార్శ్వస్థై ర్యథావర్ణ సమన్వయః,
వాచికః సతు విజ్ఞేయః సర్వపాప ప్రభంజనః॥ ౨౭

ఈషత్ స్పృష్ట్వాఽధర పుటం యో మంద మభిధీయతే,
పార్శ్వస్థై రశ్రుతః సోఽయ ముపాంశుః పరికీర్తితః॥ ౨౮

అస్పృష్ట్వాఽధర మస్పంది జిహ్వాగ్రం యోఽంతరాత్మనా,
ధ్యాయతే వర్ణరూపేణ స మానస ఇతి స్మృతః॥ ౨౯

ఈ జపము వాచికము, ఉపాంశువు, మానసికము అని ముత్తెఱం
గులు. తన చెంతల నున్న వారికి మంత్రబీజవర్ణములు చక్కఁగా వినవచ్చు
నట్లు జపించుట వాచికము. చుట్టుపట్టుల నున్న వారికి వినరానట్లు పెద
వులు మాత్రమే కదలునట్లు జపించుట ఉపాంశుజపము. పెదవులు,
[illegible] చలింపకుండ మంత్ర బీజాకారమునే చెందిన మనస్సుతో
జపించుట మానసిక జపము. మంత్రార్థ మననము చేయుచుఁ జేయు
[illegible] సగర్భజప మనఁబడును.

యావంతః కర్మ యజ్ఞాద్యా వ్రత దాన తపాంసి చ,
సర్వే తే జప యజ్ఞస్య కలాం నార్హంతి షోడశీమ్॥ 30

లోకమున జ్యోతిష్టోమాదులైనవి యజ్ఞములే. వ్రతములు, దానములు, తపస్సులు, యజ్ఞములే యైనను జపమనెడి యజ్ఞమునందు పదునాఱవ పాలికైననవి సాటికావు.

మాహాత్మ్యం వాచిక స్యైత జ్జప యజ్ఞస్య కీర్తితం,
తస్మా చ్ఛతగుణోపాంశుః సాహస్రో మానసః స్మృతః॥ 30

వాచిక జప యజ్ఞమున కెంత గొప్పదనము చెప్పఁబడెనో అంతకు నూఱురెట్లు ఉపాంశు జపయజ్ఞమునకును, దానికి వేయింతలు మానసిక జపయజ్ఞమునకును గొప్పదనము చెప్పఁబడినది.

వాచికా త్తదుపాంశోశ్చ జపా దస్య మహామనోః,
మానసో హి జపః శ్రేష్ఠో ఘోర సంసార నాశకః॥ 32

కావున వాచికోపాంశు జపముల కంటెను మానసికమే శ్రేష్ఠమై సాధకుని భయంకర సంసారమునుండి తప్పించును.

ఏతేష్వేకేన విధినా యథా భావం యథా క్రమం,
జపే త్పంచాక్షరీ మేతాం విద్యాం పాశ విముక్తయే॥ 33

ఈ మూఁడు విధములందును ఏదోయొకవిధమున క్రమముతప్పక యీ పంచాక్షరమహామనువును భవపాశముక్తిని గోరువారు జపింపవలయును.

శివుని ముందు పూజింపక స్తోత్రజపములు చేసినను ఫలమున్నదనఁగా మున్ను శివపూజ చలిపి జపస్తోత్రములు చేసినచోఁ దత్ఫలము చెప్ప నలవికాదు. వేయి సారులుగాని, అందు సగముగాని, అందు సగము గాని, ఎనిమిదివందలు గాని, వేయునెన్మిది సంఖ్యగాఁగాని చేయవలయును. కోటిపూజా సమము స్తోత్రము. కోటిస్తోత్ర సమము జపము. కోటిజప సమము ధ్యానము. కోటి ధ్యాన సమము లయము.

అనేన మూలమంత్రేణ శివలింగం ప్రపూజయేత్,
నిత్యం నియమ సంపన్నః ప్రయతాత్మా శివాత్మకః॥ 34

శివపూజా నియమనిష్ఠుఁడై పవిత్రుఁడై శివస్వరూపుఁడైన వీర శైవుఁడు నిత్యము ఈ షడక్షర మంత్రరాజముతోనే శివలింగమును బూజింపవలయును.

[illegible] పంచాక్షరేణైవ యః శివం సకృదర్చయేత్,
[illegible] గచ్ఛే చ్ఛివస్థానం మంత్రస్యాస్యైవ గౌరవాత్॥ ౩౫

[illegible] కేవల మీ పంచాక్షరమంత్రముతో నొక్కసారి శివుని [illegible] అతఁ డీ మంత్రప్రభావముచే శివలోకము నొందును.

అబ్భక్షా వాయుభక్షాశ్చ యే చాన్యే వ్రతకర్శితాః,
తేషా మేతై ర్వ్రతై ర్నాస్తి శివలోక సమాగమః॥ ౩౬

కేవల జలాహారులే కానిండు; కేవల వాతాహారులే కానిండు; [illegible] వ్రతములు పూనినవారలే కానిండు; వారల కెవ్వరికిని వీనిచే [illegible] లేదు.

[illegible] త్రవాంసి యజ్ఞాశ్చ వ్రతాని నియమా స్తథా,
పంచాక్షరార్చనస్యైతే కోట్యంశేనాపి నో సమాః॥ ౩౭

[illegible] తపస్సులు, యజ్ఞములు, వ్రతములు, నియమములును, [illegible] మంత్రజపమున నొక్కకోటి భాగమునకైన సాటికావు.

అశుద్ధో వా విశుద్ధో వా సకృ త్పంచాక్షరేణ యః,
పూజయే త్పతితో వాపి ముచ్యతే నాత్రసంశయః॥ ౩౮

[illegible] డే కానిండు; అశుద్ధుఁడే కానిండు; పతితుఁడే కానిండు; పంచా[illegible] మంత్రముచే శివుని బూజించెనేని భవబంధముక్తుఁడు కాఁజాలును.

సకృదుచ్చార మాత్రేణ పంచాక్షర మహామనోః,
[illegible]షా మపి జంతూనాం సర్వపాపక్షయో భవేత్॥ ౩౯

పంచాక్షరమంత్రము నొక్కసారి జపించినను ఎల్లప్రాణుల యెల్ల [illegible]ములను నశింపఁజేయును.

[illegible] బహవో మంత్రా విద్యంతే సకలాగమే,
[illegible] సమాభ్యాసాత్ పురుషార్థ ప్రదాయినః॥ ౪౦

[illegible] నములందును బలుమంత్రములు కానవచ్చును. [illegible] నభ్యసించుటచేతనే ధర్మార్థ కామ మోక్ష [illegible].

ఏష మంత్రో మహాశక్తి రీశ్వర ప్రతిపాదకః,
సకృ దుచ్చారణా దేవ సర్వసిద్ధి ప్రదాయకః॥ ౪౧

ఇమ్మహా పంచాక్షర మంత్రమో అద్భుతశక్తి గలది. పరమేశ్వర స్వరూపమును బోధించునదియై యొక్కసారి యుచ్చరించినంతనే సర్వార్థసిద్ధుల నొసఁగును.

పంచాక్షరీం సముచ్చార్య పుష్పం లింగే వినిక్షిపేత్,
య స్తస్య వాజపేయానాం సహస్ర ఫల మిష్యతే॥ ౪౨

ఎవఁడు పంచాక్షర మహామంత్రము నుచ్చరించుచు శివలింగమందు పుష్పము సమర్పించునో, వానికి వేయి వాజిపేయ మహాయాగముల ఫలము గల్గుననిరి.

అగ్నిహోత్రం త్రయో వేదా యజ్ఞాశ్చ బహు దక్షిణాః,
పంచాక్షర జపస్యైతే కోట్యంశే నాపి నో సమాః॥ ౪౩

నిత్యాగ్నిహోత్రకార్యము, వేదత్రయాధ్యయనము, బహు దక్షిణములు గల జ్యోతిష్టోమాది యాగములు అనునవి పంచాక్షరజపమునఁ గోటివంతునకైన సాటికావు.

పురా సానంద యోగీంద్రః శివజ్ఞాన పరాయణః,
పంచాక్షరం సముచ్చార్య నారకా నుదతారయత్॥ ౪౪

మున్ను సానందుఁడను జోగిరాయఁడు శివజ్ఞానాసక్తుఁడు పంచాక్షర మహామంత్రము నుపదేశించియే యెందఱనో పాపులను నరకమునుండి యుద్ధరించెను.

సిద్ధ్యై పంచాక్షరస్యాస్య శతానందః పురా మునిః,
నరకం స్వర్గ మకరోత్ సంగిరస్యాపి పాపినః॥ ౪౫

మున్ను శతానందుఁడను మహర్షి యిమ్మహా మంత్రసిద్ధిచేతనే సంగిరుఁడను పాపి ననుగ్రహించి, వానికై నరకమును స్వర్గముగా మార్చెను.

ఉపమన్యుః పురా యోగీ మన్త్రేణానేన సిద్ధిమాన్,
లబ్ధవాన్ పరమేశానా చ్ఛైవశాస్త్ర ప్రవక్తృతామ్॥ ४८

పూర్వ ముపమన్యుండను యోగీంద్రుండు పంచాక్షర మంత్రసిద్ధిచేతనే పరమేశ్వరుని వలన శైవశాస్త్రమును బోధింపఁగల యాచార్యుఁ డయ్యెను.

వసిష్ఠ వామదేవాద్యా మునయో ముక్తకిల్బిషాః,
మన్త్రేణానేన సంసిద్ధా మహాతేజస్వినోఽభవన్॥ ४९

వసిష్ఠుండు, వామదేవుండు మున్నగు మునీంద్రులెల్లరు పంచాక్షర మంత్రశక్తిచేతనే మహాతేజశ్శాలులై సిద్ధపురుషు లనిపించుకొనిరి.

బ్రహ్మాదీనాం చ దేవానాం జగత్సృష్ట్యాది కర్మణి,
మన్త్రస్యాస్యైవ మహాత్మ్యాత్ సామర్థ్య ముపజాయతే॥ ५०

బ్రహ్మ విష్ణు రుద్రులు మున్నగు వేల్పులెల్లరు పంచాక్షర మహామంత్రశక్తి పొంది దాని మహిమముచేతనే భువనములు సృష్టించుట పాలించుట మున్నగు పనులు చేయఁగల్గుచున్నారు.

కిమిహ బహుభి రుక్తై ర్మంత్రమేనం మహాత్మా
ప్రణవ సహిత మాదా యస్తు పంచాక్షరాఖ్యం,
జపతి పరమ భక్త్యా పూజయన్ దేవదేవం
స గతనిఖిలబంధో మోక్షలక్ష్మీం ప్రయాతి॥ ५१

పలు పలుకు లేల? ప్రణవపూర్వకముగా నే మహాత్ముఁ డీ పంచాక్షర మహామంత్రమును భక్తితో జపించునో, ఆ మంత్రోచ్చారణము చేత దేవాదిదేవుని విశ్వేశ్వరుని పూజించునో యాతఁడు సర్వపాప ప్రపంచములను వదలి మోక్షలక్ష్మి నొందును.

ఇది
సిద్ధాన్తశిఖామణి యందలి – భక్తస్థలమున
పంచాక్షర జపస్థల ప్రసంగమనెడి
ఎనిమిదవ పరిచ్ఛేదము
శ్రీ శివార్పణము.

ఓం నమః శివాయ

శ్రీ మాత్రే నమః

శ్రీ జగద్గురు పంచాచార్యాః ప్రసీదంతు

# తొమ్మిదవ పరిచ్ఛేదము

## 9. భక్త మార్గ క్రియా స్థలము

భూతి రుద్రాక్ష సంయుక్తో లింగధారీ సదా శుచిః,
పంచాక్షర జపో ద్యోగీ శివ భక్త ఇతి స్మృతః॥ ౧

విభూతిని రుద్రాక్షములను ధరించి లింగధారియై శివషడక్షర మహా మంత్ర జాపకుఁడై వెలయు నాతఁడే శివభక్తుఁ డనఁబడును.

శ్రవణం కీర్తనం శంభోః స్మరణం పాదసేవనం,
అర్చనం వందనం దాస్యం సఖ్య మాత్మనివేదనమ్॥ ౨

ఏవం నవ విధా భక్తిః ప్రోక్తా దేవేన శంభునా,
దుర్లభా పాపినాం లోకే సులభా పుణ్యకర్మణామ్॥ ౩

శివకథలను వినుట, శివుని గొనియాడుట, శివునే తలంచుట, శివుని పాదములనే సేవించుట, శివుని విధ్యుక్తముగఁ బూజించుట, శివునకు మ్రొక్కుట, శివునందు దాసభావమును నెఱపుట, శివునెడ మిత్ర భావము చూపుట, శివునందే ఆత్మ సమర్పణము చేయుట, అను పనులే 9 విధములైన భక్తులు. ఈ తొమ్మిది విధములగు భక్తి తొల్లి శివుని చేతనే చెప్పఁబడినది. ఇది పాపుల కందరానిది. పుణ్యాత్ములకు సుగముగా దొరకునది.

అధమే చోత్తమే వాపి యత్ర కుత్ర చిదూర్జితా,
వర్తతే శాంకరీ భక్తిః స భక్త ఇతి గీయతే॥ ౪

అధముఁడే కానిమ్ము; ఉత్తముఁడే కానిమ్ము; ఎవనియందు శంకరు నెడ సదృఢభక్తి నిలుచునో వాఁడే భక్తుఁ డనఁబడును.

భక్తిః స్థిరీ కృతా యస్మిన్ మ్లేచ్ఛే వా ద్విజసత్తమే,
శంభోః ప్రియః స విప్రశ్చ న ప్రియో భక్తి వర్జితః॥ ౫

[illegible] గల శివభక్తి గలవాఁడు మ్లేచ్ఛుఁడే కానిమ్ము; బ్రాహ్మణుఁడే కానిమ్ము; వాఁడే శివునకుఁ బ్రియుఁడు. జాతిచే బ్రాహ్మణుఁడై [illegible] భక్తిలేనివాఁడు శివునకు ప్రియుఁడు కాఁడు.

సా భక్తిర్ద్వివిధా జ్ఞేయా బాహ్యాభ్యంతర భేదతః,
బాహ్యా స్థూలాంతరా సూక్ష్మా వీరమాహేశ్వరా దృతా॥ ౬

ఆ శివభక్తి బాహ్యమని, ఆభ్యంతరమని రెండు విధములు. బాహ్యభక్తినే స్థూలభక్తి యందురు. ఆభ్యంతర భక్తినే సూక్ష్మభక్తి యందురు. ఈ సూక్ష్మ భక్తియే వీరమాహేశ్వరులచే ఆదరింపఁబడినది.

సింహాసనే శుద్ధదేశే సురమ్యే రత్న చిత్రితే,
శివలింగస్య పూజా యా సా బాహ్య భక్తిరుచ్యతే॥ ౭

ఆయా విధములైన సమ్మార్జనముల చేతఁ బరిశుద్ధమైనచోట నుంచఁబడి మిక్కిలి [illegible] రత్నసింహాసన మందు శివలింగము నుంచి చేయు పూజ బాహ్యభక్తి యనఁబడును.

[illegible]ంగే ప్రాణం సమాధాయ ప్రాణే లింగం తు శాంభవం,
స్వస్థం మనస్తథా కృత్వా న కించిచ్చింతయే ద్యది॥ ౮
సాఽభ్యంతరా భక్తిరితి ప్రోచ్యతే శివయోగిభిః,
సా యస్మిన్ వర్తతే తస్య జీవనం భ్రష్ట బీజవత్॥ ౯

శివలింగమందు బ్రాణమును, ప్రాణమందు లింగమును నిలిపి మనస్సును శివుని కంటె నితరమైన దానియందుఁ బోకుండ నిలిపి [illegible] చేయుటే యాంతరభక్తియని శివయోగు లందురు. ఈ యాంతరభక్తి యెవని యందుండునో వాని జన్మము అగ్నిచే వేఁచఁబడిన [illegible] మొలకెత్తదు. అనఁగా వానికి బునర్జన్మము లేదు.

[illegible] కిముక్తేన గుహ్యాద్గుహ్యాతరా పరా,
[illegible] సందేహ స్తయా యుక్తో విముచ్యతే॥ ౧౦

ఈ విషయమునఁ బలుమాటలేల? శివభక్తి రహస్యాతి రహస్యమును మిగుల శ్రేష్ఠమైనది. అట్టి శివభక్తి గలవాఁడు ముక్తుఁడే యగును.

ప్రసాదాదేవ సా భక్తిః ప్రసాదో భక్తిసంభవః,
యథైవాంకురతో బీజం బీజతో వా యథాంకురః॥ ౧౨

మొలకవలన విత్తును, విత్తువలన మొలకయు నెట్లు పుట్టునో అట్లే భక్తి శివానుగ్రహము చేతను, శివానుగ్రహము భక్తిచేతను గలుగును.

• ప్రసాద పూర్వికా యేయం భక్తిర్ముక్తి విధాయినీ,
నైవ సా శక్యతే ప్రాప్తుం నరైరేకేన జన్మనా॥ ౧౧

శివానుగ్రహముచేఁ గలుగు భక్తి ముక్తి నొసంగును. ఆ భక్తి మనుజులకు ఒక్క జన్మముననే కలుగునది కాదు.

అనేక జన్మ శుద్ధానాం శ్రౌత స్మార్తానువర్తినాం,
విరక్తానాం ప్రబుద్ధానాం ప్రసీదతి మహేశ్వరః॥ ౧౩

పలు పుట్టువులందుఁ జలిపిన శివధ్యాన శివపూజాదులచే శుద్ధులైన వారికిని, శ్రుతి స్మృతులందుఁ జెప్పఁబడిన నిత్యనైమిత్తిక కర్మాసక్తి గలవారికిని కామ్యకర్మములందుఁ దగులక జ్ఞానులైనవారికిని మాత్రమే పరమేశ్వరుఁడు ప్రసన్నుఁడగును.

ప్రసన్నే సతి ముక్తఃస్యా న్ముక్తః శివసమోభవేత్,
అల్పభావోఽపి యో మర్త్య స్తస్య జన్మత్రయా త్పరం,
నయోనియంత్రపీడా వైభవే నైవాత్ర సంశయః॥ ౧౪

పరమశివుఁ డెవనియెడ బ్రసన్నుఁడగునో వాఁడు ముక్తుఁడగును. ముక్తుఁడు శివ సమానుఁడే యగును. ఏ నరునికైనను భక్తి యింత మాత్రమున్నను వానికి మూఁడు జన్మముల వెనుక మఱి జన్మము లేదు. ఇందు సందియము లేదు.

సాంగాఽన్యానా చ యాసేవా సా భక్తిరితి కథ్యతే,
సా పునర్భిద్యతే త్రేధా మనో వాక్కాయ సాధనైః॥ ౧౫

శివరూపాది చింతా యా సా సేవా మానసీ స్మృతా,
జపాది ర్వాచికీ సేవా కర్మపూజా చ కాయికీ॥ ౧౬

ఏ శివసేవ నవవిధ భక్తులతో గూడియుండునో అది పూర్ణభక్తి. కడమదంతయు నల్పభక్తి. అది మఱల మానసికము, వాచికము, కాయికము అని మూడువిధములు. ఏ సేవ శివలింగస్వరూపాది ధ్యాన రూపమై యుండునో అది మానసికభక్తి; ఏది శివమంత్ర జపరూపమై యుండునో అది వాచికభక్తి; ఏది శరీరముచేఁ జేయఁబడు పూజారూప మైనదో అది కాయికభక్తి.

బాహ్య మాభ్యంతరం చైవ బాహ్యాభ్యంతర మేవ వా,
మనోవాక్కాయ భేదైశ్చ త్రిధా తద్భజనం విదుః॥ ౧౭

ఆ సేవ బాహ్యము, ఆభ్యంతరము, బాహ్యాభ్యంతరము అని ముప్విధ ములుగాఁ జెప్పిరి.

అన్యాత్మ విదితం బాహ్యం శంభో రభ్యర్చనాదికం,
త దేవ తు స్వసంవేద్య మాభ్యంతర ముదాహృతమ్॥ ౧౮

చేయుచుండఁగా నితరులకుఁ గానవచ్చు శివపూజాదికర్మము బాహ్య సేవ. ఇతరులకుఁ గానరాక తనకుమాత్రమే కానవచ్చు శివపూజాది కర్మము ఆభ్యంతరసేవ. మనసు శివలింగాసక్తమైనచో నది బాహ్యా భ్యంతరసేవ యనఁబడును.

మనో మహేశ ప్రవణం బాహ్యాభ్యంతర ముచ్యతే,
మనో మహేశ ధ్యానాఢ్యం నాన్యధ్యానరతం మనః,

శివనామరతా వాణీ వాఙ్మతా చైవ నేతరా॥ ౧౯
లింగైః శివస్య చోద్దిష్టై స్త్రిపుండ్రాదిభి రంకితః,

శివోపచార నిరతః కాయః కాయో న చేతరః॥ ౨౦

మనసు శివధ్యానమందే ఆసక్తమై యుండవలయును. అన్యదేవతా ధ్యానమందు రతిగలది మనసే కాదు. వాణి శివనామోచ్చారణమందే ఆసక్తితో నుండవలయును. ఇతరదేవతా నామోచ్చారణమం దాసక్త

మైనది వాణియే కాదు. శాస్త్రోక్తముగా భస్మత్రిపుండ్రములు, రుద్రాక్షములు, లింగధారణము మున్నగు వానితోఁగూడి శరీరము శివలింగ పూజయందాసక్తమై యుండవలయును. అన్యదేవతా చిహ్నములతోఁ గూడి అన్యదేవతా పూజయందాసక్తమైన శరీరము శరీరమే కాదు.

పంచధా కథ్యతే సద్భి స్తద్దేవ భజనం పునః,
తపః కర్మ జపో ధ్యానం జ్ఞానం చా న్యనుపూర్వకమ్॥ ౨౧

మఱియు నా శివసేవ తపస్సు, కర్మము, జపము, ధ్యానము, జ్ఞానము అని 5 విధములుగాఁ జెప్పఁబడుచున్నది.

శివార్థే దేహ సంశోష స్తపః కృచ్ఛ్రాది నో మతం,
శివార్చా కర్మ విజ్ఞేయం బాహ్యం యాగాది నోచ్యతే॥ ౨౨
జపః పంచాక్షరాభ్యాసః ప్రణవాభ్యాస ఏవ వా,
రుద్రాధ్యాయాదికాభ్యాసో న వేదాధ్యయనాదికమ్॥ ౨౩
ధ్యానం శివస్య రూపాది చింతా నాత్మాది చింతనం,
శివాగమార్థ విజ్ఞానం జ్ఞానం నాన్యార్థ వేదనం,
ఇతి పంచప్రకారోఽయం శివయజ్ఞః ప్రకీర్తితః॥ ౨౪

శివుని నిమిత్తముగా నగు శరీర శోషణమే తపస్సుగాని కృచ్ఛ్ర చాంద్రాయణాది వ్రతములచే నగు శరీర శోషణము తపస్సు కాదు. శివపూజయే కర్మము గాని కష్టసాధ్యములైన జ్యోతిష్టోమాది యాగములు కర్మములు కావు. పంచాక్షర మంత్ర జపాభ్యాసమును, ఓంకార జపాభ్యాసమును, శ్రీరుద్రాధ్యాయ, అథర్వశిఖా, శ్వేతాశ్వతర, కైవల్యాది శ్రుతుల యభ్యాసమే జపముగాని పశుకర్మ ప్రతిపాదకమగు వేదభాగాభ్యాసము జపము కాదు. శివుని చంద్రమౌళిత్వము, గంగాధరత్వము మున్నగు దివ్యమంగళాకారములను అనుసంధానించుటే ధ్యానముకాని శరీరేంద్రియాద్యుపాధులతోఁ గూడిన యాత్మధ్యానము ధ్యానము కాదు. శివాగమముల యర్థము నెఱుంగుటయే జ్ఞానముకాని శివాగమముల కంటె వేఱయిన సాంఖ్యాది శాస్త్రజ్ఞానము జ్ఞానము కాదు. ఈ రీతిగా శివయజ్ఞము అయిదు విధములుగాఁ జెప్పఁబడినది.

అనేన పంచ యజ్ఞేన యః పూజయతి శంకరం,
భక్త్యా పరమయా యుక్తః స వై భక్త ఇతి స్మృతః॥ ౨౭

అత్యంత భక్తితో నెవఁడీ యైదు విధములయిన యజ్ఞములచే శివు నారాధించునో యతఁడే భక్తుఁ డనఁబడును.

పూజనా చ్ఛివ భక్తస్య పుణ్యా గతి రవాప్యతే,
అవమానా న్మహాఘోరో నరకో నాత్ర సంశయః॥ ౨౮

శివభక్తుని బూజించుటచేఁ బుణ్యగతి లబ్బును. శివభక్తు నవమానించుటచే ఘోరనరకమే యబ్బును. ఇందు సందియము లేదు.

శివభక్తో మహాతేజాః శివభక్తి పరాఙ్ముఖాన్,
న స్పృశే న్నైవ వీక్షేత న తైః సహ వసే త్క్వచిత్॥ ౨౯

శివభక్తుఁడే మహాతేజోవంతుఁడైనవాఁడు శివభక్తి విముఖులను ముట్టరాదు. చూడరాదు. అట్టి వారితోఁ గొంచెము సేపయినను గూడియుండరాదు.

యదా దీక్షా ప్రవేశః స్యా ల్లింగ ధారణ పూర్వకం,
తదా ప్రభృతి భక్తోఽసౌ పూజయేత్ స్వాగమస్థితాన్॥ ౩౦

లింగధారణ పూర్వకమైన శివదీక్ష యెప్పుడు పొందునో అది మొదలు శివభక్తుఁడు నిత్యమును వీరశైవాగమ ప్రకారముగా శివభక్తులగు మాహేశ్వరులను పూజింపవలయును.

స్వమార్గాచార నిరతాః స్వజాతీయా ద్విజాస్తు యే,
తేషాం గృహేషు భుంజీత నేతరేషాం కదాచన॥ ౩౧

తమ తమ జాతి ధర్మముల ననుసరించి ఆచార నిష్ఠగల వీరశైవు లైన ద్విజులైన బ్రాహ్మణ క్షత్రియ వైశ్యులు తమకు సజాతీయులైన వారి యిండ్లయందే భుజింప వలయును. ఏనాఁడును ఇతరుల యిండ్ల భుజింపరాదు. "శివోక్తాం జాతి మర్యాదాం యోఽతీత్య భువి వర్తతే స చాండాల ఇతి జ్ఞేయః సర్వకర్మ బహిష్కృతః॥" శివునిచేఁ జెప్పఁబడిన జాతి మర్యాదను మీఱి యెవఁడు నడచునో అతఁడే

చండాలుఁడు. సర్వకర్మములకును వెలియైన వాఁడగును. అని శివాగమములు తెలుపుచుండుటచే వీరశైవ మతస్థులు తమ తమ జాతి ధర్మములకు విరుద్ధముగా నడచినచో నరకభాజను లగుదురు.

స్వమార్గాచార విముఖై ర్భవిభిః ప్రాకృతాత్మభిః,
ప్రేషితం సకలం ద్రవ్య మాత్మలీనమపి త్యజేత్॥ 30

వీరశైవాచారమం దాదరములేని ప్రాకృత జనులచేఁ బంపఁబడిన పదార్థములు ఎట్టివైనను దన స్వాధీనమందున్నను అవి ముట్టరాదు.

నార్చయే దన్య దేవాం స్తు న స్మరే న్న చ కీర్తయేత్,
న తన్నై వేద్య మశ్నీయా చ్ఛివభక్తో దృఢవ్రతః॥ 31

దృఢవ్రతుఁడైన వీరశైవుఁడు శివునికంటె నితరమైన దేవతలను బూజింపరాదు, స్మరింపరాదు, కీర్తింపరాదు. ఆయా దైవతాంతరములకు నివేదించిన వస్తువులను దినరాదు.

యద్గృహే త్వన్యదేవోఽస్తి తద్గృహాణి పరిత్యజేత్,
నాన్యదేవార్చకా న్మర్త్యా న్పూజాకాలే నిరీక్షయేత్॥ 32

ఏ యిండ్లయందు శివేతరదైవములు పూజింపఁబడునో ఆ యిండ్లకుఁ బోరాదు. తాను శివునిఁ బూజించునపుడు వీరశైవుఁడు ఇతర దేవార్చకులను గంటఁజూడరాదు.

సదాశివైక నిష్ఠానాం వీరశైవాధ్వ వర్తినాం,
న హి స్థావర లింగానాం నిర్మాల్యా ద్యుపభుజ్యతే॥ 33

ఇంతియ కాదు. శివలింగనిష్ఠ గలిగి వీరశైవమార్గాసక్తులై యుండువారు దేవాలయములందుఁ బ్రతిష్ఠింపఁబడిన స్థావరలింగములకు నివేదింపఁబడిన వస్తువులను గైకొనరాదు.

యత్ర స్థావర లింగానా మపాయః పరివర్తతే,
అథవా శివభక్తానాం శివలాంఛన ధారిణామ్॥ 34

తత్ర ప్రాణా న్విహాయాపి పరిహారం సమాచరేత్,
శివార్థం ముక్త జీవశ్చే చ్ఛివసాయుజ్య మాప్నుయాత్॥ 35

ఎచట స్థావరలింగముల కపాయము సంభవించునో, లేక శివచిహ్నా ఢ్యులైన శివభక్తులకు అపాయము వాటిల్లునో, అచట దన ప్రాణమును విడుచుటకైన సిద్ధపడి పరిహారమును జేయవలయును. శివునికొఱకుఁ బ్రాణము విడుచువానికి శివసాయుజ్యమే లభించును.

యత్ర చాచార నిందాస్తి కదాచి త్తత్ర న వ్రజేత్,
యద్గృహే శివ నిందాస్తి తద్గృహం తు పరిత్యజేత్॥ ౩౬

ఎక్కడ శివధర్మాచార నింద చేయఁబడునో అట్టిస్థలమున కేనాఁ డును బోరాదు. ఏయింట శివనింద జరుగునో ఆ యింట నుండరాదు.

యః సర్వభూతాధిపతిం విశ్వేశానం వినిందతి,
న తస్య నిష్కృతిః శక్యా కర్తుం వర్ష శతైరపి॥ ౩౭

సర్వభూతాధిపతియైన విశ్వేశ్వరు నెవఁడు నిందించునో వాని పాప పరిహారమునకు నూఱేండ్లకైనను ప్రాయశ్చిత్తమే లేదు. ఆ పాపము పోదు.

శివనిందాకరం దృష్ట్వా ఘాతయే దథవా శపేత్,
స్థానం వా తత్పరిత్యజ్య గచ్ఛే ద్యద్యక్షమో భవేత్॥ ౩౮

శివనిందచేయు పాపి నీకంటఁబడినచోఁ గొట్టుము. తిట్టుము. అందు కు నీకు శక్తి లేదేని ఆ చెడుమాటలు చెవిని బడకుండ ఆ పాపియుండు చోటినుండి తొలఁగిపొమ్ము.

శివపూజాపరో భూత్వా పూర్వకర్మ వివర్జయేత్,
అథవా పూర్వకర్మస్యాత్సా పూజా నిష్ఫలా భవేత్॥ ౩౯

శివదీక్ష నొంది శివపూజాసక్తుఁడైన వాఁడు ప్రాకృత కర్మము వర్జింపవలయును. ప్రాకృతకర్మముల ననుసరించెనేని యా శివపూజ ఫలములేనిదే యగును.

ఉత్తమాం వృత్తి మాశ్రిత్య నీచాం వృత్తిం సమాశ్రితః,
ఆరూఢ పతితో జ్ఞేయః సర్వకర్మ బహిష్కృతః॥ ౪౦

శివపూజ యనెడి సర్వోత్తమ కర్మము నాచరించువాఁడు మున్ను తా నాచరించుచుండిన ప్రాకృత కర్మమును వీడఁడేని. వాఁడె సర్వ కర్మముల నుండి వెలిబెట్టఁదగిన వాఁడు. వాఁడే ఆరూఢ పతితుఁడు. అనఁగా మిట్టమీఁది . మెట్టులెక్కియు గ్రిందకు జాతి పడినవాని వంటివాఁడు.

*పంచాక్షరోపదేశీ యో నరస్తుతి కరో యది,
సోఽలింగీ స దురాచారీ కుకవిః స తు విశ్రుతః॥ ౪౧

పంచాక్షర మంత్రోపదేశ భాగ్యము నొందియు, శివభక్తుఁడు నరస్తుతి యొనర్చెనేని వాఁడే అలింగి, దురాచారి, కుచ్ఛిత పండితుఁడు నని జను లాడుదురు.

చర్మపాత్రే జలం తైలం న గ్రాహ్యాం భక్తితత్పరైః,
గృహ్యతే యది భక్తైన రౌరవం నరకం వ్రజేత్॥ ౪౨

శివభక్తులు తోలుసిద్దెలందు నీరుగాని నూనెగాని తేరాదు. అటు లొనర్చినచో రౌరవ నరకము తప్పదు.

న తస్య సూతకం కించి త్ప్రాణ లింగాంగ సంగినః,
జననోత్థం మృతోత్థం చ విద్యతే పరమార్థతః॥ ౪౩

ప్రాణ లింగాంగ సంగియైన వీరశైవునకుఁ బరమార్థముచేఁ బురుటి మైలగాని చావుమైలగాని లేదు. అనఁగా లౌకికాచారములు నెఱపు నపుడే ఆశౌచములుగాని పవిత్రమైన ప్రాణ లింగాంగ సంగ దశయం దుండ దనుట.

లింగార్చన రతా యాశ్చ ఋతౌ నార్యా న సూతకం,
తథా ప్రసూతికా యాశ్చ సూతకం నైవ విద్యతే॥ ౪౪
గృహే యస్మిన్ ప్రసూతా స్త్రీ సూతకం నాత్ర విద్యతే,
శివపాదాంబు సంస్పర్శాత్ సర్వపాపం వినశ్యతి॥ ౪౫

లింగార్చన పరురాలైన ఆఁడుదానికి ఋతుకాలాశౌచము లేదు. మఱియు ప్రసవించిన స్త్రీలకును ఆశౌచము లేదు. అనఁగా శివలింగార్చన

వేళ ముట్టుమైలగాని, పురుటిమైలగాని పాటింప నక్కఱలేదు. తక్కిన వేళలయందు బాటింపవలయునని భావము.

శివ పాదోదకమును దాకుటచేతనే ఆ సర్వపాపములు పోవును. వీరశైవ ధర్మశాస్త్రమునుబట్టి యావజ్జీవము నాచరింపవలసిన శివపూజ వేళ మాత్రమే ఆశౌచములు లేవు. తక్కినయపు డుండితీఱును. ఈ విషయము శ్రీ శ్రీకరభాష్యముయొక్క "అథాతో బ్రహ్మజిజ్ఞాసా" యనెడి సూత్రభాష్యమందు విశేషించి ప్రతిపాదింపఁబడినది.

"ఎవనికి శివదేవార్చన నియమ ముండునో, అగ్నికార్య నియమ ముండునో వానికిని, యతులకును, బ్రహ్మచారులకును, సూతకాద్యాశౌచములు లేవు. లింగార్చనరతయైన స్త్రీ పురుటాలైనను, ముట్టుతయైనను, సూర్యాగ్ని వాయువులవలె నీమెయు బరిపూతయే. జాతాశౌచ మృతాశౌచములందును శివపూజనము విడువరాదు." ఈ మున్నగునది పారాశరస్మృతి, సిద్ధాంత శిఖామణి మున్నగువానియందును, లింగాంగి దేహమునకుఁ బవిత్రతయే జెప్పఁబడినది. కాన లింగధారణ పూజాదికమునకు విరోధము లేదు.

ఓయీ! ప్రమాణములు, ఆచారములు నున్నను, ప్రత్యక్ష విరుద్ధమగుట వలన, సూతక, రజస్వలా కాలములందుఁ జేయఁబడు శివపూజా లింగధారణాదికము ఒప్పదు గదా? యందువేమో. అటు కాదు. జ్యోతిష్టోమము, అతిరాత్రము, పౌండరీకము మున్నగు యాగములం దగుచుండు పశుహింస, మాంస భక్షణము, సురాపానము, బ్రహ్మచారిచే జేయఁబడు పగటి దాసీ సంగమము మున్నైన ప్రత్యక్ష లోకవిరుద్ధములగు శ్రుత్యుక్తాచారములకు భంగమే వాటిల్లును గదా!

ఓయీ! శైవులకు పంచసూతకములే లేవన్నదే యంగీకరింపఁబడినపుడు, వర్ణచతుష్టయధర్మమును మీఱుటే యగును గదా? వారిచేఁ జేయఁబడు పాకమును దాకుటయు పరిగ్రహించుటయు జరుగును. అట్టి అశుచివస్తు పరిగ్రహములచే శైవశాస్త్రమందుఁ జెప్పఁబడిన పూజా లింగ ధారణములు సూతక నిషేధ శాస్త్రమునకు విరుద్ధమే యగును గదా? దాని వలన వైదికులకు లింగధారణ మనర్హమే యగు నందు

వేమో. అటుకాదు, వినుము. ఇష్టలింగపూజయందు ఆశౌచమువిధింపఁ బడదనియు, పౌండరీకమందు రజస్వలకు స్వాగ్నిహోత్రమం దధికార మెట్లుకలదో అటులేయనియు, మంత్రోచ్చారణ మాత్రముచే జిహ్వ పవిత్రమగుననియు, అటులే సూతకులైనను శైవులు శివపూజా మాత్ర ముచే నిర్మలులనియు, ఇతరులు మాత్రము వారిని ముట్టరాదనియు, వేదానుశాసనము. ఇట్లు సిద్ధాంతాగమములందు శివపూజామాత్ర యోగ్యత కానవచ్చుచున్నది. గాన నీశంక నివృత్తమైనది గదా?

ఈ రీతిగా శ్రీకరపండితులు సిద్ధాంతాగమాదుల యభిప్రాయమును బట్టి లింగపూజా లింగధారణాదులందు మాత్రము ఆశౌచములు లేవ నియు, పాకస్పర్శాదులందు గలవనియు, పౌండరీక యాగమందును, అగ్నికార్యమందును రజస్వలకెటు లాశౌచములేదో యటులే నాలుక చేతితోను దాకుట తగకయున్నను మంత్రోచ్చారణమునకు మాత్ర మెటులు పరిశుద్ధమైనదో అట్లే ఆశౌచముగల వీరశైవులు, శివపూజా దులందు మాత్రము పరిశుద్ధులనియు, సిద్ధాంతమగుచుండుటచేత వీర శైవులకు, శివపూజాదులందు మాత్రము సూతకములు లేవనియు తక్కిన పాక స్పర్శాదులందుండు ననియు సిద్ధాంతము.

> శివస్థానాని తీర్థాని విశిష్టాని శివార్చకః,
> శివయాత్రోత్సవే నిత్యం సేవేత పరయా ముదా॥ ౪౬

శివపూజకుఁడు శివయాత్రోత్సవ వేళలందు శ్రేష్ఠమైన శివక్షేత్ర ములను, శివతీర్థములను మిగుల సంతసముతో సేవింపవలయును.

> శివక్షేత్రోత్సవ మహాయాత్రా దర్శన కాంక్షిణాం,
> మార్గేఽన్నపానదానం చ కుర్యా న్మాహేశ్వరో జనః॥ ౪౭
> నాన్నతోయ సమం దానం న చాహింసా పరం తపః,
> తస్మా న్మాహేశ్వరో నిత్య మన్నతోయప్రదో భవేత్॥ ౪౮

శివభక్తుడైన మాహేశ్వరుఁడు శివక్షేత్ర శివోత్సవాదులను జూడఁ గోరి పోవువారికి మార్గమందు అన్నపాన దానములను జేయవలయును. అన్న జల దానముకంటెను గొప్పదానములేదు. అహింస కంటెను

గొప్పతపస్సు లేదు. గాన శివభక్తులు నిత్యము నన్నపాన దానములను చేయుచుండవలయును.

స్వధర్మాచారవర్తిభ్యః స్వజాతిభ్యః సదావ్రతీ,
దద్యాత్తేభ్యః సమాదద్యాత్ కన్యాం కులసముద్భవామ్॥ ౪౯

శైవవ్రతముగల శివభక్తులెల్లరు స్వధర్మాచారములు గలట్టియు, తమ తమ సంప్రదాయముల ననుసరించునట్టియు జాతులవారికే పిల్ల నీయవలయును. అట్టివారినుండియే సత్కులప్రసూతలైన వధువుల నందుకొనవలయును.

## 10. ఉభయస్థలము

ఏవమాచారసంయుక్తో వీరశైవో మహావ్రతీ,
పూజయేత్పరయా భక్త్యా గురుం లింగం చ సంతతమ్॥ ౫౦

ఇటులు స్వాచారముతోఁ గూడిన వీరశైవుఁడు గురువును లింగమును పరమభక్తితో సేవింపవలయును.

గురో రభ్యర్చనేనాపి సాక్షా దభ్యర్చితః శివః,
నాస్తి భేదస్తయోః కశ్చి దేకత్వా త్తత్త్వరూపతః॥ ౫౧

గురువును బూజించుటచేఁ బ్రత్యక్షముగా శివుఁడు పూజింపఁబడినవాఁడగును. పరమార్థముచే ఏకత్వముండుటవలన గురుశివుల కించుకయు భేదములేదు. "యస్య దేవే పరాభక్తి ర్యథా దేవే తథా గురౌ" అనెడి శ్వేతాశ్వతరోపనిషత్తును ఈ విషయమునే బోధించినది.

యథా దేవే జగన్నాథే సర్వానుగ్రహకారకే,
తథా గురువరే కుర్యా దుపచారా న్దినేదినే॥ ౫౨

జగన్నాథుఁడును సర్వదయాపరుఁడు నైన శివుని ప్రతిదినమును ఉపచారపూర్వకముగాఁ బూజించునటులే గురువరునిగూడఁ బూజింపవలయును.

అప్రత్యక్షో మహాదేవః సర్వేషా మాత్మమాయయా,
ప్రత్యక్షో గురురూపేణ వర్తతే భక్తిసిద్ధయే॥ ౫౩

శివుఁడు తన మాయచేత నెల్లరకును గానరాకున్నను భక్తిసిద్ధి కొఱకు గురురూపముతో సాక్షాత్కరించుచుండును.

శివజ్ఞానం మహాఘోర సంసారార్ణవ తారకం,
దీయతే యేన స గురుః కస్యవంద్యో న జాయతే॥ ౫౪

అతి భయంకరమైన సంసారసముద్రమును దాటించు శివజ్ఞానము ఎవనిచే ఈయఁబడుచున్నదో ఆగురుఁడు ఎవరికిఁ బూజ్యుఁడుకాకుండును?

యత్కటాక్ష కలా మాత్రా త్పరమానంద లక్షణం,
లభ్యతే శివరూపత్వం స గురుః కేన నార్చ్యతే॥ ౫౫

ఎవని కరుణాకటాక్ష మాత్రముచేఁ బరమానంద రూపమైన శివ స్వరూపము పొందఁబడునో అట్టి గురుఁడెవరికిఁ బూజ్యుఁడు కాకుండును?

హిత మేవ చరే న్నిత్యం శరీరేణ ధనేన చ,
ఆచార్య స్యోప శాంతస్య శివజ్ఞాన మహానిధేః॥ ౫౬

రాగ ద్వేషాది శూన్యుఁడును, శివజ్ఞాన సముద్రుఁడునైన గురువునకు శివభక్తుఁడు, తన శరీరము చేతను ధనము చేతను నిత్యమును హిత మాచరింపవలయు.

గురో రాజ్ఞాం న లంఘేత సిద్ధకామో మహామతిః,
తదాజ్ఞా లంఘనే నాపి శివాజ్ఞాచ్ఛేదకో భవేత్॥ ౫౭

సిద్ధినిగోరు వివేకి గురునాజ్ఞ నెన్నఁడును మీఱరాదు. గురునాజ్ఞ మీఱుట శివునాజ్ఞ మీఱుటే యగును గదా ?

## 11. త్రివిధ సంపత్తి స్థలము.

యథా గురౌ యథా లింగే భక్తిమార్గ పరివర్తతే,
జంగమే చ తథా నిత్యం భక్తిం కుర్యా ద్విచక్షణః॥ ౫౮

భక్తిగల వివేకి గురువు నెడలను శివలింగము నెడలను ఎట్లు భక్తి చూపునో యటులే జంగముని యెడలను భక్తిగల్గి యుండవలయు.

ఏక ఏవ శివః సాక్షా త్సర్వానుగ్రహ కారకః,
గురు జంగమ లింగాత్మా వర్తతే భుక్తి ముక్తిదః॥ ౫౯

తనభక్తుల నెల్లరను అనుగ్రహించువాఁడును, భోగ మోక్షముల నిచ్చువాఁడు నైన యా శివుఁడొక్కఁడే ప్రత్యక్షముగ గురులింగ జంగమ స్వరూపముతో వర్తించును.

లింగం చ ద్వివిధం ప్రోక్తం జంగమాజంగ మాత్మనా,
అజంగమే యథా భక్తి ర్జంగమే చ తథా స్మృతా॥ ౬౦

లింగము చరమనియు, స్థిరమనియు, రెండు విధములుగాఁ జెప్పఁబడినది. స్థిరలింగమం దెట్లు భక్తి చూపవలయుననిరో, అటులే చరలింగస్వరూపమైన జంగమునియందును భక్తియుంచవలయు.

అజంగమం తు యల్లింగం మృచ్ఛిలాది వినిర్మితం,
తద్వరం జంగమం లింగం శివయోగీతి విశ్రుతమ్॥ ౬౧

ఏ లింగము మన్ను, ఱాయి మున్నగువానితోఁ జేయఁబడునో అదే స్థిరలింగము. ఆ స్థిరలింగముకంటెను శివయోగి యనెడి సుప్రసిద్ధమైన చరలింగము రూపముఁదాల్చి సంచరించునది. అనఁగా జంగముఁడనెడి లింగము శ్రేష్ఠమైనది.

అచరే మంత్ర సంస్కారా ల్లింగే వసతి శంకరః,
సదాకాలం వసత్యేవ చరలింగే మహేశ్వరః॥ ౬౨

స్థిరలింగమందు శివుఁడు మంత్రసంస్కారముచే మాత్రమేయుండును. చరలింగమైన జంగమునందు శివుఁడెల్లప్పుడు నుండును.

శివయోగిని యద్దత్తం త దక్షయఫలం భవేత్,
తస్మా త్సర్వప్రయత్నేన తస్మై దేయం మహాత్మనే॥ ౬౩

శివయోగి యనెడి యీ చరలింగమునకు ఏది సమర్పించినను అది తఱుగులేని ఫలమునిచ్చును. అందుచే సర్వప్రయత్నములతో మహాత్ముఁడైన యా శివయోగికే దానము చేయవలయును.

యత్ఫలం లభతే జంతుః పూజయా శివ యోగినః,
త దక్షయ మితి ప్రోక్తం సకలాగమ పారగైః॥ ౬౪

సకలాగమ వేదులైనవారు శివయోగిని పూజించుటచే నగు ఫలము తఱుగులేని దనిరి.

నావ మన్యేత కుత్రాపి శివయోగిన మాగతం,
అవమానా ద్భవే త్తస్య దుర్గతిశ్చ న సంశయః॥　　౬౫

ఆకస్మికముగా నింటికి వచ్చిన శివయోగిని అవమానింపరాదు. అవమానించిన వారికి దుర్గతి తప్పదు.

శివయోగీ శివః సాక్షా దితి కైంకర్య భక్తితః,
పూజయే దాదరేణైవ యథా లింగం యథా గురుమ్॥　　౬౬

లింగమును గురువును ఎటు లాదరభక్తులతోఁ బూజింతువో, అట్లే శివయోగి శివస్వరూపమే యను నిశ్చయముతో సేవకభావముతో బూజింపవలయును.

## 12. ప్రసాద స్వీకార స్థలము

పాదోదకం యథా భక్త్యా స్వీకరోతి మహేశితుః,
తథా శివాత్మనో ర్నిత్యం గురు జంగమయోరపి॥　　౬౭

శివభక్తుఁడు పరమ శివుని పాదోదకము నెటులు భక్తితో నానునో అటులే శివస్వరూపులైన గురుజంగముల పాదోదకమును నిత్యము స్వీకరింపవలయును.

సర్వమంగళ మాంగల్యం సర్వపావన పావనం,
సర్వసిద్ధికరం పుంసాం శంభోః పాదాంబుధారణమ్॥　　౬౮

సర్వశుభముల కంటెను శుభకరమైనదియు, సర్వపవిత్ర వస్తువుల కంటెను పవిత్రమైనదియు నైన శివపాదోదక సేవనము మానవులకు సర్వసిద్ధుల నొసఁగును.

శిరసా ధారయే ద్యస్తు పత్రం పుష్పం శివార్పితం,
ప్రతిక్షణం భవే త్తస్య పౌండరీక క్రియా ఫలమ్॥　　౬౯

శివునకు సమర్పించిన పత్ర పుష్పము లనెడి నిర్మాల్యమును ఎవరు తలఁ దాల్తురో వారికిఁ బౌండరీక యాగ ఫలము ప్రతి క్షణము లభించును.

భుంజీత రుద్రభుక్తాన్నం రుద్రపీతం జలం పిబేత్,
రుద్రాఘ్రాతం సదా జిఘ్రే దితి జాబాలికే శ్రుతిః॥ 20

"రుద్రేణాత్త మశ్నంతి, రుద్రేణ పీతం పిబంతి, రుద్రేణాఘ్రాతం జిఘ్రంతి" యను జాబాల్యుపనిషత్తును బట్టి శివభక్తుఁడు శివుఁడు భుజించిన యన్నమునే భుజింపవలయును; శివుఁడు పానముచేసిన జలమున్నే త్రాగవలయును. శివుఁడు మూర్కొనిన పుష్పపత్రాదులనే వాసన చూడవలయును. అనఁగా సర్వవిధముల శివనిర్మాల్యమునే భక్తుఁ డనుభవింపవలయు ననుట.

అర్పయిత్వా నిజేలింగే పత్రం పుష్పం ఫలం జలం,
అన్నాద్యం సర్వభోజ్యం చ స్వీకుర్యా ద్భక్తిమా న్నరః॥ 21

కావున శివభక్తులైనవారు ఇష్టలింగమునకు ముందుగా సమర్పించిన పత్రి పుష్ప ఫల జల భక్ష్య భోజ్యాదులనే తా మనుభవింపవలయును.

గురుత్వాత్ సర్వలోకానాం శంభో రమిత తేజసః,
తస్మై నివేదితం సర్వం స్వీకార్యం తత్పరాయణైః॥ 22

అఖండ తేజఃస్వరూపుఁడైన శివుఁడు సర్వజగద్గురుఁ డగుటచేత శివభక్తులు తాముపయోగించు సర్వవస్తువులను శివుని కర్పించిన పిదప స్వీకరింపవలయును.

యే లింగధారిణో లోకే యే శివైక పరాయణాః,
తేషాంతు శివ నిర్మాల్య ముచితం నాన్య జంతుషు॥ 23

లింగధారులై శివభక్తిపరాయణులైనవారికి మాత్రమే శివనిర్మాల్యము గొను నర్హత గలదు. తక్కువారికి లేదు.

అన్నజాతేతు భక్తేన భుజ్యమానే శివార్పితే,
సిక్తే సిక్తేఽశ్వమేధస్య యత్ఫలం త దవాప్యతే॥ 24

శివార్పితమైన అన్నసముదాయము శివభక్తునిచేత భుజింపఁబడు నపుడు అందలి మెతుకు మెతుకునందును అశ్వమేధఫలమిచ్చు మహిమ మున్నది. కాన నట్టిఫలము వానికి లభించును.

నిర్మాల్యం నిర్మలం శుద్ధం శివేన స్వీకృతం యతః,
నిర్మలై స్తత్పరై ర్ధార్యం నాన్యైః ప్రాకృత జంతుభిః॥ ౭౫

శివార్పితమై శివునిచే స్వీకరింపఁబడుటవలన శుద్ధమైనదానికే నిర్మాల్యమని పేరు. అదే నిర్మలము. అట్టి నిర్మాల్యమును నిర్మలులైన శివభక్తులే స్వీకరింపవలయును. శివదీక్షారహితులైన ప్రాకృతులు స్వీకరింపరాదు.

శివభక్తి విహీనానాం జంతూనాం పాపకర్మణాం,
విశుద్ధే శివనిర్మాల్యే నాధికారోఽస్తి కుత్రచిత్॥ ౭౬

శివభక్తిలేని పాపకర్ములకుఁ బరమపవిత్రమైన శివనిర్మాల్యమును గొనుట కెచ్చటను అధికారము లేదు.

శివలింగ ప్రసాదస్య స్వీకారా ద్యత్ఫలం భవేత్,
తథా ప్రసాద స్వీకారా ద్గురు జంగమయో రపి॥ ౭౭

శివలింగ ప్రసాదమును గొనుటచే నెట్టిఫలము గలుగుననిరో ఆ ఫలమే గురుజంగముల ప్రసాదమును గొనుటచేత లభించును.

తస్మాద్గురుం మహాదేవం శివయోగిన మేవ చ,
పూజయే త్తత్ప్రసాదాన్నం భుంజీత ప్రతివాసరమ్॥ ౭౮

కావున శివుని, గురువును, శివయోగిని బూజింపవలయును. వారి ప్రసాదమును బ్రతిదినమును స్వీకరింపవలయును.

## 13. సోపాధిదానస్థలము.

శివలింగే శివాచార్యే శివయోగిని భక్తిమాన్,
దానం కుర్యా ద్యథా శక్తి తత్ప్రసాదయుతః సదా॥ ౭౯

శివభక్తుఁడు గురు లింగ శివయోగుల ప్రసాదమును స్వీకరించుచుఁ దన శక్తి నతిక్రమింపక వారలకు దానము చేయుచుండవలయును.

దానం తు త్రివిధం ప్రోక్తం సోపాధి నిరుపాధికం,
సహజం చేతి తంత్రేషు సర్వతంత్ర విశారదైః॥ ౮౦

ఈ దానము సోపాధికము, నిరుపాధికము, సహజము అని 3 విధములుగా సర్వతంత్రములందును జెప్పఁబడినది.

ఫలాభిసంధిసంయుక్తం దానం యద్విహితం భవేత్,
తత్సోపాధిక మాఖ్యాతం ముముక్షుభి రనాదృతమ్॥ ౧౧

ఫలమును గోరి చేయు దానము సోపాధికము. దానిని మోక్షార్థు లంగీకరింపరు.

## 14. నిరుపాధికదానస్థలము.

ఫలాభిసంధినిర్ముక్త మీశ్వరార్పిత కాంక్షితం,
నిరుపాధిక మాఖ్యాతం దానం దానవిశారదైః॥ ౧౨

ఫలాకాంక్ష లేక చేయఁబడునదియు, ఈశ్వరార్పణబుద్ధితోఁ జేయఁబడునదియునైన దానము నిరుపాధికము అని దానతత్త్వజ్ఞు లందురు.

## 15. సహజదానస్థలము.

ఆదాతృ దాతృ దేయానాం శివభావం విచిన్త్య హి,
ఆత్మనోఽకర్తృభావం చ యద్దత్తం సహజం తు తత్॥ ౧౩

దానము నందుకొనువానియందును, దాన మిచ్చువానియందును, దానము చేయఁబడుదానియందును శివభావమునే యుంచి "యిచ్చువాఁడను నే" ననెడి కర్తృత్వమును బెట్టుకొనక చేయఁబడునదే సహజదానము.

సహజం దాన ముత్కృష్టం సర్వదానోత్తమోత్తమం,
శివజ్ఞాన ప్రదం పుంసాం జన్మరోగ నివర్తకమ్॥ ౧౪

ఈ మూఁడువిధములైన దానములందుఁ బైన జెప్పిన సహజదానమే శ్రేష్ఠతమము. దీనిచే శివజ్ఞానము గలిగి జన్మమను రోగము తొలఁగును. అనఁగా సహజదానము మోక్షకారణము.

శివాయ శివభక్తాయ దీయతే యది కించన,
భక్త్యాతదపి విఖ్యాతం సహజం దాన ముత్తమమ్॥ ౧౫

స్థావర లింగరూప శివునకును, జంగమ లింగరూప మాహేశ్వరునకును భక్తితోఁ జేయఁబడు దానము సహజమే యనఁబడును. అది శ్రేష్ఠము.

దానాత్ స్వర్ణ సహస్రస్య సత్పాత్రే యత్ఫలం భవేత్,
ఏకపుష్ప ప్రదానేన శివే తత్ఫల మిష్యతే॥ ౮౬

సత్పాత్రమందు వేలకొలఁది బంగారు నాణెములు దానము చేసిన నెంతఫలమో, అంత ఫలము శివునిపూజకై యిడిన యొక్క పుష్పము చేతనే పొందగలఁడు. సత్పాత్రమనఁగా సదాచార శీల విద్యాభక్తి సంపన్నుఁడై దానముఁ గొనఁదగినవాఁడని యర్థము.

శివ ఏవ పరం పాత్రం సర్వ విద్యానిధి ర్గురుః,
తస్మై దత్తంతు యత్కించి త్తదనంతఫలం భవేత్॥ ౮౭

సర్వజ్ఞాన నిధియు, జగద్గురుఁడు నైన శివుఁడే దానమున కత్యంత యోగ్యపాత్రము. అట్టి శివునకై యెంత కొంచెమిచ్చినను అది అనంత ఫల మిచ్చును.

శివయోగీ శివః సాక్షా చ్ఛివజ్ఞాన మహోదధిః,
యత్కించి ద్దీయతే తస్మై తద్దానం పారమార్థికమ్॥ ౮౮

శివజ్ఞాన సముద్రుఁడైన శివయోగియు ప్రత్యక్షశివుఁడే. కాన నతని కెంతమాత్ర మిచ్చినను ఆ దానమే పారమార్థికము.

శివయోగీ మహాపాత్రం సర్వేషాం దాన కర్మణి,
తస్మా న్నాస్తి పరం కించి త్పాత్రం శాస్త్ర విచారతః॥ ౮౯

శాస్త్రముల నాలోచించి చూడఁగా శివయోగియే దానకర్మము నకుఁ బరమ పాత్రము. అంతకంటెఁ సత్పాత్రము మఱి లేదు.

భిక్షా మాత్ర ప్రదానేన శాంతాయ శివయోగినే,
యత్ఫలం లభ్యతేనైత ద్యజ్ఞకోటి శతైరపి॥ ౯౦

సర్వదోష రహితుఁడగుటచేతఁ బరమ శాంతుఁడైన శివయోగికి బిచ్చము పెట్టునంత మాత్రమునఁ గలుగు ఫలము కోటులకొలఁది యజ్ఞములు చేసినను గల్గదు.

శివయోగిని సంతృప్తే తృప్తో భవతి శంకరః,
తత్తృప్త్యా తన్మయం విశ్వం తృప్తి మేతి చరాచరమ్॥ ౯౧

శివయోగి సంతృప్తుఁడయ్యేనేని తద్రూపుఁడైన శివుఁడును సంతుష్టుఁడగును. శివుఁడే సంతృప్తుఁడయ్యేనేని శివమయమైన జగత్తంతయు సంతుష్టమగును.

తస్మాత్సర్వప్రయత్నేన యేనకేనాపి కర్మణా,
తృప్తిం కుర్యాత్సదాకాల మన్నాద్యైః శివయోగినః॥ ౯-౨

కావున సర్వప్రయత్నములచేతను అన్నదానము మున్నగు నేకకర్మముల చేతనైనను శివయోగిని తృప్తినొందించుటకే యెల్లపుడును శివభక్తుఁడు చూచుచుండవలయును.

నిరుపాధిక చిద్రూప పరానంద దాత్మవస్తుని,
సమర్పితం సకలం యస్య స దానీ శంకరః స్వయమ్॥ ౯-౩

నిరుపాధికుఁడును (తన కింకొక కారణము లేక తానే యన్నిటికి కారణమైనవాఁడు) దేశకాలాపరిచ్ఛిన్నుఁడును, జ్ఞానానందస్వరూపుఁడునైన పరమాత్మవస్తువును గూర్చి యే శివభక్తుఁడు తన ధన ప్రాణాదుల నన్నిటిని సమర్పించునో అతఁడే సహజదాని. అతఁడే సాక్షాచ్ఛివుఁడు.

భక్త్యాఖిలాచార పరాయణోఽసౌ
సదా వితన్వన్ సహజం తు దానం,
బ్రహ్మాది సంపత్సు విరక్తచిత్తో
భక్తో మహా మాహేశ్వర తాముపైతి॥ ౯-౪

సకల శివ భక్త్యాచార పరాయణుఁడైన శివభక్తుఁడు సహజ దానమునే చేయుచు బ్రహ్మాదుల సంపదలందును విరక్తుఁడై మహేశ్వర భావమునే పొందును.

ఇది
సిద్ధాంత శిఖామణి యందలి – భక్తస్థలమందు
భక్తమార్గక్రియ స్థలాది సప్తవిధస్థల విచార రూపమయిన
తొమ్మిదవ పరిచ్ఛేదము
శ్రీ శివార్పణము.



ఓం నమః శివాయ

శ్రీ మాత్రే నమః

శ్రీ జగద్గురు పంచాచార్యాః ప్రసీదంతు

# పదియవ పరిచ్ఛేదము.

## 16. మాహేశ్వర స్థలము.

శ్రీ అగస్త్యమహర్షి యనుచున్నాడు:

భక్త స్థలం సమాఖ్యాతం భవతా గణనాయక,
కేన వా ధర్మ భేదేన భక్తో మాహేశ్వరో భవేత్॥ ౧

ఓ రేణుక గణాధిపతీ! ఇంతవఱకు నీచేత భక్త స్థలము వివరింపఁబడినది. ఎట్టి ధర్మవిశేషములను బూనుటచే భక్తుఁడు మాహేశ్వరుఁడగునో తెలుపుము.

శ్రీ రేణుకాచార్యులు పలుకుచున్నారు:

కేవలం సహజే దానే నిష్ణాతః శివతత్పరః,
బ్రహ్మాది స్థాన విముఖో భక్తో మాహేశ్వరః స్మృతః॥ ౨

సహజ దానమందు మిగుల నాఱితేఱిన వాఁడును, శివపరాయణుఁడును, బ్రహ్మాదుల స్థానములను గోరక వానియెడఁ బెడమొగము గలవాఁడును అయిన భక్తుఁడే మాహేశ్వరుఁ డనఁబడును.

భక్తిర్యదా సముత్కర్షో భవే ద్వైరాగ్య గౌరవాత్,
తదా మాహేశ్వరః ప్రోక్తో భక్తః స్థిర వివేకవాన్॥ 3

ఎప్పుడు అత్యంతమైన వైరాగ్యముచే శివభక్తి యధికమగునో అప్పుడే నిత్యానిత్య వస్తుపరిజ్ఞానము గలవాఁడై భక్తుఁడు మాహేశ్వరుఁ డనఁబడును.

మాహేశ్వర స్థలం వక్ష్యే యథోక్తం శంభునా పురా,
మాహేశ్వర ప్రశంసాఽదౌ లింగనిష్ఠా తతః పరమ్॥ ౪

పూర్వాశ్రయ నిరాసశ్చ తదాఽద్వైత నిరాకృతిః,
ఆహ్వాన వర్జనం పశ్చా దష్టమూర్తి నిరాకృతిః॥ ౫

సర్వగత్వ నిరాసశ్చ శివత్వం విశ్వభక్తయోః,
ఏవం నవవిధం ప్రోక్తం మాహేశ్వర మహాస్థలమ్॥ ౬

తొల్లి శివునిచేఁ జెప్పఁబడిన మాహేశ్వర స్థలమును గూర్చి యిపుడు చెప్పుచున్నాను. ఇందు మాహేశ్వర ప్రశంసాస్థలము, లింగనిష్ఠాస్థలము, పూర్వాశ్రయ నిరసనస్థలము, అద్వైత నిరసనస్థలము, ఆహ్వాన నిరసన స్థలము, అష్టమూర్తి నిరసనస్థలము, సర్వగత్వ నిరసనస్థలము, శివ జగన్మయస్థలము, భక్త దేహిక లింగస్థలము అని 9 విధములు గలవు.

ఆదితః క్రమశో వక్ష్యే స్థలభేదస్య లక్షణం,
సమాహితేన మనసా శ్రూయతాం భవతా మునే॥ ౭

ఓయీ! అగస్త్యమహర్షీ! ఈ స్థలభేదముల లక్షణములను మొదటి నుండి క్రమముగాఁ జెప్పెదను. స్వస్థమైన మనస్సుతో వినుము.

## 16. మాహేశ్వర ప్రశంసా స్థలము.

విశ్వస్మాదధికో రుద్రో విశ్వానుగ్రహకారకః,
ఇతి యస్య స్థిరా బుద్ధిః స వై మాహేశ్వరః స్మృతః॥ ౮

“విశ్వాధికో రుద్రో మహర్షిః” అనెడి శ్వేతాశ్వతర శ్రుతి వాక్యమును బట్టి శివుఁడే సర్వప్రపంచమునకంటె నధికుఁడును, సర్వప్రపంచము ననుగ్రహించు వాఁడును అనెడి స్థిరబుద్ధి యెవనికి నబ్బునో వాఁడే మాహేశ్వరుఁడు.

బ్రహ్మాద్యైర్మలినప్రాయైర్నిర్మలే పరమేశ్వరే,
సామాన్యత్వం యో న సహతే స వై మాహేశ్వరాభిధః॥ ౯

“బ్రహ్మవిష్ణురుద్రేంద్రాస్తే సంప్రసూయంతే” అను శ్రుతి వాక్యమును బట్టి జనన మరణాదులచేఁ బీడింపఁబడి ఆణవాది మలము గలవారైన బ్రహ్మాదులతో ఆణవాది మలరహితుఁడైన పరమేశ్వరునకు సమానత్వము చెప్పుట నెవఁడోర్వలేఁడో అతఁడే మాహేశ్వరుఁడనఁబడును.

ఉత్కర్షః సర్వభూతానాం బ్రహ్మాదీనాం మహానితి,
యుక్తిమార్గాత్తదాసక్తో భక్తో మాహేశ్వరః స్మృతః॥ ౧౦

"ఈశానః సర్వవిద్యానా మీశ్వరః సర్వభూతానాం బ్రహ్మాధిపతి ర్బ్రహ్మణోఽధిపతి ర్బ్రహ్మా శివో మే అస్తు సదా శివః" అను శ్రుతి వాక్యము ననుసరించియు, "ఈశ్వరః సర్వభూతానాం హృద్దేశేఽర్జున తిష్ఠతి, భ్రామయన్ సర్వభూతాని యంత్రారూఢాని మాయయా" అనెడి భగవద్గీతా వాక్యమును బట్టియు, ప్రాణులకును బ్రహ్మాది దేవతలకును శివుఁడే స్వామియగుటచే బుద్ధియోగముచే (నిశ్చయ జ్ఞానముచే) ఆ శివునందే ఆసక్తిగలవాఁడు మాహేశ్వరుఁ డనఁబడు.

బ్రహ్మాది దేవతాజాలం మోహితం మాయయా సదా,
అశక్తం ముక్తిదానే తు క్షయాతిశయ సంయుతమ్॥ ౧౧

అనాది ముక్తో భగవా నేక ఏవ మహేశ్వరః,
ముక్తిదశ్చేతి యో వేద స వై మాహేశ్వరః స్మృతః॥ ౧౨

జనన మరణములు గల బ్రహ్మాది దేవతాసమూహము మాయచేత మోహితము. గాన ముక్తినిచ్చుట కసమర్థమైనది. గాన అనాది ముక్తుఁడగు భగవంతుఁడు మహేశ్వరుఁడే మోక్షమీయఁ గలవాఁడని యెవఁడు తెలిసికొనుచున్నాఁడో వాఁడే మాహేశ్వరుఁడు.

క్షయాతిశయ సంయుక్తా బ్రహ్మ విష్ణ్వాది సంపదః,
తృణవ న్మన్యతే బుద్ధ్యా వీరమాహేశ్వరః సదా॥ ౧౩

బ్రహ్మ విష్ణ్వాది దేవతల విభవములు వినాశముతోఁ గూడినవి యను నిశ్చయ జ్ఞానముతో వానిని గడ్డిపోచవలెనే తలంచునతఁడు వీరమాహేశ్వరుఁ డనఁ బడును.

శబ్దస్పర్శాది సంపన్నే సుఖ లేశే తు నిస్పృహః,
శివానందే సముత్కంఠో వీరమాహేశ్వరః స్మృతః॥ ౧౪

శబ్ద స్పర్శ రూప రస గంధము లనెడి విషయములతోఁ గూడిన అల్పసుఖములందుఁ గోరికలేక నిత్యమైన శివానందమునందే వేడుక గలవాఁడు వీరమాహేశ్వరుఁ డనఁబడును.

పరస్త్రీ సంగ నిర్ముక్తః పరద్రవ్య పరాఙ్ముఖః,
శివశాస్త్ర కార్యసంపన్నః శివాగమ పరాయణః॥ ౧౫

శివస్తుతి రసాస్వాదమోదమాన మనాః శుచిః,
శివోత్కర్ష ప్రమాణానాం సంపాదన సముద్యతః॥ ౧౬

నిర్మమో నిరహంకారో నిరస్త క్లేశ పంజరః,
అస్పృష్ట మదసంబంధో మాత్సర్యావేశ వర్జితః॥ ౧౭

నిరస్త మదనోన్మేషో నిర్ధూత క్రోధ విప్లవః,
సదా సంతుష్టహృదయః సర్వప్రాణి హితేరతః॥ ౧౮

నివారణ సముద్యోగీ శివకార్య విరోధినాం,
సహచారీ సదాకాలం శివోత్కర్షాభిధాయిభిః॥ ౧౯

శివాపకర్ష సంప్రాప్తౌ ప్రాణత్యాగేఽప్యశంకితః,
శివైకనిష్ఠః సర్వాత్మా వీరమాహేశ్వరో భవేత్॥ ౨౦

పరస్త్రీ సంగమునకు మనసుతోడను నెడమైనవాఁడును, ఇతరుల సొత్తుపట్ల పెడమొగము గలవాఁడును, శివకైంకర్యాది సత్కార్యము లనే చేయువాఁడును, శివజ్ఞానము నిచ్చు శాస్త్రములనే చదువునాసక్తి గలవాఁడును, శివస్తుతి యనెడి యమృతమునే యానుచు నిత్యసంతుష్టి నొందువాఁడును, మనోవాక్కాయములచే దోషము లేనివాఁడును, శివుని సర్వోత్తమత్వమును ప్రతిపాదించు ప్రమాణములను సంపాదించు కోరిక గలవాఁడును. పంచక్లేశము లనెడి పంజరమందుఁ జిక్కుకొనని వాఁడును. గర్వము లేనివాఁడును, మచ్చరము లేనివాఁడును, కామ క్రోధాదుల యొత్తిడి లేనివాఁడును, ఎల్లప్పుడును దృప్తిగల మనసుగల వాఁడును, సర్వప్రాణులకు మేలు గోరువాఁడును, శివసంబంధ కార్యమునకు విరోధించువారిని నివారించువాఁడును, శివుని గొప్పదనమును జెప్పువారితోడనే నిత్యసంగతి గలవాఁడును, శివాలయములందలి శివలింగములకు బాధగలుగువేళఁ దన ప్రాణము విడువనైనను వెనుదీయని వాఁడును. శివలింగమందే నిష్ఠగలవాఁడును, సర్వమును దనను వలెనే చూచుకొనువాఁడును వీరమాహేశ్వరుఁ డనఁబడును.

## 17. లింగనిష్ఠా స్థలము

అస్య మాహేశ్వర స్యోక్తం లింగ నిష్ఠా మహా స్థలం,
ప్రాణా త్యయేఽపి సంపన్నే యదత్యాజ్యం విధీయతే॥ ౧౧

ప్రాణసంకటము కలుగునప్పుడును నేది విడువరాదో ఆ లింగ నిష్ఠా స్థలము మాహేశ్వరునకై చెప్పఁబడుచున్నది.

అప గచ్ఛతు సర్వస్వం శిరచ్ఛేదన మస్తు వా,
మాహేశ్వరో న ముంచేత్తు లింగపూజా మహావ్రతమ్॥ ౧౨

తన సంపద యంతయుఁ దొలఁగిపోనీ తన తల తెగనీ మాహేశ్వరుఁడు లింగపూజావ్రతమును విడువరాదు.

లింగపూజా మకృత్వాతు మానవా యే నభుంజతే,
తేషాం మహాత్మనాం హస్తే మోక్షలక్ష్మీ రుపస్థితామ్॥ ౧౩

ఏ మానవుఁడు 'లింగ పూజనమును జేయక తిన' ననెడి వ్రతము గలవాఁడో ఆ మహాత్మునకు మోక్షలక్ష్మి చేతిలోనిది.

కి మన్యై ర్ధర్మ కలిలైః కీక సార్థ ప్రదాయిభిః,
సాక్షా న్మోక్షప్రదః శంభో ర్ధర్మో లింగార్చ నాత్మకః॥ ౧౪

ఎముకలవలె నింద్యములును, పనికిమాలినవియు, లింగపూజకంటె వేఱయినట్టియు, క్షుద్రధర్మములతో ప్రయోజనమేమి? శివలింగపూజా రూపమైన శివధర్మమే మోక్షప్రదము.

అర్పితే నాన్నపానేన లింగే నియమ పూజితే,
యే దేహవృత్తిం కుర్వంతి మహామాహేశ్వరా హి తే॥ ౧౫

విధిప్రకారముగాఁ బూజింపఁబడు శివలింగమునకు సమర్పింపఁబడిన అన్నాదికముతోనే దేహమును బోషించుకొనువారే మహామాహేశ్వరులు.

చిన్మయే శాంకరే లింగే స్థిరం యేషాం మనః సదా,
విముక్తేతర సర్వార్థం తే శివా నాత్ర సంశయః॥ ౧౬

ఎవని మనస్సు జ్ఞాన స్వరూపమైన శివలింగమందే స్థిరపడి శివేతర విషయములైన స్వర్గాదిఫలముల నాసింపదో, అట్టివాడు శివస్వరూపులే.

లింగే యస్య మనో లీనం లింగస్తుతి పరా చ వాక్,
లింగార్చనపరౌ హస్తౌ స రుద్రో నాత్ర సంశయః॥ ౨౭

ఎవని మనస్సు శివలింగమందే చేరిపోవునో, ఎవ్వని వాణి శివలింగ స్తుతియందే చేయునో, ఎవని చేతులు శివపూజయందే ఆసక్తములో, అతడు రుద్ర స్వరూపుడే యగునన సందియము లేదు.

లింగనిష్ఠస్య కిం తస్య కర్మణా స్వర్గ హేతునా,
నిత్యానంద శివప్రాప్తి ర్యస్య శాస్త్రేషు నిశ్చితా॥ ౨౮

నిత్యానంద స్వరూపమైన శివపదప్రాప్తి యే లింగనిష్ఠునకు శాస్త్రములందు జెప్పబడినదో ఆయనకు నేడుండి రేపుండని (తుచ్ఛ) స్వర్గాది ఫలముల నిచ్చుకర్మములతో నేమి ప్రయోజనము?

లింగనిష్ఠాపరం శాంతం భూతి రుద్రాక్ష సంయుతం,
ప్రశంసంతి సదా కాలం బ్రహ్మాద్యా దేవతా ముదా। ౨౯

భస్మ రుద్రాక్షధారియు, శాంతుడును (ఇంద్రియోద్వేగములకు లోనుగానివాడును) అయిన లింగ వ్రత పరుని బ్రహ్మాది దేవతలెల్లరు కొనియాడుదురు.

## 18. పూర్వాశ్రయ నిరసన స్థలము

లింగైక నిష్ఠ హృదయః సదా మాహేశ్వరో జనః,
పూర్వాశ్రయ గతాన్ ధర్మాం స్త్యజేత్స్వాచారరోధకాన్.

నిత్యముగా శివలింగమందే యెడతెగని నిష్ఠగలిగిన మాహేశ్వరుడు మాహేశ్వరాచారములకు విరుద్ధములగు పూర్వాశ్రమ ధర్మములను (ప్రాకృతాచార ధర్మములను) పూర్తిగా విడువవలయును. ఇందలి ఆచరణము లన్నియు మొదట అలింగి జాతియందుబుట్టి ఆపైని దీక్షవలన మతమును జేరినవారి కొఱకే చెప్పబడునని తెలియవలయును.

స్వజాతి కులజాన్ ధర్మాన్ లింగ నిష్ఠా విరోధినః,
త్యజన్ మాహేశ్వరో జ్ఞేయః పూర్వాశ్రయ నిరాసకః॥ 31

లింగనిష్ఠకు విరుద్ధములైన మున్ను ప్రాకృత జాతి కులములకుఁ జెందిన ధర్మములను విడచినవాఁడే పూర్వాశ్రయ నిరాసకుఁడైన మాహేశ్వరుఁడని తెలియవలయును.

శివ సంస్కార యోగేన విశుద్ధానాం మహాత్మనాం,
కిం పూర్వకాలికైః ధర్మైః ప్రాకృతానాం హితే మతాః॥ 32

శైవ సంస్కారములను బొందుట చేతఁ బరిశుద్ధుఁడైన మహాత్మునకు తన ప్రాకృతావస్థయందు తా నాచరించిన ధర్మములతో నేమి ప్రయోజనము? ఆ ధర్మము లన్నియు అలింగులగు ప్రాకృతులకే చెప్పఁబడినవి.

శివ సంస్కారయోగేన శివ ధర్మానుషంగినాం,
ప్రాకృతానాం న ధర్మేషు ప్రవృత్తి రుపపద్యతే॥ 33

శైవ సంస్కారములను బొందుటచేత శివ ధర్మములను విడక జరుపు వారలకు అలింగులైన ప్రాకృతుల ధర్మములందుఁ బ్రవర్తించుట చెల్లదు.

విశుద్ధాః ప్రాకృతాశ్చేతి ద్వివిధా మానుషాః స్మృతాః,
శివ సంస్కారిణః శుద్ధాః ప్రాకృతా ఇతరే మతాః॥ 34

మనుజులు విశుద్ధులు, ప్రాకృతులు నని రెండు తెఱఁగులు. శివ సంస్కారము నొందినవారే విశుద్ధులు (అప్రాకృతులు). శివ సంస్కారము లేనివారే ప్రాకృతులు.

వర్ణాశ్రమాది ధర్మాణాం వ్యవస్థా హి ద్విధా మతా,
ఏకా శివేన నిర్దిష్టా బ్రహ్మణా కథితా పరా॥ 35

బ్రాహ్మణాది వర్ణములయు, బ్రహ్మచర్యాద్యాశ్రమములయు, ధర్మముల యేర్పాటు రెండు విధములు గలవు. ఒకటి శివునిచేఁ జెప్పఁబడినది. రెండవది బ్రహ్మచేఁ జెప్పఁబడినది.

శివోక్త ధర్మ నిష్ఠానాం శివాశ్రమ నిషేవిణాం,
శివ సంస్కార హీనానాం ధర్మః పైతామహః స్మృతః॥ ౩౬

శివునిచేఁ జెప్పఁబడిన ధర్మాచరణము శివ వర్ణాశ్రమ ధర్మముల నాచరించు వారికిని, బ్రహ్మచేఁ జెప్పఁబడిన ధర్మాచరణము శైవ సంస్కారము లేనివారికినిగా నున్నది.

## 19. శివాద్వైత నిరసన స్థలము.

పూజ్య పూజకయో ర్లింగ జీవయో ర్భేద వర్జనే,
పూజా కర్మాద్య సంపత్తే ర్లింగ నిష్ఠా విరోధతః॥ ౩౭

సర్వాద్వైత విచారస్య జ్ఞానాభావో వ్యవస్థితః,
భవేన్మాహేశ్వరః కర్మీ సర్వాద్వైత నిరాసకః॥ ౩౮

పూజింపఁబడు శివలింగమునకును, పూజించు భక్తునకును భేదము లేదన్నచో లింగనిష్ఠకు విరోధముగాన పూజాకర్మాదులకు స్వరూపనిష్పత్తి లేనందువలనను, సమస్తమైన యద్వైత విచారము యొక్క జ్ఞానమునకు లేమియే స్థిరపడుచున్నది. అందుచే శివలింగ పూజాది కర్మములనుజేయు మాహేశ్వరుఁడు సర్వాద్వైతమును నిరసించువాఁడు కావలయు. 'క్రియాద్వైతం న కర్తవ్యం' అనెడి ప్రమాణమువలన క్రియయం దద్వైతము చేయరాదని తాత్పర్యము.

ప్రేరకం శంకరం బుద్ధ్వా ప్రేర్య మాత్మాన మేవ చ,
భేదాత్తం పూజయే న్నిత్యం న చాద్వైతపరో భవేత్॥ ౩౯

శివుఁడు ప్రేరకుఁడనియు, జీవుఁడు ప్రేరింపఁబడువాఁడనియు తెలిసి భేదభావముతోనే శివుని బూజింపవలయును. శివ జీవులయం దద్వైతమును భావించి అద్వైతమం దాసక్తుఁడు కారాదు.

పతిః సాక్షా న్మహాదేవః పశు రేష తదాశ్రయః,
అనయోః స్వామి భృత్యత్వ మభేదే కథ మిష్యతే॥ ౪౦

శివుఁడు సాక్షాత్తుగా ప్రభువు. జీవుఁ డాశివు నాశ్రయించి యుండు వాఁడు. ఇట్లుండఁగా శివజీవుల కభేదమునే చెప్పుచో స్వామి

భృత్యభావ మెట్లు సంభవించును? గాన పూజకుఁడు శివుని భేదబుద్ధితోనే పూజింపవలెనని భావము.

సాక్షాత్కృతం పరం తత్త్వం యదా భవతి బోధతః,
తదాఽద్వైత సమాపత్తి ర్జ్ఞాన హీనస్య న క్వచిత్॥ ४०

శ్రుతి బోధము చేతను, గురు బోధము చేతను, ఎపుడు పరశివ తత్త్వము ప్రత్యక్షమగునో అపుడే అద్వైత స్ఫురణ మగును. జ్ఞానము గలుగక కేవల కర్మముల నాచరించువాని కేనాఁడును అద్వైత స్ఫురణము లేదు.

భేదస్య కర్మహేతుత్వా ద్వ్యవహారః ప్రవర్తతే,
లింగ పూజాది కర్మస్థో న చాఽద్వైతం సమాచరేత్॥ ४१

శివ జీవులయొక్క భేద వ్యవహారము శివపూజాదిక్రియలకుఁ గారణ మగుటచేత, శివలింగ పూజాది కర్మములందు వ్రతము గలవాఁడు శివ జీవులందు అద్వైత భావమును నిలుపరాదు.

పూజాది వ్యవహారఃస్యా ద్భేదాశ్రయ తయా సదా,
లింగపూజా పర స్తస్మా న్నాద్వైతే నిరతో భవేత్॥ ४३

పూజ మున్నగు వ్యవహార మంతయు భేదము నాశ్రయించియే యున్నది. అందుచే శివలింగ పూజాసక్తుఁడు అద్వైతమందాసక్తుఁడు కారాదు.

## 20. ఆహ్వాన నిరసన స్థలము.

లింగార్చన పరః శుద్ధః సర్వాద్వైత నిరాసకః,
స్వేష్ట లింగే శివాకారే నత మావాహయే చ్ఛివమ్॥ ४४

సర్వాద్వైతములను నిరసించిన వాఁడును, శుద్ధుఁడు నైన లింగ పూజకుఁడు శివ స్వరూపమైన తన యిష్ట లింగమందు శివు నావాహనము చేయరాదు.

యదా శివకలా యుక్తం లింగం దద్యా న్మహా గురుః,
తదారభ్య శివస్తత్ర తిష్ఠత్యాహ్వాన మత్ర కిమ్॥ ४५

మహాగురుఁడు శివకళలతోఁ గూడిన లింగమును భక్తునకెప్పు డనుగ్రహించునో అది మొదలు శివుఁడా లింగమం దుండును. అపుడు మరల లింగమం దావాహన మెందులకు?

స సంస్కారేషు లింగేషు సదా సన్నిహితః శివః,
తత్రావాహ్వానం న కర్తవ్యం ప్రతిపత్తి విరోధతః॥ ౪౧

సంస్కరింపఁబడిన లింగములందు శివుఁడు సర్వదా సన్నిహితుఁడై యుండును. అపుడు శివదీక్షా జ్ఞానమునకు ఆహ్వానము విరోధ మగుటచే సంస్కరింపఁబడిన లింగములం దాహ్వానము చేయరాదు.

నాహ్వానం న విసర్గం చ స్వేష్ట లింగే తు కారయేత్,
లింగ నిష్ఠాపరో నిత్యమితి శాస్త్రస్యనిశ్చయః॥ ౪౨

లింగపూజాసక్తుఁడు తన యిష్ట లింగమం దావాహనము గాని విసర్జనము గాని చేయరాదని శాస్త్రసిద్ధాంతము.

## 21. అష్టమూర్తి నిరసన స్థలము.

యథాత్మ శివయోరైక్యం న మతం కర్మసంగినః,
తథా శివాత్ పృథివ్యాదే రద్వైతమపి నేష్యతే॥ ౪౩

శివపూజా కర్మములయందు నిష్ఠగల మాహేశ్వరునకు శివజీవుల యేకత్వ మెట్లు సమ్మతముకాదో అటులే శివునకును శివుని శరీరమైన పంచభూతములు, సూర్య చంద్రులు, యజమానుఁడు (ఆత్మ) అను అష్టమూర్తులకును అద్వైతము సమ్మతము కాదు.

పృథివ్యాద్యష్టమూర్తిత్వ మీశ్వరస్య ప్రకీర్తితం,
తదధిష్ఠాతృ భావేన న సాక్షాదేక భావతః॥ ౪౪

పృథివి, జలము, తేజస్సు, వాయువు, ఆకాశము, సూర్యుఁడు, చంద్రుఁడు, ఆత్మ అను నెనిమిదియు శివుని శరీరములుగాఁ జెప్పఁబడినవి గాన అధిష్ఠాతయైన శివునకును అధిష్ఠేయమైన పృథివ్యాదులకు నేకత్వము కుదురదు.

పృథివ్యాద్య మిదం సర్వం కార్యం కర్తా మహేశ్వరః,
నైత త్సాక్షా న్మహేశోఽయం కులాలః కలశో యథా॥ ౨౦

మహేశ్వరుఁడు కారణము, పృథివి మున్నగునవి కార్యములు; అందుచేఁ బృథివ్యాదులు సాక్షాచ్ఛివుఁడు కానేరవు. కర్తయైన కుమ్మరికిని కార్యమైన కుండకును అభేద మెట్లు కుదురదో, అటులే శివునకును, అష్టమూర్తులకును అభేదము చెల్లదు.

పృథివ్యా ద్యాత్మ పర్యంత ప్రపంచో హ్యష్టధా స్థితః,
తను రీశస్య చాత్మాఽయం సర్వతత్త్వ నియామకః॥ ౨౧

పృథివి మొదలుగా నెనిమిది విధములైన ప్రపంచము శివశరీరమై యున్నది. శివుఁడు ముప్పదియాఱు తత్త్వములను నియమించు నాత్మగా నున్నాఁడు.

శరీర భూతా దేతస్మాత్ ప్రపంచా త్పరమేష్ఠినః,
ఆత్మభూతస్య దేవస్య నాభేదో న పృథక్ స్థితిః ॥ ౨౨

శివుని శరీరమైన యీ ప్రపంచముకంటె పరమేష్ఠియై (పరమ పద మందున్న) ఆత్మస్వరూపుఁడైన ఆ శివునకు అభేదము లేదు. అనగా భేదమే కలదనుట. ఇతని శరీరముగానుండి వేఱుగానున్న పృథివ్యాది ప్రపంచము శరీరి యనఁబడు శివుని విడిచి వేఱుగా నుండదు. అనఁగా శివునకును అతని శరీరమైన పృథివ్యాదులకును భేదమును అభేదమును గల వనుటయే (శ్రీ) రేణుకాచార్యుల యభిప్రాయము. ఈ భేదాభేద స్థితియే వీరశైవసిద్ధాంత పరమరహస్యము.

అచేతనత్వాత్ పృథ్వ్యాదే రజ్ఞత్వా దాత్మన స్తథా,
సర్వజ్ఞస్య మహేశస్య నైక రూపత్వ మిష్యతే॥ ౨౩

పృథివ్యాదులు జడములై యుండుటవల్లను, ఆత్మఁడు కించిజ్జ్ఞుఁడగుటవల్లను సర్వజ్ఞుఁడైన శివునకును వీనికిని సరూపత్వము సంభవింపదు.

ఇతి యశ్చింతయే న్నిత్యం పృథ్వ్యాదే రష్టమూర్తితః,
విలక్షణం మహాదేవం సోఽష్టమూర్తి నిరాసకః॥ ౨౪

ఈ విధముగా అష్టశరీరములైన పృథివ్యాదులకంటె విలక్షణుఁడైన వానిఁగా శివునెల్లపుడును ధ్యానించువాఁడే అష్టమూర్తి నిరాసకుఁ డనఁబడును.

## 22. సర్వగత్వ నిరసన స్థలము

సర్వగత్వే మహేశస్య సర్వత్రారాధనం భవేత్,
న లింగమాత్రే తన్నిష్ఠో న శివం సర్వగం స్మరేత్॥ ౫౫

శివుఁడంతటను వ్యాపించియుండుటచేత ఆతని పూజ అన్నింటను గావలయుఁగదా ? లింగమందు మాత్రమే కాఁగూడదే. అందుచే శివునియందు నిష్ఠగల మాహేశ్వరుఁడు శివుఁడంతట వ్యాపించియున్నాఁడని తలఁపరాదు.

సర్వగోఽపి స్థితః శంభుః స్వాధారే హి విశేషతః,
తస్మా దన్యత్ర విముఖః స్వేష్ట లింగే యజే చ్ఛివమ్॥ ౫౬

శివుఁ డంతట వ్యాపించి యున్నాఁడైనను తన కాధారభూతమైన యిష్టలింగమందే విశేషించి యుండును. అందుచే మాహేశ్వరుఁ డితర భావనమందు విముఖుఁడై తన యిష్టలింగమందే శివుని బూజింపవలయును.

శివ స్సర్వగత శ్చాపి స్వాధారే వ్యజ్యతే భృశం,
శమీగర్భే యథా వహ్ని ర్విశేషేణ విభావ్యతే॥ ౫౭

అగ్ని యన్ని కట్టెలయం దున్నను జమ్మికట్టెయందెట్లు విశేషించి యుండునో, అటులే శివుఁడన్నింట వ్యాపించి యున్నవాఁడైనను తన కాధారభూతమైన యిష్టలింగమందే విశేషించి ప్రకాశించుచుండును.

సర్వగత్వం మహేశస్య సర్వశాస్త్ర వినిశ్చితం,
తథా ప్యాశ్రయ లింగాదౌ పూజార్థ మధికా స్థితిః॥ ౫౮

శివుఁ డన్నిట నున్నాఁడనుట శాస్త్ర సిద్ధమే కాని తన కాధారభూతమైన యిష్ట లింగమందును, గురు జంగముల యందును, పూజకై విశేషించి నివసించియుండును.

తస్మాత్ సర్వప్రయత్నేన సర్వస్థాన పరాఙ్ముఖః,
స్వేష్ట లింగే మహాదేవం పూజయేత్పూజకోత్తమః॥ ౫౯

ఆ కారణముచే మాహేశ్వరులు, శివుఁడు సర్వస్థానములందు నున్న వాఁడను భావమునకు దూరులై సర్వప్రయత్నములచేత శివుని తన యిష్టలిగమందే పూజింపవలయును.

శివస్య సర్వగత్వేఽపి సర్వత్ర రతి వర్జితః,
స్వేష్ట లింగే యజన్ దేవం సర్వగత్వ నిరాసకః॥ ౬౦

శివుఁడంతటను వ్యాపించిన వాఁడైనను, అంతటను ప్రీతిలేనివాఁడై తన యిష్టలింగమందే శివుని పూజించువాఁడు సర్వగత్వ నిరాసకుఁ డనఁబడును.

## 23. శివ జగన్మయ స్థలము.

పూజావిధౌ నియమ్యాత్మా ల్లింగ మాత్రే స్థితం శివం,
పూజయ న్నపి దేవస్య సర్వగత్వం విభావయేత్॥ ౬౧

శివుఁడు భక్తాధీనుఁ డగుట వలన పూజకుఁడు పూజాకాలమందుఁ తన యిష్ట లింగమందు మాత్రమే వసించువాఁడని భావించి పూజించు చున్నను వెంటనే శివుఁడు సర్వవ్యాపకుఁడను భావము వీడరాదు.

యస్మా దేతత్సముత్పన్నం మహాదేవా చ్చరాచరం,
తస్మా దేత న్నభిద్యేత యథా కుంభాదికం మృదః॥ ౬౨

మంటివలనఁ గలిగిన కుండ మున్నగునవి మంటికంటె నెట్లు వేఱు కావో అటులే శివునివలనఁ గలిగిన యీ స్థిరచరాత్మక ప్రపంచము శివునికంటె వేఱయినది కాదు.

శివ తత్త్వా త్సముత్పన్నం జగదస్మా న్నభిద్యతే,
ఫేనోర్మి బుద్బుదాకారో యథా సింధోర్నభిద్యతే॥ ౬౩

సముద్రము నుండి పుట్టిన నురుగు, కెరట్లు, బుగ్గలు మున్నగునవి సముద్రముకంటె నెట్లు వేఱుకావో, అటులే శివతత్త్వమునుండి పుట్టిన జగత్తు శివుని కంటె వేఱుగా నుండదు.

యథా తంతుభి రుత్పన్నః పటస్తంతుమయః స్మృతః,
తథా శివా త్సముత్పన్నం శివ ఏవ చరాచరమ్॥ ౬౪

దారముల వలననైన వస్త్రము దారముల స్వరూపమయియే యొప్పు నటులే శివునివలన బుట్టిన చరాచరాత్మక జగత్తు శివరూపమే.

ఆత్మశక్తి వికాసేన శివో విశ్వాత్మనా స్థితః,
కుటీభావా ద్యథాభాతి పటః స్వస్య ప్రసారణాత్॥ ౬౫

వస్త్రము తన ప్రసారణముచే (పఱచుటచే) డేరా (పట గృహము) అయి యెటులు కానవచ్చునో అటులే శివుఁడును తనయందు నిత్యసంబంధముతో నుండు విమర్శశక్తియొక్క వికాసముచేత ప్రపంచరూపి యగుచున్నాఁడు.

పత్ర శాఖాది రూపేణ యథా తిష్ఠతి పాదపః,
తథా భూమ్యాది రూపేణ శివ ఏకో విరాజతే॥ ౬౬

చెట్టు తన యాకులు, కొమ్మలు మున్నగువాని రూపముతో నెట్లు విరాజిల్లుచున్నదో అటులే శివుఁడు భూమి, జలాది రూపముతో ప్రకాశించుచున్నాఁడు.

శ్రీ రేణుక భగవత్పాదులు సకలచరాచరరూప జగత్తు సత్య మగుటను, శివుని పరిణామరూప మగుటను, ఈ స్థలమందు స్పష్టముగా వివరించిరి. ఈ విషయమే "స్వశక్తి ప్రచయోఽస్య విశ్వం" అనెడి శివసూత్రమందును, "శక్తిశ్చ శక్తిమాంశ్చైవ పదార్థద్వయ ముచ్యతే, శక్తయోఽస్య జగత్సర్వం శక్తిమాం స్తు మహేశ్వరః" అను ప్రమాణముచేత, శ్రీ సర్వమంగళా శాస్త్రమందును ప్రతిపాదింపఁబడినది. అనఁగా శక్తియును శక్తిమంతుఁడును రెండు పదార్థములుగాఁ జెప్పఁబడుచున్నారు. ఈతని శక్తులే సర్వజగత్తు. ఆ శక్తులుగలవాఁడే మహేశ్వరుఁడు. గాన జరాచరాత్మకమైన జగత్తు ప్రత్యక్ష శివస్వరూపమై సత్యమైనదని సిద్ధాంతము.

## 24. భ క్త దేహిక లింగ స్థలము.

సమ స్త జగ దాత్మాపి శంకరః పరమేశ్వరః,
భక్తానాం హృదయాంభోజే విశేషేణ విరాజతే ॥ ౬౭

శివుఁడు సకల చరాచర జగద్రూపుఁ డయ్యును భ క్తులహృదయ కమలములందు విశేషించి విరాజిల్లును.

కై లాసే మందరే చైవ హిమాద్రౌ కనకాచలే,
హృదయేషు చ భక్తానాం విశేషేణ శివః స్థితః ॥ ౬౮

పరమేశ్వరుఁడు కై లాసమందును, మందరాచలమందును, మంచు కొండయందును, బంగారుకొండయందును, భక్తుల హృదయములందును విశేషించి యుండును.

సర్వాత్మాపి పరిచ్ఛిన్నో యథా దేహేషు వ ర్తతే,
తథా స్వకీయ భ క్తేషు శంకరో భాసతే సదా ॥ ౬౯

శివుఁడు సర్వాత్మయయ్యును పరిచ్ఛిన్నుఁడై దేవ మనుష్య పశు పక్ష్యాది శరీరములం దెట్లు వసించునో, యటులే భ క్తులందును సుఖ ప్రదుఁడై న పరమేశ్వరుఁడు ప్రకాశించుచుండును.

నిత్యం భాతి త్వదీయేషు యా తే రుద్ర శివా తనూః,
అఘోరాఽపాపకా శీః శ్రుతి రాహ సనాతనీ ॥ ౭౦

ఓయీ రుద్రుడా! శాశ్వతియైన (యజుర్వేద శ్రుతి, శాంతమును పాపరహితమునై న) నీ శరీరము (శివలింగమూర్తి) నీ సంబంధులై న భ క్తులందుఁ బ్రకాశించునని "యా తే రుద్ర శివాతనూ రఘోరాఽ పాపకాశినీ" అను మంత్రముచే బోధించుచున్నది.

విశుద్ధేషు విర క్తేషు వివేకిషు మహాత్మసు,
శివ స్తిష్ఠతి సర్వాత్మా శివలాంఛన ధారిషు ॥ ౭౧

• ఆణవాది మలరహితులును వై రాగ్య సంపన్నులును మహాత్ములు నైన విభూతి రుద్రాక్షాది శివలాంఛనధారులందు సర్వాత్ముఁడై న శివుడుండును.

నిత్యం సంతోష యుక్తానాం జ్ఞాన నిర్ధూత కర్మణాం,
మాహేశ్వరాణా మంతస్థో విభాతి పరమేశ్వరః॥ ౭౨

నిత్యసంతుష్టులును, జ్ఞానముచేఁ బసుకర్మములను దుల్చినవారు నైన మాహేశ్వరుల హృదయములందుండి పరమేశ్వరుఁడు ప్రకాశించును.

అన్యత్ర శంభో రతిమాత్ర శూన్యో
నిజేష్టలింగే నియతాంతరాత్మా,
శివాత్మకం విశ్వమిదం విబుద్ధ్యా
మాహేశ్వరోఽసౌ భవతి ప్రసాదీ॥ ౭౩

శివునికంటె నితరులైన దేవతలయం దింతయును ప్రీతిలేనివాఁడును, తన యిష్టలింగమందే అంతరాత్మను సంబంధింపఁ జేసికొన్న వాఁడును, సర్వ చరాచర ప్రపంచమును శివస్వరూపముగా నెఱుంగువాఁడును అయిన మాహేశ్వరుఁడే ప్రసాది యగును.

ఇది

సిద్ధాంత శిఖామణి యందలి - మాహేశ్వరస్థలమున

మాహేశ్వర ప్రశంసాది 9 స్థలము లనెడి

ప ది య వ ప రి చ్ఛే ద ము

శ్రీ శి వా ర్ప ణ ము.

—♦—

ఓం నమః శివాయ

శ్రీ మాత్రే నమః

శ్రీ జగద్గురు పంచాచార్యాః ప్రసీదంతు

# పదునొకండవ పరిచ్ఛేదము.

## ప్రసాది స్థలము.

అగస్త్యమహర్షి యనుచున్నాడు :

ఉక్తో మాహేశ్వరః సాక్షా ల్లింగనిష్ఠాది ధర్మవాన్,
కథమేష ప్రసాదీతి కథ్యతే గణనాయక॥ ౧

ఓయీ గణాధీశ్వర ! లింగనిష్ఠాది ధర్మములు గలవాఁడు మాహేశ్వరుఁ డంటివి. ఈ మాహేశ్వరుఁడు ప్రసాది యని యెటులు చెప్పఁబడును? అని ప్రశ్నింపఁగా,

శ్రీ రేణుకాచార్యు లిట్లనుచున్నారు :

లింగ నిష్ఠాది భావేన ధ్వస్త పాపనిబంధనః,
మనః ప్రసాద యోగేన ప్రసాదీత్యేష కథ్యతే॥ ౨

ఓయీ అగస్త్యమహర్షీ! లింగనిష్ఠాది స్థలముల నాచరించుటచే ఈ మాహేశ్వరుఁడు పాపబంధములన్నియుఁ దొలఁగినవాఁడై మనఃప్రసాదము (నిర్మలచిత్తము) తో గూడియుంటచేతఁ బ్రసాది యనఁబడును.

ప్రసాది స్థల మిత్యేత దస్య మాహాత్మ్య బోధకం,
అంతరస్థల భేదేన సప్తధా పరికీర్తితమ్॥ 3

ప్రసాది స్థల మాదౌ తు గురు మాహాత్మ్యకం తతః,
తతో లింగం ప్రశంసా చ తతో జంగమ గౌరవమ్॥ ౪

తతో భక్తస్య మాహాత్మ్యం తతః శరణ కీర్తనం,
శివప్రసాద మాహాత్మ్య మితి సప్త ప్రకారకం,
క్రమాల్లక్షణ మేతేషాం కథయామి మహామునే॥ ౫

ఈ ప్రసాదిస్థలము ప్రసాదియొక్క మహిమమును బోధించును. ఇది 1. ప్రసాదిస్థలము, 2. గురుమాహాత్మ్య స్థలము, 3. లింగమాహాత్మ్య

స్థలము, 4. జంగమమాహాత్మ్య స్థలము, 5. భక్తమాహాత్మ్య స్థలము, 6. శరణమాహాత్మ్య స్థలము, 7. ప్రసాద మాహాత్మ్య స్థలము అని యేడు విధములు గలది. వాని లక్షణములను క్రమముగా నీకు వివరించు చున్నాను.

## 25. ప్రసాది స్థలము

నైర్మల్యం మనసో లింగం ప్రసాద ఇతి కథ్యతే,
శివస్య లింగరూపస్య ప్రసాదాదేవ సిద్ధ్యతి॥ ౧

ఓయి మహర్షీ! మనస్సు నిర్మలముగా నుండుటే ప్రసాద మనఁబడును. ఈ ప్రసాదము నెడి ఉత్తమలక్షణము లింగరూపియైన శివుని ప్రసాదము వలననే కలుగును.

శివప్రసాదో యద్ద్రవ్యం శివాయ వినివేదితం,
నిర్మాల్యం తత్తు శైవానాం మనో నైర్మల్య కారణమ్॥ ౨

ఏ పదార్థము శివునకు నివేదింపఁబడునో దానికే నిర్మాల్యమని (నిర్మలమని) శివప్రసాదమని పేళ్లు. ఆ శివప్రసాదము వీరశైవుల మనో నైర్మల్యమునకుఁ గారణ మగుచున్నది.

మనః ప్రసాద సిద్ధ్యర్థం నిర్మలం జ్ఞానకారణం,
శివప్రసాదం స్వీకుర్వన్ ప్రసాదీ త్యేష కథ్యతే॥ ౩

మనో నైర్మల్య సిద్ధికొఱకును నిష్కలుషమైన శివజ్ఞానమునకును హేతువైన శివప్రసాదమును స్వీకరించు మాహేశ్వరుఁడు ప్రసాది నాఁ బడును.

అన్న శుద్ధ్యా హి సర్వేషాం తత్త్వశుద్ధి రుదాహృతా,
విశుద్ధ మన్నజాతం హి యచ్ఛివాయ సమర్పితమ్॥ ౪

విశుద్ధమైన అన్నములను సేవించుటచేతనే సర్వప్రాణులకును తత్త్వశుద్ధి యగునని శాస్త్రము లనుచున్నవి. అట్టి యన్నపరిశుద్ధత, శివునకు సమర్పించుటచేతనే కలుగును. అది శివప్రసాదము.

తదేవ సర్వకాలం తు భుంజానో లింగతత్పరః,
మనః ప్రసాద మతులం లభతే జ్ఞాన కారణమ్॥ ౧౦

లింగపూజాది వ్రతములందు సుస్థిరుఁడైన మాహేశ్వరుఁడు విశుద్ధమైన శివప్రసాదమునే స్వీకరించుచు శివజ్ఞానకారణమైన సాటిలేని మనః ప్రసాదము నొందును.

ఆత్మ భోగాయ నియతం యద్యద్ద్రవ్యం సమాహితం,
తత్తత్సమర్ప్య దేవాయ భుంజీతాత్మ విశుద్ధయే॥ ౧౧

తానను భవించుట కేయే వస్తువులు సంపాదింపఁబడునో, ఆయా వస్తువులను మున్ను శివునకు నివేదించి వానినే చిత్తశుద్ధికొఱకై తాను భుజింపవలయును.

నిత్య సిద్ధేన దేవేన భిషజా జన్మరోగిణాం,
యద్య త్ప్రసాదితం భుక్త్వా తత్తజ్జన్మరసాయనమ్॥ ౧౨

పుట్టువనెడి తెగులును బాపు వైద్యుఁడును, శివలింగమం దెల్లపుడు నుండువాడును, స్వయంప్రకాశుఁడు నైన మహాదేవునిచే ఏయే వస్తువు మున్ను స్వీకరింపఁబడి ప్రసాదరూపమై యుండునో ఆ వస్తు వెల్లసంసార రోగమును బోగొట్టు మహారసాయనమే.

ఆరోగ్యకారణం పుంసా మంతఃకరణ శుద్ధిదం,
తాపత్రయ మహారోగ సముద్ధరణ భేషజమ్॥ ౧౩

విద్యా వైశద్య కరణం వినిపాత విఘాతనం,
ద్వారం జ్ఞానావతారస్య మోహచ్ఛేదస్య కారణమ్॥ ౧౪

వైరాగ్య సంపదో మూలం మహానంద ప్రవర్ధనం,
దుర్లభం పాపచిత్తానాం సులభం శుద్ధకర్మణామ్॥ ౧౫

అదృతం బ్రహ్మ విష్ణ్వాద్యై ర్వశిష్ఠాద్యైశ్చ తాపసైః,
శివ స్వీకృత మన్నాద్యం స్వీకార్యం సిద్ధి కాంక్షిభిః॥ ౧౬

కావున దేహారోగ్యకారణ మైనట్టియు, చిత్తశుద్ధి గలిగించునట్టియు, ఆధ్యాత్మిక, ఆధిభౌతిక, ఆధిదైవికము లనెడి మహావ్యాధులను దొలచు

దివ్యౌషధమైనట్టియు, ఆత్మవిద్యావికాసమునకు మూలసాధనమైనట్టియు, కృత్రిమదోషముల నడంచునట్టియు, శివజ్ఞానోత్పత్తికి ద్వారమువంటి దియు, అజ్ఞానమును నశింపఁజేయునదియు, వైరాగ్యసంపద కాదికారణ మైనదియు, పాపాత్ములకుఁ బొందరానిదియు, పుణ్యవంతులకు సుఖముగాఁ జిక్కునదియు, బ్రహ్మ విష్ణ్వాది దేవతలును, వసిష్ఠాదులైన తాపసులును ఆదరించి స్వీకరించునదియు అయిన శివభుక్తాన్నాదికమునే మోక్షసిద్ధినిగోరు భక్తులు స్వీకరింపవలయును.

పత్రం పుష్పం ఫలం తోయం యచ్ఛివాయ నివేదితం,
తత్తత్ స్వీకార యోగేన సర్వపాపక్షయో భవేత్॥ ౧౭

ఆకో, పూవో, పండో, నీరో శివునకు నివేదితమైనదానిని స్వీకరించుటచేత సర్వపాపములును నశించును.

## 26. గురు మాహాత్మ్య స్థలము.

యథా శివప్రసాదాన్నం స్వీకార్యం లింగతత్పరైః.
తథా గురోః ప్రసాదాన్నం తథైవ శివయోగినామ్॥ ౧౮

లింగనిష్ఠ గలవారు శివప్రసాదాన్నమును భక్తితో స్వీకరించునటులే గురు ప్రసాదాన్నమును జంగమ ప్రసాదాన్నమును భక్తితో స్వీకరింపవలయును.

గురు రేవాత్ర సర్వేషాం కారణం సిద్ధి కర్మణాం,
గురురూపో మహాదేవో యతః సాక్షా దుపస్థితః॥ ౧౯

ఈ లోకమున భోగ మోక్ష రూపమైన సర్వసిద్ధులకును గురుఁడే మూలకారణ మగుచున్నాఁడు. ఎందుచేననఁగా శివుఁడే ప్రత్యక్షమైన గురురూపముతో నుండును. కావుననే "న గురో రధికం", "నాస్తి తత్త్వం గురోః పరం" మున్నగు వాక్యములచేత శ్రుతులును గురు మహిమమును విశేషించి కొనియాడుచున్నవి.

నిష్కలోఽపి మహాదేవో నిత్య జ్ఞాన మహోదధిః,
సకలో గురురూపేణ సర్వానుగ్రాహకో భవేత్॥ ౨౦

ఏనాఁడును ఇంకిపోని జ్ఞానరూపమహాసముద్రమైన శివుఁడు అవయవములు లేనివాఁడయ్యును, గురురూపముతో అవయవ విశిష్టుఁడై సర్వప్రాణులను అనుగ్రహించును. అనఁగా మోక్షమార్గదర్శకుఁ డగుననుట.

యః శివః స గురు ర్జ్ఞేయో యో గురుః స శివః స్మృతః,
న తయో రంతరం కుర్యాద్ జ్ఞానావాప్త్యై మహామతిః॥ ౨౧

శివుఁడే గురుఁడనియు, గురుఁడే శివుఁడనియుఁ జెప్పఁబడినది. గాన బుద్ధిశాలి జ్ఞానప్రాప్తికొఱకు శివగురులను భేదబుద్ధితోఁ గనరాదు.

హస్త పాదాది సామ్యేన నేతరైః సదృశం వదేత్,
ఆచార్యం జ్ఞానదం శుద్ధం శివరూపతయా స్థితమ్॥ ౨౨

దోషరహితుఁడును, జ్ఞానదాతయు, శివస్వరూపుఁడును అయిన శివాచార్యుఁడును ఇతరులవలె కరచరణాదులు గలవాఁడైనంత మాత్రముచే నాతనిని సామాన్యమనుష్యుఁడుగా నెన్నరాదు.

ఆచార్య స్యావమానేన శ్రేయః ప్రాప్తి ర్విహన్యతే,
తస్మా న్నిఃశ్రేయసః ప్రాప్త్యై పూజయే త్తం సమాహితః॥ ౨౩

గురు నవమానించుటచే శ్రేయస్సులు చెడును. గాన భోగ మోక్ష ప్రాప్తికిఁగా శ్రీగురువు నేకాగ్రచిత్తముతో బూజింపవలయును.

గురు భక్తి విహీనస్య శివభక్తి ర్న జాయతే,
అతః శివే యథా భక్తి స్తథా భక్తి ర్గురా వపి॥ ౨౪

గురుభక్తి లేనివానికి శివభక్తియు గలుగదు. గాన శివునందువలెనే గురువునందును నిర్మల నిశ్చల భక్తి యుంపవలయును. ఈ మాటనే శ్వేతాశ్వతరశ్రుతి "యస్య దేవే పరా భక్తి ర్యథా దేవే తథా గురౌ" అని ప్రతిపాదించుచున్నది.

## 27. లింగ మాహాత్మ్య స్థలము

గురు మాహాత్మ్య యోగేన నిజ జ్ఞానాతిరేకతః,
లింగస్యాపి చ మాహాత్మ్యం సర్వోత్కృష్టం విభావ్యతే॥ ౨౫

గురుమహిమతోఁ గూడియుండుటచేతను, యథార్థజ్ఞానాతిశయము చేతను, శివలింగముయొక్క మహిమమును సర్వోత్కృష్టమని తెలియఁబడుచున్నది.

> శివస్య బోధలింగం యద్గురు బోధిత చేతసా,
> తదేవ లింగం విజ్ఞేయం శాంకరం సర్వకారణమ్॥ ౨౬

శివుని యే జ్ఞానమయలింగము సర్వకారణభూతమై యున్నదో, అది గురుబోధతోఁ గూడిన మనస్సుచేతనే తెలియఁదగినది.

> పరం పవిత్ర మమలం లింగం బ్రహ్మ సనాతనం,
> శివాభిధానం చిన్మాత్రం సదానందం నిరంకుశమ్। ౨౭
>
> కారణం సర్వలోకానాం వేదానా మపి కారణం,
> పూరణం సర్వ తత్త్వానాం తారణం జన్మవారిధేః॥ ౨౮
>
> జ్యోతిర్మయ మనిర్దేశ్యం యోగినా మాత్మని స్థితం,
> కథం విజ్ఞాయతే లోకే మహాగురు దయాం వినా॥ ౨౯

సర్వశ్రేష్ఠమును, ఆణవాది మలములు లేనిదగుటచే బహు పావనమును, బ్రహ్మశబ్దముచేఁ జెప్పఁబడినదియు, సనాతనమును, జ్ఞానస్వరూపమును, త్రికాలాబాధ్యమును, ఆనందస్వరూపమును, నిరంకుశమును, సర్వలోకములకును వేదములకును గారణమైనదియు, ముప్పదియాఱు తత్త్వములతో నిండినదియు, సంసార సముద్ర తరణమునకు హేతువైనదియు, తేజఃస్వరూపమును, ఇట్టిదన నలవికానిదియు, యోగీశ్వరుల యాత్మలయందు స్థిరముగా నుండునదియు, శివనామకము నైన లింగము ఈ లోకమున మహాగురుకృపలేక యెట్లు తెలిసికొనఁబడును?

> బ్రహ్మణా విష్ణునా పూర్వం యల్లింగం జ్యోతి రాత్మకం,
> అపరిచ్ఛేద్య మభవ త్కేనవా పరిబోధ్యతే॥ 30

జ్యోతిర్మయమైన ఏ లింగము తొల్లి విష్ణుబ్రహ్మలకుఁగూడ దెలియ శక్యము కాకపోయెనో, ఆ లింగమును దెలియ నెవనికి శక్యమగును? ఎవనికిని దెలియ శక్యము కాదనుట.

తొల్లి శివలింగము నాద్యంతములను గనుఁగొనఁగోరి పంతగించి విష్ణు బ్రహ్మలు వరాహ హంస రూపములను ధరించి ఆదిని తెలియ విష్ణువును, అంతమును దెలియ బ్రహ్మయు బ్రయత్నించి, క్రింది లోకముల కొకరును, మీఁది లోకముల కొకరును బోయి విఫలులై మఱలి వచ్చిరి. అను లింగసూత్ర గాథ యెల్లరును ఎఱిఁగినదే.

బహునాత్ర కి ముక్తేన లింగం బ్రహ్మ సనాతనం,
యోగినో యత్ర లీయంతే ముక్తపాశ నిబంధనాః॥ 3౧

పలుమాటలేల? ఆలింగము నిత్యమై బ్రహ్మమై యున్నది. యోగులు సంసారపాశము నుండి విడువఁబడినవారై యీ లింగమనెడి వస్తువు నందే అణఁగిపోవుచున్నారు.

పీఠికా పరమా శక్తి ర్లింగం సాక్షాత్పరః శివః,
శివశక్తి సమాయోగం విశ్వం లింగం తదుచ్యతే॥ 3౨

"క్రియా శక్త్యాత్మకం పీఠం, జ్ఞాన శక్త్యాత్మనః ప్రభోః" అనఁగా జ్ఞాన శక్తి స్వరూపుఁడైన శివునకుఁ గ్రియాశక్తి స్వరూపమే పీఠము అనెడి శివాగమ ప్రమాణము ననుసరించి శక్తి పీఠముగాను, పరమ శివుఁడు లింగముగాను జెప్పఁబడెను. ఈ శివశక్తుల నిత్యసంబంధమే విశ్వలింగ మనఁబడుచున్నది.

బ్రహ్మాదయః సురాః సర్వే మునయః శౌనకాదయః,
శివలింగార్చనా దేవ స్వం స్వం పదమవాప్నువన్॥ 33

బ్రహ్మాదులైన దేవతలెల్లరును, శౌనకాదులైన మునులెల్లరును, శివలింగార్చనము చేతనే తమ తమ స్థానముల నందియున్నారు.

విశ్వాధిపత్య మీశస్య లింగమూర్తేః స్వభావజం,
అనన్య దేవ సాదృశ్యం శ్రుతిరాహ సనాతనీ॥ 3౪

లింగరూపుఁడైన పరమేశ్వరునకు విశ్వాధిపత్యము స్వభావసిద్ధముగా నున్నది. గాన అన్యదేవతలతో లింగమూర్తికి సాటి చెప్పుట సంభవింపదు. ఇందులకు శ్వేతాశ్వతరశ్రుతి ప్రమాణము. "విశ్వాధికో రుద్రో మహర్షిః హిరణ్యగర్భం జనయామాస పూర్వం, న తత్సమ

శ్చాభ్యధికశ్చ దృశ్యతే." శివుఁడే విశ్వాధికుఁడు. తొల్లి హిరణ్యగర్భుని (బ్రహ్మను) సృజించినాఁడు. అతనికి సముఁడుగాని అధికుఁడుగాని కానరాఁడు.

## 28. జంగమ మాహాత్మ్య స్థలము

గురు శిష్య సమారూఢ లింగ మాహాత్మ్య సంపదః,
సర్వ చిద్రూప విజ్ఞానా జ్జంగ మాధిక్య ముచ్యతే॥ 3౫

గురువునందును శిష్యునందును నెలకొన్న లింగమాహాత్మ్య స్థల వైభవము వలనను ఈ స్థలము సమస్త ప్రపంచమును చిద్రూపమైన దానిగా నెఱుంగుటవలనను జంగమ మాహాత్మ్య స్థలమని చెప్పఁబడు చున్నది.

జానంత్యతిశయా ద్యేతు శివం విశ్వ ప్రకాశకం,
స్వస్వరూపతయా తే తు జంగమా ఇతి కీర్తితాః॥ 3౬

తన జ్ఞానక్రియా శక్తులచేత నీ విశ్వస్థావర ప్రపంచమును బ్రకాశింపఁ జేయుచున్న శివుని స్వస్వరూపముగా నెవరు తెలిసికొనుచున్నారో వారు జంగము లనఁబడుదురు. జంగము లనఁగా గురు స్థలమందలి చరమూర్తులు.

యే పశ్యంతి జగజ్జాలం చిద్రూపం శివయోగతః,
నిర్ధూతమల సంస్పర్శా స్తే స్మృతాః శివయోగినః॥ 3౭

ఎవరీ సమస్త జగత్సముదాయమును శివుని సంబంధము చేత జిత్క్రియా రూపముగాఁ దెలిసికొనుచున్నారో, ఆణవాది మలసంపర్కము తొలగినవారో వారే శివయోగు లనియు, జంగములనియుఁ జెప్పఁబడుదురు.

ఘోర సంసార తిమిర పరిధ్వంసన కారణం,
యేషా మస్తి శివజ్ఞానం తే మతాః శివయోగినః॥ 3౮

భయంకరమైన సంసారమనెడి చీఁకటిని తొలగించుటకుఁ గారణమైన శివజానము గలవారే శివయోగు లనఁబడుదురు.

జితకామా జితక్రోధా, మోహగ్రంథి విభేదినః,
సమలోష్టాశ్మ కనకాః సాధవః శివయోగినః ॥ ౩౯

కామక్రోధాదికమైన అరిషడ్వర్గమును జయించినవారును, అజ్ఞానమనెడి ముడిని (ఆత్మానాత్మ జ్ఞానశూన్యతను) విడఁగొట్టినవారును, మట్టిపెళ్లను, రాతిని, బంగారును సమముగాఁ గనువారును, శివజ్ఞాన సంపత్తిచే సాధువులయినవారును శివయోగు లనఁబడుదురు.

సమాః శత్రౌ చ మిత్రే చ సాక్షాత్కృత శివాత్మకాః,
నిఃస్పృహా నిరహంకారా వర్తంతే శివయోగినః ॥ ౪౦

ఇట్టి శివయోగులు, పగవానియందును, నెయ్యానందును సమభావము గలవారును, శివస్వరూపమును సాక్షాత్కరించుకొన్నవారును, దేనియందును ఆశలేనివారును, అహంకార మమకారములు తొలఁగిన వారును అయి యుందురు.

దుర్లభం హి శివజ్ఞానం దుర్లభం శివచింతనం,
యేషా మేత ద్ద్వయం చాపి తే హి సాక్షాచ్ఛివాత్మకాః॥ ౪౧

శివజ్ఞానమును, శివుఁడే నేనను చింతనమును దుర్లభములు. ఈ రెండును ఎవరియందు సిద్ధములో వారు ప్రత్యక్ష శివస్వరూపులే.

పాదాగ్ర రేణవో యత్ర పతంతి శివయోగినాం,
తదేవ సదనం పుణ్యం పావనం గృహమేధినాం॥ ౪౨

అట్టి శివయోగుల పాదధూళులు ఏ యింటరాలునో ఆ గృహస్థుల యిల్లే పరమపావనమైనది.

సర్వసిద్ధికరం పుంసాం దర్శనం శివయోగినాం,
స్పర్శనం పాపశమనం పూజనం ముక్తిసాధనమ్॥ ౪౩

శివయోగుల దర్శనము సకల సిద్ధులనొసంగును. వారి స్పర్శనము పాపముల నడంచును. వారిపూజ మోక్షసాధనము.

మహతాం శివతాత్పర్య వేదినా మనుమోదినాం,
కిం వా ఫలం హి నో సిద్ధ్యేత్ సంపర్కా చ్ఛివయోగినామ్॥ ౪౪

శివరహస్యమును ఎఱిఁగినట్టియు, శివానందము ననుభవించినట్టియు, మహాత్ములైన శివయోగుల దర్శనస్పర్శములును పూజయు సర్వఫల సిద్ధికరములు.

## 29. భక్తమాహాత్మ్య స్థలము.

గురోర్లింగస్య మాహాత్మ్యకథనా చ్ఛివయోగినాం,
సిద్ధం భక్తస్య మాహాత్మ్యం తథాప్యేష ప్రశస్యతే॥ ౪౫

గురులింగజంగముల గొప్పదనమును జెప్పుటచే భక్తుని మాహాత్మ్య మిట్టిదని యిందుఁ బ్రశంసింపఁబడును.

యే భజంతి మహాదేవం పరమాత్మాన మవ్యయం,
కర్మణా మనసా వాచా తే భక్తా ఇతి కీర్తితాః॥ ౪౬

మనోవాక్కాయము లనెడి త్రికరణముల చేతను నాశరహితుఁడైన శివపరమాత్మను భజించువారలే భక్తులని చెప్పఁబడుదురు.

దుర్లభా హి శివే భక్తిః సంసార భయతారిణీ,
సా యత్ర వర్తతే సాక్షా త్స భక్త ఇతి గీయతే॥ ౪౭

సంసారభయమునుండి దాటించు శివునెడల భక్తి దుర్లభము. ఆ శివభక్తి యెవనియందు మూర్తీభవించి యుండునో యతఁడు భక్తుఁ డనఁబడును.

కిం దేవైః కిం తతః శాస్త్రైః కిం యజ్ఞైః కిం తపోవ్రతైః,
నాస్తిచే చ్ఛాంకరీ భక్తి ర్దేహినాం జన్మరోగిణామ్॥ ౪౮

పుట్టువు తెగులు గల మానవులకు శివభక్తియే లేనపుడు వారు వేదశాస్త్ర ప్రవీణులైన నేమి? సోమయాజులైన నేమి? కష్టతర తపోవ్రతము లాచరించిన నేమి? అనఁగా వాని వలనఁ బ్రయోజనము లేదనుట.

శివభక్తి విహీనస్య సుకృతం చాపి నిష్ఫలం,
విపరీత ఫలంచ స్యా ద్దక్షస్యాపి మహాధ్వరే॥ ౪౯

మానవుఁడు శివభక్తియే లేనివాఁడయినచో, వాఁడు చేయు సత్కార్మములు నిష్ఫలములే. దక్షప్రజాపతి పుణ్యశాలియే యైనను, శివభక్తి లేనివాఁడగుటచేతనేగదా తాను జేయు యజ్ఞమందు అనిష్ట ఫలమే పొందెను.

అత్యంత పాపకర్మాపి శివభక్త్యా విశుద్ధ్యతి,
చండో యథా పురా భక్త్యా పితృహాపి శివోఽభవత్॥　　౫౦

మానవుఁడు పరమ పాపాత్ముఁడే యైనను, శివభక్తిచే నిర్మలుఁడగును. తొల్లి చండుఁడను భక్తుఁడు తన తండ్రిని జంపిన వాఁడైనను, శివభక్తిచే శివస్వరూపుఁ డయ్యెను.

సుకృతం దుష్కృతం చాపి శివభక్తస్య నాస్తి హి,
శివభక్తి విహీనానాం కర్మపాశ నిబంధనమ్॥　　౫౧

శివభక్తునకుఁ బుణ్యమును లేదు; పాపమును లేదు. శివభక్తి లేని వారికే తాము చేయు కర్మముల కనురూపమైన సుఖ దుఃఖానుభవ మనెడి పాశబంధము.

శివాశ్రితానాం జంతూనాం కర్మణానాస్తి సంగమః,
వాజినాం దిననాథస్య కథం తిమిరజం భయమ్॥　　౫౨

శివుఁడే తమకుఁ బ్రాపను ప్రాణులకుఁ గర్మబంధమే లేదు. సూర్యుని గుఱ్ఱాలకు జీకటివలని భయ మెట్లు గలుగును?

నిరోద్ధుం న క్షమం కర్మ శివభక్తాన్ విశృంఖలాన్,
కథం మత్తగజాన్ రుంధేచ్ఛృంఖలా బిసతంతుజా॥　　౫౩

శివభక్తి ప్రభావముచే సర్వ బంధములును విడిపోయిన వారిని బంధించుటకు గర్మమునకు సామర్థ్యము లేదు. తామరతూటి దారములచే నైన కట్లు మదపుటేనుగులను బంధింపఁగలవా?

శుద్ధా నియమ సంయుక్తాః శివార్పిత ఫలాగమాః,
యేఽర్చయంతి శివం లోకే విజ్ఞేయాస్తే గణేశ్వరాః॥　　౫౪

ఈ లోకమున శివభక్తిచే శుద్ధులై భక్తనియమములతోఁ గూడిన వారై తమ కర్మఫలములను శివునకే అర్పించువారై శివునిఁ బూజించు వారే గణేశ్వరు లనఁబడుచున్నారు.

## 30. శరణ మాహాత్మ్య స్థలము.

గురులింగాది మాహాత్మ్య బోధాన్వేషణ సంగతః,
సర్వాత్మనా శివాపత్తిః శరణ స్థాన ముచ్యతే॥ ౫౫

గురు లింగ జంగమాదుల మాహాత్మ్య జ్ఞానము నన్వేషించుట యందే ఆసక్తి గలుగుటచే అన్ని విధముల చేతను శివుఁడే రక్షకుఁడని తెలిసికొనుటయే శరణస్థల మనఁబడును.

బ్రహ్మాది విబుధాన్ సర్వాన్ ముక్త్వా ప్రాకృతవైభవాన్,
ప్రపద్యంతే శివం యత్తు శరణం త దుదాహృతం॥ ౫౬

"శివ ఏకో ధ్యేయః శివంకరః సర్వమన్య త్పరిత్యజ్య" అనెడి శ్రుతి వాక్యమును బట్టి ప్రకృతి సంబంధవైభవము గల బ్రహ్మాది సకల దేవతలను వీడి యే స్థలము కేవల శివునే ప్రాపుగాఁగొనునో అదే శరణ స్థలమనఁబడును.

శరణ్యః సర్వభూతానాం శంకరః శశి శేఖరః,
సర్వాత్మనా ప్రసన్నస్తం శరణాగత ఉచ్యతే॥ ౫౭

నెల తలపూవుగాఁ గలవాఁడును, శుభంకరుఁడును, సర్వభూతములకు రక్షణము నిచ్చువాఁడును శివుఁడే యని తెలిసి వానియందే ప్రపత్తిచూపువాఁడు శరణాగతుఁ డనఁబడును.

విముక్త భోగలాలస్యో దేవతాంతర నిఃస్పృహః,
శివ మభ్యర్థయన్ మోక్షం శరణార్థీతి గీయతే॥ ౫౮

సర్వవిషయ లంపటములను వీడ్చుకొని, బ్రహ్మాదులైన యితర దేవతలందు నెనరు లేనివాఁడై, మోక్షమునకై శివునే ప్రార్థించు వాఁడు శరణార్థి యనఁబడును.

యే ప్రపన్నా మహాదేవం మనోవాక్కాయ కర్మభిః,
తేషాం తు కర్మజా తేన కిం వా దేవాది తర్పణైః॥ ౭౯

మనోవాక్కాయ కర్మములచే శివునందే ప్రపత్తి గలవారైన శరణార్థులకు యజ్ఞాది కర్మములచేతను, దేవతా తర్పణాదులచేతను ప్రయోజన మింతయు లేదు.

సర్వేషా మపి యజ్ఞానాం క్షయీ స్వర్గః ఫలాయతే,
అక్షయం ఫల మాప్నోతి ప్రపన్నః పరమేశ్వరమ్॥ ౮౦

జ్యోతిష్టోమాది సర్వయజ్ఞములకును, నేడుండి రేపుండని స్వర్గ సౌఖ్యమే ఫలము కావున శివప్రపత్తియే నాశనరహితమగు మోక్ష రూప ఫలమీయఁ గలది.

ప్రపన్న పారిజాతస్య శివస్య పరమాత్మనః,
ప్రపత్త్యా కిం న జాయేత పాపినామపి దేహినామ్॥ ౮౧

శరణాగతులకుఁ గల్పవృక్షమయిన శివుని శరణొందినవారు పాపాత్ము లయినను వారికిఁ గలుగని సుఖము లేదు.

ప్రపన్నానాం మహాదేవం పరిపక్వాంతరాత్మనాం,
జన్మైవ జన్మనాన్యేషాం వృథా జనన సంగినామ్॥ ౮౨

శివశరణాగతులైన శుద్ధచిత్తులదే జన్మము. శివ శరణాగతులు కానివారి పుట్టుక వ్యర్థము.

దుర్లభం మానుషం ప్రాప్య జననం జ్ఞాన సాధనం,
యే న జానంతి దేవేశం తేషా మాత్మా నిరర్థకః॥ ౮౩

జ్ఞానము నార్జించు సాధనమై అతికష్టముచే పొందఁదగు మానుష జన్మము నెత్తియు పరశివతత్త్వము నెఱుంగలేనివారి ఆత్మ (శరీరము, మనస్సు) నిరర్థకము.

తత్కులం హి సదా శుద్ధం సఫలం తస్య జీవితం,
యస్య చిత్తం శివే సాక్షా ద్విలీన మబహిర్ముఖమ్॥ ౮౪

...నిని చిత్తము శివుని కభిముఖమై క్రమముగా శివునందే చేరి మఱి ...చెకో మహాత్ముడో వాని వంశమే పావనము. వాని బ్రతుకే సఫలము.

## 31. ప్రసాద మాహాత్మ్య స్థలము

గురు లింగాది మాహాత్మ్య విశేషాను భవస్థితిః,
యస్మా చ్ఛివ ప్రసాదా త్స్యా త్తదస్య మహిమోచ్యతే॥ ౬౫

గురు లింగ జంగమాదుల మహిమా విశేషానుభవము ఏ శివప్రసాదము వలన గలుగుచున్నదో దాని మాహాత్మ్యమే జెప్పఁబడుచున్నది.

సదా లింగైక నిష్ఠానాం గురు పూజానుషంగిణాం,
ప్రపన్నానాం విశుద్ధానాం ప్రసీదతి మహేశ్వరః॥ ౬౬

శివలింగ పూజను, ఆచార్య పూజను, విడువక తాత్పర్యముతో సాధించుచు శివునే శరణుచొచ్చిన పరిశుద్ధ చిత్తులకు ఆ శివుఁడు ప్రసన్నుఁడగును.

ప్రసాదోఽపి మహేశస్య దుర్లభః పరికీర్త్యతే,
ఘోర సంసార సంతాప నివృత్తిర్యేన జాయతే॥ ౬౭

భయంకర సంసార సంతాపమును దొలఁగించునట్టి యీ శివప్రసాదము కడుఁ గష్టముచేతఁ బొందఁదగినది.

యజ్ఞా స్తపాంసి మంత్రాణాం జపశ్చింతా ప్రబోధనం,
ప్రసాదార్థం మహేశస్య కీర్తితాని న సంశయః॥ ౬౮

యాగములు, తపస్సులు, మంత్రజపములు, ధ్యానము, జ్ఞానము నను నివెల్ల పరశివప్రసాదలబ్ధికే చెప్పఁబడెననుట నిస్సంశయము.

ప్రసాదమూలా సర్వేషాం భక్తి రవ్యభిచారిణీ,
శివప్రసాద హీనస్య భక్తిశ్చాపి న సిద్ధ్యతి॥ ౬౯

అందరికిని శివప్రసాదమూలముగానే యిటు నటు చెదరని స్థిరభక్తి కలుగును. శివప్రసాద మబ్బనివారికి భక్తియు సిద్ధింపదు.

గర్భస్థో జాయమానో వా జాతో వా బ్రాహ్మణోఽథవా,
అంత్యజో వాఽపి ముచ్యేత ప్రసాదే సతి శాంకరే॥ ౨౦

శివప్రసాదమే యబ్బినవాఁడు గర్భస్థుఁడే కానిమ్ము, పుట్టుచున్న వాఁడే కానిమ్ము, పుట్టినవాఁడే కానిమ్ము, బ్రాహ్మణుఁడే కానిమ్ము, కుడజాతివాఁడే కానిమ్ము ముక్తుఁడే యగును.

బ్రహ్మాద్యా విబుధాః సర్వే స్వే స్వస్థాన నివాసినః,
నిత్యసిద్ధా భవంత్యేవ ప్రసాదా త్పరమేశ్వరాత్॥ ౨౧

శివప్రసాదముచేతనే బ్రహ్మ మున్నగు దేవతలెల్లరు తమతమ స్థానములందుండి నిత్యసిద్ధులగుదురు. "యస్య ప్రసాదా ద్దేవస్య బ్రహ్మ బ్రహ్మత్వ మాప్నుయాత్, విష్ణుత్వమపి విష్ణుశ్చ స శివః కైర్న సేవ్యతే, సాక్షాల్లింగ ప్రసాదం తు స్వదేహాధారయే న్నరః వజ్రకాయశ్చ భవతి శివసాయుజ్య మాప్నుయాత్" ఏ శివుని ప్రసాదముచే బ్రహ్మ బ్రహ్మత్వమును, విష్ణువు విష్ణుత్వమును పొందుచున్నారో, అట్టి శివుఁడు ఎవరికి పూజ్యుఁడుకాఁడు? అనఁగా నెల్లరకును బూజ్యుఁడే. విశ్వవంద్యుఁడైన యా శివుని ప్రసాదమును భక్తిపూర్వకముగా తన దేహమందు ధరించు మానవుఁడు వజ్రశరీరియై మని, తుదను శివసాయుజ్యముక్తి నొందును. అని శైవరత్నాకరమందు శివప్రసాదమహిమ విశేషించి చెప్పఁబడినది. గాన మోక్షార్థులెల్లరును అట్టి సర్వోత్తమ శివప్రసాదమందు సాటిలేని భక్తి నుంచవలయును.

ప్రసాదే శాంభవే సిద్ధే పరమానందకారణే,
సర్వం శివమయం విశ్వం దృశ్యతే నాత్రసంశయః॥ ౨౨

నిత్యానందహేతువైన శివప్రసాదసిద్ధి గలుఁగగా ఈ ప్రపంచమంతయు శివమయముగానే తోఁచును. సందియము లేదు.

సంసారచక్ర నిర్వాహ నిమిత్తం కర్మ కేవలం,
ప్రసాదేన వినా శంభో ర్న కస్యాపి నివర్తతే॥ 23

ఈ జనన మరణ రూప సంసారచక్రమును ద్రిప్పుటకు హేతువైన కర్మబంధముతొలఁగుటకు శివప్రసాదముగాక మఱియొకసాధనమే లేదు.

బహూనాత్ర కిముక్తేన నాస్తి నాస్తి జగత్త్రయే,
సమాన మధికం చాపి ప్రసాదస్య మహేశితుః॥ ౭౮

పలు మాటలేల? ముమ్మాటికిని శివప్రసాదమునకు సాటియైనదిగాని దానిని మించినదిగాని ముల్లోకములందును లేదు.

శివప్రసాదే సతి యోగభాజః
సర్వం శివైకాత్మతయా విభాతి,
స్వకర్మముక్తః శివ భావితాత్మా
స ప్రాణలింగీతి నిగద్యతేఽసౌ॥ ౭౯

శివప్రసాదసిద్ధి కాఁగా శివయోగికి సర్వమును శివస్వరూపము గానే తోఁచును. ఇటులు సర్వకర్మ ప్రతిబంధమునుండి విడివడి శివస్వరూపుఁడైన ప్రసాదియే ప్రాణలింగి యనఁబడును.

ఇది

సిద్ధాంత శిఖామణి యందు – ప్రసాది స్థలమున
ప్రసాదిస్థలము మున్నగు నేడుస్థలములు గల
పదునొకండవ పరిచ్ఛేదము.

శ్రీ శివార్పణము.



ఓం నమః శివాయ
శ్రీమాత్రే నమః
శ్రీ జగద్గురు పంచాచార్యాః ప్రసీదంతు.

# పంద్రెండవ పరిచ్ఛేదము

## ప్రాణలింగిస్థలము.

అగస్త్యమహర్షి యనుచున్నాఁడు :

భక్తో మాహేశ్వర శ్చేతి ప్రసాదీతి నిబోధితః,
ఏక ఏవ కథం చైష ప్రాణలింగీతి కథ్యతే॥ ౧

ఓయీ గురుమూర్తీ ! ఒక్కఁడే భక్తుఁడు మాహేశ్వరుఁడు ప్రసాది యగునని తెల్పితివి. మఱియు నీతఁడే ప్రాణలింగి యనఁబడు నంటివి. అది యెట్లు పొసఁగునని ప్రశ్నింపఁగా,

శ్రీ రేణుకాచార్యు లిట్లనుచున్నారు :

భక్తో మాహేశ్వరశ్చేతి ప్రసాదీతి చ కీర్తితః,
కర్మప్రాధాన్య యోగేన జ్ఞానయోగోఽస్య కథ్యతే॥ ౨

కర్మకాండమందుఁ జెప్పఁబడిన విధుల ప్రాధాన్యమునుబట్టి, ఒక్కఁడే భక్తుఁడును మాహేశ్వరుఁడును ప్రసాదియు నగునని చెప్పఁబడెను. ఈ మూఁడు స్థలాచరణములతోను గూడిన యితనికి జ్ఞానకాండమందుఁ జెప్పఁబడిన జ్ఞానయోగము చెప్పఁబడును.

ప్రాణలింగి, శరణ, ఐక్యము లను మూఁడుస్థలములును జ్ఞానప్రధానములు. భక్త, మాహేశ్వర, ప్రసాది యను మూఁడుస్థలములును గర్మప్రధానములు. వీరశైవుఁడు ఈ శరీర మున్నంతదనుకఁ గర్మజ్ఞానముల రెంటిని ఆచరింపవలయును. వీరశైవసిద్ధాన్తము కర్మజ్ఞానముల రెండింటి స్వరూపము నైనది.

లింగం చిదాత్మకం బ్రహ్మ తచ్ఛక్తిః ప్రాణరూపిణీ,
తద్రూప లింగ విజ్ఞానీ ప్రాణలింగీతి కథ్యతే॥ 3

జ్ఞానస్వరూప బ్రహ్మమే శివలింగ మనఁబడును. ఆ శివలింగ పీఠశక్తి ప్రణవస్వరూప ప్రాణరూపముగా నున్నది. ఇట్టి లింగవిజ్ఞానము గల

...డు ప్రాణలింగి యనఁబడును. ఆ బ్రహ్మశక్తియే ప్రాణరూపమైనది. ... శివలింగజ్ఞానము గలవాఁడు ప్రాణలింగి యనఁబడును.

ప్రాణలింగి స్థలం చైత త్పంచస్థల సమన్వితం,
ప్రాణలింగి స్థలం చాదౌ ప్రాణ లింగార్చనం తతః॥ ౪

శివయోగ సమాధిశ్చ తతో లింగ నిజస్థలం,
అంగలింగ స్థలం చాథ క్రమా దేషాం భిదోచ్యతే॥ ౫

1. ప్రాణలింగి స్థలము, 2. ప్రాణలింగార్చన స్థలము, 3. శివయోగ సమాధి స్థలము, 4. లింగ నిజస్థలము, 5. అంగలింగ స్థలము అని యీ ప్రాణలింగి స్థలము అయిదువిధములు గలది. వాని భేదములను వరుసగాఁ జెప్పెదను.

## 32. ప్రాణలింగిస్థలము

ప్రాణాపాన సమాఘాతాత్ కందమధ్యాద్య దుత్థితం,
ప్రాణ లింగం తదాఖ్యాతం ప్రాణాపాన నిరోధిభిః॥ ౬

శ్రీ గురూపదేశప్రకారము ప్రాణము అపానము అను వాయువుల సంఘట్టనముచే నాభి కందమధ్యమునుండి యే జ్యోతి పైకి లేచునో అదియే ప్రాణలింగమని ప్రాణాయామాభ్యాసము గలవారు చెప్పెదురు.

ప్రాణో యత్ర లయం యాతి భాస్కరేందు విఘట్టనాత్
తత్ప్రాణలింగ ముద్దిష్టం తద్ధారీ స్యా త్తదాకృతిః॥ ౭

ఇడా పింగళ లనఁబడు చంద్ర సూర్య నాడుల సంఘట్టనము చేతఁ బరబ్రహ్మ స్వరూపమైన యే శివలింగమందుఁ బ్రాణవాయువు లయమగునో అదే ప్రాణలింగ మనఁబడును. అట్టి ప్రాణలింగమును ధరించిన వాఁడు దాని యాకారము గలవాఁడే యగును.

స్ఫురితాం యోగ యుక్తానా మంతః స్ఫురతి దీపవత్,
చిదాకారం పరంబ్రహ్మ లింగ మజ్ఞై ర్నభావ్యతే॥ ౮

స్వయం ప్రకాశమును, పరబ్రహ్మ స్వరూపమైన ప్రాణలింగము శివయోగాభ్యాసము గలవారి హృదయ కమలములందు దీపమువలె

ప్రకాశించును. ఆ ప్రాణ లింగము గురూపదేశము లేని ప్రాకృతు లకుఁ దెలియఁ బడదు. "హృదయే వై బ్రహ్మ సోమ సూర్యాగ్ని మండలే నివాత దీపోపమ స్థాయి హృద్యం తజ్జ్యోతిః పురుషః" అనెడి శ్రుతులు నీ యాచార్యుల మాటనే ప్రతిపాదించుచున్నవి.

అంతః స్థితం పరం లింగం జ్యోతీ రూపం శివాత్మకం,
విహాయ బాహ్య లింగస్థా విమూఢా ఇతి కీర్తితాః॥ ౯

అనాహత పద్మమందు (హృదయ కమలమందు) జ్యోతిః స్వరూపమును, శివస్వరూపము నైన ప్రాణలింగమును విడిచి స్థావర లింగాదులను బూజించువారు మూర్ఖులు.

సంవిల్లింగ పరామర్శీ బాహ్యవస్తు పరాఙ్ముఖః,
యః సదావర్తతే యోగీ ప్రాణలింగీ స ఉచ్యతే॥ ౧౦

స్థావర లింగాదులందును, వాని పూజకైన యుపకరణములందును, పెడమొగము గలవాఁడై యెల్లపుడును జ్ఞానస్వరూపమైన ప్రాణ లింగమును గూర్చిన విచారమునే చేయు శివయోగి ప్రాణ లింగి యనఁబడును.

మాయా వికల్పజం విశ్వం హేయం సంచిత్య నిత్యశః,
చిదానంద మయే లింగే విలీనః ప్రాణ లింగవాన్॥ ౧౧

మాయాసంబంధమైన సత్త్వ రజ స్తమస్సు లనెడి గుణభేదముచే గలిగిన యీచరాచరప్రపంచము హేయమని (విడువఁదగినదని) యెఱింగి, జ్ఞానానంద స్వరూపమైన ప్రాణలింగమందే మనస్సును బూర్ణముగా లీనము చేసిన పుణ్యాత్ముఁడే ప్రాణలింగి.

సత్తా ప్రాణమయీ శక్తిః సద్రూపం ప్రాణలింగకం,
తత్సామరస్య విజ్ఞానాత్ ప్రాణలింగీతి కథ్యతే॥ ౧౨

"నే నున్నాను" = అస్మి, యని స్ఫురించుటయే జ్ఞానాత్మక లింగము యొక్క ప్రాణస్వరూప శక్తి. ప్రాణలింగమును ఆవిధమైన "అస్మి = నే నున్నాను" అనెడి స్ఫురణముతో సద్రూపమై యున్నది. ఈ యుభ

యము యొక్క (శక్తి + శివ) సమరస భావమును దెలిసినవాఁడగుటచే నీతఁడు ప్రాణలింగి యనఁబడుచున్నాఁడు.

## 33. ప్రాణ లింగార్చన స్థలము.

అంతర్గతం చిదాకారం లింగం శివమయం పరం,
పూజ్యతే భావపుష్పైర్య త్ప్రాణలింగార్చనం హి తత్॥ ౧౩

హృత్పద్మమం దుండునదియు, జ్ఞానాకారమును, శివ స్వరూపము నైన సర్వోత్కృష్ట ప్రాణలింగమునకు అంతఃకరణ వృత్తులే యనెడి పూవులతోఁ జేయు పూజయే ప్రాణలింగార్చన మనఁబడును.

అంతః పవనం సంస్పృష్టే సు సూక్ష్మాంబర శోభితే,
మూర్ధన్య చంద్ర విగళ త్సుధాసేకాతి శీతలే॥ ౧౪
బుద్ధీంద్రియ నవ ద్వారే బోధ దీపే హృదాలయే,
పద్మపీఠే సమాసీనం చిల్లింగం శివ విగ్రహం,
భావయిత్వా సదాకాలం పూజయే ద్భావ వస్తుభిః॥ ౧౫

ప్రాణవాయు సంస్పర్శము గలట్టియు, అత్యంత సూక్ష్మాకాశమందు (ఇదే గుహాయని దహరాకాశమని చెప్పఁబడును) ప్రకాశించు నట్టియు, సహస్రారమందలి చంద్రమండలము నుండి యుట్టు నమృతముచేఁ దడుపఁ బడుటచే మిక్కులఁ జల్లనైనదియు, ఇంద్రియము లనెడి తొమ్మిది దారుల సరికట్టునదియు, శివజ్ఞాన మనెడి దీపరూపమునొంది హృదయ మను నింట ద్వాదశదళ పద్మమనెడి పీఠమున వెలుంగు మంగళమూర్తి యైన ప్రాణలింగమును సద్గురూప దేశానుసారముగా ధ్యానించి మానసిక వస్తువులతో సదా పూజింపవలయును.

క్షమాభిషేకః సలిలం వివేకో వస్త్రముచ్యతే,
సత్య మాభరణం ప్రోక్తం వైరాగ్యం పుష్పమాలికా॥ ౧౬
గంధః సమాధి సంపత్తి రక్షతా నిరహంకృతిః,
శ్రద్ధా ధూపో మహాజ్ఞానం జగద్భాసి ప్రదీపికా॥ ౧౭

భ్రాంతి మూల ప్రపంచస్య నైవేద్యం తన్నివేదనం,
మౌనం ఘంటా పరిస్పంద స్తాంబూలం విషయార్పణమ్॥ ౧౮

విషయ భ్రాంతి రాహిత్యం తత్ ప్రదక్షిణ కల్పనా,
బుద్ధి స్తదాత్మికాసక్తి ర్నమస్కార క్రియా మతా॥ ౧౯

ఏవం విధై ర్భావ శుద్ధ్యై రుపచారై రదూషితైః,
ప్రత్యఙ్ముఖ మనా భూత్వా పూజయే ల్లింగ మాంతరమ్॥ ౨౦

ఆ మానసిక పూజాద్రవ్యము లేవియన, క్షమ (ఓర్మి) యే స్నాన జలము; నిత్యమేదో అనిత్యమేదో యనెడి తెలివియే వస్త్రము; సత్య వాక్కే ఆభరణము; వైరాగ్యమే (ప్రాకృత వస్తువుల యందు గోరిక వీడుటే) పూదండ; చిత్తమును ప్రాణ లింగమందు నిలుపుటయే గంధము; అహంకారము (నేను కర్తననుట) లేకుంటయే అక్షతములు; శ్రద్ధయే (అధిక భక్తియే) ధూపము; విశ్వమును బ్రకాశింపఁజేయు మహాజ్ఞానమే అఖండదీపము; అజ్ఞానమునకు మూలకారణమైన అహంకార మమకారములను నివేదించుటయే నైవేద్యము; మౌనమే ఘంటానాదము; శబ్ద స్పర్శ రూప రస గంధములను సమర్పించుటే తాంబూలము; విషయ సుఖములందలి భ్రాంతి విడుచుటే ప్రదక్షిణ క్రియ; తాదాత్మ్యము (అభేదవృత్తి) నం దాసక్తమైన బుద్ధియే నమస్కారము. ఈ విధముగా భావశుద్ధిగల దోషరహితోపచారములతో అంతర్ముఖమైన (వెనుకకు మఱలిన) మనస్సు గలవాఁడై హృదయకమల మందుండు ప్రాణలింగమును బూజింపవలయును.

## 34. శివయోగి సమాధి స్థలము.

అంతఃక్రియా రతస్యాస్య ప్రాణలింగార్చన క్రమైః,
శివాత్మధ్యాన సంపత్తిః సమాధి రితి కథ్యతే॥ ౨౧

ఈ విధముగాఁ జెప్పఁబడిన ప్రాణలింగ పూజావిధులతో ఆంతరంగిక పూజాసక్తిగల యీ ప్రాణలింగికి శివజీవులయొక్క ఏకత్వానుభవజ్ఞానము ఫలముగాఁగల ధ్యానసంపద యబ్బును. అదియే సమాధి యనఁబడును.

సర్వ తత్త్వోపరి గతం సచ్చిదానంద భాసురం,
పరబ్రహ్మ మహాలింగం ప్రాణో జీవః ప్రకీర్తితః,
తదేక భావ మననాత్ సమాధిస్థః ప్రకీర్తితః॥ ౨౨

మహాలింగమే పరబ్రహ్మ మనియు, ప్రాణమే (బ్రహ్మశక్తియే) జీవుఁడనియు, చెప్పఁబడెను. ఆ మహాలింగమే ముప్పదియాఱు తత్త్వము లను మీఱినదియు, త్రికాలాబాధ్యమును, జ్ఞానానందప్రకాశము నైనది. అట్టి పరబ్రహ్మము (లింగము) జీవుఁడు (అంగము) అనువానియొక్క ఏకత్వ చింతనము చేయుటచే ప్రాణలింగి సమాధిస్థుఁ డనఁబడును.

బహిర్వాసనయా విశ్వం వికల్పార్థం ప్రకాశతే,
అంతర్వాసిత చిత్తానా మాత్మానందః ప్రకాశతే॥ ౨౩

చరాచర రూపమైన ప్రపంచము బహిర్వాసనలచే బలు తెఱఁగులైన సంకల్ప వికల్ప రూపమయి యొప్పును. అంతర్వాసనలతోఁ గూడిన మనస్సు గలవారలందు నిర్వికల్ప శివానందమే ప్రకాశించును.

ఆత్మారణి సముత్థేన ప్రమోద మథనాత్సుధీః.
జ్ఞానాగ్నినా దహే త్సర్వం పాశజాలం జగన్మయమ్। ౨౪

ప్రాణలింగి (శివజీవైక్యము ననుభవించు బుద్ధిశాలి) ఆత్మ యనెడి అరణి (=యజ్ఞమునందు రాపిడిచే అగ్నిని బుట్టించు కట్టె) యందు ఆనంద మనెడి రాపిడిచేతఁ బుట్టు శివజ్ఞానమనెడి యగ్నిచేఁ బ్రపంచ రూపమైన పాశసముదాయమును గాల్చివేయును.

సంసార విష వృక్షస్య పంచక్లేశ పలాశినః,
ఛేదనే కర్మమూలస్య పరశుః శివ భావనా॥ ౨౫

ధర్మాధర్మములు కర్మములు ననెడి వేళ్లును, అవిద్యాది పంచక్లేశము లనెడి యాకులును గల సంసార మనెడి విషవృక్షమును ఛేదింపఁగల గొడ్డలి యీ శివజీవైక్య చింతనమే.

అజ్ఞాన రాక్ష సోన్మేషకారిణః సంహృతాత్మనా,
శివ ధ్యానంతు సంసార తమస శ్చండ భాస్కరః॥ ౨౬

అజ్ఞానమనెడి రాక్షసుని కన్ను విచ్చునట్టియు, ఆత్మ వికాసమును మూసిగించునట్టిదియు నైన సంసారమనెడి చీకటిని బోగొట్టు చండ సూర్యుఁడీ శివధ్యానమే.

అంతః షట్చక్ర రూపాణి పంకజాని విభావయేత్,
బ్రహ్మాది స్థానభూతాని భ్రూమధ్యాంతాని మూలతః॥ ౨౭

శరీరములో నుండు చక్రము లాఱు. వీనినే పద్మము లందురు. అవి మూలాధార, స్వాధిష్ఠాన, మణిపూరక, అనాహత, విశుద్ధ, ఆజ్ఞ లనెడి పేళ్లు గలవి. ఈ యాఱింటికి వరుసగా గుదము, గుహ్యము, నాభి, హృదయము, కంఠము, భ్రూమధ్యము (కనుబొమల నడుము) అనునవి స్థానములు. వానియందు మూలాధార చక్రము మొదలు చేసుకొని వరుసగా బ్రహ్మ, విష్ణు, రుద్ర, ఈశ్వర, సదాశివ, పరశివు లనెడి దైవతములకు స్థానములు.

భ్రూమధ్యా దూర్ధ్వ భాగేతు సహస్రదళ మంబుజం,
భావయే త్తత్ర విమలం చంద్రబింబం తదంతరే॥ ౨౮

భ్రూమధ్యము (కనుబొమల నడిమి యాజ్ఞాచక్ర స్థలము) కంటెను పైగానున్న సహస్రదళ కమలమును, దాని నడుమ స్వచ్ఛమైన చంద్ర బింబమును భావింపవలయును.

సూక్ష్మ రంధ్రం విజానీయాత్ తత్కైలాసపదం విదుః
తత్రస్థం భావయే చ్ఛంభుం సర్వకారణ కారణమ్॥ ౨౯
సర్వ తత్త్వోపరి గతం సచ్చిదానంద భాసురం,
స్వప్రకాశ మనిర్దేశ్య మవాఙ్మానస గోచరమ్॥ ౩౦
ఉమాఖ్యయా మహాశక్త్యా దీపితం చిత్స్వరూపయా,
హంస రూపం పరాత్మానం సోఽహం భావేన భావయేత్,
తదేక తానతా సిద్ధిః సమాధిః పరమో మతః॥ ౩౧

ఆ చంద్రమండలము నడుమ మిగుల సూక్ష్మమైన రంధ్రమును భావింపవలయును. (ఇది గురుముఖైక వేద్యము). అదియే కైలాస

స్థానము. బ్రహ్మాదులైన కారణపురుషుల కెల్లరకుఁ గారణభూతుఁడైన శంభుని అచటనే భావింపవలయును. వెనుక వివరింపఁబడిన ముప్పది యాఱు తత్త్వముల కతీతుఁడును, సచ్చిదానంద స్వరూపుఁడును, ఇట్టి వాఁడని యనుటకుఁ గాని యూహించుటకుఁ గాని. చిక్కనివాఁడును, ("యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" అని శ్రుతి). ఉమ యను పేరుగల మహాశక్తితో నిత్యసంబంధము గలిగి ప్రకాశించు వాఁడును, హంస స్వరూపుఁడునైన (హంసః = అజ్ఞానమనెడి చీఁకటినిఁ బోఁగొట్టువాఁడు. మూలాధారాది షట్చ్రక్రములనుదాటి కైలాసమనెడి బ్రహ్మరంధ్రమునకు గమించువాఁడు నైన) పరమాత్మ సోఽహంభావముతో (అతఁడే నేననెడి భావముతో) శివోహమనెడి మహావాక్యార్థ బోధతో భావింపవలయును. అట్టి శివజీవుల యేకత్వసిద్ధియే శివయోగ సమాధి యనఁబడును.

## 35. లింగ నిజ స్థలము

స్వాంతస్థ శివలింగస్య ప్రత్యక్షానుభవ స్థితిః,
యాసైవ పరలింగస్య నిజమిత్యుచ్యతే బుధైః॥ 32

తన యంతరంగమందున్న శివమహాలింగము యొక్క ప్రత్యక్షానుభవ స్థితి యేదియో అదియే మహాలింగముయొక్క నిజస్వరూపమని ఆత్మతత్త్వజ్ఞు లందురు.

అవ్యక్తం లింగ మిత్యాహు ర్జగతాం మూలకారణం,
లింగీ మహేశ్వరశ్చేతి మతమేత దసంగతమ్॥ 33

సర్వజగత్తులకును మూలకారణమై అవ్యక్తమను పేరుగల మాయాతత్త్వమును లింగమనియు, మాహేశ్వరుఁడు లింగి యనియుఁ జెప్పుదురు. అది సమ్మతము కాదు. తప్పు. "మాయాం తు ప్రకృతిం విద్యాన్మాయినం తు మహేశ్వరం" అను వాక్యము దీనికిఁ బ్రమాణ మందురు. అది యసంగతము. ప్రకృతి జడమై హేయకోటియందుఁ జేరినది గదా! "మం శివం పరమం బ్రహ్మ ప్రాప్నోతి స్వభావతః, మాయేతి ప్రోచ్యతే లోకే బ్రహ్మనిష్ఠా సనాతనీ" అనెడి శివాగమ

ప్రమాణానుసారముగా మాయ పరశివబ్రహ్మమందు వీడకుండి నిత్యమైన విమర్శశక్తి. "మం = పరశివబ్రహ్మమును, ఆయతి = స్వభావముచేతనే ఆశ్రయించియున్నది" అనియే శ్రీ రేణుకాచార్యులవారి మతము.

చిదానందమయః సాక్షాచ్ఛివ ఏవ నిరంజనః,
లింగ మిత్యుచ్యతే నాన్య ద్యతః స్యా ద్విశ్వసంభవః॥ 34

పరబ్రహ్మ స్వరూపమైన దేనివలన సర్వజగదుత్పత్తి యగునో అదే లింగమని చెప్పఁబడును. అది జ్ఞానానంద స్వరూపము. దోషరహితమైనది. సాక్షాచ్ఛివస్వరూపము. అది తక్క నేదియు లింగమనఁబడదు.

బ్రహ్మ విష్ణ్వాదయో దేవాః సర్వే వేదాదయ స్తథా,
లీయంతే యత్ర గమ్యంతే తల్లింగం బ్రహ్మ కేవలమ్॥ 35

బ్రహ్మ విష్ణువు మున్నగు దేవతలును, వేదశాస్త్రాదులైన సమస్తమును ఏవస్తువునందు (అణగిపోయి) లీనమై మఱల నేవస్తువు నుండి పుట్టునో అదియే పరబ్రహ్మ మనెడి లింగము.

బహునాత్ర కి ముక్తేన లింగ మిత్యుచ్యతే బుధైః,
శివాభిధం పరం బ్రహ్మ చిద్రూపం జగదాస్పదమ్॥ 36

పలుమాట లేల? జ్ఞానస్వరూపమును, సర్వజగత్తులకును ఆధారభూతమునైన శివుఁడను పేరుగల వస్తువే లింగము.

జ్యోతి ర్మయం పరం లింగం శ్రుతిరాహ శివాత్మకం,
తస్య భాసా సర్వమిదం ప్రతిభాతి నసంశయః॥ 37

శివస్వరూపమైన మహాలింగమే ప్రకాశ స్వరూపమైనది. ప్రకాశమయమైన ఆ మహాలింగముయొక్క ప్రకాశముచేతనే సూర్య చంద్రాదులైన ప్రకాశవస్తువులు ప్రకాశించుచున్నవి. సందియములేదు.

న సూర్యో భాతి తత్రేందు ర్నవిద్యు న్న చ పావకః,
న తారకా మహాలింగే ద్యోతమానే పరాత్మని॥ 38

ఆ పరమాత్మ మహాలింగము ప్రకాశించుచుండఁగా ఆ మహాప్రకాశమందు సూర్యుఁడు, చంద్రుఁడు, మెఱుపు, అగ్ని, నక్షత్రములు ప్రకా

శింపఁగలవా ? ఆ మహాలింగ ప్రకాశమందు వీనికాంతి మునిఁగిపోవును. "న తత్ర.........మగ్నిః" శ్రుతి.

లింగా న్నాస్తి పరం తత్త్వం య దస్మా జ్జాయతే జగత్,
య దేత ద్రూపతాం ధత్తే యదత్ర లయ మశ్నుతే॥ ౩౯

స్థావర జంగమాత్మకమైన యీ జగత్తు లింగమందే పుట్టుచున్నది. ఈ లింగరూపమునే పొందుచున్నది. ఈ లింగమందే అణఁగిపోవు చున్నది. కాన లింగముకంటెను శ్రేష్ఠమైన తత్త్వము మఱి లేదు.

తస్మా ల్లింగం పరం బ్రహ్మ సచ్చిదానంద లక్షణం,
నిజ రూప మితి ధ్యానా త్తదవస్థా ప్రజాయతే॥ ౪౦

కావున సచ్చిదానంద స్వరూపమైన పరబ్రహ్మమే స్వస్వరూపమైన లింగమని తెలిసి ధ్యానించుటచే లింగమే నిజమనెడి స్థితియుఁ గలుగును.

## ౩౬. అంగ లింగి స్థలము.

జ్ఞాన మంగమితి ప్రాహు ర్జ్ఞేయం లింగం సనాతనం,
విద్యతే త ద్ద్వయం యస్య సోఽంగ లింగీతి కీర్తితః॥ ౪౧

శివ తత్త్వ జ్ఞానముగల జీవుఁడు అంగమనియు, శివ జ్ఞాన విశిష్టుఁడైన జీవునిచే సాక్షాత్కరింపఁబడు శివుఁడు నిత్యమైన లింగమనియు తెలిసికొనఁదగును. ఆ యంగ లింగములు రెండును ఏ ప్రాణిలింగియం దుండునో ఆతఁడే అంగలింగి యనఁబడును.

అంగే లింగం సమారూఢం లింగే చాంగ ముపస్థితం,
ఏతద స్తి ద్వయం యస్య స భవే దంగ లింగవాన్॥ ౪౨

జీవాత్మయందు పరశివ లింగమును, శివలింగమందు జీవాత్మయు నుండు ననెడి ఈ రెండు విషయములును బీజాంకుర న్యాయముగా (విత్తునందు మొక్క, మొక్క యందు విత్తునువలె) యెవని యందుండునో అతఁడు అంగలింగి యనఁబడును.

జ్ఞాత్వా యః సతతం లింగం స్వాంతస్థం జ్యోతి రాత్మకం,
పూజయే ద్భావకుసుమై స్తం విద్యా దంగలింగినమ్॥ ౪౩

ఎవఁడు జ్యోతిః స్వరూపమైన లింగమును తన హృదయ కమల మందే యున్నదానిగా నెఱింగి భావరూప పుష్పములతో బూజించునో అతఁడే అంగలింగి యని తెలియవలయును.

జ్ఞాయతే లింగ మేవైకం సర్వైః శాస్త్రైః సనాతనైః,
బ్రహ్మేతి విశ్వధామేతి విముక్తేః పదమిత్యపి॥ ౪౪

లింగ మొక్కఁటే పరబ్రహ్మమనియు జగదాధార భూతమనియు మోక్షస్థాన మనియు సనాతనమైన శాస్త్రముల (వేదముల) వలనఁ దెలియుచున్నది.

ముక్తి రూప మిదం లింగ మితి యస్య మనః స్థితిః,
స ముక్తో దేహ యోగేఽపి స జ్ఞానీ స మహాగురుః॥ ౪౫

ఈ లింగము ముక్తిరూపమని యే ప్రాణలింగి మనస్సున గట్టిగా స్థిరపడునో అతఁడే శరీరముతో నున్నను ముక్తుఁడు. అనఁగా జీవన్ముక్తుఁడు. అతఁడే జ్ఞాని. అతఁడే మహాగురుఁడు.

అనాది నిధనం లింగం కారణం జగతా మితి,
యే నజానంతి తే మూఢా మోక్షమార్గ బహిష్కృతాః॥ ౪౬

ఆదియు అంతమును లేని యా లింగమును సర్వజగత్కారణముగాఁ నెవ్వరెఱుఁగరో ఆ బుద్ధిహీనులు మోక్షమార్గమునకు వెలియైనవారలే. "లీనం ప్రపంచ రూపం హి సర్వమేత చ్చరాచరం। సర్గాదౌ గమ్యతే భూయ స్తస్మా ల్లింగ ముదీరితమ్." అనఁగా సర్వ చరాచర ప్రపంచము ఏ వస్తువునందు లీనమై యేవస్తువునుండి మఱల పుట్టునో అదే లింగ మనియు, ఆ లింగము శివ శక్త్యాత్మక మైనదనియు, అందుచే భోగ మోక్ష ఫలాపేక్ష గలవారు సర్వకారణ కారణమైన లింగమును పూజింపవలయుననియు ఆగమములు బోధించుచుండుటచే ఇట్టి లింగ స్వరూపము నెఱుంగలేనివారికంటె మూఢులు లేరు.

యః ప్రాణ లింగార్చన భావ పూర్వై
ర్ధర్మై రుపేతః శివ భావితాత్మా,
స ఏవ తుర్యః పరికీర్త్యతేఽసౌ
సంవి ద్విపాకా చ్ఛరణాభిధానః॥ ౪౭

ఎవఁడు ప్రాణ లింగార్చనమును భావనా ముఖ్యములైన యుపచారములతో జేయునో, జీవాత్మను లింగస్వరూపముగా భావించునో, ఆ నాల్గవస్థలమైన ప్రాణలింగి శివజ్ఞాన పరిపాకముచే శరణుఁడని చెప్పఁబడును.

ఇది
సిద్ధాంత శిఖామణి యందు - ప్రాణ లింగి స్థలమున
ప్రాణ లింగి మున్నగు నైదు స్థలములు గల
పంద్రెండవ పరిచ్ఛేదము.
శ్రీ శి వా ర్ప ణ ము.



ఓం నమః శివాయ
శ్రీ మాత్రే నమః
శ్రీ జగద్గురు పంచాచార్యాః ప్రసీదంతు

# పదుమూడవ పరిచ్ఛేదము

## శరణ స్థలము

అగస్త్యమహర్షి యనుచున్నాఁడు :

మాహేశ్వరః ప్రసాదీతి ప్రాణ లింగీతి బోధితః,
కథ మేష సమాదిష్టః పునః శరణ సంజ్ఞికః॥ ౧

ఓయీ గణపుంగవ! మాహేశ్వరుఁడే ప్రసాది యగుననియు ప్రసాదియే ప్రాణలింగి యగుననియుఁ దెలుపఁబడినది. మఱి యీ ప్రాణలింగి శరణుఁ డెట్లగునని ప్రశ్నింపఁగా,

శ్రీ రేణుకాచార్యు లనుచున్నారు :

అంగ లింగీ జ్ఞానరూపః సతీ జ్ఞేయః శివః పతిః,
యత్సౌఖ్యం తత్సమావేశే తద్వాన్ శరణ నామవాన్॥ 2

శివ జ్ఞాన స్వరూపుఁడును లింగాంగ సామరస్యము గలవాఁడును నయిన ప్రాణలింగి తాను భార్య యనియు, శివుఁడు భర్త యనియు దెలియవలయును. ఆ భార్య భర్తల సంబంధమందు ఏ యానందము గలుగునో అంగలింగ రూపమైన సతీ పతి భావముచేఁ గలుగునట్టి యానందము గలవాఁడే శరణుఁ డనఁబడును.

"యథా స్త్రియా సంపరిష్వక్తో న బాహ్యం కించ న వేద, నాపరం, ఏవ మేవాయం పురుషః ప్రాజ్ఞే నాత్మనా సంపరిష్వక్తో న బాహ్యం కించ న వేద నాంతరం॥" అనెడి మంత్రప్రమాణముచే బృహదారణ్యక శ్రుతియు నీ యభిప్రాయమునే బోధించును.

స్థలమేత త్సమాఖ్యాతం చతుర్ధా ధర్మ భేదతః,
ఆదౌ శరణ మాఖ్యాతం తత స్తామస వర్జనమ్॥ 3

నిర్దేశ శ్చ తతః ప్రోక్తః శీల సంపాదనం తతః,
క్రమా ల్లక్షణ మేతేషాం కథయామి నిశమ్యతామ్॥ 4

ఈ శరణ స్థలము ధర్మభేదముచే 1. శరణస్థలము, 2. తామస నిరసన స్థలము, 3. నిర్దేశ స్థలము, 4. శీల సంపాదన స్థలము అని నాల్గు విధములుగా నున్నది. వీని లక్షణములు క్రమముగాఁ దెలుపఁబడును. శ్రద్ధతో వినుము.

## 37. శ ర ణ స్థ ల ము

సతీవ రమణే యస్తు శివే శక్తిం విభావయన్,
తదన్య విముఖః సోఽయం జ్ఞాతః శరణ నామవాన్॥ 5

పతివ్రత, తన భర్తయెడఁ దక్కఁ బరపురుషు నెడ నెట్లు పెడమొగముతో నుండునో అటులే తనను శివుని విషయమునఁ బతివ్రతనుగా భావించి, యితర దేవతలయెడ విముఖుఁడై యుండు నాతఁడే శరణుఁడని తెలియవలయును.

పరిజ్ఞాతే శివే సాక్షాత్ కో వాన్య మభికాంక్షతి,
నిధానే మహతి ప్రాప్తే కః కాచం యాచతేఽన్యతః॥ ౬

గొప్ప రతనాల గనియే లభించినపుడు జనుఁడు ఇతరులను గాజు పెంకులను యాచించునా ? అటులే శివతత్త్వమే సాక్షాత్తుగా దెలియఁ బడినపుడు అన్యదేవతల నెవఁడును గాంక్షింపఁడు.

శివానందం సమాసాద్య కో నాన్య మభికాంక్షతి
గంగామృతం పరిత్యజ్య కః కాంక్షే న్మృగ తృష్ణికామ్॥ ౭

గంగామృతమును విడచి యెండమావులను గోరువాఁడెవఁడుండును? అటులే శివానందమును బొందిన యాతఁ డన్యదేవతలను సేవింపఁ జూచునా? చూడఁడు.

సంసార తిమిరచ్ఛేదే వినా శంకర భాస్కరం,
ప్రభవంతి కథం దేవాః ఖద్యోతా ఇవ దేహినామ్॥ ౮

సంసారమనెడి కారుచీఁకటిని బోఁగొట్టఁజాలువాఁడు శివుఁడనెడి సూర్యుఁడే. ఆతఁడు తక్క నితరులైన దేవతలనెడి మిణుగురు లెట్లు సమర్థములు కాఁగలవు? శివేతర దేవతలకు సంసార దుఃఖమును బోఁగొట్టు శక్తి లేదని భావము.

సంసారార్తః శివం యాయా ద్బ్రహ్మాద్యైః కిం ఫలం సురైః,
చకోర స్తృషితః పశ్యే చ్చంద్రం కిం తారకా అపి॥ ౯

దప్పిగొన్న వెన్నెలపిట్ట చంద్రునివంకకే చూచునుగాని, నక్షత్రము లెన్నోయున్నను, వానివైపు చూడదు. అటులే సంసారదుఃఖముచే నలసినవాఁడు శివునే యాశ్రయించునుగాని బ్రహ్మాదిదేవతల వలన నేమి ఫలము నొందును?

శివ ఏవ సమస్తానాం శరణ్యః శరణార్థినాం,
సంసార రోగ దష్టానాం సర్వజ్ఞః సర్వదోషహా॥ ౧౦

సంసార మనెడి పాముచేఁ గఱవఁబడి రక్షణము గోరు నెల్లరకును సర్వజ్ఞుఁడును సర్వదోష నివారకుఁడునైన శివుఁడే రక్షణము నందు సమర్థుఁడు.

శివజ్ఞానే సముత్పన్నే పరానందః ప్రకాశతే,
తదాసక్త మనా యోగీ నాన్యత్ర రమతే సుధీః॥ ౧౧

శివజ్ఞానమే గలిగినపుడు పరానందము ప్రకాశించును. అట్టి పరానందమునందే మనసు తగిలిన శివయోగి శివునికంటె నన్యమైన దేవతలందుఁ బ్రీతి చూపఁడు.

తస్మాత్సర్వ ప్రయత్నేన శంకరం శరణం గతః,
తదనంత సుఖం ప్రాప్య మోదతే నాన్యచింతయా॥ ౧౨

కావున నెల్ల ప్రయత్నములచేతను శివునే శరణమొంది ఆ శివునిచే ననంతసుఖము నొంది పరమానంద విశిష్టుఁడైనవాఁడు అన్యదేవతాధ్యానముచేత ఆనందింపలేఁడు. గాన మోక్షసుఖమును గోరువాఁడు శివేతరధ్యానము నేనాఁడును జేయక సదాశివ ధ్యాననిష్ఠుఁడై నిరతిశయ శివానందము నొందవలయునని శ్రీ రేణుకాచార్యుల బోధము.

## 38. తామస నిరసన స్థలము

శివభక్తి పరానంద మోదినా గురుణా యతః,
నిరస్యంతే తమో భావాః స తామస నిరాసకః॥ ౧౩

శివభక్తి యనెడి పరానందము చేతనైన తనివి నొందువాఁడును, శ్రేష్ఠుఁడునైన శరణునిచేత దామసగుణసంబంధమంతయు నిరసింపఁబడును గాన నాతఁడు తామస నిరాసకుఁ డనఁబడును.

యస్య జ్ఞానం తమో మిశ్రం న తస్య గతి రిష్యతే,
సత్త్వం హి జ్ఞానయోగస్య నైర్మల్యం విదు రుత్తమాః॥ ౧౪

తమోగుణయుక్తమైన జ్ఞానము గలవానికి సద్గతి లేదు. జ్ఞానయోగమునకు నిష్కళంకమైన సత్త్వగుణమే సాధనమని జ్ఞాను లెన్నుదురు.

శమో దమో వివేకశ్చ వైరాగ్యం పూర్ణభావనా,
క్షాంతిః కారుణ్య సంపత్తిః శ్రద్ధా సత్య సముద్భవా॥ ౧౫

శివభక్తిః పరో ధర్మః శివజ్ఞానస్య బాంధవాః,
ఏతైర్యుక్తో మహాయోగీ సాత్త్వికః పరికీర్తితః॥ ౧౬

అంతరింద్రియ నిగ్రహము, బహిరింద్రియ నిగ్రహము, నిత్యానిత్య వస్తుజ్ఞానము, విషయములందు విరక్తి, అఖండధ్యానము, ఓర్మి, భూతదయ, సత్యవస్తువందు విశ్వాసము, శివభక్తి, శివధర్మము అనునవియే శివజ్ఞానమునకుఁ జుట్టములు. ఇవిగల శివయోగి సాత్త్వికుఁ డనఁబడును.

కామ క్రోధ మహామోహ మద మత్సర వారణాః,
శివజ్ఞాన మృగేంద్రస్య కథం తిష్ఠంతి సన్నిధౌ॥ ౧౭

సింహము నెదుట నేనుఁగులు నిలువలేనటులే శివజ్ఞానము గలిగినంతనే కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు తొలఁగిపోవును.

యత్ర కుత్రాపి యో ద్వేష్టి ప్రపంచే శివరూపిణి,
శివద్వేషీ స విజ్ఞేయో రజసాఽఽవిష్ట మానసః॥ ౧౮

రజోగుణముచేఁ గ్రమ్మఁబడినవాఁడై శివస్వరూపమేయైన ప్రపంచము నందు ద్వేషమును జూపువాఁడే శివద్వేషి యనఁబడును.

యో ద్వేష్టి సకలాన్ లోకాన్ యో వాఽహం కురుతే సదా,
యోఽసత్యభావనా యుక్తః స తామస ఇతి స్మృతః॥ ౧౯

సర్వప్రాణులను ద్వేషించుచు అహంకారముతో అసత్యభావనములతోఁ గూడినవాఁడే తామసుఁ డనఁబడును.

తమో మూలాహి సంజాతా రాగద్వేషాది పాదపాః,
శివజ్ఞాన కుఠారేణ ఛిద్యంతే హి నిరంతరమ్॥ ౨౦

శివజ్ఞానే సముత్పన్నే సహస్రాదిత్య సన్నిభే,
కుతస్తమో వికారాః స్యుర్మహతాం శివయోగినామ్॥ ౨౧

అనురాగము, పగ, మున్నగు చెట్లకుఁ దమోగుణ మనెడిదే వేరు. ఆ చెట్లు శివజ్ఞానమనెడి గొడ్డలిచేతనే భేదింపఁబడును. వేయి సూర్యులతో సమానమైన శివజ్ఞానము గలిగిన మహాత్ములైన శివయోగులకుఁ దమోగుణ వికారమెట్లు గలుగును.

## 39. నిర్దేశ స్థలము.

నిరాకృత్య తమోభాగం సంసారస్య ప్రవర్తకం,
నిర్దిశ్యతే తు యద్జ్ఞానం స నిర్దేశ ఇతి స్మృతః॥ ౧౨

సంసారప్రవృత్తికి మూలమైన తమోగుణమును నిరాకరించునే జ్ఞానము గురువుచే నుపదేశింపఁబడునో ఆ జ్ఞానమే నిర్దేశ మనఁబడును.

గురు రేవ పరం తత్త్వం ప్రకాశయతి దేహినాం,
కోవా సూర్యం వినా లోకే తమసో వినివర్తకః॥ ౧౩

(శ్రీ) గురువే దేహధారులందు శివతత్త్వమును బ్రకాశింపఁజేయును. ఈ లోకమున సూర్యుఁడుగాక చీఁకటిని బోఁగొట్టువాఁ డింకెవఁడు ? కావున (శ్రీ) గురువుగాక యజ్ఞానాంధకారమును దొలంచువా రెవ్వరును లేరని భావము.

అంతరేణ గురుం సిద్ధం కథం సంసార నిష్కృతిః,
నిదానజ్ఞం వినా వైద్యం కో వా రోగో నివర్తతే॥ ౧౪

జ్ఞానసిద్ధుఁడైన గురువువలనఁ గాక సంసారనివృత్తి మఱి యెట్లగును ? వ్యాధి మూలకారణము నెఱిఁగిన వైద్యునివలనఁగాక రోగ మితరులవలన నెట్లు మఱలును ?

అజ్ఞాన మలినం చిత్తదర్పణం యో విశోధయేత్,
ప్రజ్ఞా విభూతి యోగేన త మాహుర్గురు సత్తమమ్॥ ౧౫

అజ్ఞానముచే మలినమైన మనస్సనెడి యద్దమును శివజ్ఞాన మనెడి బూడిదచేత నెవఁడు శుద్ధముగాఁ జేయునో అతఁడే గురుశ్రేష్ఠుఁడందురు.

అపరోక్షిత తత్త్వస్య జీవన్ముక్తస్య భావినః,
గురోః కటాక్షే సంసిద్ధే కో వా లోకేషు దుర్లభః॥ ౧౬

స్వరూప జ్ఞానముచే సాక్షాత్కరింపఁబడిన శివస్వరూపము గలవాఁడును, జీవన్ముక్తస్వభావము గలవాఁడునైన గురుని కరుణాకటాక్షము లభింపఁగా లోకమందు బొందరాని పురుషార్థ ముండునా ? అనఁగా సకల పురుషార్థదాయి గురుకరుణయే యనుట.

కైవల్య కల్పతరవో గురవః కరుణాలయాః,
దుర్లభా హి జగత్యస్మిన్ శివాద్వైత పరాయణాః॥ ౨౭

మోక్ష మనెడి మహాఫలము నొసంగు దేవవృక్షములును, కరుణాశీలురును, శివాద్వైత భావనాసక్తులును అయిన గురువులు అతి ప్రయత్నముచేతఁగాని లభింపరు. అనఁగా అరుదుగా నున్నారనుట.

క్షీరాబ్ధి రివ సిన్ధూనాం సుమేరు రివ భూభృతాం,
గ్రహాణా మివ తిగ్మాంశు ర్మణీనా మివ కౌస్తుభః॥ ౨౮

ద్రుమాణా మివ భద్రశ్రీ ర్దేవానా మివ శంకరః,
గురుః శివః పరః శ్లాఘ్యో గురూణాం ప్రాకృతాత్మనామ్॥ ౨౯

సముద్రములలో పాలవెల్లియు, కొండలలో బంగారుకొండయు, గ్రహములలో సూర్యుఁడును, మణులలో గౌస్తుభమును, వృక్షములలో మంచిగంధపుఁ జెట్టును, దేవతలందు శివుఁడును, శ్రేష్ఠులైనటులే ప్రాకృతగురువులందు శివజ్ఞానప్రదుఁడైన గురుఁడే ప్రత్యక్షశివుఁడుగాఁ గొనియాడఁ దగియున్నాడు.

## 40. శీల సంపాదన స్థలము

జిజ్ఞాసా శివతత్త్వస్య శీల మిత్యుచ్యతే బుధైః,
నిర్దేశయోగా దార్యాణాం తద్వాన్ శీలీతి కథ్యతే॥ ౩౦

ఆచార్యులచే ఉపదేశింపఁబడిన నిర్దేశస్థలముచే సంపాదింపఁబడిన శివతత్త్వమును దెలిసికొను నాసక్తియే శీల మనఁబడును. అది గలవాఁడే శీలి.

ప్రపన్నార్తి హరే దేవే పరమాత్మని శంకరే,
భావస్య స్థిరతా యోగః శీల మిత్యుచ్యతే బుధైః॥ ౩౧

శరణాగతులైనవారి దుఃఖములను బోఁగొట్టువాఁడును, స్వయం ప్రకాశుఁడును, పరమాత్ముఁడు నైన శంకరునియందు మనసు చెదరక నిలుపుటే శీలమని పండితు లందురు.

శీలం శివైక విజ్ఞానం శివధ్యానైకతా నతా,
శివ ప్రాప్తి సముత్కంఠా తద్యోగీ శీలవాన్ స్మృతః॥ ౩౨

ముఖ్యముగా శివసంబంధమైన విశిష్టజ్ఞానమును, శివధ్యానమందే నిష్ఠగలిగి అన్యవృత్తి లేకుండుటయు, శివప్రాప్తియందే అమితమైన వేడ్కయు ననెడి యిమ్మూఁడును శీలమనఁబడును. గాన నవి గలవాఁడు శీలవంతుఁడు.

శివా దన్యత్ర విజ్ఞానే వైముఖ్యం యస్య సుస్థిరం,
తదాసక్తా మనోవృత్తి స్త మాహుః శీలభాజనమ్॥ ౩౩

శివునికంటె నితరమైన దైవతములయొక్క జ్ఞానమం దెవనికి విముఖత దృఢమైయుండునో, ఎవని మానసికవ్యాపారము శివునందే తగిలి యుండునో ఆతనినే జ్ఞానులు శీలభాజనుఁ డందురు.

పతివ్రతా యా యచ్ఛీలం పతిరాగా త్ప్రశస్యతే,
తథా శివానురాగేణ సుశీలో భక్త ఉచ్యతే॥ ౩౪

పతివ్రతయొక్క శీలము పతి ప్రేమ చేతనే కొనియాడఁబడును. అటులే శివుని ప్రేమ చేతనే భక్తుఁడైన శరణుఁడు సుశీలుఁడనఁబడును.

పతిం వినా యథా స్త్రీణాం సేవాఽన్యస్యతు గర్హణా,
శివం వినా తథా౽న్యేషాం సేవా నిందా కృతాత్మనామ్॥ ౩౫

స్త్రీలకు భర్తకంటె నితరులైన పురుషులసేవ యెట్లు నింద్యమైనదో అట్లే ధన్యాత్ములైన శరణులకు శివేతరులైన దేవతల సేవయు నింద్యము.

బహునాత్ర కిముక్తేన శివజ్ఞానైక నిష్ఠతా,
శీలమి త్యుచ్యతే సద్భిః శీలవాంస్తత్పరో మతః॥ ౩౬

పలుమాటలేల? ఒక్క శివజ్ఞానమందే నిల్కడ గల్గి యుండుట శీల మనఁబడును. అట్టి శీలమందే ఆసక్తి గలవాఁడు శీల వంతుఁడని పండితు లందురు.

శివాత్మ బోధైకరతః స్థిరాశయః
శివం ప్రపన్నో జగతా మధీశ్వరం,
శివైకనిష్ఠా హితశీల భూషణః
శివైక్యవా నేష హి కథ్యతే బుధైః॥ 38

లింగాంగ జ్ఞానమందు నిరతుఁడయి దృఢమైన చిత్తముఁ గలవాఁడును, జగన్నాథుఁడైన శివునే శరణమొందిన వాఁడును, సతీ పతి భావముతో శివునందే నిలకడ గల శీలమే అలంకారముగాఁ గల వాఁడును అయిన యీ శరణుఁడు శివైక్యవంతుఁ డనబడును.

ఇది
సిద్ధాంత శిఖామణి యందు – శరణ స్థలమున
శరణ స్థలాదులు నాల్గు స్థలములు గల
పదుమూడవ పరిచ్ఛేదము
శ్రీ శివార్పణము.



ఓం నమః శివాయ
శ్రీ మాత్రే నమః
శ్రీ జగద్గురు పంచాచార్యాః ప్రసీదంతు.

## పదునాల్గవ పరిచ్ఛేదము.

### ఐక్య స్థలము.

అగస్త్యమహర్షి యనుచున్నాఁడు :

తామస త్యాగ సంబంధా న్నిర్దేశా చ్ఛీలత స్తథా,
శరణాఖ్యస్య భూయోఽస్య కథమైక్య నిరూపణమ్॥ ౧

తమోభాగ నిరాకరణము, జ్ఞాన నిర్దేశము. శీల సంపాదనము అను మూఁడిటి మాత్రము చేతనే శరణునకు భేదఘటితమైన అంగలింగముల యైక్యనిరూపణ మెట్లు గల్గును? అనఁగా,

శ్రీ రేణుకాచార్యు లిట్లనుచున్నారు :

ప్రాణలింగాదీ యోగేన సుఖాతిశయ మేయివాన్,
శరణాఖ్యః శివేనైక్య భావనా దైక్యవాన్ భవేత్॥ ౨

అంతర్లింగమును ధ్యానించుట, పూజించుట మున్నగువానిచే సాటి లేని యానందము నొందిన శరణుఁడు శివునితోడ నేకత్వమునే భావించుటచేతఁ నాతఁ డైక్యుఁ డగుచున్నాఁడు.

ఐక్యస్థల మిదం ప్రోక్తం చతుర్ధా మునిపుంగవ,
ఐక్యమాచార సంపత్తి రేకభాజన మేవ చ,
సహభాజన మిత్యేషాం క్రమాల్లక్షణ ముచ్యతే॥ 3

ఓ యగస్త్యమహర్షీ! ఈ యైక్యస్థలము 1. ఐక్యస్థలము, 2. ఆచార సంపత్తిస్థలము, 3. ఏకభాజనస్థలము, 4. సహభాజనస్థలము అని నాలుగు విధములుగా నున్నది. వాని లక్షణములు వరుసగాఁ జెప్పఁబడును.

## 41. ఐక్య స్థలము,

విషయానంద కణికా నిఃస్పృహో నిర్మలాశయః,
శివానంద మహాసింధౌ మజ్జనా దైక్య ముచ్యతే॥ ౪

శుద్ధాంతఃకరణుఁడైన శరణుఁడు అత్యల్పములగు విషయానందమనెడి తుంపురులను గోరనివాఁడై శివానందమనెడి మహాసముద్రమందు మునుఁగుటచేత అనఁగా తత్స్వరూపమునే ధరించుటచేత అతఁడు ఐక్యుఁడనఁబడును.

నిర్ధూత మలసంబంధో నిష్కలంక మనోగతః,
శివోఽహ మితి భావేన నిరూఢోహి శివైకతామ్॥ ౫

ఆణవాదులైన మూఁడు మలముల సంపర్కము లేనివాఁడై కసటు లేని మనసు గలవాఁడై 'నేను శివుఁడ' నను భావముతో శివైక్యము నొందినవాఁడు ఐక్యుఁ డనఁబడును.

శివేనైక్యం సమాపన్న శ్చిదానంద స్వరూపిణా,
న పశ్యతి జగజ్జాలం మాయాకల్పిత వైభవమ్॥

జ్ఞానానంద స్వరూపుఁడైన శివునికంటె నేను వేఱుకాదు. అను నిశ్చయజ్ఞానముగల శరణుఁడు మాయాశక్తి పరికల్పితవైభవము గల యీ విశ్వసమూహమును జూడఁడు. అనఁగా శివమయముగానే చూచు నని భావము.

బ్రహ్మాండ బుద్బుదోద్భేద విజృంభి తత్త్వ వీచిమాన్,
మాయా సింధుర్లయం యాతి శివైక్య బడబానలే॥ ౭

అనంతబ్రహ్మాండములే యనెడి బుడగలును, ముప్పదియారుతత్త్వము లనెడి యలలును, మాటిమాటికి లేచి యడఁగుచుండు మాయామహాసముద్రము శివలింగైక్యమనెడి బడబాగ్నియందు అణఁగిపోవుచుండును.

మాయాశక్తి తిరోధానాచ్ఛివే భేద వికల్పనా,
ఆత్మన స్తద్వినాశే తు నాద్వైతాత్ కించి దిష్యతే॥ ౮

జీవునకు ఆ మాయాశక్తి మఱుఁగుచేయుటవలన శివునందు భేదబుద్ధి గలుగును. అవిద్యారూపమైన ఆ మాయాశక్తి సంబంధము విడిపోయి నంతనే 'శివునికంటె నేను వేఱుకా' దనెడి మాట తక్క మఱేదియు నుండదు.

పశుత్వం చ పతిత్వం చ మాయామోహ వికల్పితం,
తస్మిన్ ప్రలయ మాపన్నే కః పశుః కో ను వా పతిః॥ ౯

మాయాశక్తివలని మోహముచేతనే జీవరూపమైన పశుత్వమును, శివరూపమైన పతిత్వమును దోఁచును. ఆ యజ్ఞానము తొలఁగిపోఁగానే పశువెవ్వఁడు పతి యెవ్వఁ డనియే తోఁచును.

ఘోర సంసార సర్పస్య భేద వల్మీక శాయినః,
బాధకం పరమాద్వైత భావనా పరమౌషధమ్॥ ౧౦

జడాజడభేదము, జీవాజీవభేదము, జీవజడభేదము, జీవేశ్వరభేదము, జడేశ్వరభేదము ననెడి భేదపంచకరూపమైన పుట్టయందుండు భయంకర సంసారమనెడి సర్పమును నశింపఁజేయు మంచి మందు జడచేతనైక్య రూపమగు శివాద్వైత భావనయే.

భేదబుద్ధి సముత్పన్న మహాసంసార సాగరం,
అద్వైతబుద్ధి పోతేన సముత్తరతి దేశికః॥ ౧౧

శివునికంటె నేను వేఱనెడి భేదబుద్ధిచేఁ గలిగిన సంసారసముద్రమును శ్రీగురుఁడు అద్వైతనిశ్చయజ్ఞానమనెడి తెప్పచే శిష్యుని దాటించును.

అజ్ఞాన తిమిరోద్రిక్తా కామ రక్షః క్రియాకరీ,
సంసార కాలరాత్రిస్తు నశ్యే దద్వైత భానునా॥ ౧౨

అజ్ఞానమనెడి గాఢాంధకారముచే నల్లుకొనఁబడి కామమనెడి రాక్షస కృత్యమును జేయునట్టి సంసారమనెడు కాళరాత్రి శివాద్వైత భావన యనెడి సూర్యునిచేఁ దొలఁగును.

తస్మా దద్వైత భావస్య సదృశో నాస్తి యోగినాం,
ఉపాయో ఘోర సంసార మహాతాప నివృత్తయే॥ ౧౩

కావున భయంకర సంసారముచేఁ గలుగు తాపముల నార్పుటకు శివాద్వైత భావనముతో సాటియైన యుపాయము శివయోగులకు మఱి లేదు.

అద్వైత భావనా జాతం క్షణమాత్రేఽపి యత్సుఖం,
తత్సుఖం కోటి వర్షైస్తు ప్రాప్యతే నైవ భోగిభిః॥ ౧౪

యోగపరాయణులచే క్షణమాత్రమైనను అనుభవింపఁబడు ఆనందము భోగపరాయణులకుఁ గోటివత్సరములకైనను లభింపదు.

చిత్తవృత్తి సమాలీన జగతః శివయోగినః,
శివానంద పరిస్ఫూర్తి స్ముక్తి రిత్యభిధీయతే॥ ౧౫

తన చిత్తవృత్తియందు సమస్తప్రపంచమును అణఁగించుకొనిన శివయోగికిఁ గలుగు శివానంద పరిస్ఫురణమే ముక్తి యని చెప్పఁబడుచున్నది.

## 42. ఆచార సంపత్తి స్థలము

శివైక భావనాపన్న శివత్వో దేహవానపి,
దేశికోఽపి నలిప్యేత స్వాచారైః సూతకాదిభిః॥ ౧౬

శివైక్యముచే శివత్వమునొందిన (అనఁగా శివోఽహ మనెడి మహా వాక్యానుభవము నొందిన) శివైక్యుఁడగు దేశికుఁడు దేహమును ధరించి యున్నను సూతకాశౌచము మున్నగు స్వకులాచారములతో నంటఁడు. అనఁగా శివస్వరూపుఁడైన యతనికి ఆశౌచమే లేదు.

> శివాద్వైత పరిజ్ఞానే స్థితే సతి మనస్వినాం,
> కర్మణా కిం ను భావ్యం స్యా దకృతేన కృతాత్మనా॥ ౧౭

శివలింగైక్యమందుఁ బ్రతిష్ఠితమైన మనోవ్యాపారము గల ధీరులకు శివాద్వైతజ్ఞానము స్థిరపడుటచే వారు శివపూజాది కర్మముల నాచరించినను ఆచరింపకున్నను ఒక్కటే.

> శంభో రేకత్వ భావేన సర్వత్ర సమదర్శనః,
> కుర్వన్నపి మహాకర్మ న తత్ఫల మవాప్నుయాత్॥ ౧౮

శివైక్య ప్రాప్తిచే నంతటను సమదృష్టి గలవాఁడు (అనఁగా సర్వము శివమయ మనెడి శివలింగైక్యుఁడు) పుణ్యపాప రూపమైన కర్మల నాచరించినను వాని నా ఫల మంటదు.

> సుకృతీ దుష్కృతీ వాపి బ్రాహ్మణో వాఽన్త్యజోఽపి వా,
> శివైక భావయుక్తానాం సదృశో భవతి ధ్రువమ్॥ ౧౯

సర్వము శివమయమను దృఢభావము గలవారలకు పుణ్యాత్ముఁడు, పాపాత్ముఁడు, బ్రాహ్మణుఁడు, కడజాతివాఁడును సమానులే యనుట నిశ్చయము.

> వర్ణాశ్రమ సదాచారై ర్జ్ఞానినాం కిం ప్రయోజనం,
> లౌకికస్తు సదాచారః ఫలాభావేఽపి భావ్యతే॥ ౨౦

బ్రాహ్మణాది వర్ణములను, బ్రహ్మచర్యాద్యాశ్రమములను ఆశ్రయించి కల్గిన సదాచారములచే శివజ్ఞానుల కేమి ప్రయోజనము? లౌకికములగు వర్ణాశ్రమ ధర్మములతోఁ గూడిన నిత్యనైమిత్తికాచారములు ఫలశూన్యములైనను ఆచరింపఁదగినవియే. శివజ్ఞాన నిష్ఠులకు ఈ వర్ణాశ్రమాచార ధర్మములతోఁ బ్రయోజనము లేకున్నను లోకాను

గుణాముగా దేహాముున్నంత వఱకును ఆ ధర్మముల నాచరింపవలయునని భావము.

నిర్దగ్ధ కర్మబీజస్య నిర్మల జ్ఞాన వహ్నినా,
దేహేఽవ ద్భాసమానస్య దేహ యాత్రాతు లౌకికీ॥ -౨౧

నిర్మలమైన శివజ్ఞాన మనెడి యగ్నిచేతఁ బుణ్య పాప రూపమైన కర్మబీజములు గాలిపోయినవానికి, తాను దేహధారివలె గానవచ్చినను, అతని కరచరణాది సంచాలన రూపమైన వ్యాపారము కేవల లౌకికమై యుండును. లోకమున కాతఁడు శరీరధారిగాఁ గానఁబడినను దనకు మాత్రము శరీరాభిమాన మింతయు లేదని భావము.

దీనికే దగ్ధపట న్యాయ మందురు. అనఁగా వస్త్రము కాలిపోయినను వస్త్రాకారము మాత్రమే మిగులును, గాని ఆ వస్త్రము ధారణాదుల కుపయోగింపదు. ఈ న్యాయార్థమును మది నుంచుకొనియే శ్రీ జగద్గురువులు ఈ సత్యమును బ్రతిపాదించిరి.

శివజ్ఞాన సమాపన్న స్థిరవైరాగ్య లక్షణః,
స్వకర్మణా న లిప్యేత పద్మపత్ర మివాంభసా॥ -౨౨

తామరాకుపైఁ బడిన నీరు దాని నంటనటులే శివజ్ఞానముచే లభించిన దృఢవైరాగ్యముగల శివలింగైక్యుని కర్మములు వాని నంటవు.

గచ్ఛం స్తిష్ఠ న్స్వపన్వాపి జాగ్ర ద్వాపి మహామతిః,
శివజ్ఞాన సమాయోగా చ్ఛివ పూజాపరః సదా॥ -౨౩

శివజ్ఞానాను సంధానము గలుగుటవలన ఆ మహాశయుఁడు నడుచుచున్నను, నిలుచున్నను, నిదురించుచున్నను, మేల్కొనియున్నను, ఎడతెగని శివపూజాసక్తి గలిగియే యుండును.

యద్య త్పశ్యతి సామోదం వస్తు లోకేషు దేశికః,
శివదర్శన సంపత్తి స్తత్ర తత్ర మహాత్మనః॥ -౨౪

శివలింగైక్యుఁడు ఏవస్తువును బ్రేమ పూర్వకముగాఁ జూచుచున్నను ఆ మహాత్మునకు ఆయావస్తువులం దన్నిటను శివదర్శనమే యగుచుం

డును. అనఁగా నతఁడు చూచు సమస్తమందును శివతేజస్సే కానవచ్చు నని భావము.

యద్యచ్చింతయతే యోగీ మనసా శుద్ధభావనః,
తత్తచ్ఛివమయత్వేన శివధ్యాన ముదాహృతమ్॥ ౨౫

నిర్మలాత్ముఁడైన శివయోగి యే యే వస్తువులను మనస్సునఁ దలంచునో అవి యన్నియు శివస్వరూపముగానే యుండుటచేత నదియె శివధ్యాన మనఁబడును.

యత్కించి ద్భాషితం లోకే స్వేచ్ఛయా శివయోగినా,
శివస్తోత్ర మిదం సర్వం యస్మాత్సర్వాత్మకః శివః॥ ౨౬

శివుఁడే సర్వాత్మకుఁడు గాన శివయోగి యీ లోకమందు స్వేచ్ఛగానే మాటాడినను నదియెల్ల శివస్తోత్రమే యగును.

యా యా చేష్టా సముత్పన్నా జాయతే శివయోగినాం,
సా సా పూజా మహేశస్య సర్వదా తద్గతాత్మనామ్॥ ౨౭

శివయోగులు సదా శివగతచిత్తులై యుండుటచే వారి శారీరక క్రియ లెట్టివైనను అవియెల్ల శివపూజలే యగును.

## 43. ఏక భాజన స్థలము

విశ్వం శివమయం చేతి సదా భావయతో ధియా,
శివైక భావనాత్మత్వా దేకభాజన ముచ్యతే॥ ౨౮

సకల చరాచర రూపమైన యీ జగత్తు శివమయమని యెల్లప్పుడును బుద్ధిచే భావించు శివలింగైక్యునకు శివుఁడే ముఖ్యాధారముగా నుండుటచే నాతఁడు ఏకభాజనుఁ డనఁబడును.

స్వస్య సర్వస్య లోకస్య శివస్యాద్వైత దర్శనాత్,
ఏక భాజన యోగేన ప్రసాదైక్య మతిర్భవేత్॥ ౨౯

తనకు సమస్త ప్రపంచమును శివుని అద్వైతభావనతోఁ గాంచుటచేత పైనిజెప్పిన యేకభాజన మనెడి యోగముతోఁ గూడినవాఁడై శివైక్యుఁడు శివప్రసాదమం దైక్యభావనము గలవాఁడగును.

శివే విశ్వ మిదం సర్వం శివః సర్వత్ర భాసతే,
ఆధారాధేయ భావేన శివస్య జగతః స్థితిః॥ 30

శివునందు సమస్త ప్రపంచమును, సమస్త ప్రపంచమందు శివుఁడును ప్రకాశించుచుండును. కావున శివునియొక్కయు ప్రపంచముయొక్కయు స్థితి ఆధారాధేయ భావముతో నున్నది. ఆధారము ఒకవస్తువు నిలువఁదగిన చోటు. ఆధేయము ఆచోట నిలుచు వస్తువు. శివుఁడాధారము. ప్రపంచ మాధేయము.

చిదేక భాజనం యస్య చిత్తవృత్తిః శివాత్మికా,
నాన్య త్తస్య కి మేతేన మాయయా మూలేన వస్తునా॥ 31

శివయోగియొక్క మానసిక వ్యాపారము శివస్వరూపమై యుండుట నాతని జ్ఞానము ఏకభాజన మనఁబడును. అనఁగా నొక్కదాని యందే నిల్చినది. ఈ జ్ఞానముగాక మఱేదియు ఏకభాజన మనఁబడదు. అట్టి శివయోగికి మాయామూలమైన యీ భేద విశిష్టవస్తువుతో నేమి ప్రయోజనము ?

చిత్ప్రకాశయతే విశ్వం తద్వినా వస్తు నాస్తిహి,
చిదేక నిష్ఠ చిత్తానాం కిం మాయా పరికల్పితైః॥ 32

జ్ఞానమే సకలవస్తువులను ప్రకాశింపఁజేయునది. అది తక్క ప్రపంచమున మఱియొక్క వస్తువు ప్రకాశింపఁజేయ లేదు. కావున నిట్టి జ్ఞానమందే చిత్తము దృఢపడినవానికి మాయాకల్పిత వస్తువులతో నేమి ప్రయోజనము కలదు ? పరబ్రహ్మమే జ్ఞానస్వరూపమై యున్నది. "ప్రజ్ఞానం బ్రహ్మ" "సత్యం జ్ఞాన మనంతం బ్రహ్మ" మున్నగు శ్రుతి వాక్యము లీ మాటనే బోధించును. గాన మోక్షార్థి కేవల జ్ఞానమందే లీనుఁడై కైవల్యానందము ననుభవింపవలయునని శ్రీ భగవత్పాదుల యభిప్రాయము.

వృత్తిశూన్యే స్వహృదయే శివే లీనే నిరాకులే,
యః సదా రమతే యోగీ స ముక్తో నాత్ర సంశయః॥ 33

సర్వవ్యాపార శూన్యుఁడును, ఎట్టి చిత్తక్షోభము లేనివాఁడును, శివైక్యభావితుఁడును అయి తనయందే యే శివయోగి వినోదించునో అతఁడే జీవన్ముక్తుఁడైన నెట్టి సందియమును లేదు.

## 44. సహ భాజన స్థలము.

గురోః శివస్య శిష్యస్య స్వస్వరూపతయా స్థితిః,
సహభాజన మాఖ్యాతం సర్వగ్రాసాత్మ భావతః॥ ౩౪

శివయోగికి ''ఘటో మయా జ్ఞాతః, పటో మయా జ్ఞాతః'' అనఁగా ''కుండ నాచేఁ దెలియఁబడినది; వస్త్రము నాచేఁ దెలియఁబడినది.'' మున్నగు నే భేదములును లేక స్వస్వరూపుఁడై యుండుటచేత, అనఁగా సర్వము నభిన్నముగా నెఱుఁగుటచేత గురునందును, శివునందును, దన యందును భేదబుద్ధిలేక స్వస్వరూపత్వమునే యీ మూవురియందును నిల్పుటే సహభాజనస్థల మనఁబడును.

శివం విశ్వం గురుం సాక్షా ద్యోజయ న్నిత్య మాత్మని,
ఏకత్వేన చిదాకారే తదిదం సహభాజనమ్॥ ౩౫

సాక్షాత్తుగా జ్ఞానస్వరూపమైన ఆత్మయందు శివుని, గురుని, సర్వ ప్రపంచమును, ఏకరూపత్వముతో (అనఁగా నివెల్లను నొక్కటే యను నభేద నిశ్చయముతో) సంయోజించుటే సహభాజన స్థల మనఁబడును.

అయం శివో గురుశ్చైష జగ దేత చ్చరాచరం,
అహంచేతి మతిర్యస్య నాస్త్యసౌ విశ్వభాజకః॥ ౩౬

ఇతఁడు శివుఁడు, ఇతఁడు గురుఁడు, ఇది స్థావర జంగమాత్మక ప్రపంచము, ఇది నేను అనెడి భేదబుద్ధి యెవనికి బొత్తిగా నశించునో అతఁడు విశ్వభాజకుఁ డనఁబడును.

అయం భృత్యః శివః స్వామీ, శిష్యోఽహం గురురేషవై,
ఇతి యస్యమతి ర్నాస్తి స చాద్వైత పదే స్థితః॥ ౩౭

శివుఁడు ప్రభువనియు, నేను సేవకుఁడనియు, ఇతఁడు గురుఁడు నేను శిష్యుఁడననియు భేదబుద్ధి యెవనికి లేదో అతఁడే శివాద్వైతపదమం దధి ష్ఠాత యగును.

పరాహంతా మయే స్వాత్మ పావకే విశ్వభాసకే,
ఇదం తా హావ్యహోమేన విశ్వహోమీతి కథ్యతే॥ ౩౮

ఈ జగత్తును ప్రకాశింపఁజేయు మూలాహంతాప్రచురమైన తన ఆత్మయనెడి అగ్నియందు, ఇదంత యనెడి భేదబుద్ధిరూపమైన హోమద్రవ్యమును ఎవఁడు హోమము చేయునో అతఁడు విశ్వహోమి యనఁబడును.

అహం శివో గురు శ్చాహ మహం విశ్వం చరాచరం,
యయా విజ్ఞాయతే సమ్యక్ పూర్ణాంహంతేతి సా స్మృతా॥ ౩౯

నేనే శివుఁడను, నేనె గురుఁడను, నేనె యీ చరాచరప్రపంచము నని దేనిచేఁ జక్కఁగా దెలియఁబడునో అదె పూర్ణాహంత.

ఆధార వహ్నౌ చిద్రూపే భేదజాతం జగ ద్ధవిః,
జుహోతి జ్ఞాన జుహ్వాయః స జ్ఞేయో విశ్వ హవ్యభుక్॥ ౪౦

జ్ఞానస్వరూపమై ఆధారచక్రస్థితమైన అగ్నియందు భేదస్వరూపమైన జగత్తనెడి హోమద్రవ్యమును జ్ఞానమనెడి స్రుక్కుతోఁ (హోమసాధనమైన కట్టెతోఁ జేయఁబడిన గరిటెవంటి పాత్ర) నెవఁడు హోమమ్ము చేయునో అతఁడు "విశ్వ హవ్య భుక్" అనఁబడును. అనఁగా సమస్త హోమద్రవ్యము ననుభవించువాఁడు.

చిదాకారే పరాకాశే పరమానంద భాస్వతి,
విలీన చిత్త వృత్తీనాం కా వా విశ్వక్రమ స్థితిః॥ ౪౧

జ్ఞానస్వరూపమును, పరమానంద స్వరూపమును, స్వయంప్రకాశమును నైన పరాకాశస్వరూప పరమాత్మయందు దన మనోవ్యాపారములను లయముచేయు శివయోగులకు ప్రపంచ వ్యాపార వృత్తి యెటులుండును? ఉండదు.

నిరస్త విశ్వసంబాధే నిష్కళంకే చిదంబరే,
భావయే ల్లీన మాత్మానం సామరస్య స్వభావతః॥ ౪౨

జనన మరణ రూపమైన సమస్తక్లేశములను దొలగించునదియు దోషరహితమును అయిన చిదాకాశస్వరూప పరమాత్మయందు జీవాత్మఁడు

సామరస్యస్వభావముతో లీనుఁడైనట్లు భావింపవలయును. అనఁగా సచ్చిదానందస్వరూప పరమాత్మయందు దాను లీనుఁడు కావలయును.

సైషా విద్యా పరా జ్ఞేయా సత్తానంద ప్రకాశినీ,
ముక్తి రిత్యుచ్యతే సద్భి ర్జగన్మోహ నివర్తినీ॥ ४३

త్రికాలాబాధ్యమైన యునికిని, ఆనందమును ప్రకాశింపఁజేయునదియు జగదజ్ఞానమును నిరాకరించునదియు నైన యీ జ్ఞానమే పరవిద్య యనియు ముక్తియనియు జ్ఞానులచేఁ జెప్పఁబడును.

భక్తాది నామా వరధర్మయోగాత్
ప్రాప్తైకభావః పరమాద్భుతేన,
శివేన చిద్వ్యోమమయేన సాక్షా
న్మోక్షశ్రియో భాజన తా ముపైతి॥ ४४

భక్తుఁడు, మాహేశ్వరుఁడు మున్నగు నామములు గల శివయోగి శ్రేష్ఠమైన శివధర్మయోగముతో హృత్కమల మధ్యస్థమైన చిదాకాశ స్వరూపమైన శివునితో వింతగా ఏకత్వమును బొందినవాఁడై ప్రత్యక్ష మోక్షలక్ష్మికి స్థానమగుచున్నాఁడు.

ఇది
సిద్ధాంత శిఖామణి యందు – ఐక్య స్థలమున
ఐక్యస్థలాద్దులు నాల్గు స్థలములు గల
పదునాల్గవ పరిచ్ఛేదము
శ్రీ శివార్పణము.

—♦—

ఓం నమః శివాయ

శ్రీ మాత్రే నమః

శ్రీ జగద్గురు పంచాచార్యాః ప్రసీదంతు

# పద్మునైదవ పరిచ్ఛేదము

(లింగ స్థలములు 57)

శ్రీ రేణుకాచార్య లనుచున్నారు :

షట్ స్థలోక్త సదాచార సంపన్నస్య యథాక్రమం,
లింగ స్థలాని కథ్యంతే జీవన్ముక్తి పరాణి చ॥ ౧

ఇంతవఱకు అంగస్థలమునందలి ఆఱుస్థలముల ధర్మముల నాచరించు శివయోగికై క్రమముగా జీవన్ముక్తిపదములైన లింగస్థలములు చెప్పఁబడును.

అగస్త్యమహర్షి యనుచున్నాఁడు :

భక్త్యాద్యైక్యావసానాని షడుక్తాని స్థలాని చ,
లింగ స్థలాని కానీహ కథ్యంతే కతి వా పునః॥ ౨

గణాధీశ్వరా! ఇంతదనుక భక్తస్థలము మొదలు ఐక్యస్థలము పర్యంతము ఆఱుస్థలములు చెప్పితిరి. ఇఁక నీ లింగస్థలము లెన్ని? వాని లక్షణము లేవి? యనిన,

శ్రీ రేణుకాచార్యులు చెప్పుచున్నారు :

గుర్వాది జ్ఞాన శూన్యంతా భక్తాది స్థల సంశ్రితాః,
స్థల భేదాః ప్రకీర్త్యంతే పంచాశత్సప్త చాధునా॥ 3

ఆదౌ నవ స్థలానీహ భక్తస్థల సమాశ్రయాత్,
కథ్యంతే గుణసారేణ నామాన్యేషాం పృథక్ఛృణు॥ ౪

దీక్షా గురుస్థలము మొదలు జ్ఞానశూన్య స్థలాంతముగా నిందు ఏబది యేడు స్థలములును లింగస్థలము లనఁబడును. ఈ లింగస్థలములు భక్తాదిగా ఆఱుస్థలముల జేరియున్నవే. వీనియం దాఱిటను 57 స్థలముల గుణాధిక్యముగా భక్తస్థలము నాశ్రయించి యుండుట వలన తొలుత 9 విధములగు స్థలములు చెప్పఁబడును.

దీక్షా గురుస్థలం పూర్వం తతః శిక్షా గురుస్థలం,
ప్రజ్ఞా గురుస్థలం చాథ క్రియా లింగస్థలం తతః॥ ౫
భావ లింగస్థలం చాథ జ్ఞాన లింగస్థలం తతః,
స్వయం చరం పరం చేతి తేషాం లక్షణ ముచ్యతే॥ ౬

1. దీక్షా గురుస్థలము, 2. శిక్షా గురుస్థలము, 3. జ్ఞాన గురుస్థలము, 4. క్రియా లింగస్థలము, 5. భావ లింగస్థలము, 6. జ్ఞానలింగస్థలము, 7. స్వస్థలము, 8. చరస్థలము, 9. పరస్థలము అను తొమ్మిది స్థలముల స్వరూపము చెప్పఁబడును.

## 1. దీక్షా గురు స్థలము.

దీయతే పరమం జ్ఞానం క్షీయతే పాశ బంధనం,
యయా దీక్షేతి సా తస్యాం గురుర్దీక్షా గురుః స్మృతః॥ ౭

దేనిచేత సర్వోత్కృష్టమైన జ్ఞానము (దీయతే) ఈయఁబడునో, దేనిచేత మల మాయాది పాశబంధము (క్షీయతే) నశించునో అది దీక్ష. జ్ఞానక్రియాదీక్ష ననుగ్రహించునతఁడే దీక్షాగురుఁడు.

గుణాతీతం 'గ' వర్ణం చ రూపాతీతం 'ర' వర్ణకం,
గుణాతీత మరూపం చ యో దద్యా త్స గురుః స్మృతః॥ ౮

'గురు' పదమందలి 'గు' వర్ణము ప్రాకృత గుణ రాహిత్యమును దెలుపును. 'రు' వర్ణము ప్రాకృతరూప రాహిత్యమును దెలుపును. ఇట్టి ప్రాకృతగుణ రూపములు ఏ పరశివ బ్రహ్మమునకు లేవో అట్టి సత్పదార్థస్వరూపము ననుగ్రహించునతఁడే గురుఁ డనఁబడును.

ఆచినోతి హి శాస్త్రార్థా నాచారే స్థాపయత్యపి,
స్వయమాచరతే యస్తు స ఆచార్య ఇతి స్మృతః॥ ౯

వీరశైవ శాస్త్రమందలి రహస్యములను శిష్యులకు బోధించుచు వారి నాయాచారములందు నెలకొల్పుచుఁ దా నాయాచారములను 'తు-చ' తప్పక యాచరించుచు నెలయు శివయోగి ఆచార్యుఁడనఁబడును.

షడధ్వాతీత యోగేన యతతే యస్తు దేశికః,
మాయాబ్ధి తరణోపాయ హేతు ర్విశ్వగురుః స్మృతః॥ ౧౦

ఏ గురుఁడు వర్ణము, కళ, పదము, తత్త్వము, మంత్రము, భువనము అనెడి యాఱధ్వములను మీఱిన యోగముచే శిష్యసంతతి నుద్ధరింపఁజూచునో అతఁడే మాయా మహా సముద్రమును దాటించు నుపాయముం దెలుపు మహాగురుఁడు. అతఁడే జగద్గురుఁడు.

అఖండం యేన చైతన్యం వ్యజ్యతే సర్వవస్తుషు,
ఆత్మయోగ ప్రభావేన స గురు ర్విశ్వ భాసకః॥ ౧౧

తనయందైన యోగప్రభావముచేత సర్వపదార్థములందును అఖండమైన చైతన్యము, ఎవనిచేత వ్యక్తీకరింపఁబడునో అతఁడే విశ్వప్రకాశుఁడైన గురుఁడు.

2. శిక్షా గురు స్థలము.

దీక్షా గురురసౌ శిక్షాహేతుః శిష్యస్య బోధకః,
ప్రశ్నోత్తర ప్రవక్తా చ శిక్షా గురు రితీర్యతే॥ ౧౨

ఈ దీక్షాగురుఁడే శిష్యునకు బోధకుఁడును, శిష్యప్రశ్నములకు సంశయము తొలఁగునట్లు సమాధాన మిచ్చుచు వేదోపనిషదాదులను బోధించు శిక్షాగురుఁడు.

బోధకోఽయం సమాఖ్యాతో బోధ్యమేత దితి స్ఫుటం,
శిష్యో నియుజ్యతే యేన స శిక్షాగురు రుచ్యతే॥ ౧౩

బోధించువాఁడు గురుఁడు, బోధింపఁబడునది శివబ్రహ్మజ్ఞానము అని స్పష్టముగా నెవనిచేత శిష్యునకు ఆజ్ఞాపింపఁబడునో అతఁడు శిక్షాగురుఁ డనఁబడును.

సంసార తిమిరోన్మాథ శరచ్చంద్ర మరీచయః,
వాచో యస్య ప్రవర్తంతే తమాచార్యం ప్రచక్షతే॥ ౧౪

ఎవ్వని ఉపదేశవాక్యములనెడి శరత్కాల చంద్రకిరణములు సంసారమనెడి కారుచీఁకటిని బోఁగొట్టఁగలవో అతఁడే ఆచార్యుఁ డనఁబడును.

దదాతి యః ప్రతి జ్ఞానం జగన్మాయా నివర్తకం,
అద్వైత వాసనోపాయం తమాచార్య వరం విదుః॥ ౧౪

జగత్తు వేఱు, నేను వేఱు, శివుఁడు వేఱు, గురుఁడు వేఱు అనెడి భేదభ్రాంతిని నశింపఁజేయు శివాద్వైతవాసన యనెడి యుపాయమును అనుగ్రహించునతఁడే ఆచార్యశ్రేష్ఠుఁ డనఁబడును.

పూర్వపక్షం సమాదాయ జగద్భేద వికల్పనం,
అద్వైత కృత సిద్ధాంతో గురురేష గుణాధికః॥ ౧౫

శివునికంటెను జగత్తు భిన్నమనెడి యితరుల పూర్వపక్షము (=విశ్వ యాథార్థ్య జ్ఞానమునకు విరుద్ధమైన నిలువని సిద్ధాంతము) నే చేకొని శివాద్వైతమును సిద్ధాంతీకరించి (ద్వైత) భేద కల్పనమును నిరసించి అద్వైతమే సత్యమను మాటను ఎవఁడు నిల్పునో ఆ శిష్టాగురుఁడే శ్రేష్ఠుఁడు.

సందేహ వన సందోహ సముచ్ఛేద కుఠారికా,
యత్సూక్తిధారా విమలా స గురూణాం శిఖామణిః॥ ౧౬

అడవిని నఱకు గొడ్డలివలె శివాద్వైతోపదేశమునకైన ఎవ్వని మంచి మాటలధార సంశయములను ఛేదించునో అతఁడే గురుశ్రేష్ఠుఁ డనఁబడును.

యత్సూక్తి దర్పణాభోగే నిర్మలే దృశ్యతే సదా,
మోక్షశ్రీర్బింబరూపేణ స గురుర్భవతారకః॥ ౧౮

ఎవ్వని సదుపదేశములనెడి యద్దమున మోక్షలక్ష్మీ ప్రతిబింబము చక్కఁగా గానఁబడునో అతఁడే సంసారమునుండి తరింపఁజేయు గురుఁడు.

శిష్యాణాం హృదయాలేఖ్యం ప్రద్యోతయతి యః స్వయం,
జ్ఞానదీపికయా తేన గురుణా కః సమోభవేత్॥ ౧౯

ఏ ఆచార్యుఁడు శిష్యుని హృదయమందలి ఆత్మ యనెడి చిత్రపటమును శివజ్ఞానమనెడి దీపముచే చక్కఁగా జూపఁగలఁడో అతనికి సాటియగు గురుఁ డెవఁడును లేఁడు.

పరమాద్వైత విజ్ఞాన పరమౌషధ దానతః,
సంసారరోగ నిర్మాథీ దేశికః కేన లభ్యతే॥ ౨౦

శివాద్వైత జ్ఞానమనెడి తిరుగులేని మహౌషధమునిచ్చి జనన మరణ రూపమైన సంసారమనెడి రోగమును నిర్మూలించునో అట్టి గురుడు శివ కరుణాకటాక్షముగల యే యొక్కనికో దొరకును గాని యెల్లరకును లభింపడు.

## 3. జ్ఞాన గురు స్థలము

ఉపదేష్టోపదేశ్యానాం సంశయచ్ఛేద కారకః,
సమ్యగ్ జ్ఞానప్రదః సాక్షాదేష జ్ఞాన గురుః స్మృతః॥ ౨౧

ఉపదేశింపదగిన ఉపనిషద్రహస్యార్థముల నుపదేశించువాడును, శిష్యుల సందేహములను దన సంశయచ్ఛేది పాండిత్యముచే దొలగించి లెస్సగా శివజ్ఞానము ననుగ్రహించువాడును నగు నతడే జ్ఞాన గురుడనబడును.

నిరస్త విశ్వ సంభేదం నిర్వికారం చిదంబరం,
సాక్షాత్కరోతి యో యుక్త్యా స జ్ఞాన గురురుచ్యతే॥ ౨౨

శక్తివిశిష్ట శివునికంటె నతిరిక్తమైన జగద్భేదము లేనివాడును, తనయందెట్టి మార్పును లేని ధీరుడునయి జ్ఞానాకాశరూపమైన పరమాత్మ తత్త్వమును దన యనుభవములచే బ్రత్యక్షముగా జూపు నాతడే జ్ఞానగురుడనబడును.

కళంకవాన సౌ చంద్రః క్షయ వృద్ధి పరిప్లుతః,
నిష్కళంకః స్థితో జ్ఞాన చంద్రమా న వికారవాన్॥ ౨౩

చంద్రునినంతటి ప్రకాశమూర్తికిని తఱుగు పెరుగు లుండుటచేతను, మచ్చ యుండుటచేతను ఎల్లప్పుడు నొక్కతీరుగా సంతోషపెట్టలేడు. ఈ జ్ఞానమనెడి చంద్రుడన్ననో తఱుగు పెరుగులు లేక మార్పులును లేక కళంకమునులేక యొక్కతీరుగా బ్రకాశించుచు నెల్లరను సంతోష పెట్టుచుండును.

వాహ్యస్థం తిమిరం హంతి ప్రదీపో మణి నిర్మితః,
సర్వగామి తమో హంతి బోధదీపో నిరంకుశః॥ —౨౪

మహామణి దీపమైనను దన సమీపమందున్న చీఁకటినే తొలగించును గాని జ్ఞానులేని యీ జ్ఞానదీపము అంతట వ్యాపించిన అజ్ఞానమనెడి చీఁకటిని బోఁగొట్టును.

సర్వార్థ సాధక జ్ఞాన విశేషాదేశ తత్పరః,
జ్ఞానాచార్యః సమస్తానా మనుగ్రహాకరః శివః॥ —౨౫

ధర్మార్థకామమోక్షము లనెడి పురుషార్థముల నొసంగు జ్ఞానము నుపదేశించు నాశక్తి గలవాఁడును, వీని వారసక మోక్షార్థుల నెల్లర ననుగ్రహించు జ్ఞానాచార్యుఁడు సాక్షాచ్ఛివుఁడు. ఈ యభిప్రాయమునే వాతులాగమము "శివ రూపాను సంధాయి జ్ఞానం యే నోపదిశ్యతే, ముముక్షో ర్మోక్ష సిద్ధ్యర్థం స జ్ఞాన గురురుచ్యతే" అను శ్లోకముచే మోక్షార్థికి ముక్తి నొసంగుటకై శివస్వరూపానుసంధానము జేయు జ్ఞానము నుపదేశించునతఁడే జ్ఞానగురుఁడని బోధించుచున్నది.

కటాక్ష చంద్రమా యస్య జ్ఞాన సాగర వర్ధనః,
సంసార తిమిరచ్ఛేదీ స గురు ర్జ్ఞాన పారగః॥ —౨౬

ఎవ్వని క్రీగంటి చూపనెడి చంద్రుఁడు జ్ఞానమనెడి సముద్రము నుప్పొంగఁజేయునో, సంసారమనెడి చీఁకటిని తొలఁగించునో, ఆ గురుఁడే జ్ఞానమనెడి సముద్రము నావలిగట్టును జేరినవాఁడు.

బహి స్తిమిర విచ్ఛేత్తా భానురేవ ప్రకీర్తితః,
బహిరంత స్తమచ్ఛేదీ విభు ర్దేశిక భాస్కరః॥ —౨౭

సూర్యుఁడు వెలుపలిచీఁకటిని మాత్రమే పోఁగొట్టగలవాఁడు. గురుఁడనెడి సూర్యుఁడు లో వెలి చీఁకటులను బోఁగొట్టును. అనఁగా సర్వవిధములైన అజ్ఞానములను దొలఁగించువాఁ డనుట.

కటాక్ష లేశమాత్రేణ వినా ధ్యానాది కల్పనం,
శివత్వం భావయే ద్యత్ర స వేధః శాంభవో మతః॥ —౨౮

శిష్యుఁడు ధ్యాన ధారణాది సంకల్పముల అక్కఱలేకయే శ్రీ గురుని రవ్వంత కరుణాకటాక్ష మాత్రము చేతనే శివత్వమును భావించునో, ఆ వేధమే (అనఁగా శివతత్త్వరూపమునకు గుఱియైన పరిజ్ఞానము) శాంభవ వేధ మనఁబడును.

శివ వేధ కరే జ్ఞానే దత్తే యేన సునిర్మలే,
జీవన్ముక్తో భవే చ్ఛిష్యః స గురు ర్జ్ఞానసాగరః॥ ౨౯

శివతత్త్వమును స్ఫుటముగాఁ దెల్పగలదియు, మిగుల నిర్మలమును అయిన శివజ్ఞానము ఏ గురునిచే ననుగ్రహింపఁబడగా శిష్యుఁడు జీవన్ముక్తుఁ డగునో అతఁడే శివజ్ఞానసముద్రుఁడు.

## 4. క్రియా లింగ స్థలము

గురో ర్విజ్ఞాన యోగేన క్రియా యత్ర విలీయతే,
తత్క్రియాలింగ మాఖ్యాతం సర్వై రాగమపారగైః॥ ౩౦

జ్ఞానగురుని విశేష జ్ఞానయోగముచేత ఏలింగమందుఁ గ్రియయు లీనమగునో అది క్రియాలింగము. అనఁగా ఇష్టలింగమని యాగమవిదు లందురు.

పరానందం చిదాకారం పరబ్రహ్మైవ కేవలం,
లింగ సద్రూపతాపన్నం లక్ష్యతే విశ్వసిద్ధయే॥ ౩౧

నిత్యానందస్వరూపమును, జ్ఞానస్వరూపము నైన పరబ్రహ్మమే సర్వసిద్ధులొసఁగుటకు సద్రూపముతోఁ గూడిన క్రియా (ఇష్ట) లింగ రూపముతోఁ గానవచ్చును.

లింగమేవ పరం జ్యోతి ర్భవతి బ్రహ్మ కేవలం,
తస్మాత్తత్పూజనా దేవ సర్వకర్మ ఫలోదయః॥ ౩౨

పరంజ్యోతిఃస్వరూపమును, అద్వితీయము నైన పరబ్రహ్మమే క్రియా లింగ మగును. గాన ఆ యిష్టలింగ పూజచేతనే సర్వ సత్కర్మసిద్ధులు గలుగును.

సంత్యజ్య క్రియాః సర్వా లింగపూజైక తత్పరాః,
వర్తంతే యోగినః సర్వే తస్మాల్లింగం విశిష్యతే॥ 33

సనక సనందనాదులైన యోగులెల్లరు తక్కిన యోగముల నన్నింటిని విడిచి ముక్తలింగ పూజయందే నిరతులయిరి. కాన క్రియాలింగము శ్రేష్ఠమైనది.

యజ్ఞాదయః క్రియాః సర్వా లింగపూజాంశ సమ్మితాః,
ఇతి యత్పూజ్యతే సిద్ధై స్తత్క్రియాలింగ ముచ్యతే॥ 34

సర్వవిధ యజ్ఞాదిక్రియలును లింగపూజయొక్క లేశముతో సమానములని యెఱింగిన సిద్ధులచేత ఏ లింగము పూజింపఁబడుచున్నదో అదె క్రియాలింగము. సత్ఫలములను గోరువారు క్రియాలింగమును పూజింపవలయునని శ్రీ భగవత్పాదుల యాశయము.

కిం యజ్ఞై రగ్నిహోత్రాద్యైః కిం తపోభిశ్చ దుస్తరైః,
లింగార్చన రతిర్యస్య స సిద్ధః సర్వకర్మసు॥ 35

క్రియాలింగపూజా నిరతుఁడైనవానికి యజ్ఞములు అగ్నికార్యములు దుస్తరములైన తపస్సులు మున్నగువానితో ప్రయోజనము లేదు. అతఁడు సర్వకర్మసిద్ధుల నొందినవాఁడే.

బ్రహ్మ విష్ణ్వాదయః సర్వే విబుధాః లింగమాశ్రితాః,
సిద్ధాః స్వే స్వే పదే భాన్తి జగత్తంత్రాధికారిణః॥ 36

ప్రపంచ సృష్ట్యాది కార్యములందు అధికారులని వాసిగన్న బ్రహ్మ విష్ణు రుద్రాదులు శివలింగము నాశ్రయించియే తమతమ స్థానములందు వెలయుచున్నారు.

## 5. భావ లింగ స్థలము

క్రియా యథా లయం ప్రాప్తా తథా భావోఽపి లీయతే,
యత్ర తద్దేశికై రుక్తం భావలింగ మితి స్ఫుటమ్॥ 37

పైని చెప్పిన క్రియవలెనే భావముగూడ ఏ లింగమందు లయమగునో ఆ లింగమే భావలింగమని యాచార్యులు స్పష్టముగ ననిరి.

భావేన గృహ్యతే దేవో భగవాన్ పరమః శివః,
కిం తేన క్రియతే తస్య నిత్యపూర్ణో హి స స్మృతః॥ ౩౮

షడ్గుణైశ్వర్యసంపన్నుఁడైన పరమశివుఁడు భావముచేతనే గ్రహింపఁబడును. అట్టి పరమాత్మునకుఁ జేయు బాహ్యపూజచేత నేమి ప్రయోజనము సాధింపఁబడును? ఏలన, అతఁడు నిత్యతృప్తుఁడు గదా!

(షడైశ్వర్య గుణములు:- ఉత్పత్తి, లయము, ప్రాణుల రాకడ, ప్రాణుల పోకడ, విద్య, అవిద్య నెఱుఁగుట.)

అఖండ పరమానంద బోధ రూపః పరః శివః,
భక్తానా ముపచారేణ భావయోగా త్ప్రసీదతి॥ ౩౯

తఱుగులేని పరమానంద జ్ఞానములు స్వరూపముగాఁ గల పరమశివుఁడు మానసికోపచారములచేతను, మనస్సంయోగముచేతను భక్తులకుఁ బ్రసన్నుఁడగును.

మృచ్ఛిలా విహితా ల్లింగా ద్భావలింగం విశిష్యతే,
నిరస్త సర్వదోషత్వాద్ జ్ఞానమార్గ ప్రవేశనాత్॥ ౪౦

మన్ను, ఱాయి, మున్నగువానితోఁ జేయఁబడిన లింగముకంటె మనోలయమునకు హేతువైన ప్రాణలింగమే శ్రేష్ఠము. ఏలన అది పగులుట, విఱుగుట, మున్నగు నే దోషములు లేనిదై జ్ఞానమార్గమందు బ్రవర్తింపఁజేయును.

విహాయ బాహ్య లింగాని చిల్లింగం మనసి స్మరన్,
పూజయే ద్భావపుష్పై ర్యో భావలింగీతి కథ్యతే॥ ౪౧

శిలాదులచేఁ జేయఁబడిన బాహ్యలింగములను విడిచి జ్ఞాన స్వరూప ప్రాణలింగమును మనసున స్మరించుచు, భావపుష్పములతోఁ బూజించునతఁడే భావలింగి యనఁబడును. అనఁగా భావగోచరభూతమైన ప్రాణలింగము గలవాఁడని భావము.

మూలాధారేఽథవా చిత్తే భ్రూమధ్యేవా సునిర్మలం,
దీపాకారం యజ న్లింగం భావద్రవ్యైః స యోగవాన్॥ ౪౨

...లమును తేజోరూపమును అయిన ప్రాణలింగమును మూలాధారమందో, అనాహత మనెడి హృదయకమలమందో ఆజ్ఞ యనెడి భ్రూమధ్యస్థలమందో మానసికోపచారములతోఁ బూజించునతఁడే శివ... యనఁబడును.

స్వానుభూతి ప్రమాణేన జ్యోతిర్లింగేన సంయుతః,
శిలా మృద్దారు సంభూతం న లింగం పూజయ త్యసౌ॥ ४३

తన యనుభవప్రమాణముచేతనే పొందఁదగిన ఆజ్యోతిర్లింగముతోఁ ... కట్టె, రాయి, మన్ను గువానిలో నైన లింగమును ...

క్రియా రూపా తు యా పూజా సా జ్ఞేయా స్వల్ప సంవిదాం,
అంతరా భావపూజా తు శివస్య జ్ఞానినాం మతా॥ ४४

శివపూజా విషయమునఁ గర్మకాండమందుఁ జెప్పఁబడిన క్రియామార్గ పూజ యంతయు అల్పజ్ఞానము గలవారలకే చెప్పఁబడినది. ఆంతరంగిక మైన భావపూజ ప్రాజ్ఞజ్ఞానులకే చెప్పఁబడినది. మహాజ్ఞానులైనవారు ... ధూపదీపాది బాహ్యోపచారములచే నైన పూజ మాని శాంతి దాంతి వివేకాది రూపమైన ఆంతరోపచారములతోఁ బూజింప వలయునని భావము.

## 6. జ్ఞాన లింగ స్థలము

తద్భావ జ్ఞాపకం జ్ఞానం లయం యత్ర సమశ్నుతే,
తజ్జ్ఞాన లింగ మాఖ్యాతం శివ తత్త్వార్థ కోవిదైః॥ ४५

ఆ ప్రాణలింగమును బోధించు జ్ఞానము ఏలింగమందు లయించునో, జ్ఞానమున కాశ్రయమైన యా లింగమే జ్ఞానలింగమని తృప్తిలింగమని శివతత్త్వవేత్త లందురు.

త్రిమూర్తి భేద నిర్ముక్తం త్రిగుణాతీత వైభవం,
బ్రహ్మ యద్బోధ్యతే తత్తు జ్ఞానలింగ ముదాహృతమ్॥ ४६

ఏ పరబ్రహ్మము, బ్రహ్మ విష్ణు రుద్ర రూప మూర్తిత్రయ భేదము లేక సత్త్వ రజస్తమో గుణములను మీఱిన వైభవము గల్గదై తెలియఁబడుచున్నదో అదే జ్ఞానలింగముగాఁ జెప్పఁబడును.

స్థూలే క్రియా సమాపత్తిః సూక్ష్మే భావస్య సంభవః,
స్థూలసూక్ష్మ పదాతీతే జ్ఞాన మేవ పరాత్మని॥ ౪౮

స్థూలమైన యిష్టలింగమందు గంధపుష్పాదులతోడి క్రియారూపమైన పూజ జరుగును. సూక్ష్మమైన ప్రాణలింగమందు నిర్మల భావప్రాప్తి యగును. స్థూల సూక్ష్మముల కతీతమైన జ్ఞాన (తృప్తి) లింగమందుఁ గేవల జ్ఞానప్రాప్తి యగును.

కల్పితాని హి రూపాణి స్థూలాని పరమాత్మనః,
సూక్ష్మాణ్యపి చ తైః కిం వా పరబోధం సమాచరేత్॥ ౪౯

పరమాత్మునకు స్థూలరూపములును సూక్ష్మరూపములును గల్పితములే. వానిచే బ్రయోజనము లేదు. గనుక పరబ్రహ్మరూపమైన జ్ఞానలింగమే సర్వోత్కృష్టమైనదని తెలియవలయును.

పరాత్పరం తు యద్బ్రహ్మ పరమానంద లక్షణం,
శివాఖ్యం జ్ఞాయతే యేన జ్ఞానలింగీ స కథ్యతే॥ ౪౯

పరాత్పరము (ఏది శ్రేష్ఠమైనదన్నను దానికంటె శ్రేష్ఠము) ను, పరమానంద స్వరూపము నైన శివుఁడను పేర వెలయు బ్రహ్మమును దెలిసికొన్నయతఁడే జ్ఞానలింగి యనఁబడును.

బాహ్యక్రియాం పరిత్యజ్య చింతా మపి చ మానసీం,
అఖండ జ్ఞానరూపత్వం యోభవేత్ ముక్త ఏవ సః॥ ౫౦

ఇష్టలింగ సంబంధమైన బాహ్యపూజయును ప్రాణలింగ సంబంధమైన ఆంతరధ్యాన పూజయును వీడి అఖండ జ్ఞాన లింగ స్వరూపము నొందువారే ముక్తులు.

## 7. స్వస్థలము.

తద్భావ జ్ఞాపకం జ్ఞానం యత్ర జ్ఞానే లయం వ్రజేత్,
తద్భావనేష సమాఖ్యాతః స్వాభిధానో మనీషిభిః॥ ౫౧

...జ్ఞానలింగ స్వరూపమును దెలుపు జ్ఞానము ఏజ్ఞాన ... అట్టి జ్ఞానము గలవానినే స్వజంగముఁడని బుధు ...

స్వేచ్ఛాచార సంతుష్టో జ్యోతిర్లింగ పరాయణః,
ఆత్మస్థ సకలాకారః స్వాభిధో మునిసత్తమః॥ ౨

ఈ స్వజంగముఁడు స్వేచ్ఛాచార సంతుష్టుఁడును, తేజో లింగమందే ... గలవాఁడును సర్వప్రపంచమును దనయందే యున్నవాఁడు నైన ... శ్రేష్ఠుఁడు.

... మమకారో నిరస్తక్లేశ పంచకః,
... కాంచనే సమ బుద్ధిశ్చ ముక్తప్రాయో మునిర్భవేత్॥ ౩

... 'నాది' యనుమాట లేనివాఁడును, శరీరాభిమానను ... నవాఁడును, అవిద్యా, అభినవ, అస్మిగత, రాగ, ద్వేషముల నెడి పంచక్లేశములు (... వ పరిచ్ఛేదము - 46 వ శ్లోక వివరణ చూచునది.) ... వాఁడును, భిక్షాశనుడును, మట్టిపెల్లను, బంగారును ... నవాఁడునైన ముని జీవన్ముక్తుఁడగును.

యదృచ్ఛాలాభ సంతుష్టో భస్మనిష్ఠో జితేంద్రియః,
సమవృత్తి స్థవే ద్యోగీ భిక్షుకే వా నృపేఽథవా॥ ౪

తనంతటను తాను లభించినదానితో దనివినొందువాఁడును, మంత్ర ... భస్మధారణ నిష్ఠగలవాఁడును, ఇంద్రియములను జయించిన ... యైన యీ స్వజంగమయోగి బిచ్చగానియెడను రాజునెడను సమబుద్ధి ... యేయుండును.

పశ్యన్ సర్వాణి భూతాని సంసార స్థాని సర్వశః,
స్మయమానః పరానందే లీనాత్మా వర్తతే సుధీః॥ ౫

ఈ యోగి లోకమందలి సర్వభూతములను జూచి వింతతో వినో దించువాఁడై పరమానందమయుమైన మహాలింగమందే లీనాత్ముఁడై యుండును.

ధ్యానం శైవం తథా జ్ఞానం భిక్షా చైకాంత శీలతా,
యతేశ్చత్వారి కర్మాణి న పంచమ మిహేష్యతే॥　　౫౬

ఈ స్వజంగముఁడను యతికి శివజ్ఞానము, శివధ్యానము, భిక్షాన్న వృత్తి, ఏకాంత్య నివాసము అను నాలుగే ఆచరింపఁదగు కర్మములు. అయిదవకర్మ యనునది లేదు.

## 8. చర స్థలము

స్వరూప జ్ఞాన సంపన్నో ధ్వస్తాహం మమతాకృతిః,
స్వయమేవ స్వయం భూత్వా చరతీతి చరాభిధః॥　　౫౭

స్వస్వరూపజ్ఞానము గలవాఁడై, అహంకార మమకారములు లేని వాఁడై తానే తానయి సంచరించును గాన నీతఁడు చరజంగముఁ డనఁబడును.

కామ క్రోధాది నిర్ముక్తః శాంతి దాంతి సమన్వితః,
సమబుద్ధ్యా చరే ద్యోగీ సర్వత్ర శివబుద్ధిమాన్॥　　౫౮

కామ క్రోధ లోభ మోహ మద మాత్సర్యములు లేనివాఁడై అంత రింద్రియ బాహ్యేంద్రియ నిగ్రహము గలవాఁడై సమబుద్ధిగలవాఁడైన చరజంగముఁ డంతటను శివభావము గలవాఁడై సంచరించును.

ఇదం ముఖ్య మిదం హీన మితి చింతా మకల్పయన్,
సర్వత్ర సంచరే ద్యోగీ సర్వం బ్రహ్మేతి భావయన్॥　　౫౯

ఈ శివయోగి ఇది గొప్పది ఇది నీచమైనది అను యోజనము లేక సర్వమును పరశివబ్రహ్మముగా నెంచుచు ఎల్లెడల సంచరించుచుండును.

న సమ్మానేషు సంప్రీతిం నావమానేషు చ వ్యథాం,
కుర్వాణః సంచరే ద్యోగీ సర్వం బ్రహ్మేతి భావయన్॥　　౬౦

ఈ చరజంగమయోగి ఇష్టములయందు ప్రీతియును, అనిష్టములందు దుఃఖమును లేనివాఁడై సర్వోత్కృష్టుఁడైన పరమేశ్వరునందు నిలకడ గలిగి సంచరించును.

అప్రాకృత గుణైః స్వీయైః సర్వం విస్మాపయన్ జనం,
అద్వైత పరమానంద ముదితో దేహవచ్చరేత్॥ ౬౧

శివాద్వైతజ్ఞానముచేఁ గలిగిన మహానందముతో నిత్యతృప్తుఁడైన ఈ శివయోగి తన లోకోత్తరగుణములచే సర్వజనులకును వింతగొల్పుచు దేహధారియైన సామాన్యమనుజునివలెనే సంచరించును.

న ప్రపంచే న దేహే చ న ధర్మే న చ దుష్కృతే,
గతవైషమ్యధీ ర్ధీరో యతి శ్చరతి దేహవత్॥ ౬౨

విధినిషేధములయెడ ( ఆచరింపవలసిన, ఆచరింపరాని పనుల యెడ ) విషమబుద్ధి లేనివాఁడైన ఈ చరజంగముఁడైన యతి ప్రపంచము నెడఁ గాని, తన దేహము నెడఁగాని, పుణ్యకార్యములయెడఁగాని, పాపకార్యములయెడఁగాని ప్రాకృత మనుష్యునివలె ప్రవర్తింపఁడు.

ప్రాకృతైశ్వర్య సంపత్తి పరాఙ్ముఖ మనః స్థితిః,
చిదానంద నిజాత్మస్థో మోదతే మునిపుంగవః॥ ౬౩

ప్రాకృతులైన బ్రహ్మ విష్ణు రుద్రాదుల గొప్పదనమందు విముఖమైన మనోవృత్తిగల యీ యతిశ్రేష్ఠుఁడు చిదానందస్వరూపమందే యుండి మహానందము నొందుచుండును.

## 9. పర స్థలము

స్వయ మేవ స్వయం భూత్వా చరతః స్వస్వరూపతః,
పరం నాస్తీతి బోధస్య పరత్వ మభిధీయతే॥ ౬౪

తాను తానైయె సంచరించు శివయోగికి స్వస్వరూపముకంటె శ్రేష్ఠమైనది లేదనెడి జ్ఞానమే పరలింగ మనఁబడును. అనఁగా స్వస్వరూపజ్ఞానియే పరజంగముఁడని తెలియవలయును.

స్వతంత్రః సర్వకృత్యేషు స్వపరత్వేన భావితః,
తృణీ కుర్వన్ జగజ్జాలం వర్తతే శివయోగిరాట్॥ ౬౫

ఈ శివయోగీశ్వరుఁడు తనను బరలింగస్వరూపముగానే భావించువాఁడును సర్వకార్యములందును స్వతంత్రుఁడు గాన జగజ్జాలమును గడ్డిపోచగాఁజూచి తిరుగుచుండును.

వర్ణాశ్రమ సదాచార మార్గ నిష్ఠా పరాఙ్ముఖః,
సర్వోత్కృష్టం స్వ మాత్మానం పశ్యన్ యోగీ తు మోదతే॥

బ్రాహ్మణాది వర్ణములకును, బ్రహ్మచర్యాద్యాశ్రమములకును సంబంధించిన సదాచారములందైన నిల్కడకు బెడమొగమైన యీ శివయోగిస్వరూపమునే సర్వోత్కృష్టముగాఁ గనువాఁడగుటచేఁ బరమానంద స్వరూపుఁడై యుండును.

ఇట్లనుటచే శివయోగి ప్రాకృతములైన వర్ణాశ్రమాచారములకు దూరుఁడని తెలియవలయునేకాని అప్రాకృతములైన శివధర్మాచారములకు దూరుఁడని తలపరాదు.

ఏలనఁగా, దీనికి ముందు వ్రాయఁబడిన స్థలమైన క్రియాగమ స్థలమందు శ్రీరేణుక భగవత్పాదులు "న యథావిధి లోపః స్యాద్యథా దేవః ప్రసీదతి, యథాఽఽగమః ప్రమాణం స్యాత్తథా కర్మ సమాచరేత్", "జ్ఞానే నాచార యుక్తేన ప్రసీదతి మహేశ్వరః, తస్మాదాచారవాన్ జ్ఞానీ భవే దా దేహపాతనం" మున్నగు శ్లోకములచే విధిలోపము తగదనియు, కర్మముల నాచరింపవలయుననియు, ఆచారముతోఁ గూడిన జ్ఞానముచేతనే పరమేశ్వరుఁడు ప్రసన్నుఁడగుననియు, అక్కారణముచే శరీర మున్నంతదనుక ఆచారయుక్తుఁడు కావలసినదనియు బోధించుటచే ఈ పరస్థలమందున్న ధర్మాచా స్థలమందు "జ్ఞానామృతేన తృప్తోఽపి యోగ ధర్మం న సంత్యజేత్, ఆచారం మహతాం దృష్ట్వా ప్రవర్తంతే హి లౌకికాః" పెద్దల యాచారములను జూచి లౌకికులాచారమందు బ్రవర్తించుటఁ జేసి శివయోగియు జ్ఞానామృతముచే దృప్తుఁడైనను ధర్మమును విడరాదని స్పష్టమగుచుండుటచేత శివ వర్ణాశ్రమ ధర్మములను ఎడపెట్టరాదని తేటపడుచున్నది.

గాన ఈ శ్లోకాభిప్రాయము ప్రాకృతవర్ణాశ్రమాచారముల నెడపెట్టు విషయ మయినదని తెలియవలయును.

విశ్వాతీతం పరం బ్రహ్మ శివాఖ్యం చిత్స్వరూపకం,
తదేవాహ మితి జ్ఞానీ సర్వోత్కృష్టః స ఉచ్యతే॥ ౬౭

శివునకు వేఱు వెలయు పరబ్రహ్మము ప్రపంచాతీతమును జ్ఞాన స్వరూపము నైనది. అట్టి పరశివబ్రహ్మమే నేననెడి తెలివి గలవాఁడే సర్వోత్కృష్టుఁ డనఁబడును.

అచలం ధ్రువ మాత్మాన మనుపశ్య న్నిరంతరం,
నిరస్త విశ్వ విభ్రాంతి ర్జీవన్ముక్తో భవే న్మునిః॥ ౬౮

అచలము (చలనము లేక అంతటను నిండినది కావుననే కదలనిది). ధ్రువమును (నిత్యము, అనఁగా మూఁడుకాలములందును నాశనము లేనిది) అయిన స్వస్వరూపమును ఎల్లప్పుడు చూచు శివయోగి ప్రాపంచిక భ్రాంతి తొలఁగినవాఁడై జీవన్ముక్తుఁడగును. ఇతఁడు ఆహార వ్యవహారములతోఁ గూడినవాఁడైనను మఱి పుట్టువు లేనివాఁడగుటచే జీవన్ముక్తుఁడని భావము.

బ్రహ్మాద్యాః కిం ను కుర్వంతి దేవతాః కర్మమార్గగాః
కర్మాతీత పదస్థస్య స్వయం బ్రహ్మ స్వరూపిణః॥ ౬౯

బ్రహ్మస్వరూపియు పుణ్య పాపాది కర్మాతీతస్థానమం దున్నవాఁడు నైన శివయోగికిఁ గర్మమార్గమందున్న బ్రహ్మాది దేవతలు చేయు మేలేమి? ఏమియు లేదని భావము.

స్వేచ్ఛయా సంచర న్యోగీ విముంచ న్దేహమానితాం,
దర్శనైః స్పర్శనైః సర్వా నజ్ఞానపి విమోచయేత్॥ ౭౦

దేహాభిమానమును విడిచిన శివయోగి స్వేచ్ఛగా సంచరించువాఁడై జ్ఞానహీనులైనవారల నెల్లరను దన చూపుమాత్రము చేతను, తాకుడు మాత్రముచేతను ముక్తులను జేయఁగలడు. "సదా తృప్తిం సమాసాద్య సదాఽఽనందీ భవన్ స్వయం, స్వపాద దర్శనాదేవ భక్తానాం చాన్యదేహినామ్, దత్వా మోక్షం విధీంద్రాది సురసందోహ దుర్లభం, నిరంజన స్సన్ యో లోకే చరేత్ స పరజంగమః" అనెడి శివాగమ వాక్యము చేత నిత్యతృప్తుఁడై, ఆనందస్వరూపుఁడై తన పాదదర్శనమాత్రము చేతనే తన భక్తులకును, తదితరులకును, బ్రహ్మేంద్రాదులకును దుర్లభమైన మోక్షము ననుగ్రహించి లోకమున దానుమాత్రము దేని నంటనివాఁడై సంచరించునతఁడే పరజంగముఁడని తేటపడుచున్నది.

నిత్యే నిర్మల భావనే నిరుపమే నిర్ధూత విశ్వభ్రమే
సత్తానంద చిదాత్మకే పరశివే సామ్యం గతః సంయమీ,
ప్రధ్వస్తాశ్రమ వర్ణ ధర్మ నిగలః స్వచ్ఛంద సంచారవాన్
దేహీ ప్యద్భుత వైభవో విజయతే జీవ న్విముక్తః సుధీః॥ ౭౧

త్రికాలాబాధ్యుఁడును, నిర్మలస్వరూపుడును, సాటిలేనివాఁడును, ప్రపంచభ్రమ లేనివాఁడును, సచ్చిదానందస్వరూపుఁడు నైన పరశివునితో సామ్యమునొందిన శివయోగి ప్రాకృతములైన వర్ణాశ్రమధర్మములనెడి సంకెలలు తొలఁగినవాఁడై, స్వేచ్ఛాసంచారము గలవాఁడై, జీవన్ముక్తుఁడై, తాను దేహధారియైయున్నను ఆశ్చర్యకరమైన మహిమముతోఁ గూడినవాఁడై సర్వోత్కృష్టుఁడై ప్రకాశించును.

ఇది
సిద్ధాంత శిఖామణియందు - లింగస్థలమున
దీక్షా గురుస్థలము మున్నగు 9 స్థలములు గల
పదునైదవ పరిచ్ఛేదము.
శ్రీ శివార్పణము.



ఓం నమః శివాయ
శ్రీ మాత్రే నమః
శ్రీ జగద్గురు పంచాచార్యాః ప్రసీదంతు

# ప దు నా ఱ వ ప రి చ్ఛే ద ము

## మా హే శ్వ ర స్థ ల ము

అగస్త్యమహర్షి యనుచున్నాఁడు :

స్థలానాం నవకం ప్రోక్తం భక్తస్థల సమాశ్రయం,
మాహేశ్వర స్థలే సిద్ధం స్థలభేదం నిరూపయ. ౧

ఓ రేణుకాచార్య! భక్తస్థలమునకుఁ జెందిన 9 స్థలములను వివరించితివి. ఈ మాహేశ్వర స్థలమందలి స్థలభేదములను దెలుపుము. అనఁగా,

శ్రీ రేణుకాచార్యు లనుచున్నారు :

మాహేశ్వర స్థలే సంతి స్థలాని నవ తాపస,
క్రియాగమ స్థలం పూర్వం తతో భావాగమ స్థలమ్॥ ౨

జ్ఞానాగమ స్థలం చాథ సకాయస్థల మీరితం,
తతోఽకాయ స్థలం ప్రోక్తం పరకాయ స్థలం తతః॥ ౩

ధర్మాచార స్థలం చాథ భావాచార స్థలం తతః,
జ్ఞానాచార స్థలం చేతి క్రమా దేషాం భిదోచ్యతే॥ ౪

ఓయీ మహర్షీ ! ఈ మాహేశ్వర స్థలమందు 1. క్రియాగమ స్థలము, 2. భావాగమస్థలము, 3. జ్ఞానాగమస్థలము, 4. సకాయస్థలము, 5. అకాయస్థలము, 6. పరకాయస్థలము, 7. ధర్మాచారస్థలము, 8. భావాచారస్థలము, 9. జ్ఞానాచారస్థలము అను 9 స్థలములు గలవు. వానిని క్రమముగాఁ దెల్పెదను.

## 10. క్రియాగమస్థలము

శివో హి పరమః సాక్షాత్ పూజా తస్య క్రియోచ్యతే,
తత్పరా ఆగమా యస్మా త్తదుక్తోఽయం క్రియాగమః॥ ౫

మున్ను జెప్పిన పరస్థల సంపన్నుఁడైన శివయోగీశ్వరుఁడే ప్రత్యక్ష శివుఁడు. ఆగమములెల్ల శివపూజకైన క్రియాప్రధానములు గాన దీనికే క్రియాగమ స్థలమని పేరు.

ప్రకాశతే యథా నాగ్ని రరణ్యాం మథనం వినా,
క్రియాం వినా తథాంతస్థో న ప్రకాశో భవేచ్ఛివః॥ ౬

అరణి యందు (యాగమునకై రాపిడిచే నగ్నిజనించు కట్టె) రాపిడి చేయక అగ్ని పుట్టదు. అటులే లింగమధ్యస్థుఁడైన శివుఁడు పూజా క్రియలులేక ప్రకాశింపఁడు.

న యథా విధి లోపః స్యా ద్యథా దేవః ప్రసీదతి,
యథాఽఽగమః ప్రమాణం స్యా త్తథా కర్మ సమాచరేత్॥

ఎటులు పూజించిన విధిలోపము కాదో, యెటులు పూజించిన శివుఁడు ప్రసన్నుఁడగునో, ఆగమప్రమాణ మెటులున్నదో, అటులే పూజింప వలయును.

విధిః శ్శివ నియోగోఽయం తస్మా ద్విహిత కర్మణి,
శివారాధన బుద్ధ్యైవ నిరతః స్యా ద్విచక్షణః॥ ౯

ఈ పూజావిధి శివాజ్ఞారూపమైనదిగాన జ్ఞాని శాస్త్రోక్తకర్మములను శివారాధనబుద్ధితోనే చేయవలయును.

గురో రాదేశ మాసాద్య పూజయే త్పరమేశ్వరం,
పూజితే పరమేశానే పూజితాః సర్వదేవతాః॥ ౯

గురుఁ డుపదేశించిన విధముగానే శివలింగమును బూజింపవలయును. శివలింగమును బూజించినచో సర్వదేవతలను బూజించినట్లే యగును.

సదా శివార్చ నోపాయ సామగ్రి వ్యగ్రమానసః,
శివయోగ రతో యోగీ ముచ్యతే నాత్రసంశయః॥ ౧౦

ఎల్లపుడును శివపూజనమునకొఱకైన సామగ్రిని సంపాదించుటందే ఆసక్తిగలవాఁడైన శివయోగనిరతుఁడైన శివయోగి మలమాయాది పాశములనుండి విముక్తుఁడగును. సందియము లేదు.

అంధ పంగువ దన్యోఽన్య సాపేక్షే జ్ఞానకర్మణీ,
ఫలోత్పత్తౌ విరక్తస్తు తస్మా త్తద్వయ మాచరేత్॥ ౧౧

కర్మజ్ఞానములు రెండును కుంటివాఁడును, గ్రుడ్డివాఁడునువలె అన్యోన్యము నపేక్ష కలవి. ఈ యిద్దరును ఒకచోట చేరుకొనవలయునన్న దారిచూపుటకు నడువలేని కుంటివాఁడును, కుంటివానిని మోయుటకు గ్రుడ్డివాడును ఒకరికొకరు సాయపడునట్లే, జ్ఞానకర్మములకు ఒకదానిసాయము రెండవదానికిఁ గావలయును. గాన పరాపరముక్తి యనెడి ఫలము నొందుటకు శివయోగికి జ్ఞానకర్మములు రెండును ఆవశ్యకములే. అనఁగా ఒక్కదానిచే ముక్తిగల్గదని భావము.

గీతాభాష్యమునందును శ్రీశంకర రామానుజాదులు కర్మమిశ్రిత జ్ఞానమే ఫలసాధనమని ప్రతిపాదించిరి. కర్మఫలాపేక్ష వలదనిరి.

[illegible] సిద్ధేఽపి విదుషాం కర్మాఽపి వినియుజ్యతే,
[illegible] హితం తస్మాత్కర్మ న సంత్యజేత్॥ ౧౨

[illegible] జ్ఞానము సిద్ధమైనను నిష్కామకర్మమే చెప్పఁబడ్డది గాన [illegible] గలవారు శివపూజాకర్మములను జేయవలయును.

[illegible] ఏవ సర్వేషా మలంకారాయ కల్పతే,
[illegible] హీనః పురుషో లోకే భవతి నిందితః॥ ౧౩

[illegible] ములవారలకును సదాచారమే అలంకారము. దొడ్డ [illegible] సదాచారములు నడుపనివారు నింద్యులు.

[illegible] యుక్తేన ప్రసీదతి మహేశ్వరః,
తస్మా [illegible] జ్ఞానీ భవే దా దేహపాతనమ్॥ ౧౪

[illegible] సత్కర్మాచరణముతోఁ గూడిన జ్ఞానముచేతనే [illegible] గాన జ్ఞాని యీ స్థూలశరీర మున్నంతదాఁక సత్కర్మ [illegible] యును.

## 11. భావాగమ స్థలము

[illegible] చిహ్నాని విదుషో యాని సంతి విరాగిణః,
[illegible] భావాగమత్వేన వర్తంతే సర్వదేహినామ్॥ ౧౫

వి[illegible]మైన జ్ఞానికి ఏ భావచిహ్నము లుండునో ఆ భావచిహ్నములే [illegible] భావాగమరూపముగా వర్తించును.

[illegible] ఽహ మితి భావో హి శివతాప త్తికారణం,
[illegible] మాత్రం నాచారో భావయుక్తః శివో భవేత్॥ ౧౬

[illegible] నను భావమే శివత్వ మొందుటకు మూలము. కేవల [illegible] ములు గాని కారణము కాదు. గాన శివభావము [illegible] రూపుఁ డగును.

[illegible] పరిచ్ఛేదో ధ్యానం తద్భావకారణం,
తస్మాత్ జ్ఞాతే మహాదేవే ధ్యానయుక్తో భవే త్సుధీః॥ ౧౭

జ్ఞానము యీ వస్తు విట్టిదని దాని స్వరూపమును మాత్రమే నిర్ణయించును. ధ్యానము నిర్ణీతమైన వస్తువు నొందుటకు హేతువగును గాన ధ్యానముచే జ్ఞాని శివుని దెలిసికొని శివస్వరూపుఁ డగును.

అంత ర్బహిశ్చ సర్వత్ర పరిపూర్ణం మహేశ్వరం,
భావయే త్పరమానంద లబ్ధయే పండితోత్తమః॥ ౧౮

వెలుపలను లోపలను నంతట నిండియున్న శివుని పరమానందప్రాప్తి కొఱకు జ్ఞాని ధ్యానింపవలయును.

అర్థ హీనా యథా వాణీ పతి హీనా యథా సతీ,
శ్రుతి హీనా యథా బుద్ధి ర్భావ హీనా తథా క్రియా॥ ౧౯

అర్థములేని మాటయును, భర్తలేని యాడుదియు, వేదసమ్మతము కాని జ్ఞానమును నింద్యములైనటులే ధ్యానశూన్యమైన పూజాది క్రియయు నింద్యమే.

చక్షుర్హీనో యథా రూపం న కించి ద్వీక్షితుం క్షమః,
భావహీన స్తథా యోగీ న శివం ద్రష్టు మీశ్వరః॥ ౨౦

కనులు లేనివాఁడు వస్తురూపమును గ్రహింపలేనటులు భావహీనుఁడైన యోగియు శివుని గానఁలేఁడు. పరమాత్మను గానిపించు సాధనములందెల్ల ధ్యానరూపసాధనమే గొప్పది. గాన శివయోగి ముఖ్యముగా భావపూర్ణుఁడు గావలయునని శ్రీ రేణుక భగవత్పాదుల బోధము.

భావశుద్ధేన మనసా పూజయే త్పరమేశ్వరం,
భావహీనాం న గృహ్ణాతి పూజాం సుమహతీ మపి॥ ౨౧

అందుచే ధ్యానశుద్ధిగల మనసుతోఁ బరమశివుని బూజింపవలయును. ధ్యానశూన్యమైన పూజ యెంత గొప్పదైనను బరమేశ్వరుఁడు గైకొనఁడు.

నైరంతర్యేణ సంపన్నే భావే ధ్యాతుం శివం ప్రతి,
తద్భావో జాయతే యద్వత్ కీటే భ్రమర చింతనాత్॥ ౨౨

తుమ్మెదచే తేఁబడి మంటిపట్టునం దుంచఁబడు పురుగు సదా ఆ తుమ్మెదనే తలంచుచుండుటచేఁ దానును గొన్నాళ్ళకుఁ దుమ్మెదగానే

...కులు, నిరంతరము శివుని ధ్యానించు మనసు శివస్వరూపమే యగును.

...ధ్యానము మహాత్ములచేఁ బ్రయోగింపఁబడినను చింత్యమే. ...ధ్యానములు విజాతీయములు కావు.)

...ంకం నిరాకారం పరబ్రహ్మ శివాభిదం,
...ధ్యాతు మసమర్థోఽపి తద్విభూతిం విభావయేత్॥ ౧౩

...ము లేనిదియు, రూపము లేనిదియు నైన శివుఁడను పరబ్రహ్మ మును ధ్యానింపలేనివాఁడు ఆ పరశివ బ్రహ్మముయొక్క సర్వజ్ఞత్వ, స...త్వ, సర్వవ్యాపకత్వాది వైభవమును సదా ధ్యానించు చుండవలయును.

## 12. జ్ఞానాగమ స్థలము

...స్య జ్ఞాన చిహ్నాని యాని సంతి శరీరిణాం,
...ని జ్ఞానాగమత్వేన ప్రవర్తంతే విముక్తయే॥ ౧౪

...ము సంపన్నుఁడైన శివయోగికి వెలయు జ్ఞానలక్షణములే ...వు ముక్తికొఱకు జ్ఞానాగమ స్వరూపమునఁ బ్రవర్తించును.

...వేన కిం ఫలం పుంసాం కర్మణా వా కిమిష్యతే,
...వకర్మ సమాయుక్తం జ్ఞానమేవ విముక్తిదమ్॥ ౧౫

మానవులకుఁ గేవల ధ్యానమువలనఁగాని, కేవల కర్మవలనఁగాని ప్రయోజనము లేదు. ధ్యానకర్మలతోఁ గూడిన జ్ఞానమే మోక్షప్రదము.

కేవలం కర్మమాత్రేణ జన్మకోటి శతైరపి,
నాత్మనాం జాయతే ముక్తిర్జ్ఞానం ముక్తేర్హి కారణమ్॥ ౧౬

కేవల కర్మముల నాచరించు వారికిఁ గోటి జన్మము లెత్తినను ముక్తి లేదు. కర్మసహిత జ్ఞానమే మోక్షహేతువు.

జ్ఞానహీనం సదాకర్మ పుంసాం సంసార కారణం,
తదేవ జ్ఞానయోగేన సంసార వినివర్తకమ్॥ ౧౭

జ్ఞానము లేని కర్మము జనన మరణ రూప సంసారప్రవృత్తికే హేతువు. జ్ఞానముతోఁ గూడిన యాకర్మమే సంసార నివర్తకమగును.

ఫలం క్రియావతాం పుంసాం స్వర్గాద్యం నశ్వరం యతః,
తస్మాత్ స్థాయి ఫల ప్రాప్త్యై జ్ఞానమేవ సమభ్యసేత్॥ ౨౮

కేవల కర్మాచరణ ఫలముగాఁ గలుగు స్వర్గాదులు నేఁడుండి రేపు లేనివే గాన శాశ్వత ఫలావాప్తికై కర్మసహిత జ్ఞానమునే యలవరచు కొనవలయును.

శాస్త్రాభ్యాసాది యత్నేన సద్గురో రుపదేశతః,
జ్ఞానమేవ సమభ్యస్యేత్ కి మన్యేన ప్రయోజనమ్॥ ౨౯

సుప్రసిద్ధమైన వీరశైవ శాస్త్రాభ్యాసము చేతను, సద్గురూపదేశము చేతను, జ్ఞానమునే ప్రధానముగా నభ్యసింపవలయును. తక్క జ్ఞాన హీన కర్మాదులవలనఁ బ్రయోజనము లేదు.

జ్ఞానం పరశివాద్వైత పరిపాక వినిశ్చయః,
యేన సంసార సంబంధ వినివృత్తిర్భవేత్సతామ్॥ 30

శివతత్త్వమును మీఁఱిన తత్త్వమే లేదు. సమస్త చరాచరమును బరశివుఁడు దక్క వేఱొండు కాదనెడి మనఃపరిపాకమే జ్ఞానము. అట్టి జ్ఞానముచేతనే సజ్జనులకు మోక్షము గలుగును.

శివాత్మక మిదం సర్వం శివా దన్య న్న విద్యతే,
శివోఽహమితి యా బుద్ధి స్తదేవ జ్ఞాన ముత్తమమ్॥ 3౧

సర్వసృష్టియు శివ పరబ్రహ్మ స్వరూపమే యై యున్నది. శివునకు వేఱుగా నేదియు లేదు. గాన “శివుఁడే నే”ననెడి నిశ్చయబుద్ధియే శ్రేష్ఠమైన జ్ఞానము.

అంధో యథా పురః స్థాని వస్తూని న హి పశ్యతి,
జ్ఞాన హీన స్తథా దేహీ నాత్మస్థం వీక్షతే శివమ్॥ 3౨

గ్రుడ్డివాఁడు తన యెదుటనున్న వస్తువులను జూడఁజాలనటులే జ్ఞాన హీనుఁడు తనయందే యున్న శివునిఁ గానలేఁడు.

శివస్య దర్శనాత్పుంసాం జన్మరోగ నివర్తనం,
శివదర్శన మప్యాహుః సులభం జ్ఞాన చక్షుషామ్॥ 33

తనయందు శివునిఁగాంచుటే మానవునకు జన్మరోగమును గుదుర్చు మందు. జ్ఞానమనెడి కన్ను గలవారల కా శివదర్శనము శ్రమలేకయే కలుగును.

దీపం వినా యథా గేహే నాంధకారో నివర్తతే,
జ్ఞానం వినా తథా చిత్తే మోహోఽపి న నివర్తతే॥ 34

దీపము లేక యింటఁ జీకటి యెట్లు తొలఁగదో, అటులే జ్ఞానమే లేకున్నచో మనసునంటిన యజ్ఞానము తొలఁగదు. దీపపు వెలుగు లేకుండుటే చీఁకటి. జ్ఞానము లేకుండుటే యజ్ఞానము.

## 13. సకాయ స్థలము

పరస్య యా తనుర్జ్ఞేయా ఽదేహ కర్మాభిమానినః,
తయా సకాయో లోకోఽయం తదాత్మత్వ నిరూపణాత్॥

దేహాభిమానమును కర్మాభిమానమును లేక పరుఁడనఁబడు శివయోగియొక్క యే శరీరము లోకులకుఁ దెలియఁదగినదో అట్టి శరీరమున కా శివయోగియే ఆత్మఁగాఁ జెప్పఁబడుటచేత ఆ శరీరముతోనే అతఁడు సకాయుఁ డనఁబడును.

కాయం వినా సమస్తానాం న క్రియా న చ భావనా,
న జ్ఞానం యత్తతో యోగీ కాయవానేవ సంచరేత్॥ 35

శరీరము లేక యే క్రియయు జరుగదు. ధ్యానమును అసంభవమే. జ్ఞానమును సంభవింపదు. గాన శివయోగి శరీరము గలవాఁడయియే యుండవలయును.

శివైక్య జ్ఞాన యుక్తస్య యోగినోఽపి మహాత్మనః,
కాయ యోగేన సిద్ధ్యన్తి భోగ మోక్షాదయః సదా॥ 36

శివాద్వైతజ్ఞాన యుక్తుఁడును మహాత్ముఁడును అయిన శివయోగికిని భోగమోక్షాదు లీ శరీరసంబంధముతోనే సిద్ధించును. ("శరీర మాద్యం ఖలు ధర్మ సాధనమ్").

కాష్ఠం వినా యథా వహ్ని ర్జాయతే న ప్రకాశవాన్,
మూర్తిం వినా తథా యోగీ నాత్మతత్త్వ ప్రకాశవాన్॥ ౩౮

కట్టె సంబంధము లేక అగ్నియు నెట్లు ప్రకాశింపదో, అటులే శరీరము లేక శివయోగియు ఆత్మతత్త్వప్రకాశము గలవాఁడు కాలేఁడు.

మూర్త్యాత్మ నైవ దేవస్య యథా పూజ్యత్వ కల్పనా,
తథా దేహాత్మ నైవాస్య పూజ్యత్వం పరయోగినః॥ ౩౯

పరమేశ్వరునకును మూర్తి స్వరూపముచేతనే పూజ్యత గలుగుచున్నది. అట్లే శివయోగికిని శరీరాకారముచేతనే పూజ్యత గలుగును.

నిష్కలో హి మహాదేవః పరిపూర్ణః సదాశివః,
జగత్సృష్ట్యాది సంసిద్ధ్యై మూర్తిమా నేవ భాసతే॥ ౪౦

నిష్కలుఁడును, పరిపూర్ణుఁడును, దేవదేవుఁడు నైన పరమేశ్వరుఁడును ఈ జగత్తును సృష్టించుకొఱకు ఆకారసహితుఁడే యగుచున్నాఁడు.

బ్రహ్మాద్యా దేవతాః సర్వా మునయోఽపి ముముక్షవః,
కాయవంతో హి కుర్వంతి తపః సర్వార్థ సాధకమ్॥ ౪౧

బ్రహ్మాది దేవతలును, మోక్షార్థులైన మునులును శరీరమును ధరించియే సర్వార్థసాధనమైన తపస్సు చేయుచున్నారు.

తపో హి మూలం సర్వాసాం సిద్ధీనాం య జ్జగత్త్రయే,
తపస్తత్కాయ మూలం హి తస్మాత్కాయం న సంత్యజేత్॥

ముల్లోకములందును నెట్టి సిద్ధి కావలసినను తపస్సే కారణము. గాన ఆ తపస్సు శరీరముతోనే సాధింపదగినది గావునను శివయోగియు శరీరముతోడనే సర్వసిద్ధులను బొందవలయునని భావము.

## 14. అకాయ స్థలము

ఔపచారిక దేహిత్వా జ్జగదాత్మత్వ భావనాత్,
మాయయా సంబంధ రాహిత్యా దకాయో హి పరః స్మృతః॥ ౪౩

శివయోగి సేవాసాధన భూతమైన శరీరము గలవాఁడగుటచేతను, సర్వ ప్రపంచమును స్వస్వరూపముగా భావించువాఁ డగుటచేతను

కామాద్యాసంబంధము లేనివాఁడగుటచేతను అకాయుఁ డనఁబడును.

> యస్య దేహ యోగేఽపి న దేహాశ్రయ విక్రియా,
> శివస్యేవ యత స్తస్మా దకాయోఽయం ప్రకీర్తితః॥ ౪౪

శివునకు దేహముతో సంబంధమున్నను దేహమువల్ల నగు కామ క్రోధాది వికారములు లేనటులే, శివయోగికిని శరీరసంబంధ మున్నను కామాది వికారములు గలుగనందున అకాయుఁ డనఁబడును.

> పరలింగే విలీనస్య పరమానంద చిన్మయే,
> కుతో దేహేన సంబంధో దేహేవ ద్భాసనం భ్రమః॥ ౪౫

పరమానందమును, జ్ఞానమును స్వరూపముగాఁగల శివలింగమందు లీనుఁడైనవానికి శరీర సంబంధ మెక్కడిది ? చూచువారికి శరీరధారివలె తోఁచుట భ్రాంతియే.

> దేహాభిమాన హీనస్య శివభావే స్థిరాత్మనః,
> జగదేత చ్ఛరీరం స్యా ద్దేహేనైకేన కా వ్యథా॥ ౪౬

శరీరాభిమానము లేనివాఁడును, శివస్వరూపమందే స్వస్వరూపము స్థిరపడినవాఁడును నైన శివయోగికి ఈ జగత్తే శరీరమగుచున్నది. అట్టి మహాత్మునకుఁ దన శరీరముచే దుఃఖమెప్పుడును గలుగదు.

> శివజ్ఞానైక నిష్ఠస్య నాహంకార భవో భ్రమః,
> నేంద్రియ భవం దుఃఖం త్యక్తదేహాభి మానినః॥ ౪౭

శివోఽహ' మనెడి యుత్కృష్టజ్ఞానము స్థిరపడినవాఁడును, శరీరాభిమానము పూర్తిగా తొలఁగినవాఁడునైన శివయోగికి అహంకారముచేఁ గలుగు భ్రమయుకాని ఇంద్రియములచేనగు దుఃఖముగాని, యుండదు.

> న మనుష్యో న దేవోఽహం న యక్షో నైవ రాక్షసః,
> శివోఽహ మితియో బుద్ధ్యా త్తస్య కిం దేహకర్మణా॥ ౪౮

నేను మనుజుఁడను గాను, దేవతను గాను, రాక్షసుఁడను గాను, యక్షుఁడను గాను, కేవల శివుఁడనే యను జ్ఞానము కుదిరినవానికి శరీర సంబంధమైన కర్మచే నేమి ప్రయోజనము ?

## 15. పరకాయ స్థలము

వశీకృతత్వాత్ప్రకృతే ర్మాయా మార్గాతి వర్తనాత్,
పరకాయోఽయ మాఖ్యాతః సత్యజ్ఞాన సుఖాత్మకః॥ ౪౯

అకాయుఁడైన యీశివయోగి ప్రకృతిని వశపఱచుకొన్నవాఁడగుట చేతను, అవిద్యామార్గమును మీఱి ప్రవర్తించువాఁ డగుటచేతను, సచ్చిదానందస్వరూపుఁ డగుటచేతను పరకాయుఁ డనఁబడును.

పరబ్రహ్మ వపుర్యస్య ప్రబోధానంద భాసురం,
ప్రాకృతేన కి మేతేన శరీరేణాస్య జాయతే॥ ౫౦

జ్ఞానానందస్వరూపమై ప్రకాశించు పరశివబ్రహ్మమే పరకాయునకు శరీరమైయుండగా శివయోగికి ప్రాకృతశరీరముతో నేమిప్రయోజనము?

సమ్యక్ జ్ఞానాగ్ని సందగ్ధ జన్మబీజ కలేబరః,
శివ తత్త్వావలంబీ యః పరకాయః స ఉచ్యతే॥ ౫౧

లెస్సయైన పరశివజ్ఞానమనెడి యగ్గిచేత జన్మబీజరూపమైన శరీరమును గాల్చివేసి, శివస్వరూపతత్త్వమునే యూతగొన్న యా శివయోగియే పరకాయుఁ డనఁబడును.

ఇంద్రియాణి మనోవృత్తి ర్వాసనాః కర్మసంభవాః,
యత్ర యాంతి లయం తేన సకాయోఽయం పరాత్మనా॥ ౫౨

కర్మములవల్ల గలిఁగిన వాసనలు (సంస్కారములు) ఇంద్రియకార్యములును, మానసికవ్యాపారములును దేనియందు దణఁగిపోవునో ఆ పరబ్రహ్మమే యీ పరకాయునకు శరీరముగా నున్నది. అనఁగా బ్రహ్మభూతుఁ డనుట.

పర్యాహంతా మనుప్రాప్య పశ్యేద్విశ్వం చిదాత్మకం,
న దేహీతి భ్రమ స్తస్య నిశ్చితాహి శివాత్మనా॥ ౫౩

"అహం బ్రహ్మాస్మి" యనెడి యనుభవజ్ఞానము గలిగి విశ్వసృష్టిని జ్ఞానస్వరూపబ్రహ్మమయముగా నేచూచు నాతనికి నేను శరీరముగలవాఁడ ననెడి భ్రాంతియే యుండదు. ఏలన నేను పరశివబ్రహ్మస్వరూపుఁడనే యనుట స్థిరపడియున్నది.

స్వస్వరూపం శివాకారం జ్యోతి స్సాక్షా ద్విచింతయన్,
దేహవా నపి నిర్దేహో జీవన్ముక్తో హి సాధకః॥ ౧౪

స్వస్వరూపమును ప్రత్యక్షు శివస్వరూపమైన జ్యోతిగా భావించు శివ సాధకుడు దేహముతో నున్నను జీవన్ముక్తుం డనంబడును.

దేహే తిష్ఠతు వా యాతు యోగినః స్వాత్మబోధినః,
జీవన్ముక్తి స్థ్సి వేత్సద్య శ్చిదానంద ప్రకాశినీ॥ ౧౫

స్వస్వరూప జ్ఞానముగల శివయోగికి దేహమున్నను పోయినను తత్క్షణమందే యతనికి జ్ఞానానందప్రకాశముగల జీవన్ముక్తి లభించును.

ఆత్మజ్ఞానావసానం హి సంసార పరిపీడనం,
సూర్యోదయేఽపి కిం లోక స్తిమిరేణోప రుధ్యతే॥ ౧౬

ప్రొద్దుపొడిచినంతనే లోకమునకు జీకటిబాధ యెట్లుండదో, అటులే ఆత్మజ్ఞానము కలిగినంతనే సంసారబాధ మఱి యుండదుగదా?

దేహాభిమాన నిర్ముక్తః కాలాతీత పదాశ్రయః,
నేదం యాతి పరిచ్ఛేదం శరీరేషు మహాబుధః॥ ౧౭

దేహాభిమానము లేనివాఁడును, కాలాతీతుఁడైన పరమాత్మపదము నాశ్రయించినవాఁడును అయిన పరకాయుఁడు ఇది నా శరీరము, ఇది నాది కాదు అను భేదభావము నొందఁడు. అనఁగా సర్వశరీరములను స్వస్వరూపములుగానే భావించును.

## 16. ధర్మాచార స్థలము.

ఈదృశస్యైవ పరకాయస్య ధర్మాచారో య ఇష్యతే,
స ధర్మః సర్వలోకానా ముపకారాయ కల్పతే॥ ౧

ఈలాటి లక్షణములు గల పరకాయుఁడగు శివయోగికిఁ జెప్పఁబడిన ధర్మము సర్వజనుల యుపకారమునకే యగును.

అహింసా సత్య మస్తేయం బ్రహ్మచర్యం దయాక్షమా,
దానం పూజా జపో ధ్యాన మితి ధర్మస్య సంగ్రహః॥ ౨

మనోవాక్కాయములచే హింస చేయకుండుట, సత్యవాక్యము. దయ, ఓరిమి, ఈవి, శివపూజ, శివపంచాక్షర మహామంత్ర జపము, శివధ్యానము నను నవియే ధర్మములు.

శివేన విహితో యస్మా దాగమై ర్ధర్మ సంగ్రహః,
తస్మా త్తమాచరన్ విద్వాన్ తత్ప్రసాదాయ కల్పతే॥　౬౦

ఈ ధర్మసంగ్రహము శివునిచేతనే ఆగమములందుఁ జెప్పఁబడినది. గాన ఇట్టి ధర్మముల నాచరించు జ్ఞాని శివానుగ్రహ పాత్రుఁడగును.

అధర్మం న స్పృశేత్కించి ద్విహితం ధర్మమాచరేత్,
తం చ కామ వినిర్ముక్తం త మపి జ్ఞాన పూర్వకమ్॥　౬౧

అధర్మము నాచరింపరాదు. ఆగమోక్తమైన అహింసాది ధర్మముల నాచరింపవలయును. అదియు ఫలాపేక్షలేకయు జ్ఞానముతో గూడియు నుండవలయును.

ఆత్మవత్ సర్వభూతాని సంపశ్యే ద్యోగవిత్తమః,
జగదేకాత్మతా భావా న్నిగ్రహాది విరోధతః॥　౬౨

శివయోగి సర్వప్రపంచమును ఏకాత్మ స్వరూపముగాఁ గనుచు, నిగ్రహాదుల కవకాశ మీయక సర్వప్రాణులను దననువలెనే కన వలయును.

ఏక ఏవ శివః సాక్షా జ్జగదేత దితి స్ఫుటం,
పశ్యతః కిం నజాయేత మమకారో హి విభ్రమః॥　౬౩

ఒక్క శివుఁడే ప్రత్యక్షముగా నున్న యీ జగత్తని రూఢిగాఁ దెలియువానికి సర్వము సిద్ధించును. ఈ జగత్తునందు మమకారమే కేవల భ్రమము గదా?

ధర్మ ఏవ సమస్తానాం యతః సంసిద్ధి కారణం,
నిఃస్పృహోఽపి మహాయోగీ ధర్మమార్గం హి న త్యజేత్॥　౬౪

ధర్మమే యెల్లరకు భోగమోక్షప్రాప్తిహేతు వగుటవలన శివయోగి తా నెందును గోరికలేని వాఁడైనను ధర్మమార్గమును విడువరాదు.

జ్ఞానామృతేన తృప్తోఽపి యోగీ ధర్మం న సంత్యజేత్,
ఆచారం మహతాం దృష్ట్వా ప్రవర్తంతే హి లౌకికాః॥ ౬౫

పెద్దవారి యాచారములనుబట్టి లోకులు ప్రవర్తింతురు. శివయోగి జ్ఞానామృతముచేతఁ దనిసినను, ధర్మమును లోకసంగ్రహార్థమై విడువక యాచరింపవలయును.

సదాచార ప్రియః శంభుః సదాచారేణ పూజ్యతే.
సదాచారం వినా తస్య ప్రసాదో నైవ జాయతే॥ ౬౬

శివుఁడు సదాచారప్రియుఁడు. సదాచారముచేత బూజింపఁబడును. సదాచారము లేక శివు ననుగ్రహము గలుగదు.

## 17. భావాచార స్థలము

భావ ఏవాస్య సర్వేషాం భావాచారః ప్రకీర్తితః,
భావో మానస చేష్టాత్మా పరిపూర్ణః శివాశ్రయః॥ ౬౭

పైఁ జెప్పిన ధర్మాచారములన్నిఁ శివయోగిచేయు శివభావనయే భావాచార మనఁబడును. ఈ భావము మనోవ్యాపార స్వరూపము. ఇది కలిమిలేనిదై శివునిగూర్చినదే యయియుండవలయును.

భావనా విహితం కర్మ పావనాదపి పావనం,
తస్మా ద్భావనయా యుక్తం పరధర్మం సమాచరేత్॥ ౬౮

భావముతోఁ గూడిన కర్మమే (శివ పూజాదికము) పరమ పవిత్రము. కావున ధర్మాచారము లన్నిటిని భావనతోనే చేయవలయును.

భావనే హి మనః శుద్ధి ర్భావాత్ సిద్ధిశ్చ కర్మణాం,
ఇతి సంచింత్య మనసా యోగీ భావం న సంత్యజేత్॥ ౬౯

భావముతోనే మనశ్శుద్ధి యగును. భావముచేతనే సర్వకర్మములు సిద్ధించును అని తెలిసి యోగి భావమును వీడరాదు.

శివ భావనయా సర్వం నిత్య నైమిత్తికాదికం,
కుర్వన్నపి మహాయోగీ గుణదోషై ర్న బాధ్యతే॥ ౭౦

తాను జేయవలసిన నిత్యనైమిత్తికాది కర్మముల నన్నిటిని శివభావనతోనే చేయు శివయోగిని గుణదోషము లెవ్వియు బాధింపలేవు.

అంతః ప్రకాశ మానస్య సంవి త్సూర్యస్య సంతతం,
భావేన యదుపస్థానం తత్సంధ్యావందనం విదుః॥ ౭౧

హృదయకమలమందుఁ బ్రకాశించు జ్ఞానస్వరూపుఁడైన సూర్యుని ఎల్లప్పుడు భావముతో నారాధించుటయే సంధ్యావందన మందురు.

ఆత్మ జ్యోతిషి సర్వేషాం విషయాణాం సమర్పణం,
అంతర్ముఖేన భావేన హోమ కర్మేతి గీయతే॥ ౭౨

అంతర్ముఖమైన మనస్సుతో ఇంద్రియాదులవంక నిక్షేపములేని భావము ఆత్మయ నెడియగ్నియందు సర్వేంద్రియకార్యముల నెడి సమిధల నర్పించుటే హోమకర్మము. అనఁగా తన భావమును విషయదూరముగాను ఆత్మపరముగాను జేయవలయును.

భావయే త్సర్వకర్మాణి నిత్య నైమిత్తికాని చ,
శివప్రీతికరా ణ్యేవ సంగరాహిత్య సిద్ధయే॥ ౭౩

సంసారబంధ నివృత్తికై నిత్య నైమిత్తికములైన కర్మముల నన్నిటిని శివప్రీతికరముగానే జేయవలయును.

శివే నివేశ్య సకలం కార్యాకార్యం వివేకతః,
వర్తతే యో మహాభాగః స సంగరహితో భవేత్॥ ౭౪

కార్యాకార్యములను జక్కఁగా వివేకించి శివునందే సమర్పణము చేయు మహాత్ముఁడే సంసారబంధమునుండి తొలఁగినవాఁడగును.

ఆత్మాన మఖిలం వస్తు శివమానంద చిన్మయం,
ఏకీభావేన సతతం సంపశ్య న్నేవ పశ్యతి॥ ౭౫

సమస్త వస్తువులను జ్ఞానానంద స్వరూపుఁడైన శివుని సదా యేకభావముతోఁ గనువాఁడే శివునిఁ గనఁగలుగును. అనఁగా సర్వము శివస్వరూపముగాఁ గనువాఁడు శివస్వరూపుఁడే యగును.

## 18. జ్ఞానాచార స్థలము

అస్య జ్ఞాన సమాచారో యోగినః సర్వదేహినాం,
[illegible] యదుక్తో౽యం జ్ఞానాచారః స కథ్యతే॥ ౭౬

[illegible] సంపన్నుఁడైన శివయోగియొక్క జ్ఞానసహితమైన ఆచా[illegible] [illegible] వర్తించుకొనుట జ్ఞానాచారమని చెప్పఁబడును.

[illegible] ప్రాప్తం మహాజ్ఞానం పరతత్త్వ ప్రకాశకం,
[illegible] ప్రవృత్తో యో జ్ఞానాచారః స ఉచ్యతే॥ ౭౭

[illegible] తత్త్వమును దెలుపునదియై పరిపూర్ణమైన శివాద్వైతజ్ఞానము [illegible] ప్రవర్తించునది జ్ఞానాచార మనఁబడును.

[illegible] కల్పే పరే ధామ్ని నిష్కలే శివనామని,
జ్ఞానేన యోజయన్ సర్వం జ్ఞానాచారీ ప్రకీర్తితః॥ ౭౮

[illegible] కల్పుఁడును, నిష్కలుఁడును అయిన శివుఁడను పేరుగల పర[illegible] మందు సర్వమును అభేదవృత్తితో జ్ఞానముతో యోజించు [illegible] జ్ఞానాచారి యనఁబడును.

[illegible] జ్ఞానాగ్నినా దగ్ధం న ప్రరోహే త్కథంచన,
[illegible] సంసృతే ర్మూలం ప్రవాహానుగతం బుధాః॥ ౭౯

[illegible] ప్రవాహరూపమైన యే కర్మమును సంసార[illegible] కారణముగాఁ జెప్పుచున్నారో ఆ కర్మము జ్ఞానమనెడి యగ్నిచేఁ [illegible] వేఁచిన విత్తనమువలె మఱి మొలకెత్తదు. అనఁగా కర్మ[illegible] ఫలము జ్ఞాని నంటదు.

జ్ఞానేన హీనః పురుషః కర్మణా బధ్యతే సదా,
జ్ఞానినః కర్మ సంకల్పా భవంతి కిల నిష్ఫలాః॥ ౮౦

శివజ్ఞానము లేనివానిని కర్మములు బంధింపకమానవు. జ్ఞానుల కర్మ సంకల్పములు ఫలప్రదములును గావు.

జ్ఞానం ముక్తిప్రదం ప్రాప్య గురు దృష్టి ప్రసాదతః,
కః కుర్యా త్కర్మ కార్పణ్యే వాంఛాం సంసారవర్ధనే॥ ౮౧

గురు కరుణానుగ్రహములచే మోక్షప్రదమగు జ్ఞానము నొందినవాఁడెవ్వఁడును సంసారబంధకమగు కర్మాచరణమును గోరఁడు.

శివాద్వైత పరం జ్ఞానం జ్ఞాన మిత్యుచ్యతే బుధైః,
సిద్ధేన వా ప్యసిద్ధేన ఫలం జ్ఞానాంతరేణ కిమ్॥ ౧౨

సర్వము శివునికంటె వేఱు కాదను జ్ఞానమే నిజమైన జ్ఞానము. శివజ్ఞానముకాని జ్ఞానము శాస్త్రసిద్ధమైనను గాకున్నను నిష్ఫలమని బుధులందురు.

నిర్మలం హి శివజ్ఞానం నిశ్శ్రేయసకరం పరం,
రాగద్వేషాది కలుషం భూయః సంసృతి కారణమ్॥ ౧౩

నిర్మల శివజ్ఞానమే మోక్షప్రదము, శ్రేష్ఠము. తదితరమైన జ్ఞానము రాగద్వేషాదులచేఁ జెడినదిగాన మఱల సంసారకారణమే యగును.

శుద్ధాచారః శుద్ధభావో వివేకీ
జ్యోతిః పశ్యన్ సర్వతః శైవమేకమ్,
జ్ఞాన ధ్వస్త ప్రాకృతాత్మ ప్రపంచో
జీవన్ముక్త శ్చేష్టతే దివ్యయోగీ॥ ౧౪

శుద్ధాచారము గలవాఁడును, జ్ఞానియు, అంతటను సర్వోత్కృష్టమై ప్రకాశించు శివతేజమునే గనువాఁడును, శివాద్వైతజ్ఞానమనెడి అగ్నిచేత ప్రకృతిజన్యమైన దేహప్రపంచమును నశింపఁజేసినవాఁడును అయిన శివయోగి జనసామాన్యముగా సంచరించుచున్నను జీవన్ముక్తుఁడే.

ఇది

సిద్ధాంత శిఖామణి యందలి – లింగస్థలీయ మాహేశ్వరస్థలమున
క్రియాగమమాదిగా 9 స్థలములు గల
పదునాఅవ పరిచ్ఛేదము.


శ్రీ శివార్పణము.

—♦—

ఓం నమః శివాయ

శ్రీ మాత్రే నమః

శ్రీ జగద్గురు పంచాచార్యాః ప్రసీదంతు

# పదునేడవ పరిచ్ఛేదము

## ప్రసాది స్థలము

[illegible] స్త్యమహర్షి యనుచున్నాడు :

[illegible] చోక్తాని యాని మాహేశ్వర స్థలే,
[illegible] స్థల భేదం మే ప్రసాదిస్థల సంశ్రితమ్॥ ౧

[illegible] చార్యేంద్రా! మాహేశ్వరస్థలమందలి స్థలముల నన్నిటిని [illegible] ప్రసాదిస్థలమందలి స్థలభేదములను నాకుఁ దెలుపుము.

[illegible] చార్యు లిట్లనుచున్నారు :

[illegible] ప్రోక్తాః ప్రసాదిస్థల సంశ్రితాః,
[illegible] నుగ్రహాణాం పూర్వ మింద్రియానుగ్రహ స్తతః॥ ౨

[illegible] నుగ్రహాణాం పశ్చా త్తతః కాయార్పణం మతం,
[illegible] మాఖ్యాతం తతో భావార్పణం మతమ్॥ 3

[illegible] తతః ప్రోక్తం శుశ్రూషు స్థల మేవ చ,
తతః [illegible]వ్యస్థలం చైషాం క్రమశః శృణు లక్షణమ్॥ ౪

[illegible] స్త్యమహర్షీ! ఈ ప్రసాది స్థలమందు 1. కాయానుగ్రహ [illegible]లము, [illegible] ద్రియానుగ్రహ స్థలము, 3. ప్రాణానుగ్రహ స్థలము, [illegible] ర్పణస్థలము, 5. కరణార్పణస్థలము, 6. భావార్పణస్థలము, [illegible] ష్యస్థలము, 8. శుశ్రూషుస్థలము, 9. సేవ్యస్థలము అని 9 స్థల [illegible] సగా వాని లక్షణములను వినుము.

### 19. కాయానుగ్రహ స్థలము

[illegible] యల్లోకాన్ స్వకాయం దర్శయ న్నసౌ,
[illegible] వ సమాఖ్యాతః కాయానుగ్రహ నామకః॥ ౫

జ్ఞానాచారసంపన్నుఁడైన శివయోగి తన శరీరమును లోకమునకుఁ జూపుచు ప్రాకృతజనుల ననుగ్రహించుటచేత నితఁడు కాయానుగ్రహుఁ డనఁబడును. ఇది కాయానుగ్రహస్థలము.

యథా శివోఽనుగృహ్ణాతి మూర్తిమావిశ్య దేహినః,
తథా యోగీ శరీరస్థః సర్వానుగ్రాహకో భవేత్॥ ౬

శివుఁడు నానావిధములైన ఉపాధులందుఁ బ్రవేశించి దేహధారుల నెట్లనుగ్రహించుచున్నాఁడో, అటులే శివయోగియు శరీరధారియై మానవుల ననుగ్రహించును.

శివః శరీర యోగేఽపి యథా సంగవివర్జితః,
తథా యోగీ శరీరస్థో నిస్సంగో వర్తతే సదా॥ ౭

శివుఁడు శరీరసంబంధము గలిగియున్నను సర్వసంగదూరుఁడై యెటు లున్నాఁడో అటులే శివయోగియు శరీరధారియైనను ఎల్లపుడును సుఖదుఃఖాదులతోఁ దగులములేకయే యుండును.

శివ భావనయా యుక్తః స్థిరయా నిర్వికల్పయా,
శివో భవతి నిర్ధూత మాయావేశ పరిప్లవః॥ ౮

ఏ మార్పును లేని దృఢమైన శివోఽహం భావనతోఁ గూడిన శివయోగి, మాయావరణముచేఁ గలుగు నెట్టి యుపద్రవములును లేనివాఁడై ప్రత్యక్షశివుఁడే యగుచున్నాఁడు.

గళితాహంకృతి గ్రంథిః క్రీడాకల్పిత విగ్రహః,
జీవన్ముక్త శ్చరే ద్యోగీ దేహీవ న్నిరుపాధికః। ౯

శరీరము మున్నగు వానియందైన అభిమానమనెడి ముడి విడినవాఁడును, లీలకొఱకు దేహముఁ దాల్చినవాఁడును, పాపఫల రూపమైన యెట్టి ప్రతిబంధమును లేనివాఁడును అయిన శివయోగి జీవన్ముక్తుఁడై మనుజసామాన్యుఁడు వలనే సంచరించును.

## 20. ఇంద్రియానుగ్రహ స్థలము.

ధర్మినా త్పరకాయస్య కరణానాం వివేకతః,
ఇంద్రియానుగ్రహః ప్రోక్తః సర్వేషాం తత్త్వవేదిభిః॥ ౧౦

[illegible] నను శివయోగియొక్క దర్శనమువలనను, ఇంద్రియముల [illegible] వలనను. సమస్తజీవులకును ఇంద్రియానుగ్రహము [illegible] తత్త్వవేత్త లితనిని ఇంద్రియానుగ్రహుం డందురు. [illegible] స్థల మిది.

[illegible] సమస్తానాం స్వార్థేషు సతి సంగమే,
[illegible] తే ద్వేష స్తౌ యోగీ పరి వర్జయేత్ ॥ ౧౧

[illegible] ములకు విషయములైన శ్రవణాదులందు [illegible] మో ద్వేషమో కలుగకమానదు. గాన [illegible] ములను విడువవలయును.

[illegible] ప్రపంచస్య ప్రకాశినీ,
[illegible] సమావేశో నిష్ప్రపంచస్య కారణమ్॥ ౧౨

[illegible] ప్రవర్తించెనేని దుఃఖరూప ప్రపంచ [illegible] ఈ ఇంద్రియవ్యాపారమే అంతర్ముఖమై [illegible] మోక్షహేతు వగును.

[illegible] శివం పశ్యన్ కేవలే నైవ చేతసా,
[illegible] క్షణం కుర్వన్ దృగాదిభిః ॥ ౧౩
[illegible] సర్వేంద్రియ విహీనవత్,
[illegible] యోగీ శివం పశ్యతి నాపరమ్॥ ౧౪

[illegible] నిర్మలమనస్సుతో అంతర్ముఖుడై [illegible], నేత్రాదీంద్రియములతో క్షణకా[illegible] ను అనుభవించువాడును, శివునందే సుస్థిరమైన [illegible] అయిన శివయోగి సర్వేంద్రియములతోఁగూడిన [illegible] ములు లేనివాడువలె కేవల శివునే దర్శించుచు [illegible] డును.

[illegible] నాస్తి న పిపాసా న చ క్షుధా,
[illegible] న్యాస్య నిర్మానస్య మహాత్మనః ॥ ౧౫

ఇంద్రియ వ్యాపారములను శివునందే కూర్చి దేహాభిమానము లేని మహాత్మునకు ముదిమి లేదు, చావు లేదు, దప్పి లేదు, ఆఁకలి లేదు. అనఁగా శివుని వలెనే ప్రకాశించునని భావము.

మనో యత్ర ప్రవర్తేత తత్ర సర్వేంద్రియ స్థితిః,
శివే మనసి సంలీనే క్వచేంద్రియ విచారణా॥ ౧౬

మనస్సు సర్వేంద్రియ నాయకుఁడు. అది యెందుఁ బ్రవర్తించునో అందే సర్వేంద్రియములు నిలిచి పనిచేయుచుండును. ఈ మనసు శివుని యందే చేరిపోయినపుడు ఇంద్రియవ్యాపారముల మాట్రమే లేదు. భగవద్గీతలో శ్రీకృష్ణుఁడును విభూతియోగమున "ఇంద్రియాణాం మనశ్చాస్మి" యని జ్ఞానేంద్రియ కర్మేంద్రియాత్మకమైన మనస్సు తన రూపమే యనెను. అనఁగా శివునందు మనస్సు నిల్చినపుడు ఇంద్రియములన్నియు శివస్వరూపమే అయిపోవును.

యద్యత్పశ్యతి దృశా యోగీ మనసా చింతయత్యపి,
తత్తత్సర్వం శివాకారం సంవిద్రూపం ప్రకాశతే॥ ౧౭

శివయోగి కంటితో నేది చూచునో, మనసుతో నేది తలంచునో అది యంతయు జ్ఞానస్వరూప శివాకారమై ప్రకాశించును.

కరణైః సహితం ప్రాణం మనస్యాధాయ సంయమీ,
యోజయేత్తచ్ఛివే సాక్షాద్యత్ర నాస్తి జగద్భ్రమః॥ ౧౮

శివయోగి యింద్రియములతోఁ గూడిన ప్రాణమును మనసునందు నిలిపి, ఆ మనసును సాక్షాచ్ఛివుని యందు నిలుపవలయును. అపుడు ప్రపంచసంబంధమైన చాపల్యముండదు.

సర్వేంద్రియ ప్రవృత్త్యా చ బహిరంతః శివం యజన్,
స్వచ్ఛంద చారీ సర్వత్ర సుఖీ భవతి సంయమీ॥ ౧౯

అంతరింద్రియములైన శ్రోత్రాదుల వ్యాపారములతోను, బాహ్యేంద్రియములైన వాగాదుల వ్యాపారములతోను ఇష్టలింగ ప్రాణలింగ రూప శివునే వెలుపలను లోపలను అర్చించునట్టి శివయోగి శివానందమునే యనుభవించుచు స్వేచ్ఛగాఁ దిరుగును.

## 21. ప్రాణానుగ్రహ స్థలము.

శివకు[illegible]కాయస్య య త్తాత్పర్యావ లోకనం,
స ప్రాణానుగ్రహః ప్రోక్తః సర్వేషాం తత్త్వదర్శిభిః ॥ ౨౦

[illegible] శరీరమును ధరించిన శివయోగికి ప్రాణాయామముచే [illegible]వ మగునో దానినే తత్త్వజ్ఞానులు ప్రాణానుగ్రహ మం[illegible]. [illegible] ప్రాణానుగ్రహ స్థలము.

[illegible] యస్య లయం యాతి శివే పరమ కారణే,
కుత స్తస్యేంద్రియ స్ఫూర్తిః కుతః సంసార దర్శనమ్॥ ౨౧

[illegible] ప్రాణము కేవల కుంభకయోగముచే (అనఁగా [illegible] నిల్పఁబడిన (ప్రాణవాయువును నిల్పుట) బ్రహ్మాది [illegible]ప్రపంచ కారణుండైన శివునందు లయమగును. అట్టి యభ్యా సము[illegible] శివయోగికి ఇంద్రియస్ఫురణముగాని జననమరణరూప సంసార [illegible]ముగాని కాదు.

[illegible]షు నివృత్తేషు స్వార్థసంగ ప్రయత్నతః,
[illegible] సమం ప్రాణమారోప్య స్వాంతే శాంతమతిః స్వయమ్॥ ౨౨

[illegible]ములు తమతమ విషయములతోఁ జేరు ప్రయత్నమునుండి [illegible] శివయో[illegible] వానితోఁగూడఁ బ్రాణమును మనసునందు జేర్చి [illegible] తనంతనే శాంతబుద్ధిగలవాఁ డగును.

శాంతస్య ప్రాణవృత్తీనాం మనః శామ్యతి వృత్తిభిః,
త[illegible]తో [illegible]నాం కించి చ్ఛివా దన్య న్న దృశ్యతే॥ ౨౩

పూరక రేచక రూపమైన ప్రాణవృత్తులు (పూరకము=వాయువును [illegible]. రేచకము=వెలికి విడుచుట) శాంతింపఁగా మనసుగూడ సంకల్ప వికల్పరూపమైన తన వృత్తులతోనే శాంతించును. అట్టి మన [illegible] యోగులు శివునిఁదక్క మఱేదియు గనరు.

ప్రాణ ఏవ మనుష్యాణాం దేహధారణ కారణం,
[illegible] శివః ప్రోక్తః సర్వకారణ కారణమ్॥ ౨౪

ప్రాణమే మనుష్యుల దేహధారణమునకు ముఖ్యకారణము. అట్టి ప్రాణమునకు సర్వకారణ కారణుండైన శివుఁ డాధారభూతుఁడు.

నిరాధారః శివః సాక్షాత్ ప్రాణస్తేన ప్రతిష్ఠితః,
తదాధారా తనుర్జ్ఞేయా జీవో యేనైవ చేష్టతే॥ ౨౭

శివునకు వేఱొక్క యాధారము లేదు. ప్రాణము సాక్షాత్తుగా శివరూపమైన యాధారముచేతనే ప్రతిష్ఠ గనుచున్నది. జీవుఁడును ఏప్రాణముచేతఁ జలనాదిక్రియలు గలవాఁడగుచున్నాఁడో ఆ ప్రాణమే శరీరమునకాధారముగా నున్నది.

శివే ప్రాణో విలీనోఽపి యోగినో యోగమార్గతః,
స్వశక్తి వాసనా యోగా ద్ధారయ త్యేవ విగ్రహమ్॥ ౨౮

శివయోగి ప్రాణము కుంభకరూపమైన యోగసాధనముచే శివునందు లీనమైనను, తన శక్తిసంస్కార బలముచేతనే ఆ యోగి శరీరధారణము చేయుచున్నాఁడు.

స చాభ్యాస వశా ద్భాయః సర్వ తత్త్వాతి వర్తిని,
నిష్కలంకే నిరాకారే నిరస్తాశేష విప్లవే॥ ౨౯

చిద్విలాస పరిస్ఫూర్తి పరిపూర్ణ సుఖాద్వయే,
శివే విలీన సర్వాత్మా స్థాణువ ద్భాతి సంయమీ॥ ౩౦

సర్వతత్త్వములను మీఱినవాఁడును, దోషరహితుఁడును, నిరాకారుఁడును (ప్రాకృతరూపము లేనివాఁడు), సర్వోపద్రవములకును దూరుఁడును, జ్ఞానవిలాస వికాసముచేఁ బరిపూర్ణానంద స్వరూపుఁడును, అద్వితీయుఁడును అయిన పరశివునందు యోగాభ్యాసబలముచే లయమొందిన శివయోగి యెక్కడను ఎన్నఁడును జలింపఁడు.

ప్రధ్వస్తవాసనా సంగాత్ ప్రాణవృత్తి పరిక్షయాత్,
శివైకీభూత సర్వాత్మా స్థాణువ ద్భాతి సంయమీ॥ ౩౧

శివయోగి మంచివియు చెడ్డవియునైన వాసనలసంబంధమును ప్రాణవ్యాపారమును నశించినవాఁడగుటవలన, శివునందే యేకత్వమునొందిన సర్వేంద్రియవ్యాపారము గలవాఁడగుటవలనను స్థాణువువలె శోభించును.

స్థాణువు = శివుఁడు. పై శ్లోకమునఁ జెప్పఁబడిన పరిపూర్ణత శివలక్షణము. అంతటను అనఁగా దేశకాల పరిచ్ఛేదము లేక సర్వత్ర నిండి యుండుటచేతనే స్థాణువు=కదలనివాఁడు, అచలుఁడు. అటులే శోభించువాఁడనఁగా శివునం దేకాకారము గలవాఁడుగా రాజిల్లునని భావము. (ఈ స్థలమందు "ప్రాణాయామ" మనఁగా చైతన్యశక్తిని విస్తరింపఁ జేయుట యని గ్రహింపవలయును.)

## 22. కాయార్పణ స్థలము

శివస్య పరరూపస్య సర్వానుగ్రాహిణోఽర్చనే,
త్యాగో దేహాభిమానస్య కాయార్పణ ముదాహృతమ్॥ 30

సర్వము ననుగ్రహించువాఁడును, శివస్వరూపుఁడు నైన శివయోగికి శివలింగపూజా విషయమున దేహాభిమానము వీడుటే కాయార్పణ మనఁబడును.

యదా యోగీ నిజం దేహం శివాయ వినివేదయేత్,
తదా భవతి తద్రూపం శివరూపం న సంశయః॥ 31

శివయోగి తన శరీరము నెపుడు శివునకే యర్పించునో, యపుడే వాని రూపము శివరూపమే యగునన సందియము లేదు. ఇదె సారూప్యముక్తి.

ఇంద్రియ ప్రీతి హేతూని విషయా సంగజాని చ,
సుఖాని సుఖ చిద్రూపే శివయోగీ నివేదయేత్॥ 32

శివయోగి యింద్రియప్రీతిఁ గల్గించునట్టి విషయసుఖములను చిదానంద స్వరూపుఁడైన శివునందే సమర్పింపవలయును.

దర్శనాత్ స్పర్శనా ద్భుక్తేః శ్రవణా ఘ్రాణనా దపి,
విషయేభ్యో యదుత్పన్నం శివే తత్సుఖ మర్పయేత్॥ 33

చూచుట, తాకుట, తినుట, వినుట, మూర్కొనుట యను పంచేంద్రియకార్యములవలనఁ గలుగు సుఖమును శివయోగి శివునకే యర్పింపవలయును.

దేహద్వారేణ యద్యత్స్యాత్ సుఖం ప్రాసంగ మాత్మనః,
తత్సర్వం వేదయ౯ శంభోర్యోగీ భవతి నిర్మలః॥ 3౮

దేహము నాశ్రయించిన పదియింద్రియములచేత ఏయే సుఖము తనకుఁగల్గునో దానినెల్ల శివయోగి శివునకు సమర్పించుటచేత నిర్మలుఁడగును. ఈరీతిగా కాయమునకు సంబంధించిన సుఖము శివునకు సమర్పించుటే కాయార్పణ మనఁబడును.

## 23. కరణార్పణ స్థలము.

ఆసంజనం సమస్తానాం కరణానాం పరాత్పరే,
శివే యత్తదిదం ప్రోక్తం కరణార్పణ మాగమే॥ 3౯

పరాత్పరుఁడైన శివునందు సర్వేంద్రియములను జేర్చుటే శివాగమములందు కరణార్పణ మనఁబడును.

యద్యత్కరణ మాలంబ్య భుంక్తే విషయజం సుఖం,
తత్తచ్ఛివే సమర్ప్యైవ కరణార్పక ఉచ్యతే॥ 3౬

ఏ యింద్రియమువలన నే విషయసుఖము ననుభవించుచున్నాఁడో ఆ విషయసుఖమును శివునందు సమర్పించువాఁడు కరణార్పకుఁ డనఁబడును.

అహంకార మదోద్రిక్త మనః కరణ వారణం,
బధ్నీయాద్యః శివాలానే స ధీరః సర్వసిద్ధిమా౯॥ 3౭

అహంకార మమకార రూపమైన మదముచేఁ బిచ్చియెత్తిన మనోబుద్ధిచిత్తము లనెడి యేనుగులను శివుఁడనెడి కట్టుకొయ్యకుఁ గట్టిపెట్టగల శివయోగియే నిర్వికారుఁడును సర్వసిద్ధుఁడునైన జ్ఞాని యనఁబడును.

ఇంద్రియాణాం సమస్తానాం మనః ప్రథమ ముచ్యతే,
వశీకృతే శివే తస్మి౯ కి మన్యైస్తద్వశానుగైః॥ 3౮

మనస్సు సర్వేంద్రియ నాయకుఁడు. అట్టి మనసే శివునకు లోఁబడినచో దానిననుసరించు తక్కినయింద్రియము లేమిచేయఁగలవు? అనఁగా మనస్సుతోనే తక్కిన ఇంద్రియములును శివునందు లీనమగును.

ఇంద్రియాణాం వశీకారో నివృత్తి రితి గీయతే,
లక్ష్యీకృతే శివే తేషాం కుతః సంసార గాహనమ్॥ ౩౯

ఇంద్రియములు లోఁబడుటయే నివృత్తి. అనఁగా ముక్తి యనఁబడును. విషయములను గ్రహించు బుద్ధీంద్రియములను శివపరములుగానే చేసినవారికి సంసారసాగరమందు మునుఁగుట యను బాధలేదు.

సంసార విషకాంతార సముచ్ఛేద కుఠారికా,
ఉపశాంతి ర్భవే త్త్వంసా మింద్రియాణాం వశీకృతౌ॥ ౪౦

సంసార మనెడి విషవృక్ష మహారణ్యమును నఱుకు గొడ్డలియైన శాంతి యనెడి లాభము, ఇంద్రియములను వశము చేసుకొన్నవారికే గలుగును.

ఇంద్రియై రేవ జాయంతే పాపాని సుకృతాని చ,
తేషాం సమర్పణా దీశే కుతః కర్మ నిబంధనమ్॥ ౪౧

ఇంద్రియములచేతనే పాపపుణ్యములు గలుగును. వానిని శివునందు సమర్పించువారికి కర్మబంధన మెట్లుండును?

ప్రకాశమానే చిద్వహ్నౌ బహిరంత ర్జగన్మయే,
సమర్ప్య విషయాన్ సర్వాన్ ముక్తవ జ్జాయతే జనః॥ ౪౨

వెలిని, లోను ప్రకాశించునట్టియు, శివస్వరూపమే యయినట్టియు జ్ఞానాగ్నియందు సమస్త విషయములను సమర్పించినవాఁడు ముక్తుఁడగును.

చిత్తద్రవ్యం సమాదాయ జగజ్జాతం మహాహవిః,
చిద్వహ్నౌ జుహ్వతా మంతః కుతః సంసార విప్లవః॥ ౪౩

చిత్తమనెడి హోమద్రవ్యమును సకల చరాచర రూపమైన మహాహవిస్సును గ్రహించి జ్ఞానమనెడి యగ్నియందు వేల్చు శివయోగులకు జనన మరణ రూప సంసారమువలని బాధయే యుండదు.

ఆత్మ జ్యోతిషి చిద్రూపే ప్రాణవాయు నిబోధితే,
జుహ్వాత్ సమస్త విషయాన్ తన్మయో భవతి ధ్రువమ్॥ ౪౪

ప్రాణవాయువుచే రగుల్పఁబడిన జ్ఞానమనెడి శివాగ్నియందు ఇంద్రియ కార్యములనెడి విషయములను హోమముచేయు శివయోగి నిశ్చయముగా జ్ఞానస్వరూప శివుఁడే యగును.

ఇంద్రియాణి సమస్తాని శరీరం భోగసాధనం,
శివపూజాంగభావేన భావయన్ ముక్తిమాప్నుయాత్॥ ౮౩

శివయోగి సర్వేంద్రియములును, సుఖసాధనమైన శరీరమును శివపూజకైన యంగములని తెలిసికొని శివపూజాంగ భావముతోనే వర్తించి ముక్తినొందును.

## 24. భావార్పణ స్థలము

శివే నిశ్చల భావేన భావానాం యత్సమర్పణం,
భావార్పణ మిదం ప్రోక్తం శివసద్భావ వేదిభిః॥ ౮౬

నిశ్చలబుద్ధితో భావముల నన్నిటిని శివునందు సమర్పించుటయే భావార్పణమని శివరహస్యము నెఱిఁగినవా రందురు.

చిత్తస్థ సకలార్థానాం మననం యత్తు మానసే,
తదర్పణం శివే సాక్షా న్మానసో భావ ఉచ్యతే॥ ౫౭

చిత్తమందునిల్చిన సకలపదార్థములయొక్క అనుభవమనెడి చింతనమును (సర్వార్థములను మనసున దలఁచుకొనుట) శివునందు సమర్పించుటయే భావార్పణ మనఁబడును.

భావ ఏవహి జంతూనాం కారణం బంధమోక్షయోః,
భావశుద్ధా భవేన్ముక్తి ర్విపరీతేతు సంసృతిః॥ ౮౮

సమస్త ప్రాణుల బంధనమునకును, మోక్షమునకును భావమే హేతువు. మనోభావము నిర్మలమైనచో ముక్తియు, కలుషమైనచో జనన మరణ రూప బంధమును దప్పదు.

భావస్య శుద్ధిరాఖ్యాతా శివోఽహామితి యోజనా,
విపరీతసమాయోగే కుతో దుఃఖనివర్తనమ్॥ ౮౯

[illegible] శివునకు స్వస్వరూపానుభవజ్ఞానమే భావశుద్ధి. దానికి [illegible] "నేను వేఱు, శివుఁడు వేఱు" అనెడి దుర్భావము (అనఁగా [illegible] యజ్ఞానము) నిల్చినపుడు సంసారదుఃఖ మెన్నఁ [illegible]ను.

[illegible] భోజ్యం ప్రేరయితా సర్వమేత చ్చరాచరం,
[illegible] శివరూపేణ శివో భవతి వస్తుతః॥ ౨౦

[illegible] శివుఁడును, అనుభవింపఁబడు వస్తువులును, అనుభ[illegible]చేయు శివుఁడును, మఱియు నీ సకల చరాచర [illegible] శివస్వరూపమే యని రూఢిపడిన శివయోగి నిజముగా [illegible].

[illegible] ర్మార్చనం శంభో ర్వచనం తస్యకీర్తనం,
ఇతి భావయుతో నిత్యం కథం స్యాత్కర్మబంధనమ్॥ ౨౧

[illegible] చేయు పనులన్నియు శివపూజలుగాను, తన పలుకులెల్ల శివ[illegible] సంతతము భావించువానికి (అనగా సర్వము శివస్వరూప[illegible] మహాశయునకు) కర్మబంధనమే లేదు.

[illegible] గతం సౌఖ్యం దుఃఖం వా కర్మసంభవం,
[illegible] భావయ న్యోగీ జీవన్ముక్తో భవిష్యతి॥ ౨౨

[illegible]ములవలనఁ గలుగు సుఖముగాని, పాపకర్మములవలన [illegible]గాని శివునకే చెందునని భావించు యోగి ముక్తుఁడే [illegible].

## 25. శిష్యస్థలము

[illegible] భవేద్యస్తు పరకాయేన సర్వదా,
[illegible]ప్రసాదాత్తు మోక్షార్థీ స శిష్య ఇతి కీర్తితః॥ ౨౩

[illegible] శివయోగివలన నిరంతరశిక్షణము నొందుచు ఆతని [illegible]వలన ముక్తి నొందగోరినయతఁడు శిష్యుఁ డనఁబడును.

[illegible] యస్య స్థితో నిత్యం మనో వాక్కాయ కర్మభిః,
[illegible] గుణోదారే స శిష్య ఇతి గీయతే॥ ౨౪

జ్ఞాన వైరాగ్యాది గుణగణముచే నతిశయించిన గురునందు త్రికరణ శుద్ధితో నెవ్వని భావము చెదరకుండునో ఆతఁడే శిష్యుఁడు. త్రికరణ శుద్ధి యనఁగా నిర్మలబుద్ధితో ధ్యానించుట, నిర్మలవాక్కులచే నుతించుట, నిర్మలక్రియలచేఁ బూజించుట.

శాంతో దాంత స్తపః శీలః సత్యవా క్సమదర్శనః,
గురౌ శివే సమానస్థః స శిష్యాణా మిహోత్తమః॥ ౫౬

అంతరింద్రియ నిగ్రహము, బాహ్యేంద్రియ నిగ్రహము, తపస్సు, సదాచారము, సత్యవాక్కు, సర్వ సమబుద్ధి గలిగి గురువును శివుని సమముగా నెవఁడు కాంచునో అతఁడే శిష్యులందెల్ల శ్రేష్ఠుఁడు.

గురు మేవ శివం పశ్యే చ్ఛివ మేవ గురుం తథా,
నైతయో రంతరం కించి ద్విజానీయా ద్విచక్షణః॥ ౫౭

బుద్ధిశాలియైన శిష్యుఁడు గురువునే శివునిగాను, శివునే గురువునుగాను గనవలయును. ఆ ఇరువురందు ఇంచుకయు వేఱుపాటు తలంపరాదు.

శివాచారే శివధ్యానే శివజ్ఞానే చ నిర్మలే,
గురో రాదేశ మాత్రేణ పరాం నిష్ఠా మవాప్నుయాత్॥ ౫౮

శిష్యుఁడు శ్రీ గురు నాజ్ఞామాత్రముచేత నిర్మలమైన శివాచారమందును, శివధ్యానమందును, శివజ్ఞానమందును శ్రేష్ఠమైన నమ్మకముతోడి నిల్కడగలిగి యుండవలయును.

న లంఘయే ద్గురో రాజ్ఞాం జ్ఞాన మేవ ప్రకాశయన్,
శివాసక్తేన మనసా సర్వసిద్ధి మవాప్నుయాత్॥ ౫౯

కేవల జ్ఞానమునే ప్రకాశింపఁజేయుచు, గురు నాజ్ఞ మీఱరాదు. శివునందు లగ్నమైన మనస్సుతోనే సర్వసిద్ధులను శిష్యుఁ డందఁగలఁడు.

గురోర్లబ్ధ్వా మహాజ్ఞానం సంసారభయ భేషజం,
మోదతే యః సుఖీ శాంతః స జీవన్ముక్త ఏవ హి॥ ౬౦

సంసారమనెడి రోగమును బోగొట్టు శివమహాజ్ఞానమును గురువువలనఁ బొంది సుఖియై శాంతుఁడై సంతుష్టుఁడగునతఁడే జీవన్ముక్తుఁడు.

## 26. శుశ్రూషస్థలము

బోధ్యమానః స గురుణా పరకాయేన సర్వదా,
తచ్ఛుశ్రూషా రతః శిష్యః శుశ్రూషు రితి కీర్త్యతే॥ ౬౦

పరశివ శరీరధారియైన శ్రీగురునిచేత నిరంతరము బోధింపఁబడుచు ఆ గురుఁడు చెప్పినది వినుటయం దాసక్తిఁగలిగి అతనిసేవ చేయువాఁడు శుశ్రూషుఁడు.

శ్రుత్వా శ్రుత్వా గురో ర్వాక్యం శివసాక్షాత్క్రియావహం,
ఉపశామ్యతి యః స్వాంతే స ముక్తిపద మాప్నుయాత్॥ ౬౧

శివుని సాక్షాత్కరింపఁజేయు శ్రీగురుని మాటలను పలుసారులు విని విషయములను జయించి, మనస్సు నంతర్ముఖను చేయు శిష్యుఁడు మోక్షము నొందును.

న బుద్ధ్యతి గురో ర్వాక్యం వినా శిష్యస్య మానసం,
తేజో వినా సహస్రాంశోః కథం స్ఫురతి పంకజమ్॥ ౬౨

సూర్యతేజస్సులేక తామర వికసింపదు. అటులే గురూపదేశ వాక్యములు లేక శిష్యునికి జ్ఞానవికాసము కలుగదు.

సూర్యస్యోదయ మాత్రేణ సూర్యకాంతః ప్రకాశతే.
గురో రాలోక మాత్రేణ శిష్యో బోధేన భాసతే॥ ౬౩

సూర్యుఁ డుదయించినంతనే సూర్యకాంతపుఱాయి ప్రకాశించునట్లే గురుకృపాదృష్టి పడినంతనే శిష్యునందు జ్ఞానవికాసము గలుగును.

అద్వైత పరమానంద ప్రబోధైక ప్రకాశకం,
ఉపాయం శృణుయా చ్ఛిష్యః సద్గురుం ప్రాప్య సాంజలిః॥ ౬౪

శిష్యుఁడు చేతులు జోడించుకొని సద్గురువునుజేరి శివాద్వైత పరమానందజ్ఞానమునే బోధించు నుపాయమును ప్రశ్నపూర్వకముగా గురువువల్ల వినవలయును. "తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా" అని గీతావచనము.

కిం తత్త్వం పరమం జ్ఞేయం కేన సర్వే ప్రతిష్ఠితాః,
కస్య సాక్షాత్క్రియా ముక్తిః కథయేతి సమాసతః॥ ౬౫

ఇతి ప్రశ్నే కృతే పూర్వం శిష్యేణ నియతాత్మనా,
బ్రూయాత్తత్త్వం గురు స్తస్మై యేన స్యాత్సంస్కృతే ర్లయః॥
"ఓ శ్రీగురువరా! ఎఱుఁగఁదగిన యుత్తమతత్త్వమేది? దేనిచే సర్వ వస్తువులును నిలిచియున్నవి? ఎవని సాక్షాత్కారము ముక్తి? సెలవిమ్ము" అని యేకాగ్రమనస్సుగల శిష్యునిచే నడుగఁబడిన గురుఁడు, ఈ సంసార నాశ మెట్లగునో ఆ తత్త్వము నపుడు శిష్యునకుఁ జెప్పవలయును.

శివ ఏవ పరం తత్త్వం చిదానంద సదాకృతిః,
స యథార్థ స్తదన్యస్య జగతో నాస్తి నిత్యతా॥ ౬౭
ఓ శిష్యుఁడా! సచ్చిదానందస్వరూపుఁడైన శివుఁడే పరమతత్త్వము. అతఁడే నిత్యుఁడు. ఆ శివునకు వేఱయిన జగత్తు నిత్యముకాదు. అనఁగా నిరంతర పరిణామమేగాని యేకరూపత్వము లేదు.

శివోఽహమితి భావేన శివే సాక్షాత్కృతే స్థిరం,
ముక్తో భవతి సంసార మోహగ్రంధి విభేదతః॥ ౬౮
"నేను శివుఁడనే" యనెడి నిశ్చయ భావముచే శివసాక్షాత్కారము గల్గినపుడు శిష్యుఁడు సంసార రూప మోహగ్రంధి విడిపోయి ముక్తుఁ డగును.

శివం భావయ చాత్మానం శివాదన్య న్న చింతయ,
ఏవం స్థిరే శివాద్వైతే జీవన్ముక్తో భవిష్యసి॥ ౬౯
ఓయి శిష్యుఁడా! నీవు నిన్ను శివునిఁగానే భావింపుము. శివుని కంటె నితరమును దేనిని దలంపకుము. ఇటులు 'శివునికంటె నేను వేఱుకా'దనెడి భావము స్థిరపడినపుడు నీవు శరీరముండియు ముక్తుఁ డవే కాఁగలవు.

ఏవం ప్రబోధితః శిష్యో గురుణా గుణశాలినా,
శివమేవ జగత్పశ్యన్ జీవన్ముక్తోఽభి జాయతే॥ ౭౦
ఇటులు భక్తి జ్ఞాన వైరాగ్య గుణసంపన్నుఁడైన గురునిచే జక్కఁగా బోధింపఁబడిన శిష్యుఁడు సకల చరాచరప్రపంచజాలమును శివమయము గానే కాంచుచు జీవన్ముక్తుఁడగును.

## 27. సేవ్య స్థలము.

గురు వాక్యామృతా స్వాదాత్ ప్రాప్తబోధ మహాఫలః,
శుశ్రూషు రేవ సర్వేషాం సేవ్యత్వాత్ సేవ్య ఉచ్యతే॥ ౨౦

శ్రీ గురూపదేశ వాక్యములనెడి అమృతమును గ్రోలుటచేత శివాద్వైతజ్ఞానమనెడి మహాఫలమును సంపాదించిన శుశ్రూషుఁడు ఎల్లరికును సేవింపఁబడఁదగినవాఁడగుటచేత సేవ్యుఁడనఁబడును.

గురూపదిష్టే విజ్ఞానే చేతసి స్థిరతాం గతే,
సాక్షాత్కృత శివః శిష్యో గురవ త్పూజ్యతే సదా॥ ౨౧

శ్రీ గురునిచే నుపదేశింపఁబడిన శివాద్వైత జ్ఞానము మనసున స్థిరపడఁగా శివుని సాక్షాత్కరింపఁజేసికొన్న శిష్యుఁడును శివునివలెనే పూజ్యుఁడు.

జ్ఞానా దాధిక్య సంపత్తి ర్గురో రస్మా దుపస్థితా,
తస్మాద్ జ్ఞానాగమా చ్ఛిష్యో గురువ త్పూజ్యతాం వ్రజేత్॥ ౨౩

శ్రీ గురువువలనఁ బొందఁబడిన యే జ్ఞానముచేత నాధిక్యసంపద నొందుచున్నాఁడో ఆజ్ఞానసిద్ధివలన శిష్యుఁడును గురువువలెనే పూజ్యత నొందును.

శివోఽహ మితి భావస్య నైరంతర్య విశేషతః,
శివభావే సముత్పన్నే శివవ త్పూజ్య ఏవ సః॥ ౨౪

నేను శివుఁడననెడి యద్వైతభావము ఎడతెగక యభ్యాసపడుట వల్ల శివభావ మాతనియం దుత్పన్నమగుచున్నది గాన శిష్యుఁడును శివునివలెనే పూజ్యుఁడే యగును.

బ్రహ్మాండ బుద్బుదో ద్భాసి మాయాసింధుం మహాత్తరం,
గురోః కవలయ త్యాశు కటాక్ష వడవానలః॥ ౨౫

శ్రీ గురుకటాక్షమనెడి బడబాగ్ని బ్రహ్మాండమనెడి బుడగలతోఁ గూడిన యీ గొప్ప మాయాసముద్రమును క్షణములో బీల్చివేయఁ గలదు. శ్రీగురుకటాక్షముచేత అవిద్య యిట్టె తొలఁగునని భావము.

గురోః కటాక్ష వేధేన శివో భవతి మానవః,
రసవేధా ద్యథా లోహో హేమతాం ప్రతిపద్యతే॥ 28

రాగి మున్నగు లోహములయొక్క సూక్ష్మాణువులందుఁ బాదరసము చొచ్చుటచేత నవి బంగారముగా నెట్లు మారునో, అటులే శ్రీగురు కరుణాకటాక్షము శిష్యునందు బ్రసరించుటచే నతఁడు శివత్వము నొందును.

విషయాసక్త చిత్తోఽపి విషయా సంగ వివర్జితః,
శివ భావ యుతో యోగీ సేవ్యః శివ ఇవాపరః॥ 29

శివభావముతోఁ గూడిన సేవ్యుఁడనఁబడు శివయోగి విషయములందు దగిలిన మనసుగలవాఁ డయినను, విషయఫల సంగము లేనివాఁడై యుండుటచే రెండవ శివుని వలెనే సేవింపఁదగినవాఁడు.

ముక్తః సంశయ పాశతః స్థిరమనా బోధే చ ముక్తిప్రదే
మోహం దేహభృతాం దృశా విఘటయ న్మూలం మహాసంసృతేః,
సత్తానంద చిదాత్మకే నిరుపమే శైవే పరస్మిన్ పదే
లీనాత్మా విదితప్రపంచ విభవో యోగీ జనైః సేవ్యతే॥ 30

"నేను శివుఁడనా, కానా ?" యనెడి సందియమువలన విడువఁబడిన వాఁడై మోక్షదాయకమైన శివజ్ఞానమందు దృఢపడిన మనస్సు గలవాఁడై సంసార మూలకారణమైన నరుల యజ్ఞానమును దన కృపా దృష్టిపాత మాత్రముచేతనే తొలగింపఁగలవాఁడై సచ్చిదానంద స్వరూపమును సాటిలేనిదియు నైన పరశివపదమందు (పరబ్రహ్మమందు) లీనుఁడై విశ్వప్రపంచ విభవమును దెలిసినవాఁడై యొప్పు శివయోగి యెల్లరచేఁ బూజింపఁబడును.

ఇది
సిద్ధాన్త శిఖామణి యందు – లింగస్థలీయ ప్రసాది స్థలమున
కాయానుగ్రహాది నవ విధ స్థలములు గల
పదునేడవ పరిచ్ఛేదము
శ్రీ శివార్పణము.



ఓం నమః శివాయ

శ్రీ మాత్రే నమః

శ్రీ జగద్గురు పంచాచార్యాః ప్రసీదంతు

# పదునెనిమిదవ పరిచ్ఛేదము

## ప్రాణలింగి స్థలము

అగస్త్యమహర్షి యనుచున్నాఁడు:

ప్రసాదిస్థల సంబద్ధాః స్థలభేదాః ప్రకీర్తితాః,
ప్రాణలింగి స్థలారూఢాన్ స్థలభేదా న్నిరూపయ॥ ౧

స్వామీ! శ్రీ రేణుకాచార్య! ప్రసాదిస్థలసంబంధముగల స్థలభేదములనన్నిటిని దెలిపితివి. ఇఁక ప్రాణలింగిస్థలమునకుఁ జెందిన స్థలముల నన్నిటిని ఉపదేశింపుము. అనఁగా —

శ్రీ రేణుకాచార్యు లనుచున్నారు:

స్థలానాం నవకం ప్రోక్తం ప్రాణలింగి స్థలాశ్రితం,
ఆదావాత్మ స్థలం ప్రోక్త మంతరాత్మ స్థలం తతః॥ ౨

పరమాత్మ స్థలం పశ్చా న్నిర్దేహాగమ సంజ్ఞకం,
నిర్భావాగమ సంజ్ఞం చ తతో నష్టాగమస్థలమ్॥ 3

ఆదిప్రసాది నామాథ తతశ్చాంత్య ప్రసాదికం,
సేవ్య ప్రసాదికంచాథ శ్రుణు తేషాం హి లక్షణమ్॥ ౪

ఓయీ మహర్షీ! ఈ ప్రాణలింగి స్థలమునకుఁ జెందినవి 1. ఆత్మ స్థలము, 2. అంతరాత్మస్థలము, 3. పరమాత్మస్థలము, 4. నిర్దేహాగమ స్థలము, 5. నిర్భావాగమస్థలము, 6. నష్టాగమస్థలము, 7. ఆదిప్రసాది స్థలము, 8. అంత్యప్రసాదిస్థలము, 9. సేవ్యప్రసాదిస్థలము అని తొమ్మిది. వాని లక్షణములను గ్రమముగా వినుము.

## 28. ఆత్మ స్థలము.

జీవభావం పరిత్యజ్య యదా తత్త్వం విభావ్యతే,
గురోశ్చ బోధ యోగేన తదాత్మాయం ప్రకీర్తితః॥ ౫

శ్రీగురుని యుపదేశముచేత జీవభావమును విడిచి యెపుడు శివతత్త్వ మనుభవింపఁబడుచున్నదో అపుడితఁడు "ఆత్మ" యనఁబడును.

వాలాగ్ర శతభాగేన సదృశో హృదయే స్థితః,
అశ్నన్ కర్మఫలం సర్వ మాత్మా స్ఫురతి దీపవత్॥ ౬

ఆత్మ తలవెండ్రుక కొనయొక్క నూరవ వంతునకు సాటియై (అనఁగా బహుసూక్ష్మమై) సర్వప్రాణుల హృదయమందుండి తన పూర్వార్జిత కర్మఫలముల నన్నిఁటి ననుభవించుచు దీపముఁ గొనవలె వెలుఁగుచుండును.

దీపము గృహమందొక మూలఁ జిన్నదై యున్నను ఇంటినంతటిని దనవెలుఁగుచే నెట్లు వెలిఁగించునో, అటులే ఆత్మయు హృదయస్థానమందుండి తనకాంతిచే (జ్ఞానకాంతిచే) శరీరమంతట వ్యాపించి సర్వావయవ చైతన్యము ననుభవించునదై ప్రకాశించును.

ఆత్మాపి సర్వభూతానా మంతఃకరణ మాశ్రితః,
అణుభూతో మలాసంగా దాదికర్మ నియంత్రితః॥ ౭

అణురూపమైన ఆ యాత్మ సర్వప్రాణుల యంతఃకరణము నాశ్రయించి ఆణవ, మాయిక, కార్మికముల నెడి మలముల సంబంధముచేత తొల్లింటికర్మల నెడి యురులచేఁ గట్టువడును. పూర్వకర్మపాశమే ఆత్మను సంసారమందు బంధించును.

అశరీరోఽపి సర్వత్ర వ్యాపకోఽపి నిరంజనః,
ఆత్మామాయా శరీరస్థః పరిభ్రమతి సంసృతౌ॥ ౮

శరీరము లేనివాఁడయ్యును, అంతట వ్యాపించువాఁడయ్యును, దేనినంటనివాఁడయ్యును ఆత్మయు అవిద్యా (అజ్ఞానము – మాయా) స్వరూపమైన శరీరమునందుండి జనన మరణ రూప సంసారమందు సుడివడుచుండును.

ఆత్మ స్వరూప విజ్ఞానం దేహేంద్రియ విభాగతః,
అఖండ బ్రహ్మ రూపేణ తదాఽత్మ ప్రాప్తి రుచ్యతే॥ ౯

దేహము ఆత్మ కాదు, ఇంద్రియములు ఆత్మ కాదు, మనస్సు ఆత్మ కాదు, ప్రాణము ఆత్మ కాదు, వీటికన్నిటికిని వేఱయినది ఆత్మ యని తెలిసి దేశకాలాదులచేఁ దెగని అఖండ బ్రహ్మస్వరూపమే తన స్వరూపమని తెలియుటయే ఆత్మప్రాప్తి యందురు.

జపా యోగా ద్యథా రాగః స్ఫటికస్య మణేర్భవేత్,
తథాఽహంకార సంబంధా దాత్మనో దేహమానితా॥ ౧౦

శుద్ధ స్ఫటికమునకు ఎఱుపు వన్నెగల మంకెన (దాసాని) పూవు చేరికచే ఎఱ్ఱరంగు ఎట్లు కలుగునో (ఎఱ్ఱగా నెట్లు కానవచ్చునో) అటులే అహంకార సంబంధముచేత ఆత్మనకు దేహాభిమానము (దేహమే నేననుకొనుట) గలుగును.

న చాస్తి దేహ సంబంధో నిర్దేహస్య స్వభావతః,
అజ్ఞాన కర్మయోగేన దేహీ భవతి భుక్తయే॥ ౧౧

శరీరములేని ఆత్మనకు స్వాభావికమైన దేహసంబంధము లేదు. అజ్ఞానమూలమైన కర్మసంబంధముచేత ఆ కర్మఫలముల ననుభవించుటకై దేహము గలవాఁ డగుచున్నాఁడు. (కనుకనే ఈ శరీరమునకుఁ బ్రారబ్ధఘటమని పేరు.)

నాసౌ దేవో న గంధర్వో న యక్షో నైవ రాక్షసః,
న మనుష్యో న తిర్యక్చ న చ స్థావర విగ్రహః,
తత్తచ్ఛరీర యోగేన తత్తన్నామ్నా విరాజతే॥ ౧౨

ఈ ఆత్మఁడు దేవత కాఁడు, గంధర్వుఁడు గాఁడు, యక్షుఁడు కాఁడు, రాక్షసుఁడు కాఁడు, మనుష్యుఁడు కాఁడు, పశువు కాఁడు, పక్షి మున్నగునవి కాఁడు, చెట్టు, రాయి, మున్నగు కదలని వస్తువు కాఁడు. ఆయా శరీరమందుండుటచేత ఆయా నామములతో వ్యవహరింపఁబడుచున్నాఁడు.

నానాకర్మ విపాకా చ్చ నానాయోని సమాశ్రితాః,
నానాయోని సమాపన్నా నానాబుద్ధి విచేష్టితాః॥ ౧౩

నానామార్గ సమారూఢా నానా సంకల్ప కారిణః,
అస్వతంత్రాశ్చ కించిజ్ఞాః కించిత్కర్తృత్వ హేతవః,
లీలా భాజనతాం ప్రాప్తాః శివస్య పరమాత్మనః॥　　౧౪

జీవులు తమ తమ తొల్లింటి కర్మ విపాకముచేత దేవ తిర్యఙ్మనుష్యాది నానా యోనులందుఁ బుట్టుచున్నవారయి, పలువిధములైన బుద్ధులును చేష్టలును గలవారయి, పలువిధములైన శాస్త్రమార్గములను ద్రొక్కువారయి, పలువిధములయిన సంకల్పములను జేయువారయి, అల్పకర్తృత్వము గలవారయి పరమశివుఁడను పరమాత్మునకు ఆటవస్తువులయి యున్నారు.

చోదితాః పరమేశేన స్వస్వకర్మానురూపతః,
స్వర్గం వా నరకం వాపి ప్రాణినో యాంతి కర్మిణః॥　　౧౫

ఈ జీవులు తమ తమ కర్మానుగుణముగా పరమేశ్వరునిచేతఁ బ్రేరితులై స్వర్గమునో నరకమునో పొందుచున్నారు.

పునః కర్మావశేషేణ జాయంతే గర్భకోటరాత్,
జాతా మృతాః పునర్జాతాః పునర్మరణ భాజనాః,
భ్రమంతి ఘోర సంసారే విశ్రాంతి కథయా వినా॥　　౧౬

స్వర్గ నరక ఫలభోగమైనపిమ్మట నింకను మిగిలియున్న కర్మఫలము ననుభవించుటకుఁగాను పుట్టుచుఁ గిట్టుచు నీరీతిగా సంసారసాగరమున సుడివడుచు విశ్రాంతియనుమాటయే లేకున్నారు.

జీవత్వం దుఃఖ సర్వస్వం తదిదం మలకల్పితం,
నిరస్యతే గురోర్బోధాత్ జ్ఞానశక్తిః ప్రకాశతే॥　　౧౭

ఆణవాది మలములచేఁ గలిగినట్టియు, ఎల్లదుఃఖములతో నిండినట్టియు నీ జీవత్వము శ్రీగురుని సదుపదేశముచేతనే తొలఁగిపోయి జ్ఞానశక్తి ప్రకాశించును.

## 29. అంతరాత్మ స్థలము

యదా నిరస్తం జీవత్వం భవేద్గుర్వను బోధతః,
తదాంత రాత్మ భావోహి నిరస్తస్య భవేద్ధ్రువమ్॥　　౧౮

(శ్రీ)గురుబోధచేత జీవభావ మెప్పుడు తొలగునో అప్పుడు (జీవ భావము లేని) ఆత్మునకు నిశ్చయముగా నంతరాత్మభావము గలుగును.

దేహస్థితో౾ప్యయం జీవో దేహసంగవివర్జితః,
బోధాత్పరాత్మభావిత్వా దంతరాత్మేతి కీర్తితః॥ ౧౯

ఈ జీవాత్ముఁడు దేహమందున్న వాఁడయినను, దేహసంబంధము తొలఁగినవాఁడయి స్వరూపజ్ఞానముచేతను, పరమాత్మ ననెడి భావము గలవాఁడగుటచేతను అంతరాత్మ యనఁబడును.

ఆత్మాఽంతరాలవర్తిత్వా జ్జీవాత్మపరమాత్మనోః,
యోగా దుభయధర్మాణా మంతరాత్మేతి కథ్యతే॥ ౨౦

ఇపుడు జీవభావమునకు నెడమయిన ఆత్ముఁడు జీవాత్మత్వ పరమాత్మత్వములకు నడిమిదశలో నుండుటచేతను, జీవధర్మ సంబంధమును పరమాత్మ (శివ) ధర్మ సంబంధమును గూడఁ గలిగియున్న యవస్థ గనుకను అంతరాత్మ యనఁబడుచున్నాఁడు.

అహంకారస్య సంబంధా న్మనుష్యత్వాది విభ్రమః
న స్వభావ ఇతి జ్ఞానా దంతరాత్మేతి కథ్యతే॥ ౨౧

నేను మనుష్యుఁడను, నేను బ్రాహ్మణుఁడను, నే ఘనుఁడను, నేను అల్పుఁడను అనెడి భ్రాంతి అవిద్యాజన్యమైన అహంకారమువలనఁ గల్గినదిగాని స్వభావసిద్ధము కాదు అనెడి జ్ఞానము గలుగుటచే అంతరాత్ముఁ డనఁబడును.

యథా పద్మపలాశస్య న సంగో వారిణా భవేత్,
తథా దేహజుషో౾ప్యస్య న శరీరేణ సంగతిః॥ ౨౨

తామరాకును నీరంటనటులే ఆత్ముఁడు శరీరమందున్నవాఁడయినను శరీర సంబంధము లేనివాఁడే యగును.

నీడస్థితో యథా పక్షీ నీడాద్భిన్నః ప్రకాశతే,
దేహస్థిత స్తథాఽఽత్మాఽయం దేహాదన్యః ప్రకాశతే॥ ౨౩

పక్షి గూటియందున్నను గూటికంటెను దానెటులు వేఱుగా న్నదో యటులే ఆత్ముఁడు దేహమందున్నను దేహముకంటెను ఱుగానే యున్నాఁడు.

ఆచ్ఛాద్యతే యథా చంద్రో మేఘై రాసంగ వర్జితః,
తథాఽఽత్మా దేహ సంఘాతై రసంగః పరివేష్టితః॥ ౨౪

మేఘ సంబంధము లేనివాఁడయ్యును చంద్రుఁడు మేఘములచేఁ ప్పఁబడుచున్నటులే జీవాత్ముఁడును దేహసంబంధము లేనివాఁడయ్యును నానావిధ దేహములచే నావరింపఁబడినవాఁ డగుచున్నాఁడు.

నిర్మమో నిరహంకారో నిరస్తోపాధి విప్లవః,
దేహస్థోఽపి సదాహ్యాత్మా శివం పశ్యతి యోగతః॥ ౨౫

నాది యనెడి మమకారమును నేననెడి యహంకారమును దేహముల వలని బాధలును లేనివాఁడయిన ఆత్ముఁడు తాను దేహమందున్నను యోగ సాధనముచేత నెల్లప్పుడును శివుని గాంచును.

భోక్తుర్భోజ్య పరిత్యాగాత్ ప్రేరకస్య ప్రసాదతః,
భోక్తృతా భోగ గలితః స్ఫురత్యాత్మా స్వభావతః॥ ౨౬

భోక్త (అనుభవించువాఁడు) అయిన ఆత్మనకు ప్రేరకుఁడయిన పరమాత్మని (శివుని) యనుగ్రహమువలన, భోజ్యములతో (అనుభవింపఁబడు వస్తువులతో) సంబంధము విడిపోవుటచేత తాను భోక్తృత్వముతోను భోగముతోను ఎడపడినవాఁడై స్వస్వరూపముతోనే ప్రకాశించును.

సర్వేషాం ప్రేరకత్వేన శంభు రంతఃస్థితః సదా,
తత్పర జ్ఞాన యోగేన యోగీ నందతి ముక్తవత్॥ ౨౭

సర్వప్రాణులలోను శివుఁడే ప్రేరకుఁడై యున్నాఁడు. అట్టి శివుని యథార్థజ్ఞానముతోఁ గూడుటచేత యోగి ముక్తుఁడువలెనే యానందించును. అనఁగా శివయోగి శివస్వరూప జ్ఞానముచేత ఆనందమయుఁడై యుండును.

## 30. పరమాత్మస్థలము

నిర్ధూతే తత్త్వబోధేన మలే సంసారకారణే,
సామరస్యాత్పరాత్మస్థః పరమాత్మాయ ముచ్యతే॥ 29

చావు పుట్టుకలే స్వరూపముగాఁగల సంసారమునకు ముఖ్యహేతువైన యజ్ఞానము శ్రీగురుదత్తమైన శివాద్వైత జ్ఞానముచేఁ దొలఁగి పోఁగా ఈయంతరాత్మనకుఁ బరమాత్మనకు సామరస్యము గలిగి పరమాత్మయందే నిల్చినవాఁడైన యితఁడు పరమాత్ముఁడే యనఁబడును.

"యథా నద్యః స్యందమానాః సముద్రే
అస్తం గచ్ఛంతి నామ రూపే విహాయ,
తథా విద్వాన్నామ రూపా ద్విముక్తః
పరాత్పరం పురుష ముపైతి దివ్యమ్॥"

సముద్రములోనికి పాఱుచున్న నదులు తమ నామ రూపములను గోల్పోయి యెటులు మాఱి కానరాకున్నవో అటులే జ్ఞానియు నామ రూపములను విడిపోయినవాఁడై స్వయంప్రకాశుఁడును, పరాత్పరుఁడునైన పరమాత్మనే చేరుచున్నాఁడు. అనఁగా ఏకత్వమునే పొందుచున్నాఁడనుట.

సర్వేషా మాత్మభేదానా ముత్కృష్టత్వాత్ స్వతేజసా,
పరమాత్మా శివః ప్రోక్తః సర్వగోఽపి ప్రకాశవాన్॥ 29

ఆత్మ, అంతరాత్మ, పరమాత్మ యనెడి ఈ ముగ్వురిలో అడ్డులేని తన తేజస్సుచే సర్వోత్కృష్టుఁ డగుటవలన పరమాత్మయే శివుఁడు. ఇతఁడు సచరాచరప్రపంచమందంతటను నిండియున్నవాఁడైనను ఆత్ముఁడువలె తేజోహీనుఁడుగాక ఉత్కృష్ట ప్రకాశవంతుఁడుగా నున్నాఁడు.

బ్రహ్మాండ బుద్బుదస్తోమా యస్య మాయా మహోదధౌ,
ఉన్మజ్జంతి నిమజ్జంతి పరమాత్మా స ఉచ్యతే॥ 30

ఎవనియొక్క మాయాశక్తి యనెడి మహాసముద్రమందు బ్రహ్మాండములనెడి బుడగలు లేచుచు నణగుచు నున్నవో ఆతఁడే పరమాత్మ యనఁబడుచున్నాఁడు.

యస్మిన్ జ్యోతిర్గణాః సర్వే స్ఫులింగా ఇవ పావకాత్,
ఉత్పద్య విలయం యాంతి తద్రూపం పరమాత్మనః॥ 30

అగ్నియందు మిణుగురులువలె దేనియందు జీవసమూహముపుట్టి మఱల దేనియందు లీనమగుచున్నదో అదియే పరమాత్ముని స్వరూపము.

యస్మిన్ సమస్త తత్త్వాని కల్లోలా ఇవ వారిధౌ,
సంభూయ లయ మాయాంతి తద్రూపం పరమాత్మనః ॥ 32

సముద్రమందుఁ గెరటములువలె దేనియందు సమస్తమైన పృథివ్యాది తత్త్వములు పుట్టి దేనియందే లయమగుచున్నవో అదే పరమాత్ముని స్వరూపము.

నిరస్త మలసంబంధ మశేష జగదాత్మకం,
సర్వతత్త్వ పరిప్రోక్తం తద్రూపం పరమాత్మనః ॥ 33

ఆణవాది మలసంబంధము లేనిదగుటచేత పరమపవిత్రమై సకల చరాచరరూప ప్రపంచస్వరూపమై భూమ్యాది సర్వతత్త్వములను మీఱి ప్రకాశించునదియే పరమాత్మ స్వరూపము.

యథా వ్యాప్య జగత్సర్వం స్వభాసా భాతి భాస్కరః,
తథా స్వశక్తిభి ర్వ్యాప్య పరమాత్మా ప్రకాశతే॥ 34

ప్రకాశించు కిరణములుగల సూర్యుఁడు తన తేజస్సుచేత జగముల నన్నిటను వ్యాపించి వెలుఁగుచున్నటులే పరమాత్మయు తన సర్వశక్తులతో సర్వజగత్తులను వ్యాపించి ప్రకాశించుచున్నాఁడు.

విశ్వతో భా సమానోఽపి విశ్వమాయా విలక్షణః,
పరమాత్మా స్వయం జ్యోతి రూపో జీవాత్మనాం భవేత్॥ 35

మహామాయావిలక్షణుఁడైన పరమాత్మ అంతటను జీవాత్మలలో ప్రకాశించుచున్నవాఁడైనను తానుమాత్రము స్వయంజ్యోతిః స్వరూపుఁడయియే ప్రకాశించుచున్నాఁడు. "అనశ్న న్నన్యో అభిచాకశీతి" అనెడి శ్రుతియు ఈ మాటనే బోధించుచున్నది.

## 31. నిర్దేహాగమ స్థలము.

దేహినోఽపి పరాత్మత్వ భావినో నిరహంకృతేః,
నిరస్త దేహధర్మస్య నిర్దేహాగమ ఉచ్యతే॥ 36

పరమాత్మస్వరూపమును భావించునట్టియు, అహంకార మమకారములు లేనట్టియు, దేహముగలవాఁడయ్యును దేహధర్మములచే విడువఁబడిన శివయోగికి నిర్దేహత్వప్రాప్తి చెప్పఁబడినది.

శివోఽహమితి యస్యాస్తి భావనా సర్వగామినీ,
తస్య దేహేన సంబంధః కథం స్యా దమితాత్మనః॥ 37

నేను శివుఁడనెడి సర్వవ్యాపకభావనగల మహాత్ముఁడైన శివయోగికి శరీరసంబంధ మెటులుండును? ఉండదని భావము.

గలితే కృత్రిమాహంత్వే సంసార భ్రమకారణే,
పరాహంతాం ప్రవిష్టస్య కుతో దేహః కుతో రతిః॥ 38

సంసారభ్రాంతికి మూలకారణమైన కృత్రిమాహంకారము (స్వభావముతోఁగాక అజ్ఞానముచేఁ గల్గిన యహంకారము) తొలఁగి పరాహంతను (శివభావమును) పొందిన శివయోగికి శరీరమెక్కడిది? శరీరమందలి ప్రీతి యెక్కడిది? అనఁగా నీ రెండును లేవనుట.

నిష్కలే నిష్ప్రపంచౌఘే గంభీరే చిన్మహోదధౌ,
నిమగ్న మానసో యోగీ కథం దేహం విచింతయేత్॥ 39

నిష్కలమును, స్థావర జంగమ ప్రపంచ సముదాయ శూన్యమును, అత్యంతగంభీరమునయిన జ్ఞానసముద్రమందు మనసుమునిగిన శివయోగికి దేహచింతఎట్లుండును? అనఁగా దేహవిషయమైన స్మృతియేయుండదనుట.

అపరిచ్ఛేద్యమాత్మానం చిదంబర మితిస్మరన్,
దేహయోగేఽపి దేహస్థై ర్వికారై ర్నవిలిప్యతే॥ 40

తనను దేశకాలాదులచేఁ దెగనట్టి జ్ఞానాకాశమున భావించు శివయోగి దేహముతోఁ గూడియున్నను దేహసంబంధమైన ఇంద్రియాది వికారములతోఁ [illegible] నంటడు.

అఖండ సంవిదాకార మద్వితీయం సుఖాత్మకం,
పరమాకాశ మాత్మానం మన్వానః కుత్ర ముహ్యతి॥ ౪౧

తనను అఖండ జ్ఞానస్వరూపముగాను, అద్వితీయునిగాను, ఆనంద స్వరూపునిగాను, పరమాకాశముగాను దలంచు శివయోగికి మోహ మెట్లగును ?

ఉపాధి విహితా భేదా దృశ్యంతే చైక వస్తుని,
ఇతి యస్యమతిః సోఽయం కథం దేహామితో భవేత్॥ ౪౨

ఒక వస్తువునందే పలువిధములైన భేదములు ఉపాధులతోఁ గూడుటచేఁ గానఁబడుచున్నవిగాని యథార్థవస్తువొక్కటే యను నిశ్చయబుద్ధి గలవానికి దేహసంబంధ మెట్లుండును? సర్వమును అభేదబుద్ధితోఁ గనుచు సాక్షాచ్ఛివస్వరూపుఁడైన యాతనికి దేహసంబంధమే లేదని భావము.

భేదబుద్ధిః సమస్తానాం పరిచ్ఛేదస్య కారణం,
అభేద బుద్ధౌ జాతాయాం పరిచ్ఛేదస్య కా కథా॥ ౪౩

భేదబుద్ధియే సమస్తవస్తువుల వేఱుపాటునకు (భిన్నభిన్నములను బుద్ధికి) మూలకారణము. అభేద బుద్ధిగలవాఁడు ఏవస్తువులను భిన్నముగాఁ జూడక సర్వమును శివస్వరూపముగానే చూచునని భావము.

## 32. నిర్భావాగమస్థలము

వ్యతిరేకాత్స్వరూపస్య భావాంతర నిరాకృతేః,
భావో వికార నిర్ముక్తో నిర్భావాగమ ఉచ్యతే॥ ౪౪

"నేను వేఱు, శివుఁడు వేఱు, జగత్తు వేఱు" అను భావనను నిరాకరించుటచేతను, అందుచేతనే తన తొంటి రూపముయొక్క వ్యతిరేకత చేతను, ఇంద్రియ వికారములతో నిడివడిన మనోభావమే నిర్భావాగమ మనఁబడును,

అహం బ్రహ్మేతి భావస్య వస్తుద్వయ సమాశ్రయః,
ఏకీ భూతస్య చిద్వ్యోమ్ని తదభావో వినిశ్చితః॥ ౪౫

"అహం బ్రహ్మ" యనెడి భావమునకు 'అహం' అనియు 'బ్రహ్మ' యనియు రెండు వస్తువుల సంబంధము గలదు. కాని జ్ఞానాకాశమందు

సామరస్యమునొందిన భావనకు, అహం-బ్రహ్మ-యను రెండు వస్తువుల లేమియే నిశ్చయమగుచున్నది. శివోహంభావనయు నణఁగిపోయి తానే తానుగాఁ బ్రకాశించుటయే నిర్బావాగమ మనఁబడును.

ఏకభావేన రూఢస్య నిష్కలంకే చిదంబరే;
క్వజాతి వాసనాయోగః క్వదేహిత్వం పరిభ్రమః॥ ౪౬

నిష్కలంకమైన జ్ఞానాకాశమందు సామరస్యము దృఢపడిన శివయోగికి వర్ణాశ్రమాదివాసనా సంబంధమేని, శరీరము గలదను మాట యేని, సంసారభ్రమణమేని యెన్నఁడును గలుగవు.

శూన్యే చిదంబరే స్థానే దూరే వాఙ్మనసా ధ్వనః,
విలీనాత్మా మహాయోగీ కేన కిం వాఽపి భావయేత్॥ ౪౭

మాటలకు మనసునకందక వర్ణరూపాదులు లేకయుండు జ్ఞానాకాశమం దాత్మను లయముచేసిన శివయోగి దేనితో నేవస్తువును భావించును? అతఁడు స్వస్వరూపానంద మయుఁడై యుండునుగాన ఏవిధముగాను ఏవస్తువును భావింపఁడని భావము.

అవిశుద్ధే విశుద్ధే వా స్థలే దీప్తి ర్యథా రవేః,
పతత్యేవం సదాఽద్వైతీ సర్వత్ర సమవృత్తిమాన్॥ ౪౮

సూర్యకాంతి పవిత్రమైనచోటను, అపవిత్రమైనచోటను భేదభావము లేక వ్యాపించునటులే శివాద్వైతియు అన్నింటను భేదబుద్ధి లేకయే యుండును.

న బిభేతి జరా మృత్యో ర్న క్షుధాయా వశం వ్రజేత్,
పరిపూర్ణ నిజానంద సమాస్వాదా న్మహా సుఖీ॥ ౪౯

అట్టి శివయోగి ముదిమికిని చావునకును భయపడఁడు. ఆఁకలి దప్పులకు లోనుగాఁడు. పరిపూర్ణ స్వాత్మానందామృతము ననుభవించుచు, నిత్యసుఖియై యుండును.

## 33. నష్టాగమ స్థలము.

భేద శూన్యే మహాబోధే జ్ఞాతృత్వాది త్రయ హానితః,
జ్ఞానస్య నష్టభావేన నష్టాగమ ఇహోచ్యతే॥ ౫౦

భేదబుద్ధి కవకాశములేని శివాద్వైతజ్ఞానము గలుగఁగా, జ్ఞాతృ జ్ఞాన జ్ఞేయములనెడి త్రిపుటి (తెలియువాఁడు, తెలివి, తెలియఁబడునది) యను మాట పోవుటచే నిర్భావాగమసంపన్నుఁడైన శివయోగి విషయ భేదజ్ఞానము లేనివాఁడయి నష్టాగముఁ డనిపించుకొనుచున్నాఁడు.

అద్వైత వాసనావిష్ట చేతసాం పరయోగినాం,
పశ్యతా మంతరాత్మానం జ్ఞాతృత్వం కథ మన్యథా॥ ౫౧

శివాద్వైతవాసన గలట్టియు, తమ హృదయకమలమందు పరమేశ్వరునే కనుచుండు శివయోగులకుఁ దనకంటె వేఱుగాఁ బదార్థాంతరములను దెలిసికొనుటయనునది ఎట్లగును? శివయోగులు తమకంటె వేరైన వస్తువుల నన్నిటిని స్వస్వరూపముగానే కాంతురని తాత్పర్యము.

అకర్తాహ మవేత్తాహ మదేహోఽహం నిరంజనః,
ఇతి చింతయతః సాక్షాత్ సంవిదేవ ప్రకాశతే॥ ౫౨

నేను జేయువాఁడను గాను, నేను దెలియువాఁడను గాను, నే నొకదాని నంటను అని చింతించుచుండు శివయోగికి సాక్షాత్తుగా శివాద్వైత జ్ఞానమే ప్రకాశించుచుండును.

నిరస్త భేద జల్పస్య నిరీహస్య ప్రశామ్యతః,
స్వే మహిమ్ని విలీనస్య కిమన్యత్ జ్ఞేయ ముచ్యతే॥ ౫౩

భేదభావము తొలఁగి రాగద్వేషాదులు లేక సర్వవిషయములందును వైరాగ్యమే కలిగి, తన మహిమమందే లీనుఁడైయున్న శివయోగికి తనకంటె నితర మేవస్తువును దెలియఁదగినది లేదు.

ఏకీభూతే నిజాకారే సంవిదా నిష్ప్రపంచయా,
కేన కిం వేదనీయం స్యా ద్వేత్తాకః పరిభావ్యతే॥ ౫౪

భేదరహితమైన శివాద్వైతజ్ఞానముతో స్వస్వరూపము సామరస్యమును బొందఁగా దేనిచేత ఏది తెలియఁదగినది? ఎవనిని తెలిసికొనువాఁడనుట. "నాఽతః పరం వేదితవ్యం హి కించిత్" అనెడి శ్రుతిచేత శివయోగి జ్ఞాతృ జ్ఞేయ జ్ఞానములనెడి త్రిపుటి లేనివాఁడని భావము.

మహాసత్తా మహాసంవి ద్విశ్వరూపా ప్రకాశతే,
తద్వినా నాస్తి వస్త్వేకం భేద బుద్ధిం విముంచతః॥ ౫౫

మహాసత్తారూపమైన మహాజ్ఞానమే జగద్రూపముగాఁ బ్రకాశించు చున్నది. గాన ఔపాధికమైన భేదబుద్ధి లేనివానికి అట్టి జ్ఞానరూప వస్తువుగాక మఱొకవస్తువు కానరాదు.

## 34. ఆదిప్రసాది స్థలము

సర్వాధిష్ఠాతృకః శంభు రాది స్తస్య ప్రసాదతః,
ఆదిప్రసాదీ త్యుక్తోఽయం నిర్వికారపదే స్థితః॥ ౫౬

అన్నిటికిని ఆధారభూతమైనవాఁడు శివుఁడు. అతఁడే సర్వప్రపంచమునకు మూలకారణము. ఆ పరశివుని దయచేత వికారరహితమైన నష్ఠాగము నందున్న శివయోగి ఆదిప్రసాది యనఁబడును.

అనేక జన్మ శుద్ధస్య నిరహంకార భావినః,
ప్రసన్నస్య మహాదేవః ప్రసీదతి విముక్తయే॥ ౫౭

వెనుకటి పలుపుట్టువులందుఁ బరిశుద్ధుఁడును, శరీరాద్యభిమాన రహితుఁడును, నిర్మలాత్ముఁడు నయిన శివయోగికి మోక్షమిచ్చుటకై పరమ శివుఁడు ప్రసన్నుఁడగును.

శివప్రసాద సంపత్త్యా శివభావ ముపేయుషా,
శివాదన్య జ్జగజ్జాలం దృశ్యం తేన నదృశ్యతే॥ ౫౮

శివానుగ్రహసంపదచేత శివస్వరూపమునొందిన శివయోగి, కనఁబడు చున్న సర్వప్రపంచమును శివునికంటె నన్యముగాఁ గానఁడు. సముద్ర తరంగ న్యాయముగా (అనఁగా సముద్రమునకును దానినుండియే పుట్టు కెరటములకును భేదములేనట్లుగా) శివునకును శివునుండి పుట్టిన చరాచర ప్రపంచమునకును అభేదమనియే తలంచునని భావము.

శంభో రేవ ప్రసాదేన సంసార చ్ఛేదకారిణా,
మోహ గ్రంధిం వినిర్భిద్య ముక్తిం యాంతి వివేకినః॥ ౫౯

జ్ఞానులు సంసారబంధమును దొలఁగించు మూలకారణమైన శివ ప్రసాదము చేతనే అజ్ఞానమనెడి ముడిని విప్పుకొని ముక్తులగుదురు.

వినా ప్రసాద మీశస్య సంసారో న నివర్తతే,
వినా సూర్యోదయం లోకే కుతః స్యా త్తమసో లయః॥ ౬౦

శివానుగ్రహము లేక సంసారనివృత్తి కాదు. లోకమున సూర్యుఁడు ఉదయింపక చీఁకటి యెట్లు తొలఁగును? సూర్యోదయముచేత చీఁకటి వలెనే శివానుగ్రహముచేత సంసారబంధము తొలఁగును.

సర్వానుగ్రాహకః శంభుః కేవలం కృపయా ప్రభుః,
మోచయే త్సకలా౯ జంతూ న్నకించి దిహ కారణమ్॥ ౬౧

సర్వసమర్థుఁడును, అఖిలాండకోటి బ్రహ్మాండనాయకుఁడును అయిన శివుఁడు తన కృపచేతనే ప్రాణులనెల్ల భవబంధమునుండి విడిపించును. ఇందాతని కృపయేగాని మఱియొకటి కారణము గాదు.

## 35. అంత్యప్రసాది స్థలము

లయః సర్వపదార్థానా మంత్య ఇత్యుచ్యతే బుధైః,
ప్రసాదోఽనుభవ స్తస్య తద్వా నంత్యప్రసాదవా౯॥ ౬౨

భూమ్యాది శివాంతమైన సర్వతత్త్వముల లయమున కాశ్రయమైన శివుఁడు "అంత్య" మనఁబడును. ఆ శివుఁడు సాక్షాత్కరించుటయే యతని ప్రసాద మనఁబడును. అట్టి శివప్రసాదము గల ఆదిప్రసాదియే అంత్య ప్రసాది యనఁబడును.

దేవ తిర్య జ్మనుష్యాది వ్యవహార వికల్పనా,
మాయాకృతా పరే తత్త్వే తల్లయో తత్క్షయో భవేత్॥ ౬౩

దేవతలనియు, మానవులనియు, పశువులనియు, పక్షులనియు వ్యవహారకల్పనము మాయాకృతము. తుదకా పరతత్త్వమందు ఆమాయ లీనమగునప్పుడు దేవతిర్యగాది కల్పనమును నశించును.

సాక్షా త్కృతే పరే తత్త్వే సచ్చిదానంద లక్షణే,
క్వ పదార్థ పరిజ్ఞానం కుతో జ్ఞాతృత్వ సంభవః॥ ౬౪

సచ్చిదానందస్వరూప పరశివతత్త్వము ప్రత్యక్షముకాఁగా ఈ వస్తు విదియని తెలియఁబడదు. తెలిసికొనువాఁడును లేఁడు. అనఁగా పైని వివరించిన జ్ఞాతృ, జ్ఞాన, జ్ఞేయము లనెడి త్రిపుటియు లేదని భావము.

సుషుప్తస్య యథా వస్తు న కించిదపి భాసతే,
తథా ముక్తస్య జీవస్య న కించి ద్వస్తు దృశ్యతే॥ ౬౭

గాఢనిద్రచే మైమఱచియున్న వానికి ఏవస్తువు నించుకంతయు భాసింప నట్లే జీవన్ముక్తునకును ఏవస్తువును గానరాదు. అనఁగా వానికి సర్వమును శివస్వరూపముగానే తోఁచునని భావము.

యథాకాశ మవిచ్ఛిన్నం నిర్వికారం స్వరూపతః,
తథా ముక్తస్య జీవస్య స్వరూప మవ శిష్యతే॥ ౬౮

సహజముగా ఆకాశము ఎడములేనిదియు మార్పు లేనిదియు నైనట్లే జీవన్ముక్తుఁడు నెట్టిమార్పులునులేక స్వస్వరూపమాత్రుఁడై యుండును.

న కించి దపి ముక్తస్య దృశ్యం కర్తవ్యమేవ వా,
సుఖ స్ఫూర్తి స్వరూపస్య నిశ్చలా స్థితి రుచ్యతే॥ ౬౯

జీవన్ముక్తుఁడు చూడఁదగినదియు లేదు, చేయఁదగినదియు లేదు. ఆనంద స్వరూపుఁడైన యాతని స్థితియు నిశ్చలమై యుండును.

శివాద్వైత పరిజ్ఞాన శిథిలాశేష వస్తునః,
కేవలం సంవిదుల్లాస దర్శినః కేన కిం భవేత్॥ ౭౦

శివాద్వైత జ్ఞానముచే నివృత్తియైన సర్వమును గలవాఁడును, కేవల జ్ఞానవిలాసమునే గనువాఁడునైన శివయోగికి దేనిచేతను నెట్టిప్రయోజనము లేదు.

## ౩౭. సేవ్య ప్రసాది స్థలము

సేవ్యో గురుః స్మృతో హ్యస్య ప్రసాదోఽనుభవో మతః,
తదేకావేశ రూపేణ తద్వాన్ సేవ్య ప్రసాదవాన్. ౭౧

శివస్వరూపుఁడైన గురుఁడే సేవ్యుఁ డనఁబడును. అట్టి శ్రీగురుని యుపదేశానుభవమే ప్రసాద మనఁబడును. గురువును ప్రసాదము ననెడి ఈ రెంటియొక్క యేకీభావము శిష్యునం దుండుటచేత శిష్యుఁడు సేవ్య ప్రసాది యనఁబడును.

సేవ్యో గురుః సమస్తానాం శివ ఏవ న సంశయః,
ప్రసాదోఽస్య పరానంద ప్రకాశః పరికీర్త్యతే॥ ౭౨

ఎల్లఱకును సేవ్యుఁడైన శ్రీగురుఁడు ప్రత్యక్ష శివుఁడేయయి యుం డును ఇందు సందియము లేదు. ఇట్టి శివస్వరూపుఁడైన శ్రీగురుని యుపదేశానుగ్రహమే పరానందప్రకాశ మనఁబడును.

గురు రేవ పరం తత్త్వం పరతత్త్వం గురుః స్మృతః,
తదేకత్వానుభావేన న కించి దవశిష్యతే॥ 20

శ్రీగురుఁడే పరతత్త్వము. పరతత్త్వమే (శివతత్త్వమే) శ్రీగురుఁడు. ఆ గురుతత్త్వ పరతత్త్వములు రెండును ఒక్కటియే యనుజ్ఞానముచేత మఱేదియు మిగులదు. అనఁగా రెండిటికిని భేదమన్నదే లేదనియు సర్వము తత్స్వరూపమే యనియు భావము.

అపరిచ్ఛేద్య మాత్మస్థ మవాఙ్మానస గోచరం,
ఆనందం పశ్యతాం పుంసాం రతి రన్యత్ర కా భవేత్॥ 21

తెంపులేనిదియు, స్వస్వరూపమును, తనయందే యున్నదియు, మాటకు మనసునకు నందనిదియునైన పరానందమును ప్రత్యక్షముగా గాంచువానికి (శివయోగికి) ఇతర విషయములందుఁ బ్రీతి యింతయు నుండదు.

జ్ఞానామృతేన తృప్తస్య కి మన్యై ర్భోజ్య వస్తుభిః,
జ్ఞానమేవ పరానందం ప్రకాశయతి యచ్ఛివమ్। 23

సచ్చిదానంద స్వరూపుఁడైన శివుని ప్రకాశింపఁజేయు జ్ఞానమనెడి యమృతమును గ్రోలి తనివినొందు శివయోగికి క్షణకాల తృప్తినిచ్చు తుచ్ఛములైన భోజ్య వస్తువులతోఁ బ్రయోజనము లేదు. అతఁడు మఱియొకదాని భోగానుభవమును గోరఁడని భావము.

ముక్తి రేవ పరాతృప్తిః పరమానంద లక్షణా,
నిత్య తృప్తస్య ముక్తస్య కి మన్యై ర్భోగసాధనైః॥ 24

పరమానంద స్వరూపమైన మోక్షమే సాటిలేని గొప్పతనివి. శాశ్వత తృప్తిఁగొన్న జీవన్ముక్తుఁడైన శివయోగికిఁ దక్కిన భోగ సాధనములతోఁ బ్రయోజనము లేదు.

న బాహ్యకర్మ తస్యాస్తి న చాంతరైవ కుత్ర చిత్,
శివైక్య జ్ఞాన రూఢస్య దేహభ్రాంతిం విముంచతః॥ 25

శివైక్య జ్ఞానసంపద నొంది దేహభ్రాంతి విడిపోయిన శివయోగికి అర్ఘ్య పాద్య దానాది బాహ్యకర్మములుగాని మనసునఁ జేయఁదగిన ధ్యానముగాని యుండదు. ఏలనఁగా శివజ్ఞానసంపన్నుఁడైన శివయోగి సర్వమును శివస్వరూపముగానే భావించును. తానే తానయి(స్వస్వరూపమందే) యుండునట్టి శివయోగికి బాహ్యక్రియలైన పూజాదులచేతను, ఆంతరంగికములైన ధ్యానాదులచేతను ఫలములేదు. ఒకవేళ ఆశివయోగి పూజా ధ్యానాదు లాచరించినను అది ఇతరులను సన్మార్గమునఁబెట్టి యుద్ధరించుటకనియే తెలియవలయును. తన నుద్ధరించుకొనుటకే యను కొనరాదు. గాన శ్రీ రేణుకాచార్యులు అట్టి శివయోగికి బాహ్యాభ్యంతర పరిశ్రమయే యుండదనిరి.

> న కర్మ బంధే న తపో విశేషే
> న మంత్ర యోగాభ్యసనే తథైవ,
> ధ్యానే న బోధే చ తథాఽత్మ తత్త్వే
> మనః ప్రవృత్తిః పరయోగభాజామ్॥ ౭౬

ఉత్తమశివయోగ మలవడిన శివయోగుల మనోవ్యాపారము, షట్కర్మాదిరూపమైన హఠయోగమందుగాని, తపోవిశేషమైన రాజయోగమందుగాని, అజపగాయత్రీరూప సోఽహంమంత్ర యోగాభ్యాసమందుగాని, అనాహత బ్రహ్మధ్యానరూపమైన లయయోగమందుగాని యుండదు. ఆ నాల్గువిధములైన యోగములకు ఆత్మస్వరూపమైన స్వస్వరూపమందే యుండును.

ఇది

సిద్ధాంత శిఖామణి యందు – లింగస్థలీయ ప్రాణలింగస్థలమందలి
ఆత్మస్థలాది నవవిధ స్థల విచారరూపమైన
పదునెనిమిదవ పరిచ్ఛేదము
శ్రీ శివార్పణము.



ఓం నమః శివాయ

శ్రీ మాత్రే నమః

శ్రీ జగద్గురు పంచాచార్యాః ప్రసీదంతు

# పంచాశ్మిదవ పరిచ్ఛేదము

## శరణ స్థలము

అగస్త్యమహర్షి యనుచున్నాడు :

స్థలభేదాః సమాఖ్యాతాః ప్రాణలింగి స్థలాశ్రయాః,
కథయ స్థలభేదం మే శరణస్థల సంశ్రితమ్॥ ౧

స్వామీ! శ్రీ రేణుకాచార్య! ప్రాణలింగిస్థల సంబంధమైన స్థలభేదములు చెప్పితివి. ఇఁక శరణస్థలమందలి స్థలభేదముల నుపదేశింపుము. అని యర్థింపఁగా,

శ్రీ రేణుకాచార్యులు చెప్పుచున్నారు :

శరణస్థల మాశ్రిత్య స్థల ద్వాదశకం మయా,
ఉచ్యతే నామ సర్వేషాం స్థలానాం శృణు తాపస॥ ౨

దీక్షా పాదోదకం పూర్వం శిక్షా పాదోదకం తతః,
జ్ఞాన పాదోదకం చాథ క్రియా నిష్పత్తికం తతః॥ ౩

భావ నిష్పత్తికం చాథ జ్ఞాన నిష్పత్తికం తతః,
పిండాకాశ స్థలం చాథ బింద్వాకాశ స్థలం తతః॥ ౪

మహాకాశ స్థలం చాథ క్రియాయాశ్చ ప్రకాశనం,
భావ ప్రకాశనం పశ్చాత్తతో జ్ఞాన ప్రకాశనం,
స్వరూపం పృథకే తేషాం కథయామి యథాక్రమమ్॥ ౫

ఈ శరణస్థలమందు 1. దీక్షాపాదోదకస్థలము, 2. శిక్షాపాదోదకస్థలము, 3. జ్ఞానపాదోదకస్థలము, 4. క్రియానిష్పత్తిస్థలము, 5. భావనిష్పత్తి స్థలము, 6. జ్ఞాననిష్పత్తి స్థలము, 7. పిండాకాశ స్థలము, 8. బింద్వాకాశ స్థలము, 9. మహాకాశ స్థలము, 10. క్రియాప్రకాశస్థలము, 11. భావప్రకాశస్థలము, 12. జ్ఞానప్రకాశస్థలము అని పం

ప్రసాద స్థలములు గలవు. వాని లక్షణములను వరుసగాఁ జెప్పెదను వినుము.

## 37. దీక్షా పాదోదక స్థలము

దీక్షయోపగతాద్వైతం యద్జ్ఞానం గురుశిష్యయోః,
తయోస్సైన్యైక్య మేతేన దీక్షా పాదోదకం స్మృతమ్॥ ౬

దీక్షచేతఁ బొందఁబడిన యద్వైతజ్ఞానముతో గురు శిష్యులకు జ్ఞానము యొక్క ఐక్యమే దీక్షాపాదోదకస్థల మనఁబడును.

పరమానన్ద ఏవోక్తః పాదశబ్దేన నిర్మలః,
జ్ఞానం చోదక శబ్దేన తయో రైక్యం తు దీక్షయా॥ ౭

పాదశబ్దము చేతఁ బరమానందము చెప్పఁబడుచున్నది. ఉదకశబ్దము చేత జ్ఞానము చెప్పఁబడుచున్నది. ఈ రెండిటి సంబంధమే పాదోదక మనఁబడును.

అథవా పాదశబ్దేన గురురేవ నిగద్యతే,
శిష్యశ్చోదక శబ్దేన తయో రైక్యం తు దీక్షయా॥ ౮

పాదశబ్దముచేత గురుఁడును, ఉదకశబ్దముచేత శిష్యుఁడును చెప్పఁబడుచున్నది. గురు హస్త శిష్య మస్తక సంయోగరూపమైనట్టిగాని, శిష్యుని కర్ణత్రాణ రూపమైనట్టిగాని దీక్షావిశేషముచే గురుశిష్యుల ఐక్యము చెప్పబడును. అనఁగా గురువు తన తపఃశక్తిచే సంగ్రహించిన శక్తిని తన చేయి శిష్యునితలపైనుంచిగాని, శిష్యునిశిరము మూర్ధ్ని గాని శిష్యునందు సంక్రమింపఁజేయును. దీనికే శక్తిపాతమని పేరు.

పరమానంద తృప్తికాశాత్మా పరమానంద భావనాం,
అనుగమ్య మహాయోగీ న భేదం క్వాఽపి పశ్యతి॥ ౯

స్వప్రకాశ ప్రకాశస్వరూపుఁడైన శివయోగి పరమానంద స్వరూపమునందు భేదమెందునను గానఁడు.

దేశకాలాద్యవచ్ఛేద విహీనం నిత్య నిర్మలం,
ఆనందం ప్రాప్యబోధేన నాన్యత్ కాంక్షతి సంయమీ॥ ౧౦

శివయోగి దేశకాలాది పరిచ్ఛేదము లేనట్టియు, నిత్య నిర్మలమైనట్టియు బ్రహ్మానందము నొంది మఱి రెండవదానిని గోరఁడు. అనఁగా బ్రహ్మానందముకంటె నాతని కనుభవింపఁదగినది వేఱొకటి లేదని భావము.

జ్ఞానామృత మతిస్వచ్ఛం గురుకారుణ్య సంభవం,
ఆస్వాద్య రమతే యోగీ సంసారామయ వర్జితః॥　　౧౧

భవరోగ దూరుఁడైన శివయోగి గురుకరుణచే బొందఁబడినట్టియు, అత్యంత నిర్మలమైనట్టియు జ్ఞానామృతమును సేవించి స్వస్వరూపమందే రమించును.

## 38. శిక్షాపాదోదకస్థలము

గురు శిష్య మయం జ్ఞానం శిక్షా మనన మీర్యతే,
తయోః సమరసత్వం హి శిక్షా పాదోదకం స్మృతమ్॥　　౧౨

గురు శిష్య స్వరూపమయిన ఐక్యజ్ఞానము శిక్షాజ్ఞాన మనఁబడును. ఆ గురు శిష్యుల సామరస్యమే శిక్షాపాదోదక మనఁబడును.

మథితా చ్ఛాస్త్రజలధే ర్యుక్తిమంథాన వైభవాత్,
గురుణా లభ్యతే బోధ సుధా సుమనసాం గణైః॥　　౧౩

శ్రీ గురువుచే యుక్తి యనెడి కవ్వపు బలమున ద్రచ్చఁబడిన వీరశైవశాస్త్ర మనెడి సముద్రమునుండి పొందఁబడిన జ్ఞానమనెడి యమృతమును శుద్ధచిత్తులైన శివయోగులు మాత్రమే పొందుదురు.

జ్ఞాన చంద్ర సముద్భూతాం పరమానంద చంద్రికాం,
పశ్యంతి పరమాకాశే ముక్తి రాత్రౌ మహాధియః॥　　౧౪

మహాజ్ఞానులైన శివయోగులు ముక్తియనెడి రాత్రితోఁ గూడిన హృదయమనెడి యాకాశమందు జ్ఞానమనెడి చంద్రునినుండి పుట్టిన పరమానందమనెడి వెన్నెలను గాంతురు.

దృష్టే తస్మిన్ పరానందే దేశకాలాది వర్జితే,
ద్రష్టవ్యం విద్యతే నాన్య చ్ఛ్రోతవ్యం జ్ఞేయ మేవ వా॥　　౧౫

దేశకాలాది శూన్యమైన యీ పరానందము కనఁబడగా మఱి చూడఁదగినదిగాని వినఁదగినదిగాని తెలియఁదగినదిగాని లేదు.

ఆత్మానందేన తృప్తస్య కా స్పృహా విషయే సుఖే,
గంగాజలేన తృప్తస్య కూపతోయే కుతో రతిః॥ ౧౬

నిత్యమైన ఆత్మానందముచేఁ దృప్తినొందిన వానికి క్షణికమైన విషయసుఖమం దిచ్ఛయుండదు. గాంగజలముచే దనివినొందినవాఁడు నూతి నీటికై ప్రీతి నొందఁడు.

యస్మిన్నప్రాప్తకల్లోలే సుఖసింధౌ నిమజ్జతి,
సామరస్యాన్మహాయోగీ తస్య సీమా కుతో భవేత్॥ ౧౭

అలలు లేక శాంతమైన యానంద సముద్రమునందు మునుఁగు శివయోగి పొందు నానందమునకుఁ బారమే లేదు.

గురుప్రసాద చంద్రేణ నిష్కలంకేన చారుణా,
యన్మనః కుముదం నిత్యం బోధితం తస్య కో భ్రమః॥ ౧౮

గురు నను్రగహ మనెడి చంద్రునిచే ఏశివయోగి మనస నెడి కలువ ఎల్లప్పుడును వికసించియుండునో అతనికి సంసారభ్రాంతి యెటులుండును?

## 39. జ్ఞాన పాదోదక స్థలము.

సద్వైక్య సంపదానందో యోఽసౌ జ్ఞాన గురుర్మతః,
తత్సామరస్యం శిష్యస్య జ్ఞానపాదోదకం విదుః॥ ౧౯

సద్రూపమైన పరబ్రహ్మముతోడి సామరస్య సంపదవలన నబ్బిన యానందము గలవాఁడే జ్ఞానగురుఁ డనఁబడును. అట్టి జ్ఞానగురునితోడ శిష్యునకుఁగల్గు సామరస్యమే జ్ఞానపాదోదకమని పెద్దలందురు.

అవిద్యా రాహు నిర్ముక్తో జీవచంద్రః సునిర్మలః,
ప్రకాశతే పరాకాశే పరానంద మహాద్యుతిః॥ ౨౦

అజ్ఞానమ నెడి రాహుగ్రహముచే విడువఁబడినట్టియు, కనుకనే మిగుల నిర్మలుఁడైనట్టియు, పరమానంద మనెడి మహాప్రకాశము గలట్టియు, జీవుఁడనెడి చంద్రుఁడు సర్వశ్రేష్ఠమైన హృదయాకాశమున వెలుఁగును.

అజ్ఞాన మేఘ నిర్ముక్తః పూర్ణో జీవ సుధాకరః,
ఆనంద జలధే ర్వృద్ధి మనుపశ్యన్ విభాసతే॥ ౧౨

అజ్ఞాన మనెడి మబ్బుచే విడువఁబడిన జీవుఁడనెడి పూర్ణచంద్రుఁడు ఆనందమనెడి సముద్రపుఁ బెంపును చూచుచు వెలుంగును.

జ్ఞాన చంద్రోదయే జాతే ధ్వస్త మోహ తమో భరాః,
పశ్యంతి పరమాం కాష్ఠాం యోగినః సుఖరూపిణీమ్॥ ౨౨

జ్ఞానమనెడి చంద్రుఁడుదయింపఁగా అజ్ఞానమనెడిచీఁకటులు తొలఁగిన శివయోగులు పరమానందస్వరూపమైన స్వస్వరూపస్థితి నొందుదురు.

మాయా రజన్యా విరమే బోధ సూర్యే ప్రకాశితే,
నిరస్త సర్వవ్యాపార శ్చిత్రం స్వపితి సంయమీ॥ ౨౩

మాయయనెడి రాత్రి కడముట్టఁగా జ్ఞానమనెడి సూర్యుఁడు ప్రకాశించునపుడు, యోగి సమస్త వ్యాపారములుమాని నిద్రించుచున్నది చిత్రము. ఎట్లనఁగా సర్వప్రాణులు రాత్రి నిదురించి సూర్యోదయము కాఁగానే మేల్కొనుచుఁ దమ తమ వ్యాపారములందు మెలఁగుట యెల్లరకు ననుభవసిద్ధము. ఇట్లుండఁగా యోగి వ్యాపారము దీనికి విరుద్ధముగా నుండును. అతఁడు జ్ఞానసూర్యుఁ డుదయింపఁగనే సర్వేంద్రియ ప్రాపంచిక వ్యాపారములు లేనివాఁడై హాయిగ నుండును. ఇదే వైచిత్ర్యము. దీనికి జ్ఞానోదయమే కారణము. ఈ యభిప్రాయమే భగవద్గీతయు "యా నిశా సర్వభూతానాం తస్యాం జాగర్తి సంయమీ, యస్యాం జాగ్రతి భూతాని సా నిశా పశ్యతో మునేః॥" యోగి సర్వభూతములకు రాత్రియైన సమయమున మేల్కొని యుండును. సర్వభూతములును మేల్కొనువేళ యాతనికి రాత్రియై యుండును. అను మాటలచే సమర్థించినది.

అనాద్యవిద్యా విచ్ఛిత్తి వేలాయాం పరయోగినః,
ప్రకాశతే పరానందః ప్రపంచేన వినాకృతః॥ ౨౪

ప్రపంచముతో వేఱయిన పరమానందము శివయోగికి అనాదియైన యజ్ఞానము నశించునపుడు ప్రకాశించును.

నిత్యానందే నిజాకారే నిర్మలే పరతేజసి,
విలీన చేతసాం పుంసాం కుతో విశ్వవికల్పనా॥ ౨౫

నిజస్వరూపమై నిర్మలమైన జ్ఞానతేజస్సునందు లీనమైన మనసుగల శివయోగులకు స్థూలప్రపంచకల్పనమే యుండదు.

కుతో బ్రహ్మా కుతో విష్ణుః కుతో రుద్రః కుతో రవిః,
సాక్షాత్కృత పరానంద జ్యోతిషః సామ్యకల్పనే॥

బ్రహ్మానంద తేజస్సును సాక్షాత్కరించుకొన్న శివయోగికి సామరస్య కల్పనము సిద్ధింపఁగా చతుర్ముఖబ్రహ్మ, విష్ణువు, రుద్రుఁడు, సూర్యుఁడు అనువారును సాటికారని యర్థము.

అపరోక్ష పరానంద విలాసస్య మహాత్మనః,
బ్రహ్మవిష్ణ్వాదయో దేవా విశేషాః సుఖబిందవః॥ ౨౭

సాక్షాత్ బ్రహ్మానందమునందు రమించు శివయోగికి బ్రహ్మ విష్ణు రుద్రాదులైన వేలుపులు అత్యల్పమైన సుఖవిశేషములుగ నుండురు. అనఁగా ఆనందమయుఁడైన శివయోగిదృష్టికి బ్రహ్మాదిదేవతలు అత్యల్ప సుఖప్రదములుగాఁ దోఁచుదురనుట.

యన్మాత్రా సహితం లోకే వాంఛంతి విషయం నరాః,
త మప్రమేయ మానందం పరమం కో న వాంఛతి॥ ౨౮

లోకమందలి మనుజులు అల్పమాత్రమైన విషయసుఖమును గోరుచున్నవారు కాఁగా హద్దులేని యా పరమానందమును గోరనివా రుండరు గదా?

## 40. క్రియా నిష్పత్తి స్థలము

జ్ఞానినో యాని కర్మాణి తాని నో జన్మహేతవః,
అగ్నిదగ్ధాని బీజాని యథా నాంకుర కారణమ్॥ ౨౯

అగ్నిచేఁ గాల్పఁబడిన విత్తులు మొలకెత్తుటకు ఎట్లు కారణము కావో, అటులే జ్ఞానాగ్నిచే దగ్ధమైన కర్మములు గలవాఁడుగాన శివజ్ఞాని కర్మములు మఱల వాని జన్మమునకు హేతువులు కానేరవు.

కర్మణా కిం కృతే నాపి జ్ఞానినో నిరహంకృతేః,
విక్రియా ప్రతిబింబస్థా కిం కరోతి హిమద్యుతేః॥ 30

మూలాహంకారము లేని శివజ్ఞాని కర్మములు చేసినను ప్రయోజన మేమి? చంద్రుని ప్రతిబింబమందలి వికారము అతని నేమి చేయును? అనఁగా నీటియందో అద్దమందో చంద్ర ప్రతిబింబము పడినపుడు ఆ నీటనో అద్దమందో తోఁచు వికారములు (కదలుట, వంకగా నుండుట, రంగు మారుట మున్నగు మార్పులు) ఆ చంద్రునికి సంబంధించినవి కానటులే శివజ్ఞాని యే కర్మములు చేసినను వాని ఫలము లాతని నంట వని తాత్పర్యము.

జ్ఞానీ కర్మ నిరూఢోఽపి లిప్యతే న క్రియా ఫలైః,
ఘృతాదినా యథా జిహ్వా భోక్త్రీ చాపి న లిప్యతే॥ 31

నాలుక నేయి మున్నగు వస్తువులను స్వీకరించునదైనను దాని నవి యంటనటులే శివజ్ఞాని ఏకర్మము లొనర్చినను వాని ఫలము లాతని నంటవు.

నిరస్తోపాధి సంబంధే జీవే యాయా క్రియా స్థితిః,
సాసా ప్రతీతి మాత్రేణ నిష్ఫలా తత్ర లీయతే॥ 32

ఉపాధిసంబంధము తొలఁగిన జీవన్ముక్తుని కర్మములన్నియు ఫలరహిత ములై వానియందే యణఁగిపోవును. ఈ పట్టున వేదాంతులు దగ్ధ రజ్జు న్యాయమును దెల్పుదురు. అనఁగా కాలిపోయిన త్రాడు త్రాటివలెనే కానవచ్చునుగాని అది యెందులకును బనికిరాదు.

గచ్ఛం స్తిష్ఠ న్స్వప న్నాపి న నిష్కర్మాస్తి కశ్చన,
స్వభావో దేహినాం కర్మ జ్ఞానినాం తత్తు నిష్ఫలమ్॥ 33

మనుష్యుఁడెవ్వఁడును ప్రాణులకు సాజమైన నడచుట, కూర్చుండుట, నిద్రించుట మున్నగు కర్మములు లేక నుండఁడు. కాని జ్ఞానులకు మాత్రము ఆ కర్మములును నిష్ఫలములే.

పరిపూర్ణ మహానంద భావినః శుద్ధచేతసః,
న భవేత్కర్మ కార్పణ్యం నానాభోగ ఫలప్రదమ్॥ 34

వెలితిలేని బ్రహ్మానందము ననుభవించువాఁడును, నిర్మలాంతఃకర ణుఁడు నైన శివయోగికి పుణ్యపాప రూపమైన నానావిధ భోగఫలముల నిచ్చునట్టి కర్మబంధ ముండదు.

## 41. భావ నిష్పత్తి స్థలము.

భావేన నాస్తి సంబంధః కేవల జ్ఞాన యోగినః,
తథాఽపి భావం కుర్వీత శివే సంసార మోచకే॥ 3౫

జానయోగరూఢుఁడైన శివయోగికి భావముతో సంబంధము లేదు. అయినను భవసంబంధమును విడిపించు శివునందు భావముంచవలయును.

పరిపూర్ణ ప్రబోధోఽపి భావం శంభౌ న వర్జయేత్,
భావోహి నిహితస్తస్మిన్ భవసాగర తారకః॥ 3౬

శివయోగి పరిపూర్ణజ్ఞానము గలవాఁడయినను శివునందు భావము విడువరాదు. ఆ శివునందు నిలుకడగల భావమేకదా సంసారసముద్రమును దాటింపఁగలది.

నివర్త్య జన్మజం దుఃఖం భావః శైవో నివర్తతే,
యథా కాష్ఠాదికం దగ్ధ్వా స్వయం శామ్యతి పావకః॥ 3౭

అగ్ని కట్టెలు మున్నగువానిని గాల్చి క్రమముగా దానును శాంతించునట్లే శివసంబంధమైన భావము సంసారదుఃఖమును మఱలించి తానును మఱలిపోవును.

ప్రకాశితే శివానందే తద్భావైః కిం ప్రయోజనం,
సిద్ధే సాధ్యేఽచిరేణాపి సాధనైః కిం ప్రయోజనమ్॥ 3౮

శివానందము ప్రకాశింపఁగా ఆ శివభావములతో నేమి ప్రయోజనము? సాధింపఁదగిన కార్యము వడిగా సాధింపఁబడిన పిమ్మట దాని కగు సాధనములతో నింకేమి ప్రయోజనము?

ఏకీకృతే శివే భావే జ్ఞానేన సహ సంయమీ,
వి[illegible]త్మ సమావేశః శివ భావే విభాసతే॥ 3౯

భావము శివునందు జ్ఞానముతోనే ఏకత్వము నొందఁగా ఆత్మ సమావేశమును (ఆత్మ శివునితో జేరుటను) మఱచి శివయోగి 'శివోఽహం' భావమందే ప్రకాశించును.

న భావేన వినా జ్ఞానం న భావో జ్ఞాన మంతరా,
మోక్షాయ కారణం ప్రోక్తం తస్మాదుభయమాశ్రయేత్॥ ౪౦

భావమును విడిచి జ్ఞానము లేదు, జ్ఞానమును విడిచి భావమును లేదు. ఈ రెండును మోక్షకారణము లగుటచే శివయోగి రెండిటిని ఆశ్రయింపవలయును.

## 42. జ్ఞాన నిష్పత్తి స్థలము.

పరిపూర్ణే మహానందే పరమాకాశ లక్షణే,
శివే విలీన చిత్తస్య కుతో జ్ఞేయాంతరే కథా॥ ౪౧

అంతటను నిండినవాఁడును, పరమానందమే స్వరూపముగ గలవాఁడును, అనంతాకాశ స్వరూపుడు నైన శివునందుఁ జిత్తము నణఁగించిన శివయోగికిఁ దెలిసికొనవలసిన దికేమి యుండును? అతఁడు సర్వజ్ఞుఁడగుటచేఁ దెలియఁదగినది మఱియొకటి లేదని భావము.

జ్ఞాతా చాహం జ్ఞేయ మిద మితి వ్యవహృతిః కుతః,
అభేద బ్రహ్మ సారస్య నిరస్తాఖిల వస్తుని॥ ౪౨

అద్వితీయ పరబ్రహ్మముతోఁ దాదాత్మ్యము నొందినట్టియు, ప్రాపంచికములగు నన్నిటికి నెడమయినట్టియు శివయోగియందు "నేను తెలిసికొనువాఁడను, ఇది తెలియఁదగినది" అను వ్యవహారమే యుండదు. ఇదే త్రిపుటినాశన మందురు.

## 43. పిండాకాశ స్థలము

యథా పిండస్థ ఆకాశ స్తథాత్మా పూర్ణ ఉచ్యతే,
ఏతదర్థ వివేకో యః పిండాకాశ స్థలం విదుః॥ ౪౩

శరీరమందలి యాకాశము శరీరమనెడి యుపాధిచే మితముగాఁ గానఁబడినను, ఉపాధి నశించిన వెనుక తనకు సహజమైన పూర్ణతను బొందు

నటులే శరీరమందలి యాత్మయు పూర్ణమైనదిగానే చెప్పఁబడినది. ఈ విషయమును గూర్చిన జ్ఞానమునే జ్ఞానులు పిండాకాశ స్థలమందురు.

ఘటోపాధి ర్యథాఽఽకాశః పరిపూర్ణః స్వరూపతః।
తథా పిండస్థితో హ్యాత్మా పరిపూర్ణః ప్రకాశతే॥ ४४

కుండ యనెడి ఉపాధియందున్న ఆకాశము స్వభావముచేత బరిపూర్ణమే. అటులే శరీరమందున్న ఆత్మయుఁ దన సచ్చిదానంద స్వరూపముతోఁ బూర్ణమే అయియున్నది.

అంతః స్థితం పరాకాశం శివ మద్వైత లక్షణం,
భావయే ద్యః సుమనసా పిండాకాశః స ఉచ్యతే॥ ४५

హృదయాకాశమందుండి జ్ఞానాకాశ స్వరూపమై, తాను దక్క మఱియొకఁడు లేనివాఁడైన శివుని పరిశుద్ధచిత్తుఁడై భావించు యోగియే పిండాకాశ స్వరూపుఁ డనఁబడును.

శివాగార మిదం ప్రోక్తం శరీరం బోధ దీపితం,
షట్త్రింశ త్తత్త్వ ఘటితం సుమనః పద్మపీఠకమ్॥ ४६

శివాది భూమ్యంతమైన 36 తత్త్వముల నెడి స్తంభములపై నిల్చి హృదయ పద్మమనెడి పీఠమును, జ్ఞానమనెడి దీపమును గల యీ శరీరమే శివుని యిల్లుగా నెఱుంగునది. "దేహో దేవాలయ ప్రోక్తో జీవో దేవః సనాతనః" అను మాట దీనినే ప్రతిపాదించుచున్నది.

పరాకాశ స్వరూపో హి ప్రకాశః పరమేశ్వరః,
హృదాకాశ గుహాలీనో దృశ్యతేఽంతః శరీరిణామ్॥ ४७

జ్ఞానాకాశ స్వరూపుఁడును, పరమానంద స్వరూపుఁడును అగు పరమశివుఁడు సర్వప్రాణుల హృదయమనెడి గుహయందున్నవాఁడై కానఁబడుచుండును. "విహితం గుహాయాం పరమే వ్యోమన్" అను శ్రుతి తాత్పర్య మిదియే.

ఏత చ్ఛివపురం ప్రోక్తం సప్తధాతు సమావృతం,
అత్ర హృత్పంకజం వేశ్మ సూక్ష్మాంబర మనోహరమ్॥ ४८

తత్ర సన్నిహితః సాక్షాత్సచ్చిదానంద లక్షణః,
నిత్య సిద్ధః ప్రకాశాత్మా జలస్థాకాశవ చ్ఛివః॥   ౮౯

రస, రక్త, మాంస, మేధః, అస్థి, మజ్జా, శుక్రము లనెడి ఏడు ధాతువులచే నావరింపఁబడిన యీ శరీరము శివుని ముఖ్యపట్టణము. ఈ రాజధానియందు సూక్ష్మాకాశ రమ్యమైన హృదయకమలమే ఆతని మందిరము. ఆ యంతఃపురమున సచ్చిదానంద స్వరూపుఁడును, నిత్య పూర్ణుఁడును స్వయంప్రకాశుఁడునైన శివప్రభువు నీటియందు ప్రతిబింబించు ఆకాశమువలెనే ప్రత్యక్షముగాఁ గానవచ్చును.

అంతరాకాశ మధ్యస్థ మశేషోపాధి వర్జితం,
ఘటాకాశ మివాచ్ఛిన్నం భావయే చ్చిన్మయం శివమ్॥   ౯౦

ఘటమందలి యాకాశము ఆ ఘటము నశించునపుడు స్వభావముచేఁ దెంపులేని మహాకాశముగానై పోవునటులే హృదయాకాశమున వెలుంగు చిత్స్వరూపుఁడైన శివుఁడును శరీరమనెడి యుపాధిని విడిచినపుడు అపరిచ్ఛిన్నుఁడే కావలయును.

## 44. బింద్వాకాశ స్థలము

యథాకాశో విభుర్జ్ఞేయః సర్వప్రాణ్యుపరిస్థితః,
తథాత్మే త్యుపమానార్థం బింద్వాకాశ స్థలం విదుః॥   ౯౧

ఆకాశము సర్వప్రాణులయం దుండుటయేగాక సర్వత్ర వ్యాపించి తెలియఁబడుచున్నటులే, ఆత్మయును సర్వోపాధులయందుండి సర్వవ్యాపకమై తెలియఁబడుచున్నది. ఈ సాటి చెప్పుటచే దీనిని జ్ఞానులు బింద్వాకాశ స్థల మనిరి.

యథైకో వాయు రాఖ్యాతః సర్వప్రాణి గతో విభుః,
తథాత్మా వ్యాపకః సాక్షాత్ సర్వప్రాణి గతః స్వయమ్॥ ౯౨

వాయు వొక్కటియే యైనను అది సర్వప్రాణులయందుండి సర్వవ్యాపక మగుచున్నది. అటులే ఆత్మఁడును తాను ప్రత్యక్షముగా సర్వప్రాణులయందుండి సర్వవ్యాపకుఁ డగుచున్నాఁడు.

యథా వహ్ని రమేయాత్మా సర్వత్రైకోఽపి భాసతే,
తథా శంభుః సమస్తాత్మా పరిచ్ఛేద వివర్జితః॥ ౫౩

అగ్ని యెట్లనగ అపరిమితస్వరూపముగలదయి ఒక్కటియేయయ్యును [illegible] ప్రపంచమున వైద్యుతాగ్ని, దావాగ్ని, బడబాగ్ని రూపమును [illegible] ప్రపంచమున కార్యభేదములచే దీపకాగ్ని, పాచకాగ్ని, [illegible] ఆలోచకాగ్ని, సాధకాగ్ని యను నామములతోను నిండి యున్నట్లే, పరమేశ్వరుఁడును దానొక్కఁడయ్యును పరిచ్ఛేద రహితుఁడై (తెంపులేనివాఁడై) దేవ దానవ మానవ పశు పక్ష్యాది రూప [illegible] ప్రపంచమునంతటను సర్వచైతన్యస్వరూపుఁడై కొన్నిటను స్థూల [illegible] తెలియఁబడునట్లును, కొన్నిటను దెలియఁబడనట్లును సర్వవ్యాపకుఁడై వెలుఁగుచున్నాఁడు.

సర్వేషాం దేహినా మంత శ్చిత్త తోయం ప్రకాశతే,
తస్మిన్ ప్రతిఫలత్యాత్మా శివో దర్పణవ ద్విభుః॥ ౫౪

సర్వప్రాణులందును చిత్తమనెడి నీరు ప్రకాశించుచున్నది. అద్దమందు మొగము గనఁబడుచున్నటులే నిర్మలమైన చిత్తమందు ఆత్మస్వరూపుఁడైన శివుఁడు ప్రతిబింబించుచున్నాఁడు.

ఏకః పరిమితః సంవి త్ప్రకాశాత్మా పరాత్పరః,
సర్వప్రాణి గతో భాతి తథాఽపి విభు రుచ్యతే॥ ౫౫

జ్ఞాన తేజస్స్వరూపుఁడును, పరాత్పరుఁడునైన శివుఁడొక్కఁడే సర్వప్రాణులయందును హృదయముననుండి పరిమితుఁడుగాఁ బ్రకాశించును. [illegible] సర్వవ్యాపకుఁడై యుండుటచేతనే విభుఁ డనఁబడుచున్నాఁడు.

ఏక ఏవ యథా సూర్య స్తేజసా భాతి సర్వగః,
తథాఽఽత్మా శక్తిభేదేన శివః సర్వగతో భవేత్॥ ౫౬

సూర్యుఁ డొక్కఁడయ్యును దన తేజస్సుచేత నంతట వ్యాపించి ప్రకాశించుచున్నట్లే ఆత్మస్వరూపుఁడైన శివుఁడును ఇచ్ఛా, జ్ఞాన, [illegible] శక్తిభేదములచే విశ్వవ్యాపకుఁడై శోభిల్లుచున్నాఁడు.

## 45. మహాకాశ స్థలము.

పిండాండస్థం యథాఽఽకాశం న భిన్నం తద్వ దాత్మనః,
అభిన్నః పరమాత్మేతి మహాకాశ స్థలం విదుః॥ ౫౭

బ్రహ్మాండమందును పిండాండమందును ఉన్న ఆకాశమెట్లు భిన్నముగా లేదో అటులే శివయోగియొక్క ఆత్మకంటె పరమాత్మ వేఱుగా లేదు. శివయోగి ఆత్మ, పరమాత్మ అను నీ ఇరువురును ఒకటే అను అభేదమునే జ్ఞానులు మహాకాశ స్థలమందురు.

యథా న భిన్న మాకాశం ఘటేషు చ మఠేషు చ,
తథాండేషు చ పిండేషు స్థితో హ్యాత్మా న భిద్యతే॥ ౫౮

ఘటము, మఠము అనువానియందున్న ఆకాశము ఎటులు వేర్వేఱుగా లేదో అటులే బ్రహ్మాండము పిండాండము అనువానియందున్న ఆత్మ వేఱుకాదు.

అనిర్దేశ్య మనౌపమ్య మవాఙ్మానస గోచరం,
సర్వతోముఖ సంపన్నం సత్యానంద చిదాత్మకమ్॥ ౫౯
కాలాతీతం కలాతీతం క్రమయోగాది వర్జితం,
స్వానుభూతి ప్రమాణస్థం జ్యోతిషా ముదయస్థలమ్॥ ౬౦
శివాఖ్యం పరమం బ్రహ్మ పరమాకాశ లక్షణం,
లింగ మిత్యుచ్యతే సద్భి ర్యద్వినా న జగత్స్థితిః॥ ౬౧

ఇదే అని చూపుటకు వీలుకానిదియు, ఇట్టిదని పోలిక చెప్ప రానిదియు, మాటలకును మనసునకును అందనిదియు, అన్నివైపుల మోములు కలదియు (=సర్వసాక్షికము), సచ్చిదానంద స్వరూపమును, కాలమును మీఱినదియు (= తనకు లోఁబడిన కాలముగలది), ౩౮ కళలను(సూర్యకళలు ౧౨, చంద్రకళలు ౧౬, అగ్నికళలు ౧౦ వెరశి ౩౮ ) మించినదియు, పుట్టుట, పెరుగుట, చెడుట యను ప్రాకృతక్రమము లేనిదియు, స్వానుభవమాత్రముననే తెలియఁదగినదియు, సూర్యచంద్రాదులైన ప్రకాశవస్తువులు పుట్టుచోటును, మహాకాశస్వరూపమునైన శివుఁడను

పేరి పరబ్రహ్మమే లింగమనఁబడును. అట్టి లింగముకంటె వేఱుగా నీ జగత్తు లేదు. సకలచరాచరప్రపంచమును శివుఁడాధారముగా నుండి శివస్వరూపమే అయియున్నదని భావము.

పరమాకాశ మవ్యక్తం ప్రబోధానంద లక్షణం,
లింగం జ్యోతిర్మయం ప్రాహు ర్లీయంతే యత్ర యోగినః॥ ౬౨

యోగులు ఏ పరమాకాశమందు లీనులగుదురో, అవ్యక్తమైన ఆ పరమాకాశమునే బుధులు చిదానందలక్షణమును తేజోమయమైన లింగమందురు.

సంవిదేవ పరకాష్ఠా పరమానంద రూపిణీ,
తా మాహుః పరమాకాశం మునయో ముక్తసంశయాః॥ ౬౩

పరమానంద స్వరూపమైన జ్ఞానమే సర్వోత్తమ గమ్యస్థానము. నిస్సంశయ జ్ఞానముగల మునులు ఆ జ్ఞానమునే పరమాకాశ మందురు.

తరంగాది ర్యథా సింధోః స్వరూపా న్నాతిరిచ్యతే,
తథా శివా త్పరాకాశా ద్విశ్వమేత న్నభిద్యతే॥ ౬౪

సముద్రమున బుట్టిన కెరటములు నురుగు తుంపుర్లు మొదలగునవి యా సముద్రస్వరూపముకంటె వేఱుకానట్లే, పరమానందస్వరూపుఁడైన శివునుండి విడువఁబడిన జగత్తు శివస్వరూపముకంటె వేఱుగాదు.

యథా పుష్ప పలాశాది ర్వృక్షరూపా న్నభిద్యతే,
తథా శివా త్పరాకాశా జ్జగతో నాస్తి భిన్నతా॥ ౬౫

పువ్వులు, ఆకులు, కాయలు మున్నగునవి చెట్టుకంటె వేఱుకానట్లే స్థావరజంగమాత్మకమైన ఈ జగత్తునకు పరమానందరూప, పరశివరూపముకంటె వేఱుపాటులేదు. శివునివలెనే నిత్యము సత్యమని భావము.

యథా జ్యోతీంషి భాసంతే భూతాకాశే పృథక్పృథక్,
తథా భాంతి పరాకాశే బ్రహ్మాండాని విశేషతః॥ ౬౬

ఆకాశమందుఁ జుక్కలు వేర్వేరుగా వెలుఁగునటులే లెక్కలేని బ్రహ్మాండములు పరాకాశ స్వరూపుఁడైన శివునియందు ప్రకాశించుచున్నవి.

నిరస్తోపాధి సంబంధం నిర్మలం సంవిదాత్మకం,
పరాకాశం జగచ్చిత్ర విలాసాలంబ భిత్తికమ్॥ ౬౭

పలువిధములైన బొమ్మలు వ్రాయుటకు గోడ ఆధారమైనట్లే జగము లనెడి చిత్రరూపులు వెలయుటకు ఉపాధి సంబంధము లేనట్టియు, నిష్కళంకమైనట్టియు, జ్ఞాన స్వరూపమైనట్టియు పరమాకాశమే (పరశివుఁడే) ఆధారమై యున్నది.

## 46. క్రియాప్రకాశ స్థలము.

శివస్య పరిపూర్ణస్య పరాకాశ స్వరూపిణః,
ఆత్మత్వే నానుసంధానాత్ క్రియా ద్యోతనవాఁ యమీ॥ ౬౮

మహాకాశ స్వరూపుఁడైన శివయోగి పరిపూర్ణుఁడను పరాకాశ స్వరూపుఁడైన ఆత్మస్వరూపముతో (సోఽహం = అతఁడే నేను, నేనే అతఁడు అను భావనతో) అనుసంధానించువాఁడగుటచేత క్రియా ప్రకాశకుఁ డనఁబడును.

నిష్కలంక చిదానంద గగనోపమ రూపిణః,
శివస్య పరిపూర్ణస్య వృత్తి శ్చైతన్యరూపిణీ॥ ౬౯

నిర్మలుఁడును, చిదానందస్వరూపుఁడును, పరమాకాశ స్వరూపుఁడును, పరిపూర్ణుఁడును అయిన శివుని వ్యాపారము జ్ఞానస్వరూపమే. అనఁగా శివుఁడు క్రియావిశిష్ట జ్ఞానస్వరూపుఁడని భావము.

నిష్కలంకే నిరాకారే నిత్యే పరమతేజసి,
విలీన చిత్తవృత్తస్య తథా శక్తిః క్రియోచ్యతే॥ ౭౦

దోషము లేనిది, రూపము లేనిది, ముక్కాలములందుఁ జెరుపు లేనిది అయిన పరశివతేజస్సునందు మనోవ్యాపారము లీనమైన శివయోగిశక్తియును శివునిశక్తివలెనే జ్ఞానవిశిష్ట క్రియారూపమై యున్నది.

సర్వజ్ఞః సర్వకర్తా చ సర్వగః పరమేశ్వరః,
తదైక్య చింతయా యోగీ తాదృశాత్మా ప్రకాశతే॥ ౭౧

పరమేశ్వరుఁడు సర్వజ్ఞుఁడు, సర్వకర్త, సర్వవ్యాపకుఁడు నై యున్నాఁడు. అట్టి శివుని తాదాత్మ్యధ్యానముచే (శివోఽహం భావనచే) శివయోగియును శివస్వరూపుడయియే ప్రకాశించును.

సర్వేంద్రియాణాం వ్యాపారే విద్యమానేఽపి సంయమీ,
ప్రత్యఙ్ముఖేన మనసా శివం పశ్యన్ ప్రమోదతే॥ ౭౨

శివయోగియందు సర్వేంద్రియవ్యాపార మున్నను అతఁడు లోనికి మఱలిన మనస్సుతో శివుని సాక్షాత్కరింపఁజేసికొని యానందించును.

కూటస్థమచలం ప్రాజ్ఞం గుణాతీతం గుణోత్తరం,
శివతత్త్వం స్వరూపేణ పశ్యన్ యోగీ ప్రమోదతే॥ ౭౩

నిర్వికారమును, సర్వజ్ఞమును, హేయగుణములు లేనిదియు, అధిక కల్యాణగుణములే కలదియు నైన శివతత్త్వమును శివయోగి స్వస్వరూపముగనే చూచుచు నానందించును.

## 47. భావప్రకాశస్థలము

తరంగాద్యా యథా సింధో ర్నభిద్యంతే తథాఽఽత్మనః,
భావా బుద్ధ్యాదయః సర్వే యత్తద్భావప్రకాశనమ్॥ ౭౪

కెరటములు, నురుగు, తుంపురులు మున్నగునవి సముద్రముకంటె వేఱుకానట్లే, బుద్ధి మున్నగు సమస్తభావములును ఆత్మకంటె వేఱుగా నుండవు అను నదియే భావప్రకాశస్థల మనఁబడును.

శివ ఏవ జగత్సర్వం శివ ఏవాహ మిత్యపి,
భావయన్ పరమో యోగీ భవదోషై ర్నబాధ్యతే॥ ౭౫

'సచరాచరమైన సర్వజగత్తును శివస్వరూపమే. నేనును శివస్వరూపుఁడనే' యని భావించు మహాయోగి సాంసారిక దోషములచే బాధనొందఁడు.

శివభావే స్థిరే జాతే నిర్లేపస్య మహాత్మనః,
యే యే భావాః సముత్పన్నా స్తేతే శివమయాః స్మృతాః॥

విషయములతో నంటని శివయోగికి శివభావము దృఢము కాఁగా గల్గు భావములన్నియు శివస్వరూపములే యగును.

అద్వితీయ శివాకార భావనా ధ్వస్త కర్మణా,
న కించి ద్భావ్యతే సాక్షాత్ శివా దన్య న్మహాత్మనా॥ ౭౭

అద్వితీయమైన 'శివోఽహం' భావనముచే కర్మ నాశనమైన శివయోగి దేనిని శివునికంటె నన్యమైనదానినిగా భావింపఁడు. సర్వమును శివస్వరూపముగానే కాంచునని భావము.

గలితాజ్ఞాన బంధస్య కేవలాత్మాను భావినః,
యత్ర యత్రేంద్రియాసక్తి స్తత్ర తత్ర శివాత్మతా॥ ౭౮

అజ్ఞానబంధము సడలి కేవల పరమాత్మానుభవము గలవానికి ఏయే విషయమందు ఇంద్రియవ్యాపార ముండునో ఆయా విషయమందు శివస్వరూపమే తోఁచుచుండును.

రాగద్వేషాదయో భావాః సంసారక్లేశ కారణం,
తేషా ముపరమో యత్ర తత్ర భావః శివాత్మకః॥ ౭౯

చెలిమి, పగ మున్నగు భావములెల్ల సంసారదుఃఖమునకు మూల కారణములు. ఇచ్ఛాద్వేషములు అణఁగిన శివయోగియందయిన భావములెల్ల శివస్వరూపములే యగును.

యథా సూర్య సమాక్రాంతౌ న శక్నోతి తమః సదా,
తథా ప్రకాశ మాత్మానం నాఽవిద్యాఽఽక్రామతి స్వయమ్॥

చీఁకటి సూర్యునిఁ గ్రమ్ముకొనఁజాలనట్లే అజ్ఞానము శివస్వరూపుఁడును, స్వయంప్రకాశుఁడునైన శివయోగిని గ్రమ్ముకొనఁజాలదు.

## 48. జ్ఞానప్రకాశస్థలము

ముక్తస్య జ్ఞాన సంబంధో జ్ఞేయాభావః స్వభావతః,
ఉపాధి సహితం జ్ఞానం న భేద మతివర్తతే॥ ౮౦

జీవన్ముక్తుఁడైన శివయోగియొక్క జ్ఞానసంబంధము సహజముగా జ్ఞేయరహితమై యుండును. మహాజ్ఞానియైన శివయోగియొక్క జ్ఞానము

ఉపాధి లేనిదగుటచేత జ్ఞాత, జ్ఞేయము, జ్ఞానము అను త్రిపుటిభేదము లేనిదై యుండును. ఉపాధిసహితమైన జ్ఞానము ఆ త్రిపుటి భేదమును దాటలేదని భావము.

జ్ఞానస్య విషయే తత్త్వే శివాఖ్యే చిత్సుఖాత్మని,
ఆత్మైకత్వాను సంధానం జ్ఞాన మిత్యుచ్యతే బుధైః॥ ౮౨

జ్ఞానమునకు విషయమై చిదానంద స్వరూపమైన శివ తత్త్వమందు ఆత్మైక్యానుసంధానమే జ్ఞానమని పండితు లందురు.

అపరిచ్ఛిన్న మానందం సత్తాకారం జగన్మయం,
బ్రహ్మేతి లక్షణ జ్ఞానం బ్రహ్మజ్ఞాన మిహోచ్యతే॥ ౮౩

బ్రహ్మము పరిపూర్ణమైనది, ఆనందస్వరూపమైనది, త్రికాలము లందు నాశములేనిది, జగత్స్వరూపమైనది యనెడి లక్షణ జ్ఞానమే బ్రహ్మజ్ఞాన మనఁబడుచున్నది.

బ్రహ్మజ్ఞానే సముత్పన్నే విశ్వోపాధి వివర్జితే,
సర్వం సంవిన్మయం భాతి తదన్యన్నైవ దృశ్యతే॥ ౮౪

ఎట్టి యుపాధులును లేని బ్రహ్మజ్ఞానము కలుగఁగా సర్వమును జ్ఞాన స్వరూపముగానే తోఁచును. దానికి వేఱుగా నేదియు గానరాదు.

తస్మా దద్వైత విజ్ఞాన మపవర్గస్య కారణం,
భావయ& సతతం యోగీ సంసారేణ న లిప్యతే॥ ౮౫

అందువలన మోక్షమునకు మూలకారణమైన శివాద్వైతజ్ఞానము ననుభవించు శివయోగి యేనాఁడును జనన మరణ రూప సంసారముతో నంటఁడు.

నిత్యే నిర్మల సత్త్వయోగిని పరే నిర్వాసనే నిష్కలే
సర్వాతీత పదే చరాచరమయే సత్తాత్మని జ్యోతిషి,
సంవిద్వ్యోమ్ని శివే విలీన హృదయ స్తద్భేద వైముఖ్యతః,
సాక్షాత్సర్వగతో విభాతి విగలద్విశ్వః స్వయం సంయమీ॥ ౮౬

శాశ్వతుఁడును, శుద్ధసత్త్వగుణముతోఁ గూడినవాఁడును, సర్వశ్రేష్ఠుఁడును, ఎట్టివాసనలు లేనివాఁడును, హేయకళలు లేనివాఁడును,

అన్నిటిని మీఱిన స్థానమం దున్నవాఁడును, చరాచర ప్రపంచ స్వరూపుఁడును, పారమార్థిక వస్తురూపుఁడును, తేజఃస్వరూపుఁడును, జ్ఞానాకాశస్వరూపుఁడును అయిన పరమశివునందుఁ జేరిపోయిన హృదయము గల విశ్వవ్యాపకుఁడైన శివయోగి విశ్వభేదము తొలఁగినవాఁడై తానే తానై (స్వస్వరూపముతో) ప్రకాశించును.

ఇది
సిద్ధాంత శిఖామణి యందలి - లింగస్థలీయ శరణ స్థలమున
దీక్షాపాదోదక స్థలాదులైన పండ్రెండు స్థలములుగల
పందొమ్మిదవ పరిచ్ఛేదము
శ్రీ శివార్పణము.



ఓం నమః శివాయ
శ్రీ మాత్రే నమః
శ్రీ జగద్గురు పంచాచార్యాః ప్రసీదంతు

# ఇరువదవ పరిచ్ఛేదము

## ఐక్య స్థలము.

అగస్త్యమహర్షి యనుచున్నాఁడు:

స్థలభేదా స్త్వయా ప్రోక్తాః శరణస్థల సంశ్రితాః,
ఐక్యస్థల గతాన్ బ్రూహి స్థలభేదాన్ గణేంద్ర మే॥　　౧

'ఓ గణాధీశ్వరా! శరణస్థలమందలి స్థలభేదములను దెల్పితివి. ఐక్యస్థలమునకుఁజెందిన స్థలవిశేషముల నన్నిటిని దెల్పు' మని వేఁడఁగా,

శ్రీ రేణుక గణాధీశ్వరులు పలుకుచున్నారు:

స్థలానాం నవకం చైక్య స్థలేఽస్మిన్ పరికీర్త్యతే,
తత్రస్వీకృత ప్రసాదాఖ్య స్థలమాదౌ ప్రకీర్తితమ్॥　　౨

శిష్టోదన స్థలం చాథ చరాచర లయస్థలం,
భాండస్థలం తతః ప్రోక్తం భాజనస్థల ముత్తమమ్॥ ౩

అంగలేప స్థలం పశ్చాత్ స్వపరాజ్ఞ స్థలం తతః,
భావాభావ వినాశం చ జ్ఞాన శూన్య స్థలం తతః,
తదేషాం క్రమశో వక్ష్యే శృణు తాపస లక్షణమ్॥ ౪

ఓ మహర్షీ! ఐక్యస్థలమందు 1. స్వీకృత ప్రసాదస్థలము, 2. శిష్టోదన స్థలము, 3. చరాచర లయస్థలము, 4. భాండస్థలము, 5. భాజనస్థలము, 6. అంగాలేపస్థలము, 7. స్వపరాజ్ఞస్థలము, 8. భావాభావ లయస్థలము, 9. జ్ఞానశూన్య స్థలము అని 9 స్థలములు గలవు. వాని లక్షణములను వరుసగాఁ జెప్పెద వినుము.

## 49. స్వీకృత ప్రసాద స్థలము.

మాతృ మేయ ప్రమాణాది వ్యవహార విహారిణీం,
సంవి త్సాక్షాత్కృతిం లబ్ధ్వా యోగీ స్వాత్మని తిష్ఠతి॥ ౫

ప్రమాత = ఎఱింగెడివాఁడు, మేయము = యథార్థముగా నెఱుంగ దగినది, ప్రమాణము = ఎఱుక (ప్రత్యక్షాది జ్ఞానము) మున్నగు వ్యవహారములను లయముచేయు (దీనికే త్రిపుటిలయ మందురు) బ్రహ్మసాక్షాత్కారమునొంది శివయోగి స్వస్వరూపమునందే యుండును.

అద్వైత బోధ నిర్ధూత భేదావేశస్య యోగినః,
సాక్షాత్కృత మహాసంవి త్ప్రకాశస్య క్వ బంధనమ్॥ ౬

శివాద్వైత జ్ఞానముచేత అంగ లింగ రూపమైన జీవేశ్వరుల భేదము తొలఁగినట్టియు, పూర్ణ తేజస్సును సాక్షాత్కరించుకొన్నట్టియు శివయోగికి సంసారబంధమే లేదు.

చిదాత్మని శివే న్యస్తం జగదేత చ్చరాచరం,
దృశ్యతే తన్మయం సర్వ మగ్నౌ కాష్ఠాదికం యథా॥ ౭

అగ్నియందు వేయఁబడిన కట్టెలు నేయి మున్నగునవన్నియు అగ్ని రూపముగానే కానవచ్చునట్లు జ్ఞానస్వరూపుఁడైన శివునందు నిల్కడ

గల శివయోగికి స్వచరాచర జగత్తంతయు శివరూపముగానే కాన వచ్చును.

> న భాతి పృథ్వీ న జలం న తేజో నైవ మారుతః,
> నాకాశో నాపరం తత్త్వం శివే దృష్టే చిదాత్మని॥ ౮

జ్ఞానస్వరూపుఁడైన శివుఁడే కానవచ్చునపుడు పృథివ్యాది యే యితరతత్త్వమును దోఁచదు. పృథివ్యాదిగ ముప్పదియాఱు తత్త్వములును శివునుండియే పుట్టుటచేత సర్వము పరశివ స్వరూపముగానే తోఁచును.

> జ్యోతిర్లింగే చిదాకారే జ్వలత్యంత ర్నిరంతరం,
> విలీనం నిఖిలం తత్త్వం పశ్యన్ యోగీ న లిప్యతే॥ ౯

జ్ఞానస్వరూపమై యెపుడపు డనక హృదయకమలమందుఁ బ్రకాశించు ఆ మహాలింగమందు సూక్ష్మరూపముతో నణఁగియుండు పృథివ్యాది సమస్త తత్త్వములను గాంచు శివయోగి సంసారముతో నుండఁడు.

> అంతర్ముఖేన మనసా స్వాత్మ జ్యోతిషి చిన్మయే,
> సర్వా నప్యర్థ విషయాన్ జుహ్వన్యోగీ ప్రమోదతే॥ ౧౦

శివయోగి లోనికి మఱలిన ముఖముగల మనస్సు జ్ఞానమనెడి స్వస్వరూపాగ్నియందు సమస్త విషయములను హోమము చేయుచు సంతసించును. అనఁగా నాతఁడు విషయదూరుఁడై, అంతర్ముఖుఁడై మహానందమందే యుండునని భావము.

> సచ్చిదానంద జలధౌ శివే స్వాత్మని నిర్మలః,
> సమర్ప్య సకలాన్ భుంక్తే విషయాం స్తత్ప్రసాదతః॥ ౧౧

ఆణవాదిమలములు తొలఁగినట్టి శివయోగి సచ్చిదానంద సముద్రుఁడును, తనంతటఁ దా వెలుఁగువాఁడును అయిన శివునందు శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము లనెడి విషయములను సమర్పించి పరిశుద్ధమైన వానిని శివప్రసాదముగా ఉపభోగించును.

## 50. శిష్టౌదనస్థలము

ప్రకాశతే యా సర్వేషాం మాయా సైవౌదనాకృతిః,
లీయతే యత్ర చిల్లింగే శిష్టం తత్పరికీర్తితమ్॥ ౧౨

అన్నిటియందును బ్రకాశించు మాయయే ఓదనరూపము (అనుభవింపఁబడు వస్తువు) గా నున్నది (ఓదనము = వండఁబడిన యన్నము). ఇట్టి యోదనరూపమైన మాయ జ్ఞానశక్తిసహితమైన యే మహాలింగమందు అణఁగిపోవునో ఆ మహాలింగరూపమే శిష్టౌదన మనఁబడును.

జగత్యస్మిన్ పరిగ్రస్తే మాయాపాశ విజృంభితే,
స్వాత్మజ్యోతిషి బోధేన తదేక మవశిష్యతే॥ ౧౩

మాయాపాశబద్ధమైన యీ జగత్తు జ్ఞానముచేత ఆక్రమింపఁబడఁగా స్వస్వరూప తేజస్సునందు ఆ మాయాతత్త్వ మొక్కటే మిగులును

అఖండ సచ్చిదానంద పరబ్రహ్మ స్వరూపిణః,
జీవన్ముక్తస్య ధీఃస్య మాయా కైంకర్యవాదినీ॥ ౧౪

అఖండ సచ్చిదానందస్వరూప పరబ్రహ్మస్వరూపుఁడును, నిర్వికారచిత్తుఁడును, జీవన్ముక్తుఁడును నైన శివయోగికి మాయ దాసురాలు.

విశ్వ సంమోహినీ మాయా బహుశక్తి ర్నిరంకుశా,
శివైకత్వ ముపేతస్య స పురః స్థాతు మీహతే॥ ౧౫

సర్వజగత్తులను మోహింపఁజేయునదియు, పలువిధములైన శక్తులతోఁగూడినదియు, అడ్డులేనిదియు నైన ఆ మాయ శివునితో దాదాత్మ్యము నొందిన శివయోగియెదుట నిలువలేదు.

జ్యోతిర్లింగే చిదాకారే నిమగ్నేన మహాత్మనా,
భుజ్యమానా యథా యోగం నశ్యంతి విషయాః స్వతః॥ ౧౬

జ్ఞానస్వరూపమైన జ్యోతిర్లింగమందు మునిఁగిపోయిన శివయోగిచేత అనుభవింపఁబడుచున్న విషయములు తామే వ్యర్థమై నష్టపడును.

శబ్దాదయోఽపి విషయా భుజ్యమానా స్తదింద్రియైః,
ఆత్మన్యేవ విలీయన్తే సరితః సాగరే యథా॥ ౧౭

శబ్ద, స్పర్శ, రూప, రస, గంధము లనెడి విషయములు, శ్రోత్ర త్వక్చక్షుర్జిహ్వా ఘ్రాణము లనెడి యింద్రియములతో డనే నదులన్నియు సముద్రమునం దణఁగిపోవునట్లు ఆత్మస్వరూపమందే యణఁగును.

అస్తజాత మశేషంతు గ్రసన్ యోగీ ప్రశామ్యతి,
స్వాత్మనీవ స్థితం భాను స్తేజో జాల మశేషతః॥ ౧౮

సాయంవేళ తన కిరణముల నన్నిటిని దనయందే యణఁగించుకొను సూర్యుఁడువలె శివయోగి విషయముల నన్నిటిని తనయందే యణఁగించుకొని శాంతుఁడగును.

## 51. చరాచర లయ స్థలము

లింగైక్యేతు సమాపన్నే చరాచర జగల్లయే,
నిర్దేహీ చ భవేద్యోగీ చరాచర వినాశకః॥ ౧౯

శివునం దేకత్వము నొందిన శివయోగియందు చరాచర జగత్తు లయ మొందఁగా ఆతఁడు విదేహుఁడై చరాచర వినాశకుఁ డగును. ఇదె చరాచర లయస్థల మనఁబడును.

యథా మేఘా స్సముద్భూతా విలీయన్తే నభః స్థలే,
తథాఽఽత్మని విలీయన్తే విషయాః స్వానుభావినః॥ ౨౦

ఆకసమునఁ బుట్టిన మబ్బులు క్రమముగా నాకసమందే యణఁగిపోవునట్లు స్వస్వరూపానుభవముగల శివయోగి యాత్మయందే పుట్టిన శబ్దాదివిషయము లాత్మయందే లయ మొందును.

జాగ్రత్స్వప్న సుషుప్తిభ్యః పరావస్థా ముపేయుషః,
కిం వా ప్రమాణం కిం జ్ఞేయం కిం వా జ్ఞానస్య సాధనమ్॥ ౨౧

జాగ్రత్స్వప్న సుషుప్తు లనెడి మూఁడవస్థలను మీఱి తుర్యావస్థ నొందిన శివయోగికిఁ బ్రమాణమును లేదు. తెలియఁ దగినదియు లేదు. తెలియఁదగిన సాధనమును లేదు.

తుర్యాతీత పదం యత్తద్దూరం వాఙ్మనసాధ్వనః,
అనుప్రవిశ్య తద్యోగీ న భూయో విశ్వ మీక్షతే॥ ౨౨

తుర్యాతీతావస్థ యన్నది వాఙ్మనసుల కందరానిది. అనఁగా స్తుతి ధ్యానములకు దూరమైనది. శివయోగి యట్టి శ్రేష్ఠమైన స్థానమును ప్రవేశించి మరల ప్రపంచమును జూడఁడు.

నాన్యత్పశ్యతి యోగీంద్రో నాన్యజ్జానాతి కించన,
నాన్యచ్ఛృణోతి స ద్రష్టే చిదానందమయే శివే॥ ౨౩

జ్ఞానానందమయ స్వరూపుఁడైన శివుఁడు సాక్షాత్కరింపఁగా శివయోగీశుఁడు తనకు వేఱుగా నన్యమును జూడఁడు. వినఁడు. అనఁగా స్వస్వరూపమును విడిచి యన్యమును దేనిని భావింపఁడు.

## 52. భాండస్థలము

బ్రహ్మాండ శత కోటీనాం సర్గ స్థితి లయాన్ ప్రతి.
స్థాన భూతో విమర్శో య స్తద్భాండస్థల ముచ్యతే। ౨౪

అసంఖ్యాకములైన బ్రహ్మాండములు పుట్టుటకును, నిల్చుటకును, అణఁగుటకును ఆధారభూతమైన విమర్శశక్తి యనెడి జ్ఞానవిశేషమే (విశ్వాత్మకుఁడైన శివుఁడే నేనను తెలివి) భాండస్థల మనఁబడును.

విమర్శాఖ్యా పరాశక్తి ర్విశ్వోద్భాసన కారిణీ,
సాక్షిణీ సర్వ తత్త్వానాం సమింధే సర్వతో ముఖీ॥ ౨౫

విమర్శమనెడి పరాశక్తియే విశ్వమును ప్రకాశింపఁ జేయునదియు, సర్వతత్త్వములకును సాక్షిణియైనదియు, అన్నియెడలను ప్రకాశించునదియునై యున్నది.

విశ్వం యత్ర లయం యాతి విభాత్యాత్మా చిదాకృతిః,
సదానంద మయ స్సాక్షాత్ సా విమర్శమయీ కలా॥ ౨౬

సచరాచర జగత్తంతయు దేనియం దడఁగునో, సచ్చిదానంద రూప పరమాత్మ దేనియందుఁ బ్రత్యక్షముగాఁ బ్రకాశించునో అదే విమర్శ రూప శక్తి.

పరాహంతా సమావేశ పరిపూర్ణ విమర్శవాన్,
సర్వజ్ఞః సర్వగః సాక్షీ సర్వకర్తా మహేశ్వరః॥ ౨౭

శివయోగి "శివోఽహం" అనెడి పరాహంత యొక్క ఆక్రమణముచే విమర్శశక్తి గలవాఁడై సర్వజ్ఞుఁడును, సర్వసాక్షియు, సర్వ వ్యాపకుఁడును, సర్వకర్తయు నైన పరమేశ్వరుఁ డగును.

విశ్వాధారం మహాసంవి త్ప్రకాశ పరిపూరితం,
పరాహంతా మయం ప్రాహు ర్విమర్శం పరమాత్మనః॥ ౨౮

సర్వజగదాధారుఁడును, మహాజ్ఞాన ప్రకాశపూర్ణుఁడు నైన పరమాత్మయొక్క యీ విమర్శశక్తినే 'పరాహంతా' స్వరూపమని జ్ఞాను లందురు. "ఓం దేవాహ్వై స్వర్గం లోకమాయంస్తే రుద్రమపృచ్ఛన్ కో భవా నితి, సోఽబ్రవీ దహమేకః ప్రథమ మాసం వర్తామి చ భవిష్యామి చ నాన్యః కశ్చి న్మత్తో వ్యతిరిక్త ఇతి." ఇత్యాది వాక్యములచే అథర్వ శిరః శ్రుతి మున్నగు ననేకశ్రుతులు పరబ్రహ్మము "అహం" పదవాచ్యమని తెలుపుచున్నవి. అహంపద వాచ్యమైన పరబ్రహ్మము యొక్క అసాధారణ ధర్మమే పరాహంతయై యున్నది.

విమర్శ భాండే విన్యస్త విశ్వతత్త్వ విజృంభణః,
అనన్యముఖ సంప్రేక్షీ ముక్తః స్వాత్మని తిష్ఠతి॥ ౨౯

విమర్శశక్తి రూపమైన జ్ఞానవిశేషమనెడి పాత్రయందు సర్వ తత్త్వములనుంచి యానందించు జీవన్ముక్తుఁడు తన స్వరూపమునకు వేఱుగా మఱియొకదానిని గానక స్వస్వరూపమందే యుండును.

## ౫౩. భాజన స్థలము.

సమస్త జగదండానాం సృష్టిస్థిత్యంత కారణం,
విమర్శో భాసతే యత్ర తద్భాజన మిహోచ్యతే॥ ౩౦

ఈ జగదండము లన్నియు పుట్టుటకును, నిల్చుటకును, గిట్టుటకును, కారణమైన విమర్శశక్తిరూప జ్ఞానము ఏ పరశివబ్రహ్మమందుఁ బ్రకాశించునో, ఆ పరశివబ్రహ్మమే భాజన మనఁబడును.

విమర్శాఖ్యా పరాశక్తి ర్విశ్వవైచిత్ర్యకారిణీ,
యస్మిన్ప్రతిష్ఠితా బ్రహ్మ తదిదం విశ్వభాజనమ్॥ ౩౧

వింతవింతయగు నీ విశ్వసృష్టినిజేయు నీ విమర్శముపేరి పరాశక్తి దేనియందు అవినాభావ సంబంధముతో నిల్చునో (ఎపుడును విడువక బ్రహ్మము వేఱు, శక్తి వేఱు అను భేదము లేకయుండునో) ఆబ్రహ్మమే విశ్వభాజన మనఁబడును.

యథా చన్ద్రే స్థిరా జ్యోత్స్నా విశ్వవస్తు ప్రకాశినీ,
తథా శక్తి ర్విమర్శాఖ్యా ప్రకాశే బ్రహ్మణి స్థిరా॥ 32

సర్వవస్తువులను బ్రకాశింపఁజేయు వెన్నెల చంద్రునందెటులు స్థిరమై యుండునో అటులే విమర్శమనెడి యీశక్తి ప్రకాశ స్వరూపబ్రహ్మమందు సుస్థిరమై యుండును. అనఁగా వెన్నెలను విడిచి చంద్రుఁడును, చంద్రుని విడిచి వెన్నెలయు నెట్లుండవో అటులే శివుని వీడి శక్తియు, శక్తిని వీడి శివుఁడును ఉండరనుటయే దీని భావము.

వృక్షస్థం పత్ర పుష్పాది వటబీజ స్థితం యథా,
తథా హృదయ బీజస్థం విశ్వమేత త్పరాత్మనః॥ 33

అతి విశాలమైన మఱ్ఱిచెట్టుయొక్క ఆకులు, కొమ్మలు, పూవులు, మున్నగునవి మిగులఁ జిన్నదియైన విత్తునందు సూక్ష్మరూపముతో నుండునట్లే చరాచరాత్మకమైన సర్వప్రపంచమును బరమేశ్వరుని హృదయమనెడి బీజమందు (అనఁగా దనతో నెడసియుండని విమర్శ శక్తియందు) సూక్ష్మరూపముతో నుండును. ఇంద్రియ గోచరమగు నీ స్థూలప్రపంచము లయమైనను ఆ పరమేశ్వరునియందు సూక్ష్మరూపముతో నుండుటచేతనే శుద్ధాద్వైతులనునట్లు ఈ ప్రపంచము మిథ్యగాక సత్యమైనదని భావము.

అ కారః శివ ఆఖ్యాతో హం కారః శక్తి రుచ్యతే,
శివశక్తి మయం బ్రహ్మ స్థితమేక మహం పదే॥ 34

'అ' కారము శివుఁడని, 'హం' కారము శక్తియని చెప్పఁబడును. అ+హం, అహం అయినది. అనగా శివశక్తిరూప బ్రహ్మము అహం= నేను అనెడి యర్థమునిచ్చు మాటయందే యున్నది. అహం అనఁగా శివశక్త్యాత్మక బ్రహ్మమని భావము.

అహంతాం పరమాం ప్రాప్య శివశక్తిమయీం స్థిరాం,
బ్రహ్మభూయం గతో యోగీ విశ్వాత్మా ప్రతిభాసతే॥ 36

పరశివత్వము నొందిన శివయోగి సర్వోత్కృష్టమును, నిత్యమును, శివశక్త్యాత్మకమునైన అహంతను బొంది, సకల చరాచర ప్రపంచ స్వరూపుఁడై ప్రకాశించును. "స్యాద్బ్రహ్మభూయం బ్రహ్మత్వం బ్రహ్మసాయుజ్య మిత్యపి" అని అమరకోశము.

అంతఃకరణ రూపేణ జగదంకుర రూపతః,
యస్మి న్విభాతి చిచ్ఛక్తి ర్బ్రహ్మభూతః స ఉచ్యతే॥ 37

విమర్శ జ్ఞానశక్తి మూలాహంకార రూపముగాను, సూక్ష్మ జగద్రూపముగాను ఎవనియందుఁ బ్రకాశించునో, ఆ శివయోగియే పరబ్రహ్మ స్వరూపుఁ డనఁబడును. శివునితో ఐక్యమొందిన శివయోగి పరశివబ్రహ్మమువలెనే శక్తివికాసము కలవాఁడని భావము.

## 54. అంగాలేపస్థలము

దిక్కాలా ద్యనవచ్ఛిన్నం చిదానంద మయం మహత్,
యస్య రూప మిదం ఖ్యాతం సోఽంగాలేప ఇహోచ్యతే॥ 38

పరబ్రహ్మత్వము నొందిన యేశివయోగి స్వరూపము దేశకాలాదులచేఁ దెంపు లేనిదియు, జ్ఞానానందస్వరూపమును, గొప్పదియు, ప్రసిద్ధమునై యుండునో, అతఁడే (అంగ+అలేప) అంగాలేపుఁ డనఁబడును. అనఁగా శరీరసంబంధమైన కర్మ లేనివాఁడు. ఇది అంగాలేప స్థలము.

సమస్త జగదాత్మాఽపి సంవిద్రూపో మహామతిః,
లిప్యతే నైవ సంసారై ర్యథా ధూమాదిభి ర్నభః॥ 39

పొగ, ధూళి మున్నగువాని యంటు ఆకాశమునకు లేనటులే, జ్ఞానస్వరూపుఁడైన శివయోగి సర్వప్రపంచ స్వరూపుఁడైనను సాంసారిక కర్మఫలముతో నంటుఁడు.

న దేవత్వం న మానుష్యం న తిర్యక్త్వం న చాన్యథా,
సర్వాకారత్వ మాఖ్యాతం జీవన్ముక్తస్య యోగినః॥ 40

జీవన్ముక్తుఁడైనశివయోగికిఁ బుణ్యాతిరేకమునఁగలుగు దేవత్వమును లేదు, పాపాతిరేకమునఁ గలుగు పశుపక్ష్యాది జన్మమును లేదు. పుణ్యాపాప మిశ్రకర్మముల వలనఁ గలుఁగు మనుష్యత్వమును లేదు. అతనికి విశ్వాకారత్వమే చెప్పఁబడినది.

న విధి ర్న నిషేధశ్చ న వికల్పో న వాసనా,
కేవలం చిత్స్వరూపస్య గలిత ప్రాకృతాత్మనః॥ ౪౦

ప్రాకృతత్వము తొలఁగి కేవల జ్ఞానస్వరూపుఁడైన యా శివయోగికి విధి లేదు, నిషేధము లేదు, వికల్పము లేదు, సంసారవాసన లేదు.

అనశ్వర మనిర్దేశ్యం యథావ్యోమ ప్రకాశతే,
తథా బ్రహ్మాపి చైతన్య మాత్ర వైశేషికీ కలా॥ ౪౧

ఆకాశము నాశనము లేనిదై, యిది యిట్లుండునని తెలుపరానిదై ప్రకాశించుచుండునట్లు, నాశనరహితమును, అనిర్దేశ్యము నైన పరబ్రహ్మము ప్రకాశించుచున్నది. ఈ జ్ఞానాకాశ రూప పరబ్రహ్మమందు చైతన్యమే విశేషకళ.

ఘటాదిషు పృథగ్భూతం యథాకాశం న భిద్యతే,
తథోపాధి గతం బ్రహ్మ నానారూపం నభిద్యతే॥ ౪౨

కుండ, యిల్లు మున్నగు నుపాధిసంబంధముచేత ఆకాశము వేర్వేఱుగా నున్నట్లు కానఁబడినను యథార్థముగా అది వేఱుగా లేక ఏకముగా నున్నటులే పరబ్రహ్మము ఉపాధిసంబంధముచేత దేవతలు, మానవులు మున్నగు పలువిధములుగ దోఁచినను వాస్తవముగా వేఱుగా లేదు. ఒక్కటిగానే యున్నది.

## 55. స్వపరాజ్ఞ స్థలము

దిక్కాలా ద్యనవచ్ఛిన్న తేజోరూప సమాశ్రయాత్,
స్వరూపజ్ఞాన విరహాత్ స్వపరాజ్ఞ స్థలం విదుః॥ ౪౩

శివయోగి దేశకాలాదులచేఁ దెంపులేని బ్రహ్మతేజఃస్వరూపుఁడై యుండుటచే "తన – పెర" అను జ్ఞానము లేకపోవుటవలన అతఁడు

స్వరూపాజ్ఞుఁ డనఁబడును. దీనినే జ్ఞానులు 'స్వపరాజ్ఞ' స్థల మందురు. (స్వ + పర + అజ్ఞ + స్థలము = ఇది నేను, ఇతఁడు పరుఁడు అను మాట తెలియకపోవుట.)

అప్రమేయే చిదాకారే బ్రహ్మణ్యద్వైత వైభవే,
విలీనః కిం ను జానాతి స్వాత్మానం పరమేవ వా॥ ౪౪

అప్రమేయమును, జ్ఞానస్వరూపమును "ఏకమేవాద్వితీయం బ్రహ్మ" అనెడి శ్రుతివాక్యానుసారముగా రెండవది లేక ఉన్నది తానొక్కఁడే యనెడి వైభవముగల పరబ్రహ్మమునందు సామరస్యమునొందిన శివయోగి తననుగాని, తనకంటె వేఱయిన వస్తువునుగాని తెలిసికొనుటెట్లు?

యత్ర నాస్తి భిదా యోగా దహం త్వ మితి విభ్రమః,
న సంయోగో వియోగశ్చ న జ్ఞేయ జ్ఞాతృ కల్పనా॥ ౪౫

అద్వైత వైభవము గల ఆ పరాత్పర వస్తువునందు సామరస్యము గలుగుటచేత జీవాత్మకు భేదము లేకపోవుటవలన నేను, నీవు అనెడి భ్రాంతి లేదు. కలియుట, విడుట యనునవి లేవు. తెలియువాఁడు, తెలియఁబడునది యను మాట లేదు.

న బంధో న చ ముక్తిశ్చ న దేవా ద్యభిమానితా,
న సుఖం నైవ దుఃఖం చ నా జ్ఞానం జ్ఞానమేవ వా॥ ౪౬
నోత్కృష్టత్వం న హీనత్వం నో పరిష్టా న్నచా ప్యధః,
న పశ్చా న్నైవ పురతో న బాహ్యం న చ చాంతరమ్॥ ౪౭
సర్వాకారే చిదానందే సత్యరూపిణి శాశ్వతే,
పరాకాశమయే తస్మిన్ పరబ్రహ్మణి నిర్మలే॥ ౪౮
ఏకీభావ ముపేతానాం యోగినాం పరమాత్మనాం,
పరాపర పరిజ్ఞాన పరిహాస కథా కుతః॥ ౪౯

కట్టు విడుపులు లేవు. నేను దేవతను, నేను మనుష్యుఁడను అనునభిమానము లేదు; సుఖదుఃఖములు లేవు; తెలివి, తెలివిలేమి యనునవి లేవు; గొప్ప కొలఁదులు లేవు; క్రింది మీఁదులు లేవు; వెనుక ముందులు

లేవు; లో వెలులు లేవు; సర్వప్రపంచ రూపమును, చిద్రూపమును, ఆనందరూపమును, శాశ్వతమును, నిర్మలమును, పరాకాశస్వరూపము నైన పరబ్రహ్మమందు సామరస్యము నొంది పరబ్రహ్మభూయులైన శివయోగులకు 'తాను-ఇతరము' అనెడి పరిజ్ఞానముచేతనైన నగుబాటు ఎట్లగును ? అనఁగా శివయోగులకు స్వపరజ్ఞానము కలదనుట కేవలము హాస్యాస్పదమని భావము.

## 56. భావాభావ లయస్థలము

ప్రతీయమానౌ విద్యేతే భావాభావౌ న కుత్ర చిత్,
లింగైక్యే సతి య త్తస్మా ద్భావాభావ లయస్థలమ్॥ ౫౦

శివయోగి శివునందుఁ దాదాత్మ్యము నొందఁగా అతనియందు సామాన్యముగా జనులందు తోఁచుచుండు "నేనున్నా" ననెడి భావముగాని "నేను లే" ననెడి యభావముగాని యెన్నఁడును లేక పోవుటవలన నిది భావాభావలయస్థల మనఁబడును.

అహం భావస్య శూన్యత్వా దభావస్య తథాత్మనః,
భావాభావ వినిర్ముక్తో జీవన్ముక్తః ప్రకాశతే॥ ౫౧

జీవన్ముక్తుఁడైన శివయోగి "నేనున్నా" ననెడి భావమునకును "నేను లే" ననెడి యభావమునకును దూరమై యుండుటచేత ఇతఁడు భావాభావములతో విడివడి ప్రకాశించును.

సుఖదుఃఖాది యోగేషు నా భావో భావ ఏవ వా,
విద్యతే చిత్స్వరూపస్య నిర్లేపస్య మహాత్మనః॥ ౫౨

జ్ఞానస్వరూపుఁడును, దేనిని అంటనివాఁడును, మహాత్ముఁడునైన శివయోగికి సుఖదుఃఖములు నాకున్నవి యనెడి భావముగాని నాకు లేవనెడి యభావముగాని లేదు.

త్వం తా హంతా వినిర్ముక్తే నిర్వికల్పే చిదంబరే,
ఏకీభూతస్య సిద్ధస్య భావాభావ కథా కుతః॥ ౫౩

నీవు, నేను అనెడి భేదములేనివాఁడును, మార్పులేనివాఁడును, జ్ఞానాకాశ స్వరూపుఁడునై బ్రహ్మముతో నేకత్వము నొందిన శివయోగసిద్ధునకు భావము, అభావము అను రెండిటి ప్రసక్తియే లేదు.

## 57. జ్ఞాన శూన్య స్థలము

పరస్పర సమాపేక్ష భావాభావ వివేచనం,
జ్ఞానం బ్రహ్మణి యన్నాస్తి జ్ఞానశూన్య స్థలం విదుః॥ ౫౪

ఒండొంటి యపేక్షతోఁ గూడిన ఉన్నది – లేదు అనెడి భావాభావముల భేదజ్ఞానము పరబ్రహ్మస్వరూపుఁడైన యే శివయోగియందుండదో, అట్టి వాని భేదజ్ఞానశూన్యతను బ్రతిపాదించు స్థలమును "జ్ఞానశూన్య స్థల" మందురు. "జ్ఞానం బంధః" అనెడి శివసూత్రమందలి జ్ఞాన పదమునకు భేదజ్ఞానమని తెలియునట్లే, యిక్కడను జ్ఞానశూన్య స్థల మనెడి పదమునకు భేద జ్ఞాన శూన్య స్థలమని యర్థము తెలియవలయును.

సర్వాత్మని పరే తత్త్వే భేద శంకా వివర్జితే,
జ్ఞాత్రాది వ్యవహారోత్థం కుతో జ్ఞానం విభావ్యతే॥ ౫౫

భేదమువలని సందేహము లేనట్టియు, సర్వప్రపంచ స్వరూప మైనట్టియు పరతత్త్వమందు "తెలియువాఁడు. తెలియఁబడునది" అనెడు వ్యవహారముచేఁ గలుగు భేదజ్ఞాన మెన్నఁడు నుండదు.

నిర్వికారం నిరాకారం నిత్యం సీమా వివర్జితం,
వ్యోమవ త్పరమం బ్రహ్మ నిర్వికల్పతయా స్థితమ్॥ ౫౬

మార్పు లేనిదియు, హేయాకారము లేనిదియు, నిత్యమును, హద్దు లేనిదియు నైన పరబ్రహ్మము ఆకాశమువలెనే భేదశూన్యమై యున్నది.

న పృథ్వ్యాదీని భూతాని న గ్రహా నైవ తారకాః,
న దేవా న మనుష్యాశ్చ న తిర్యంచో న చాపరే॥ ౫౭

స్థూలములైన పృథివ్యాది భూతములుగాని, సూర్యాది గ్రహములుగాని, అశ్విన్యాది నక్షత్రములుగాని, దేవతలుగాని, మనుష్యులుగాని, పశు పక్ష్యాదులుగాని, మఱి యే వస్తువులుగాని దానియందు లేవు.

తస్మిన్ కేవల చిన్మాత్ర సత్తానందైక లక్షణే,
త్వంతాఽహంతాది సంయుక్తం విజ్ఞానం కేన భావ్యతే॥ ౫౮

కేవల సచ్చిదానందస్వరూపమైన పరబ్రహ్మమందు "నేను – నీవు" అనెడి భావములతోఁ గూడిన భేదజ్ఞాన ముంటునని యూహించువాఁడుండఁడు.

కేవలం సచ్చిదానంద ప్రకాశాద్వయ లక్షణం,
నిర్వికల్పం పరాకాశం పరబ్రహ్మ ప్రకాశతే॥ ౫౯

కేవల సచ్చిదానంద ప్రకాశమును, అద్వితీయమును, నిర్వికల్పము నైన పరబ్రహ్మము మహాకాశస్వరూపముగాఁ బ్రకాశించును.

జ్యోతిర్లింగే చిదాకారే స్వప్రకాశే నిరంతరే,
ఏకీభావ ముపేతస్య కథం జ్ఞానస్య సంభవః॥ ౬౦

తేజోలింగస్వరూపమును, జ్ఞానస్వరూపమును అయిన స్వయంప్రకాశ పరబ్రహ్మమందు సమరసభావము నొందిన శివయోగికి భేదజ్ఞాన మేనాఁడును నుండదు.

జలే జల మివ న్యస్తం వహ్నౌ వహ్ని రివార్పితః,
పరబ్రహ్మణి లీనాత్మా విభాగేన న దృశ్యతే॥ ౬౧

నీటియందు నీటివలె, అగ్నియందు అగ్నివలెనే పరబ్రహ్మమందుఁ దన్నుఁదా లయముచేసుకొన్న శివయోగి జీవభావమునకు దూరుఁడై పరబ్రహ్మమందు సామరస్య మొందినపైని పరబ్రహ్మస్వరూపముకంటె వేరుగాఁ దోఁచఁబడఁడు. ఇదే శివాద్వైత లింగాంగ సామరస్యసిద్ధాంత పరమరహస్యము.

"యథా నద్యః స్యందమానాః సముద్రే అస్తం గచ్ఛంతి నామరూపే విహాయ, తథా విద్వా న్నామ రూపా ద్విముక్తః పరాత్పరం పురుష ముపైతి దివ్యం" అనెడి ముండకశ్రుతియు, "అవిభాగేన దృష్టత్వాత్" అనెడి బ్రహ్మసూత్రమును యీ యభిప్రాయమునే బోధించుచున్నవి.

ఏతావదుక్త్వా పరమ ప్రబోధ
మద్వైత మానంద శివప్రకాశమ్,

దేవ్యై పురా భాషిత మీశ్వరేణ
తూష్ణీ మభూ ద్ధ్యానపరో గణేంద్రః॥ ౬౨

శ్రీ రేణుక గణాధీశ్వరులు పరమేశ్వరుఁడు తొల్లి పార్వతీదేవికి ఉపదేశించినట్టియు, పరమజ్ఞాన స్వరూపమైనట్టియు, శివానంద ప్రకాశకమైనట్టియు, పిండాది జ్ఞానశూన్యాంత మైనట్టియు పది స్థలములతోఁ గూడిన శివాద్వైతసిద్ధాంతమును అనఁగా లింగాంగ సామరస్యసిద్ధాంతమును ఈ రీతిగా బోధించి స్వస్వరూప ధ్యానాసక్తులై మౌనముద్రను ధరించిరి.

ఏవ ముక్త్వా సమాసీనం శివయోగ పరాయణం,
రేణుకం తం సమాలోక్య బభాషే ప్రాంజలి ర్మునిః॥ ౬౩

ఇటులు బోధించి మౌనముదాల్చి శివయోగమగ్నుఁడై యున్న శ్రీ రేణుకాచార్యులనుజూచి అగస్త్యమహర్షి చేతులుమోడ్చి యిట్లనెను.

అగస్త్య ఉవాచ :

శివయోగ విశేషజ్ఞ శివజ్ఞాన మహోదధే,
సమస్త వేదశాస్త్రాది వ్యవహార ధురంధర॥ ౬౪

ఆలోకమాత్ర నిర్ధూత సర్వసంసార బంధన,
స్వచ్ఛంద చరితోల్లాస స్వప్రకాశాత్మవిచ్ఛివ॥ ౬౫

అవతీర్ణ మిదం శాస్త్ర మనవద్యం త్వదాననాత్,
శ్రుత్వామే మోదతే చిత్తం జ్యోతిః పశ్య ఇచ్ఛవాభిధమ్॥ ౬౬

అద్య మే సఫలం జన్మ గతో మే చిత్త విభ్రమః,
సంజాతా పాశవిచ్ఛిత్తి స్తపాంసి ఫలితాని మే॥ ౬౭

ఇదానీ మేవ మే జాతం మునిరాజత్వ ముత్తమం,
ఇతఃపరం మయా నాస్తి సదృశో భువనత్రయే॥ ౬౮

శాస్త్రం తవ ముఖోద్గీర్ణం శివాద్వైత పరం వరం,
మాం వినా కస్య లోకేషు శ్రోతు మస్తి తపః శుభమ్॥ ౬౯

తపసః పరిపాకేన శంకరస్య ప్రసాదతః,
ఆగతస్త్వం మహాభాగ మాం కృతార్థయితుం గిరా॥ ౨౦

శ్రీ రేణుక గణాధీశ్వరా! శివయోగ రహస్యము నెఱిఁగినవాఁడా! శివజ్ఞాన సముద్రుఁడా! సర్వవేద వేదాంత వేదాంగ విచక్షుణుఁడా! కృపాదృష్టిమాత్రముచే సంసార బంధమును దొలఁగించు వాఁడా! స్వేచ్ఛాలీలల నొప్పువాఁడా! స్వయం ప్రకాశ శివ స్వరూపుఁడా! నీ నోర వెడలిన పరమ పవిత్రమైన, శివాద్వైత రూపమైన, వీరశైవ మహా శాస్త్రమును విని శివ తేజస్సును గాంచిన నా మనసు తనిస్సినది. నా పుట్టువు పండినది. నా చిత్త భ్రాంతి సమసినది. నా భవ పాశము తెగినది. నా తపస్సులు పండినవి. శ్రేష్ఠమైన మునిరాజత్వము నా కిపుడు లభించినది. ముల్లోకము లందును నాకు సమానుఁడు మఱి లేఁడు. నీ నోర వెడలిన శివాద్వైత పరమైన శాస్త్రరాజమును వినుటకు ముల్లోకము లందును నాకుఁ గాక యితరుల కీ మంగళ కరమైన తపస్సె వరికిఁ గలదు? మహాత్మా! నా తపస్సు పండుట చేతను, శివాను గ్రహము చేతను నను ధన్యునిఁ జేయుటకే నీ విటకు వచ్చితివి.

ఇతి స్తువం తం వినయా దగస్త్యం మునిపుంగవం,
ఆలోక్య కరుణా దృష్ట్యా బభాషే స గణేశ్వరః॥ ౨౧

అడకువతో నిటులు స్తుతించు చున్న యగస్త్య మహామునిని కృపా దృష్టితోఁ జూచి శ్రీ రేణుకా చార్యు లిట్లనిరి.

అగస్త్య మునిశార్దూల తపస్సిద్ధ మనోరథ,
త్వాం వినా శివశాస్త్రస్య కః శ్రోతు మధికారవాన్॥ ౨౨

తపస్సిద్ధకాముఁడవైన యగస్త్య మునివర్యా! శివాద్వైత శాస్త్రమును వినుటకు నీ కంటె నధికారి యెవఁడు?

పాత్రం శివప్రసాదస్య భవానేకో న చాపరః,
ఇతి నిశ్చిత్య కథితం మయా తే తంత్ర మీదృశమ్॥ ౨౩

శివానుగ్రహమునకు నీ వొక్కండవే పాత్రుఁడవు. అని నిశ్చయించి యిట్టి శివాద్వైత శాస్త్రమును నీ కుపదేశించితిని.

స్థాప్యతాం సర్వలోకేషు తంత్రమేతత్త్వయా మునే,
ఈదృశం శివబోధస్య సాధనం నాస్తి కుత్రచిత్॥ ౭౪

కావున నో మహర్షీ! నీ వీ వీరశైవ సిద్ధాన్తమును సర్వ ప్రపంచ మందును ప్రకాశింపఁజేయుము. శివజ్ఞానమున కిట్టి సాధనము మఱెం దును లేదు.

రహస్య మేత త్సర్వజ్ఞః సర్వానుగ్రాహకః శివః,
అవాదీ త్సర్వలోకానాం సిద్ధయే పార్వతీ పతిః॥ ౭౫

అన్నిటి నెఱుంగువాఁడును, అందఱను దయఁజూచువాఁడును, పార్వతీరమణుఁడు నైన శివుఁడు ఈ వీరశైవ శాస్త్ర రహస్యమును, ఎల్లజనుల మోక్షసిద్ధికై బోధించెను.

తదిదం సర్వసిద్ధాంత సారాణా ముత్తమోత్తమం,
వేద వేదాంత సర్వస్వం విద్యాచార ప్రకాశకమ్॥ ౭౬

వీరమాహేశ్వర గ్రాహ్యం శివాద్వైత ప్రకాశకం,
పరీక్షి తేభ్యో దాతవ్యం శిష్యేభ్యో నాన్యథా క్వచిత్,
ఏతచ్ఛ్రవణ మాత్రేణ సర్వేషాం పాప సంక్షయః॥ ౭౭

సర్వసిద్ధాంతములందును సర్వోత్తమమును, వేదవేదాంతముల స్వరూపముగలదియు, జ్ఞానమును సదాచారములను జక్కఁగా బోధించు నదియు, వీరమాహేశ్వరు లాదరించి గ్రహింపఁదగినదియు, శివాద్వైత మును వెల్లడించునదియునైన యీ వీరశైవశాస్త్రమును శుశ్రూషుల వంశగుణాదులను బరీక్షించి బోధింపుము. అనధికారుల కీయకుము. ఈ శాస్త్రరహస్యమును విన్నమాత్రముననే ఎల్లపాపములు నశించును.

అవతీర్ణం మయాభూమౌ శాస్త్రస్యాస్య ప్రవృత్తయే,
ప్రవర్తయ శివాద్వైతం త్వ మపి జ్ఞానమీదృశమ్॥ ౭౮

ఈ యాఱుస్థలములుగల శాస్త్రమును వెల్లడించుటకే నేనీ భూమం డలమం దవతరించితిని. నీవును ఈ శివాద్వైతసిద్ధాంతమును అంతటను బ్రవర్తింపఁజేయుము.

ఇత్యుక్త్వా పశ్యత స్తస్య పురస్తాదేవ రేణుకః,
అంతర్దధే మహాదేవం చింతయ న్నంతరాత్మనా॥ ౭౯

ఇటులుపదేశించి శ్రీ రేణుకగణాధీశ్వరులు అంతరాత్మను పరమాత్మ ధ్యానముచేయుచు అంతర్ధానులైరి.

అంతర్హితే తదా తస్మిన్ మునిరాశ్చర్య సంకులః,
తచ్ఛాస్త్ర ప్రవణో భూత్వా సమవర్తత సంయమీ॥ ౮౦

శ్రీ రేణుకగణాధీశ్వరు లంతర్ధానమొందఁగా అగస్త్యమహర్షియు వింతపడుచు తనకుపదేశింపఁబడిన శివాద్వైతజ్ఞానమందే ఆసక్తుఁడయ్యెను.

య ఇదం శివసిద్ధాంతం వీరశైవ మతాత్మకం,
శ్రుణోతి శుద్ధమనసా స యాతి పరమాంగతిమ్॥ ౮౧

వీరశైవమత స్వరూపమైన యీ శివాద్వైత సిద్ధాంతమును శుద్ధచిత్తుఁడై వినువాఁడు మోక్షము నొందును.

ఇది
సిద్ధాన్త శిఖామణి యందు – లింగస్థలీయమైన ఐక్యస్థలమున
స్వీకృత ప్రసాద స్థలాదులైన తొమ్మిదిస్థలములు గల
ఇరువదవ పరిచ్ఛేదము
శ్రీ శివార్పణము.

—♦—

ఓం నమః శివాయ

శ్రీ మాత్రే నమః

శ్రీ జగద్గురు పంచాచార్యాః ప్రసీదంతు

# ఇర్వదియొకటవ పరిచ్ఛేదము

## విభీషణాభీష్ట వరప్రదానము.

స్వచ్ఛందాచార రసికః స్వేచ్ఛానిర్మిత విగ్రహః,
ఆససాద పురీం లంకాం రేణుకో గణనాయకః॥ ౧

స్వతంత్రాచారశీలుఁడును, తన ఇచ్ఛచేఁగలిగిన దివ్యతేజశ్శరీరముగల వాఁడును. ప్రమథనాయకుఁడైన శ్రీ రేణుకాచార్యుఁడు విభీషణ రాజధానియైన లంకను జేరెను.

తమాగతం మహాభాగం సర్వాగమ విశారదం,
విభీషణః సమాలోక్య సౌధం ప్రావేశయన్నిజమ్॥ ౨

విభీషణుఁడును దన నగరమునకువచ్చిన సకలాగమపండితుఁడును తత్త్వవేదియునైన యమ్మహాత్ముని దర్శించి పూజించి తన మేడయందే విడియించెను.

భద్రాసనే మహారమ్యే నివేశ్య గణనాయకం,
అర్ఘ్యపాద్యాదిభిః సర్వై రుపచారై రపూజయత్॥ 3

మఱియు నా ప్రమథశ్రేష్ఠుని మిగుల రమ్యమైన సింహాసనమందుంచి అర్ఘ్యపాద్యాది షోడశోపచారములచేఁ బూజించెను.

పూజితేన ప్రసన్నేన రేణుకేన నిరూపితః,
నిషసాద తదభ్యాసే స నిజాసన మాశ్రితః॥ ౪

ఇటులు పూజింపఁబడి ప్రసన్నుఁడైన ఆ రేణుకాచార్యుని సెలవు నంది ఆ సమీపమునఁ దన యాసనమందుఁ గూర్చుండెను.

విభీషణో గణేంద్రం త మాబభాషే కృతాంజలిః,
మానుషాకార సంపన్నం సాక్షాచ్ఛివ మివాపరమ్॥ ౫

మనుష్య శరీరము నొందిన సాక్షాచ్ఛివునివలెనున్న శ్రీ రేణుకాచార్యులను గూర్చి విభీషణుఁడు చేతులు మోడ్చి యిట్లనెను.

రేణుక త్వం గణాధీశ శివజ్ఞాన పరాయణ,
అవతీర్ణో మహీం మేనా మితి సమ్యక్ శ్రుతం మయా॥ ౬

శివజ్ఞాన తత్పరుఁడవైన ప్రమథాధీశ్వరా! శ్రీ రేణుకాచార్య! నీవీ భూలోకమందలి సమస్తప్రాణులను ఉద్ధరించుటకై శివునాజ్ఞానుసారముగా అవతరించితివని వింటిని.

మద్భాగ్య గౌరవా దద్య స మాయాస్త్వం పురీ మిమాం,
కథం భాగ్య విహీనానాం సులభాః స్యుర్భవాదృశాః॥ ౭

నీవు నేఁడు నాపుణ్యాతిరేకముచే నా లంకాపురికి వచ్చితివి. భాగ్యహీనులకు నీయట్టి మహానుభావులు సుగముగ లభింపరు.

మత్సమో నాస్తి లోకేషు భాగ్యాతిశయవత్తయా,
యస్య సౌధం స్వయం ప్రాప్తో భవాన్ సాక్షాన్మహేశ్వరః॥ ౮

ప్రత్యక్ష శివుఁడైన నీవు నాయింటికి స్వయముగా వచ్చుటచూడ భాగ్యాతిశయమున ముల్లోకములందును నాకు సమానుఁడు లేఁడు.

కృతార్థా మే పురీ హ్యేషా కృతార్థో రాక్షసాన్వయః,
జీవితం చ కృతార్థం మే యస్య త్వం దృష్టిగోచరః॥ ౯

నిన్ను దర్శించుటచే నాపట్టణము, మారాక్షసకులము, నాపుట్టువును ధన్యములైనవి.

ఇతి బ్రువాణం కల్యాణం రాక్షసేంద్రం గణేశ్వరః,
బభాషే సస్మితో వాణీం విశ్వోల్లాసకరీం శుభామ్॥ ౧౦

ఇట్టి మేలిమాట లాడుచున్న విభీషణునితో శ్రీ రేణుకాచార్యులు చిఱునవ్వుతో ఎల్లరకును వేడుక కలిగించు మంగళవాక్కు లిట్లుపలికెను.

విభీషణ మహాభాగ జానే త్వాం ధర్మకోవిదం,
త్వాం వినా కస్య లోకేషు జాయతే భక్తి రీదృశీ॥ ౧౧

ఓ పుణ్యాత్ముఁడా! విభీషణా! నేను నిన్ను ధర్మపరాయణుఁడవని యెఱుఁగుదును. ఇట్టి భక్తి నీకుఁ దక్క లోకమం దెవనికిఁ గలుగును?

సమస్త శాస్త్ర సారజ్ఞం సర్వధర్మ పరాయణమ్,
అధ్యాత్మ విద్యా నిరత మాహుస్త్వాం రాక్షసేశ్వర॥ ౧౨

ఓయీ రాక్షసనాథా! నీవు సర్వశాస్త్రముల రహస్యముల నెఱిఁగినవాఁడ వనియు, సర్వధర్మాచారములందు నిరతుఁడవనియు, వేదాంత విద్యాసక్తుఁడవనియు లోకులెల్ల రనుచున్నారు.

త్వదీయ ధర్మ సంపత్తిం శ్రుత్వాఽహం విస్మితాశయః,
వ్రజన్ కైలాస మచలం త్వదంతిక ముపాగతః॥ ౧౩

కైలాసగిరికిఁ బోవుచున్న నేను నీధర్మసంపత్తిని విని వింతపడి ఇటులు నీసమీపమునకు వచ్చితిని.

ప్రీతోఽస్మి తవ చారిత్రైః శోభనై ర్లోక విశ్రుతైః,
దాస్యామి తే వరం సాక్షాత్ ప్రార్థయస్వ యథేప్సితమ్॥ ౧౪

జగద్విఖ్యాతములైన శుభకరములైన నీనడవడులకు నేనెంతో సంతసించితిని. నీ యిచ్చవచ్చిన వరము కోరుము. ఇదిగో, ఇచ్చుచున్నాను.

ఇతి ప్రసాద సుముఖే భాషమాణే గణేశ్వరే,
ప్రణమ్య పరయా ప్రీత్యా వ్యాజహార విభీషణః॥ ౧౫

ప్రసన్న వదనుఁడై శ్రీ రేణుకాచార్యుఁ డిటులు పలుకఁగా విభీషణుఁడు అనన్య సామాన్య భక్తితో మ్రొక్కి ఇటు లనుచున్నాఁడు.

ఆగమానుగ్రహో దేవ భవతః శివయోగినః,
దుర్లభాః సర్వలోకానాం సమాపద్యంత సంపదః॥ ౧౬

శ్రీ రేణుకాచార్య! శివయోగి శ్రేష్ఠుఁడవైన నీ రాకయను దయచే ఎల్లరకును సుఖముగా బొందరాని సంపదలు చేకూరును.

తథాపి ప్రార్థనీయం మే కించి దస్తి గణేశ్వర,
సుకృతే పరిపక్వే హి స్వయం సిద్ధ్యతి వాంఛితమ్॥ ౧౭

ఓ రేణుక గణేశ్వరా! అయినను నేను గోరఁదగినది యించుకంత గలదు. పుణ్యము పండినపుడు కోరిక తనంతటనే నెఱవేఱును గదా?

రావణో హి మమ భ్రాతా శివభక్త శిఖామణిః,
అదృష్ట శత్రు సంబాధం శశాస హి జగత్త్రయమ్॥ ౧౮

శివభక్తి తత్పరుఁడైన మాయన్న రావణుఁడు ముల్లోకములను శత్రుబాధ లేనటులు పరిపాలించెను.

యస్య ప్రతాప మతులం సోఢు మక్షమ శక్తయః,
ఇంద్రాదయః సురాస్సర్వే రాజ్యలక్ష్మ్యా వియోజితాః॥ ౧౯
స తు కాలవశేనైవ స్వచారిత్ర విపర్యయాత్,
రణే విష్ణ్వవతారేణ రామేణ నిహతోఽభవత్॥ ౨౦

సాటిలేని అతని పరాక్రమము నోరువలేని ఇంద్రుఁడు మున్నగు వేలుపులెల్లరు తమ తమ రాచసిరుల కెడమయిరి. ఆ మహాపరాక్రమ శాలియైన రావణుఁడు కాలవశముచేతఁ దన చెడునడతయే కారణముగా విష్ణుని యవతారమైన శ్రీరామునిచే యుద్ధమునఁ జంపఁబడెను.

స తు రామ శరావిద్ధః కంఠ స్ఖలిత జీవితః,
అవశిష్టం సమాలోక్య మామవాదీత్సు దుఃఖితః॥ ౨౧

శ్రీరాము నమ్ములచేఁ గొట్టఁబడి కంఠగత ప్రాణుఁడైన మాయన్న రాక్షస సమూహముతోఁ జావక మిగిలియున్న ననుఁగాంచి మిగుల దుఃఖితుఁడై యిట్లు పలికెను.

విభీషణ విశేషజ్ఞ మహాబుద్ధే సుధార్మిక,
అవశిష్టోఽసి వంశస్య రక్షసాం భాగ్యగౌరవాత్॥ ౨౨

ఓ మహాబుద్ధిశాలీ! ధర్మాచార సంపన్నుఁడా! విచక్షణుఁడా! తమ్ముఁడా! విభీషణుఁడా! మన రాక్షస కులముయొక్క భాగ్యాతిశయమున నీవొక్కఁడవు మిగిలితివి.

వయ మజ్ఞాన సంపన్నా మహాత్మ ద్రోహకారిణః,
ఈదృశీం తు గతిం ప్రాప్తా దుస్తరా హి విధి స్థితిః॥ ౨౩

అజ్ఞాన దూషితులమై దొడ్డవారిపట్ల ద్రోహ మొనర్చిన మేమెల్లరము నిట్టి దుర్గతి నొందితిమి. దైవగతి దాటరానిది గదా?

నవకం లింగకోటీనాం ప్రతిష్ఠాప్య మిహ స్థలే,
ఇతి సంకల్పితం పూర్వం మయా తదవశిష్యతే॥ ౨౪

ఈ లంకాపురియందుఁ దొమ్మిదికోటుల శివలింగములు నెలకొల్పవలయునని నేను మున్ను సంకల్పించితిని. ఆ తలంపునఁ గొంత వెనుకఁబడియున్నది.

కోటి షట్కన్తు లింగానాం మయా సాధు ప్రతిష్ఠితం,
కోటి త్రయం తు లింగానాం స్థాపనీయ మతస్త్వయా॥ ౨౬

ఆఱుకోట్ల లింగములను నేను శాస్త్రానుసారముగాఁ బ్రతిష్ఠించితిని. కావున మిగిలిన మూఁకోటి లింగములను నీవు ప్రతిష్ఠచేయుము.

ఇతి తస్య వచః శ్రుత్వా దీన బుద్ధే ర్మరిష్యతః,
తథా సాధు కరోమీతి ప్రతిజ్ఞాతం మయా తదా॥ ౨౭

మరణోన్ముఖుఁడై జాలితో ననినమాట విని "అన్నయ్యా! నీ కోరి నట్లు మూఁడుకోట్లు లింగములను యథావిధిగా స్థాపించెదను" అని ప్రతిన జేసితిని.

యుగప చ్ఛివ లింగానాం కోటిత్రయ మనుత్తమం,
ప్రతిష్ఠాప్యం యథా శాస్త్ర మితి మే నిశ్చయోఽభవత్॥ ౨౮

మిగుల శ్రేష్ఠములైన ముక్కోటి శివలింగములను ఒక్కసారిగానే యథావిధిగా నెలకొల్ప నిశ్చయించితిని.

లింగకోటి త్రయ స్యాహం యుగపత్ స్థాపనా విధౌ,
అవిదన్నేక మాచార్య మహామేవ మవస్థితః॥ ౨౯

ఈ లోకమున ఏకకాలమందే మూఁడుకోటుల లింగములను బ్రతిష్ఠింపఁజేయు సమర్థుఁడైన ఆచార్యుఁడు నాకుఁ గానరాక యిటులు నిరాశతో నుంటిని.

శివశాస్త్ర విశేషజ్ఞ శివజ్ఞాన నిధిర్భవాన్,
ఆచార్యభావ మాసాద్య మమ పూరయ వాంఛితమ్॥ ౩౦

కావున శివశాస్త్ర రహస్యముల నెఱిఁగినవాఁడవును, శివజ్ఞాన సాగరుఁడవైన మహానుభావా! నీవే మూఁడుకోట్ల గురురూపములను దాల్చి నాకోరిక తీర్పుము.

తస్యేతి వచనం శ్రుత్వా రాక్షసేంద్రస్య ధీమతః,
తథేతి ప్రతిశుశ్రావ సర్వజ్ఞో గణనాయకః॥ 30

సర్వజ్ఞుఁడును, ప్రమథాధిపతియునైన శ్రీ రేణుక దేశికేంద్రుఁడు బుద్ధిశాలియైన విభీషణుని మాటవిని "అట్లే యగుఁగాక" యనెను.

తత్ర సంతుష్ట చిత్తస్య పౌలస్త్యస్యేష్ట సిద్ధయే,
కోటిత్రయం తు లింగానాం యథా శాస్త్రం యథావిధి,
త్రికోట్యాచార్యరూపేణ స్థాపితం తేన తత్క్షణే॥ 30

సంతుష్టహృదయుఁడైన విభీషణునికోర్కె నెఱవేర్చుటకై శ్రీ రేణుకాచార్యుఁడు మూఁడుకోట్ల గురురూపములనుదాల్చి లంకాపురమున మూఁడుకోట్ల శివలింగములను అప్పుడే ఏకకాలమందే నెలకొల్పించెను.

తాదృశ్యం తస్య మాహాత్మ్యం సమాలోక్య విభీషణః,
ప్రణనామ ముహుర్భక్త్యా పాదయో స్తస్య విస్మితః॥ 31

అట్టి శ్రీ రేణుకాచార్యుల మహాత్మ్యమును గాంచి వింతనొంది భక్తితో బలుసార్లు పాదములపైఁబడి మ్రొక్కెను.

ప్రణతం వినయోపేతం ప్రహృష్టం రాక్షసేశ్వరం,
అనుగృహ్య స్వ మాహాత్మ్య (ద్రేణుకోఽంతర్హితోఽభవత్॥

శ్రీ రేణుకాచార్యులు తనకు వినయముతో మ్రొక్కినట్టియు, కడుం దనిసినట్టియు విభీషణు నను(గహించి తన మహిమచే నచటినుండి యంతర్ధానుఁ డయ్యెను.

విభీషణోఽపి హృష్టాత్మా రేణుకస్య ప్రసాదతః,
శివభక్తి ఐసాసక్తః స్థిరం రాజ్య మపాలయత్॥ 34

శ్రీ రేణుక గణేశుని యను(గహముచే సంతుష్టుఁడై శివభక్తి యనెడి యమృతమం దాసక్తుఁడై విభీషణుఁడు తన రాజ్యమును సుస్థిరముగ, సుఖముగఁ బాలించెను.

రేణుకోఽపి మహాతేజాః సంచరన్ క్షితిమండలే,
ప్రచ్ఛన్నశ్చ ప్రకాశశ్చ పరమాద్వైత భావనః॥ 35

కాంశ్చి ద్దృష్టి నిపాతేన కరుణారస వర్షిణా,
అపరానుపదేశేన శివాద్వైతాభి మర్శినా॥ 36

అన్యాంశ్చ సహవాసేన సమస్త మలహారిణా,
కృతార్థయన్ జనాన్ సర్వాన్ కృతినః పక్వకర్మిణః॥ 37

ఇటులు మహాతేజఃశాలియైన శ్రీ రేణుకాచార్యుఁడు భూలోకమున బెక్కెండ్లు ఇతరులకుఁ గానరాకయు, పెక్కెండ్లితరులకుఁ గానఁబడుచును పరమ శివాద్వైతభావముతో సంచరించుచు కొందఱను దయారసము కురియు చూపులతోను, కొందఱను శివాద్వైత బోధకములగు ఉపదేశములతోను పరిపక్వ పుణ్యాకర్ములును ధన్యులునైన మఱికొందఱను దన సహవాసముతోను గృతార్థులనుగాఁ జేసెను.

దర్శయిత్వా నిజాధిక్యం శివదర్శన లాలసః,
ఖండయిత్వా దురాచారాన్ పాషండాన్ భిన్నదర్శనాన్॥ ౩౮

యంత్ర మంత్ర కలా సిద్ధాన్ విమతాన్ సిద్ధమండలాన్,
విజిత్య స్వప్రభావేన స్థాపయిత్వా శివాగమాన్,
ఆజగామ నిజావాసం కుల్యపాకాభిధం స్థలమ్॥ ౩౯

శివాగమములందే యాసక్తి గల శ్రీ రేణుకాచార్యులు పలువిధములైన తన లీలావైభవములచేఁ దన గొప్పదనము నెల్లెడ వెల్లడి చేసి, దుష్టాచారులగు నాస్తిక శాస్త్రాసక్తులైన పాషండులను ఖండించి యంత్రకలా సిద్ధులను, మంత్రకలా సిద్ధులను, దుర్మతముల నాచరించు కుటిల సిద్ధులను తన మహిమచే గెలిచి శైవసిద్ధాంతమును స్థాపించి తన యావాసమైన కుల్యపాక యనెడి శివక్షేత్రమునకు మరలి వచ్చెను.

తత్ర సంభావితః సర్వై ర్జనైః శివపరాయణైః,
సోమనాథాభిధానస్య శివస్య ప్రాప మందిరమ్॥ ౪౦

అట వచ్చి యచ్చటి శివభక్తులెల్లరచే సత్కరింపఁబడి శ్రీ రేణుకాచార్యులు శ్రీ సోమనాథుఁడను శివుని యాలయమును జేరిరి.

పశ్యతాం తత్రసర్వేషాం భక్తానాం శివయోగినాం,
తన్వానో విస్మయం భూయః తుష్టావ పరమేశ్వరమ్। ౪౧

అచట శివ మందిరమందు భక్తులును శివయోగులెల్లరును గనుచుండఁగా శ్రీ రేణుకాగణేశ్వరులు తన లీలలతో నెల్లరకు వింతగొల్పుచు పరమేశ్వరుని సోమనాథు నిట్లు స్తుతించిరి.

దేవ దేవ జగన్నాథ జగత్కారణ కారణ,
బ్రహ్మవిష్ణు సురాధీశ వంద్యమాన పదాంబుజ॥ ౪౨

సమస్త వేదవేదాంత పరిబోధిత వైభవ,
సంసారవైద్య సర్వజ్ఞ సర్వశక్తి నిరంకుశ॥ ౪౩

సచ్చిదానంద సర్వస్వ పరమాకాశ విగ్రహ,
సమస్త జగదాధార జ్యోతిర్లింగ విజృంభణ॥ ౪౪

గుణత్రయ పదాతీత మలత్రయ వినాశన,
జగత్త్రయ విలాసాత్మక శ్రుతిత్రయ విలోచన॥ ౪౫

పాహి మాం పరమేశాన పాహి మాం పార్వతీ పతే,
త్వదాజ్ఞయా మయైతావత్కాలమాత్రం మహీతలే,
అచారి భవదుక్తానా మాగమానాం ప్రసిద్ధయే॥ ౪౬

ఇతః పరం స్వరూపం తే ప్రాప్తు కామోఽస్మి శంకర,
అంతరం దేహి మే కించి దనుకంపా విశేషతః॥ ౪౭

ఓ పరమేశ్వరా! సర్వ జగములకు గతియైనవాఁడ! జగములు పుట్టు కారణమునకుఁ గారణమైనవాఁడా! బ్రహ్మ విష్ణు శక్రాదులైన వేలుపులచే మ్రొక్కఁబడు అడుగుఁదమ్ములు గలవాఁడ! ప్రాఁబలుకుల చేతను, ప్రాఁబల్కుల కొనలచేతను దెలియఁబడు లీలావైభవము గలవాఁడా! చావు పుట్టువు లనెడి రోగముల బాపు మందరి! అంతయు నెఱుంగువాఁడా! అన్నిశక్తు లుండుటచే నడ్డులేనివాఁడా! సచ్చిదానందముల పాతఱయైనవాఁడ! జ్ఞానాకాశమే రూపముగాఁ గలవాఁడా! ఎల్లలోకములకును ప్రాపయినవాఁడా! తేజోలింగ రూపమున నంతటను నిండియున్నవాఁడా! సత్త్వ రజ స్తమస్సులనెడి మూఁడుగుణముల స్థానమును మీఁటియున్నవాఁడా! ముజ్జగముల వికాసమే రూపముగాఁ గలవాఁడా! ఆణవాది మలముల నశింపఁజేయువాఁడా! ఋ, గ్యజు, స్సామము లనెడి మూఁడు వేదములు కన్నులుగాఁ గలవాఁడా! పార్వతీ పతీ! పరమేశ్వరా! నన్ను రక్షించు. నన్ను రక్షింపుము. నీయానచే నే నింతవఱకు భూలోకమున నీయైదు మోముల వెలువడిన ఆగమము

లను వెల్లడించుటకుఁగా సంచరించితిని. ఓ శంకరా! ఇటుపై నీ స్వరూపము నొందఁగోరి యున్నాను. నాయందుఁ గడుం గరుణించి నా కించుకంతయు నవకాశమిమ్ము.

ఇత్యుక్తే గణనాయకేన సహసా లింగాత్తత శ్శంకరో
వత్సాగచ్ఛ మహానుభావ భవతో భక్త్యా ప్రసన్నోఽస్మ్యహమ్,
ఇత్యుచ్చై రగద ద్వచ స్తనుభృతా మాశ్చర్య మాసీ త్తదా
దివ్యో దుందుభిరానదాద గగనే పుష్పం వవర్షుర్గణాః॥ ౪౮

అని యిటులు ప్రమథ గణాధీశుఁడైన శ్రీ రేణుకాచార్యులు వేడుకొనఁగా దయాపూర్వకమై శంకరుండు శ్రీ సోమనాథ లింగమునుండి "మహానుభావుఁడవైన ముద్దుకొడుకా! నీ భక్తికి మెచ్చి ప్రసన్నుఁడనైతిని." అని బిగ్గరగాఁ బలుకఁగా నచటి వారెల్లరు కడువింత నొందిరి. దేవదుందుభులు మొఱసెను. వేల్పుగుములు మింటినుండి పూలవానలు కురిసిరి.

శ్రుత్వా లింగా ద్వచన ముదితం శాంకరం సానుకంపం
సంహృష్టాత్మా గణపతి రథో జ్యోతిషా దీప్యమానః,
జాతోత్కంఠైః శివ మనుపరై ర్యోగిభిః స్తూయమానో
జ్యోతిర్లింగం పరమ మవిశత్ స్వప్రకాశం తదానీమ్॥ ౪౯

శ్రీ సోమనాథలింగ ముఖమునుండి కృపాపూర్వకముగ వెలువడిన శంకరుని మాటలనువిని సంతుష్టాంతరంగుఁడైన శ్రీ రేణుకాచార్యులు తేజోమయ శరీరముతోఁ బ్రకాశించుచు శివవాక్య శ్రవణమున వేడుక గొన్నట్టియు, శివమహామంత్ర జపశీలురైనట్టియు శివయోగులచేఁ [illegible]డఁబడుచు సర్వోత్కృష్టమును, స్వయంప్రకాశమునైన జ్యోతిర్లింగమునందు లీనుఁడయ్యెను.

లీనే తస్మిన్ శాంకరే స్వప్రకాశే
దివ్యాకారే రేణుకే సిద్ధనాథే,
సర్వో లోకే విస్మితోఽభూ త్తదానీం
శైవీభక్తిః స ప్రమాణా బభూవ॥ ౫౦

[illegible] లింగ శరీరము దాల్చినట్టియు, సిద్ధసార్వభౌముఁడైనట్టియు శ్రీ రేణుకాచార్యులు స్వయంప్రకాశమగు శాంకర లింగమందు [illegible] లోకులెల్లరు నాశ్చర్యపడిరి. ఇపుడు శివభక్తి ప్రమాణ [illegible].

శ్రీ వేదాగమ వీరశైవ సరణిం శ్రీ షట్స్థలోద్యన్మణిం
శ్రీ శివైక్య యోగ పద్మతరణిం శ్రీ గోప్యచింతామణిం;
శ్రీ సిద్ధాంత శిరోమణిం లిఖతి యస్త్వం లేఖయ త్యాదరాత్
శ్రోతా శ్రావయితా స యాతి విమలాం భుక్తించ ముక్తిం పరామ్।

శ్రీ వేదాగమ ప్రసిద్ధ వీరశైవ తత్త్వ మార్గముతోఁ గూడినదియు. ఆరు స్థలములు అనెడి మహారత్నములతోఁ గూడినదియు, శ్రీ శివైక్య యోగమనెడి (లింగాంగ సామరస్యమనెడి) తామరను వికసింపజేయు సూర్యుని వంటిదియు, శివరహస్యమునకుఁ జింతారత్నము వంటి యీ సిద్ధాంత శిఖామణిని భక్తితో వ్రాయువారును, ఇతరులచే వ్రాయించువారును. వినువారును, వినిపించువారును ఇచట నిర్మల భోగానుభవము నొంది తుదిని మోక్షము నొందుదురు. ఇది శివ వాక్యము.

ఇది
సిద్ధాంత శిఖామణి యందు – విభీషణాభీష్ట వరదానమనెడి
ఇరువదియొకటవ పరిచ్ఛేదము పరిసమాప్తము
శ్రీ శ్రీ యోగానందనాథాపరనాముఁడు
ఈశ్వర సత్యనారాయణ శర్మ చేసిన
తెనుఁగు వివరణముతోఁ గూడిన
సిద్ధాంతశిఖామణి సమాప్తము.
శ్రీ శివార్పణము.

—◆—